

చెన్నపట్టణము, అక్టోబరు ౧౯౨౪

సంపుటము ౧. రక్తాక్షి సంవత్సరము అశ్వయుజమాసము సంఖ్య ౧౦.

# దివ్యలోచనములు

శ్రీ శివశంకర శాస్త్రి [సాహితీసమితి]

## ౧

### ధనుర్దాసు

దేవా, మేదురభవ్యతావక కృపాదీవ్యత్కటాక్షప్రభా
శ్రీ విద్యోతితుఁ జాచు భాగ్యమును గాంచెన్ దాసుఁ డప్రార్థనన్!
కావేరీ పరిపూత శీతల మహాకల్లోలినీస్పర్శ శో
భావంతం బయి పొల్చునామరధరాభాగంబు చందంబునన్.

ఈనాఁ డే నొనరించినట్టి సుకృతం బెంతో యహీనంబు కా
దే నిన్ యుష్మదపాంగ వీక్షణ మహా స్నేలాం ప్రవర్తిల్లు నీ
దీనాంఘ్రి ప్రభవాధమాధమునిపై దేవా, కృపాపూర్ణమై?
ఆనందోద్గతిఁ బిచ్చలించినది రోమాంచంబు దేహమ్మునన్!

మీ సందర్శన నవ్య భాగ్యమున స్వామీ, ధన్యతం గాంచితిన్!
వాసిం బొందెను నిశ్చయంబుగ భవద్వాల్లభ్యసంలబ్ధి నీ
దాసుం! డా నిఖిలైకనాయకుని సందర్శించిన ట్లయ్యె మీ
శ్రీ సాన్నిధ్యమునందు నిల్వగనె యక్షీణప్రమోదంబునన్!

స్వామీ, తావకపాదపంకజరజస్సంసక్తిచే నెప్డు
న్నామూర్ధం బుదయార్కమండల దళన్నవ్యప్రభారంజిత
శ్రీమంతం బగు నంజనాచలగతిన్! సేవాసమారాధనో
ద్దామప్రాభవ మ నాకు లభ్య మగుతన్ ద్వత్సన్నిధానంబునన్!

ఈదాసాధము మీఁద నేల నిలిచెన్ హృద్యద్వివేకప్రభా
శ్రీదం బైన భవత్కటాక్షము కృపాసింధూ, వచింపంగదే!
మోదస్ఫూర్తి సమాచరించుఁ బ్రతిలో మూర్ధంబునం దాల్చి త్వ
త్పాదాంభోజముల న్నియోగముల నీదాసానుదాసుం డిదే!

భ గ వ ద్రా మా ను జు లు

కనుఁగొన నిన్ను సంతసము కల్గిన దెంతయు నేఁడు మాకు; నీ
వినయ మకృత్రిమోద్గతిని వెల్లడి యయ్యెను, భక్తిభావసం
ఘన మధుర ప్రకారమునఁ గానగవచ్చెను, నీ ప్రవర్తనం
బనుపమభంగి నెప్పెను మదాశిషముం గొను మోకుమారకా!

జననము శూద్రవంశమున సంఘటిలంగను దోషమానె? ఆ
ననమున సౌమ్యరీతిని కనంబడుచున్నది, భాషణంబులం
దొనరెడి నకల్మషా రభటి, యోగ్యత యున్నది పెక్కుభంగులన్..
ఘనతరలోప మొక్కటియె కానగవచ్చెను మాకు నీకడన్.

నది నవగాహనాదిక మొనర్చి మఠాగమనాభిలాష నీ
యుదయమునందు మేము చనుచుండెడి వేళను శిష్యపంక్తితో,
ఎదురుగ వచ్చినావు మది రేఁకుఁ గొక్కతె కాతపత్రముం
బదిలము గాఁగఁ బట్టుకొని పార్శ్వమునన్ మెలమెల్ల సేఁగుచున్.

తరుణి విలోచన ద్వయిని దప్పక నిల్పితి వీక్షణంబులన్
సరసని పోవువారల దెసం గనుఁగొన్న, లవంబు సైత మే
నరసినయట్లు లేదు పక్షమందలి వింతలనైనఁ, గామినీ
పరవశబుద్ధితోఁ జనెడిభంగి కనంబడినావు దాసుఁడా!

పొలఁతుక మీఁద నీకుఁ బరిపూర్ణముగా ననురాగ మొప్ప నీ,
చెలియకుఁ దద్విధంబున నశేషజనమ్ముల ప్రోల సేవలన్
జలుపుచు, లజ్జఁ బోవిడిచి సంచరిలం దగునయ్యా? ప్రేమికిన్
నిలుపఁగఁబోలు రమ్యముగ నిందు మనమ్మున గూఢవృత్తితో.

ధనుర్దాసు

స్వామి, భవత్పదద్వయము సాక్షిగఁ బల్కెద విశ్వసింపుఁడీ!
భామిని మీఁది మత్ప్రణయభావము వెల్లడిసేయు బుద్ధి నా
కేమియు లేదు, లజ్జఁ ద్యజియించెడి కోర్కియు లేదు, ఘూర్ణగాం
గామినికిన్ సపర్యలను గాఁ బొసఁగింపుట దేనికన్నఁడీ!

కావరబుద్ధిఁ గాదు పథగాములఁ జూపకయుంటి, వింతలో
సేవియుఁ బట్టి, వాకునల సేకొనఁ దివ్యవిలోచన ద్యుతి
శ్రీ వసివాడు భాస్కర గభస్తి ప్రసరంబున సన్నగిల్ల నో
దేవర, యామెనుండి నిజదృష్టి మరల్పఁగనైతి నయ్యెడన్.

ఆమెను జెప్పినట్లు మదిరాక్షి యటంచు వచించినారలో
స్వామి, విధేయదాసజను సాహసముం క్షమియింపఁగా వలెన్!
ఆమహిళాలలామ విపులాయతనేత్రము లుత్పలప్రభా
ధామముగాని వేఱొకవిధం బగునే పరికించి చూచినన్?

మానసహారులై, మధురమంజుల నూతనకాంతి నొప్పి, ల
క్ష్మీనిలయంబులై, వెలయుఁ జిత్రగతిం బ్రియురాలి నేత్రముల్!
పూనుట దుర్భరం బగుఁ బ్రభూ, తమ దాసుఁడు మేనఁ బ్రాణముల్
మ్లానము లయ్యెనేని యణుమాత్రము తన్నయనోత్పలచ్ఛవుల్!

### భగవద్రామానుజులు

తెలియఁగవచ్చె మాకు భవదీయ విధం బిపు డంతయుఁ సుతా!
చెలియవిలోచనద్వయికిఁ జేయుచునుంటివి సేవ, మంచిదే!
కలికి మనోజ్ఞనేత్రముల కన్న మనోజ్ఞమవై మహాద్యుతుల్
గొలిపెడి నేత్రయుగ్మమునకుఁ నిరతంబు సపర్య చేయుదే?

### ధనుర్దాసు

ఎక్కడఁగూడ నా కువలయేక్షణకన్నుల కాంతికన్న సొం
పెక్కిన యంబకద్యుతుల నెన్నఁడుఁ జూడఁగ లేదు! మిక్కిలిం
జొక్కపు నేత్రయుగ్మమును జూపుదురేని మహానుభావ, నే
నిక్కపుభక్తి భావమున నిత్యము దాస్యము జేయకుందునే?

### భగవద్రామానుజులు

ఆనందంబు ఘటిల్లె మా కిపుడు వత్సా, నీవచో ధోరణిన్,
నీ నిష్కల్మషవృత్తి శిష్యహృదయోన్మేషం బొనర్చెం గదా!
కానం బొల్పుద మెల్లరుం గదలుఁడీ కల్యాణకాంతిచ్ఛటా
స్థానంబై విలసిల్లు దివ్యనయన ద్వంద్వంబు శీఘ్రంబుగన్!

### భగవద్రామానుజులు

పరమాకారణ జాయమాన కరుణాపాంగ ప్రసారంబునన్
భరితాజ్ఞాన దురంత సంతమసముఁ భంజించుచున్ విష్టప
స్థిరసంరక్షణ భార మూనినమహా శ్రీరంగనాథా, భవ
చ్చరణాబ్జంబుల కే నొనర్చెద నమస్కారంబు భక్తప్రియా!

అవలోకింపుము వత్స, అల్లవె రమాహ్లాదాను సంధానవై
భవముల్ ధిక్కృత భానుమండలరుచుల్ బ్రహ్మాండ సందీపక
చ్ఛవులున్ భక్తిభర ప్రపన్న జనతా సంరక్షణ ప్రాభవో
త్సవముల్ రంగశయాన దివ్యకరుణా సంఫుల్ల నేత్రాబ్జముల్!

## ధనుర్దాసు

అహాహా యెంతమనోహరంబులు త్వదీయప్రస్ఫురన్నేత్రముల్!
మిహిరప్రస్ఫుట పంకజమంజుల సమున్మేషప్రభల్ గల్గియుం
దుహినాంశుద్యుతి శీతలమ్ము లయి సంతోషం బొసంగెన్; భవ
న్మహిమం బొప్పు మహాద్భుతంబుగను శ్రీమద్రంగధామ ప్రభూ!

అవలోకింపఁగనైతి నేఁటివఱకుం గాహా! దుర్విపాకంబునన్
భువనత్రాణన భూరిశీతల కృపాపూర్ణ ప్రభావస్ఫుర
ద్భవదక్షిద్వితయంబు; దేశికదయాప్రస్యంద వాఙ్మాధురిన్
నవసౌభాగ్యము గల్గె నక్కజముగా నాకో జగన్నాయకా!

స్థిరతాత్పర్యముతోడఁ గన్గొనినచో దేవా, భవన్నేత్రముల్
తిరుగన్నేర్చునె బుద్ధి యన్యనయనోద్రిక్త ప్రమోదంబునన్?
పరమప్రీతిని భృంగ మాసవ సుధాపానాభిలాషన్ దళ
త్సరసీజంబుల వ్రాలుఁగాని యితరక్ష్మాజంబులన్ జేరునే?

శరణు శ్రీమదనంతకోటి జగతీ సంత్రాణ రంగప్రభూ!
శరణు శ్రీమదశేష శిష్యతతి సంరక్షా రామానుజా!
తిరుమంత్రం బుపదేశమిచ్చి కరుణార్ద్రభావాత్త చిత్తంబుతో
గురువర్యా, నను వైష్ణవప్రతతిలోఁ గూర్పంగదే మ్రొక్కెదన్!

శ్రీమతే రామానుజాయ నమః.






భోగరాజు నారాయణమూర్తి గారు

## VI

## ఆంధ్రలాక్షణికులు – కవిత్వతత్త్వము

కవుల ప్రసంగములను జాలించి, యింకఁ గావ్యములను గూర్చియుఁ గావ్యభేదములను గూర్చియుఁ గావ్యప్రాశస్త్యాదులను గూర్చియు లక్షణకర్తలమతములను మనము కనుంగొనవలసియున్నది. ఆంధ్రకవితాప్రపంచమునఁ బ్రథమాంధ్ర మహాకవియుఁ బ్రథమాంధ్రమహాలాక్షణికుఁడు నగు నన్నపార్యుఁడు తనలక్షణగ్రంథమగు 'ఆంధ్రశబ్దచింతామణి'యందు 'విశ్వశ్రేయః కావ్యం' అని ప్రప్రథమసూత్రమునందే కావ్యప్రశంస గావించియున్నవాఁడు. కావ్యము కీర్త్యాది సమస్తశ్రేయస్సాధన మని దీనియర్థము. బాలసరస్వత్యప్పకవ్యహోబలాదులైన లాక్షణికులు కావ్యమహిమల నుగ్గడించుచుఁ దమతమ మతములనుబట్టి యిమ్మూలసూత్రమున కనేకవిధముల వ్యాఖ్యానములు గావించిరి. పెద్దనార్యుఁడు కావ్యాలంకార చూడామణి యందు నుత్తమకావ్యమహిమ నిట్లు వర్ణించుచున్నాఁడు:

మ. కవిసంసిద్ధపదంబు భావరస వి
ఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబు నుదాత్తనాయకము శ్రీ
వ్యంబుం జతుర్వర్గ సం
భవసద్మంబును నైన కావ్య మిలనా
పదోత్తస్థవస్థాయియై
కవి సంస్ఫూర్తియు, దాత్మకీర్తియుఁ దగన్
గల్పించు నెల్లప్పుడున్.

ఉత్తమకావ్యము జ్ఞానదాయకమనియు యశస్కరమనియుఁ గామితాభీష్టప్రదాయకమనియుఁ గార్పణ్యభంజనమనియు, ముక్తిమార్గమనియు, మూర్తికవి కావ్యమహిమ నిట్లు కొనియాడుచున్నాఁడు:

మ. పరమజ్ఞానలతాలవాలము జగత్ప్రఖ్యాతవిఖ్యాతసా
గరచంద్రోపయ మిష్టసంఘటనరేఖాదివ్యధేనూత్తమం
బుచికార్పణ్య దశానిశాదినముఖం బుద్వేలనిర్వాణభ
వ్య రసాస్వాదరసాయనం బనినఁ గావ్యం బెన్న
సామాన్యమే?

ఇట్లు కావ్యమహిమను గొనియాడిన లాక్షణికులందఱిలో నప్పకవిని ముఖ్యముగాఁ బేర్కొనవలసియున్నది. కావ్యోత్కర్ష నింత ఘనముగా వివరించినలాక్షణికుఁ డింకొకఁడు లేఁడు.

క. ధర్మములలోన నుత్తమ
ధర్మము కావ్యము నిజంబు ధర నెవ్వని కా
ధర్మము చేకుఱు నతఁడు ను
ధర్మను వశియించుఁ బెక్కుదైవతయుగముల్.

క. తనయుఁడు చెఱువును గావ్యం
బు నిధానము గుడి వనంబు భూదేవస్థా

పనమును ననునిర్యోదును
జను శాస్త్రములందు సప్తసంతతు లనఁగ.

గీ. దుష్కృతము లెన్ని చేసినఁ దుదిని సప్త
సంతతులలోన నొక్కటి జరుపునతఁడు
సుకృతమునఁ దనమూఁడొక్కకులమువారి
నరకములఁ బాపి ముక్తికి నడపు నిజము
నెగడుఁగావునఁ గావ్య మన్నిటికిఁ బొడవు.

క. పురివరదనీరు గోదా
వరిని గలసి యోగ్యమైన వసువునఁ గనుదు
శ్చరితుండైనను గావ్యం
తరమునఁ జెప్పఁబడి పావనగ్రగుఁ డగున్.

క. క్షితి నెవ్వని నామము స
త్కృతి నెన్నిదినంబు లుండు దని నా పుణ్య
వ్రతుఁ డంతకాల ముండును
ధృతి నింద్రసద్మమ్ము నునికి స్పష్టాంతముగాన్.

క. తనకు హితార్థము లెఱుఁగిం
చు ననుంబు లడంచు ఘనము శోభనము యశం
బును గూర్చు నఖిలసురలన్
గనఁబడఁగాఁ జేయు నెపుడు కావ్యము కవికిన్.

గీ. మేటి బ్రహ్మర్షి యయ్యె వల్మీకభవుఁడు
గాంచె రవిని మయూరుండు గతియలోనఁ
హరిణరోగము వాసె శ్రీహర్షుఁ డందు
కావ్యమునఁ జెంపరాని సద్గతులు గలవె?

గీ. రామకథలోనఁ గపులు వారాశిఁ గట్టి
నను మ వాల్మీకి చెప్పంగ నఖిలజనులు
సేతువనుచు నెఱింగిరి చెప్పకున్న
నదియు నొక సోగదీవి యటండ్రుగాదె?

* * * * *

'విశ్వశ్రేయః కావ్య' మ్మను శబ్దశాసన సూత్రమునకు వ్యాఖ్యానము వ్రాయుచు నహోబలుఁడు సంస్కృతలాక్షణికోక్తులఁ బేరుకొనుచుఁ దన్మూలమునఁ గావ్యమహిమం గూర్చి తనయభిప్రాయము నిట్లు సూచించుచున్నాఁడు:

"వ్యా. కావ్య స్యానేకశ్రేయస్కరత్వ ముక్తం, కావ్యప్రకాశకారాదిభిః. శ్లో. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే." (కావ్యము కీర్తిని ఘటించును. ధనము నొసంగును. వ్యవహారమును దెలుపును. అశుభములను బోఁగొట్టును. వెంటనే యానందమును గూర్చును. భార్యవలెఁ జక్కని యుపదేశములను గావించును.)

కావ్యస్వరూపము

"విశ్వశ్రేయః కావ్య" మ్మని కావ్యమహిమ నుగ్గడించుటయే కాక, "తదదోషౌ పరి కృతావద వాగ్నే'" అని ప్రక్రమాచార్యుఁడు కావ్యస్వరూపమును నైతమును జేర్కొని యుండుటచేత దాని నాధారముగాఁ జేసికొని

గీ. ఇంకఁ గావ్యస్వరూపంబు లేర్పరింతు
విగతదోషంబులును గుణాన్వితము లధిక
లసదలంకారభావసలక్షితములు
నైన శబ్దార్థములు కావ్య మనఁ జెలంగు.

అని మూర్తికవియు;

గీ. కృతికి నెప్పు శబ్దార్థముల్ రెండు వలయు
నవి యలంకారయుతములు నఖిలదోష
రహితములుగాఁగఁ జూచి కూర్పంగవలయు

* * * * *

అని యప్పకవియు నిట్లు యితరలాక్షణికులును జెప్పుచువచ్చిరి. అహోబలుఁడు తత్సూత్రమున కిట్లు వ్యాఖ్యానము వ్రాయుచున్నాఁడు.

"వ్యా. అదోషౌ వాక్యార్థదోషరహితౌ, పరిష్కృతౌ, గుణాలంకారసహితౌ చ వాక్యార్థౌ తత్కావ్యం, పదస్య వాక్యావయవత్వా త్తద్దోషరాహిత్యమప్యత్ర వివక్షితం, అల్పోఽపి దోషః ప్రమాదేనా ప్యనుపేక్ష్య ఇతి ద్యోతయితు మాదావదోషావితి విశేషణం; 'ఏకోఽపి

దోష'ఇతి న్యాయస్తు కావ్యవ్యతిరిక్తవిషయక ఇతి ద్రష్టవ్యం."

దోషరాహిత్యము

అనఁగా, 'ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః,' చంద్రునికిరణములయందుఁ దత్కళంకమువలెఁ బెక్కుగుణములయం దొక్కదోష మడఁగి పోవు నను కాళిదాససూక్తి యితరవిషయములయందేకాని కావ్యమువట్లమాత్ర మన్వయింపరాదని యహోబలుఁడు చెప్పుచున్నాఁడు. ఇది సంస్కృతలాక్షణికుల మర్యాద. కావ్యమునందలి దోషరాహిత్యమును గూర్చి విఖ్యాతలక్షణకర్తయగు దండిశాసన మిట్లున్నది:

'శ్లో. తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన;
స్యా ద్వపు స్సుందరమపి శ్విత్రే ణైకేన దుర్భగమ్'.

(కావ్యమునందు దోషము చిన్నదియే యైనను సహింపఁగూడదు. శరీరము మిక్కిలి సుందరమైన దైనను ఒక్కబొల్లియుండుట చేతనే వికారముగా నుండునుగదా!)

పదదోషములనియు వాక్య దోషములనియు నర్థదోషములనియుఁ గావ్యదోషములను మూఁడువిధములుగా విభాగించి; వానినెల్ల మనయాంధ్రలాక్షణికులుఁగూడ వివరించియున్నారు. కాని దోషరాహిత్యమును గూర్చి యింతకఠినముగా శాసింపలేదు. మఱియు సంస్కృతలాక్షణికులు చెప్పినట్టు లొక్కదోషమైన లేకుండఁ గావ్యరచన గావింపఁగలుగుట యెట్టిమహాకవికైన నసాధ్యమనియుఁ గూడ నూహించినట్లు కనఁబడుచున్నది.

క. నేరములు కాళిదాసమ
యూరాదులకైనఁ గలుగ నొరులకు లేవే!"

అని యభినవదండియైన కేతనయు—

గీ. కాళిదాసమయూరాది కవులకైనఁ
గలవు తప్పులసంగ నన్యులకు లేవె?
దిద్దఁదగుపట్ల దిద్దుఁడు దిద్దరాని
యెడల నానేరములు క్షమియించు టొప్పు.

అని యప్పకవియు నీవిషయమును బలపరచుచున్నారు. 'ఏకోహి దోషః' అనున్యాయము కావ్యముపట్ల నన్వయింపరాదను మతము వహించిన యహోబలుఁడు గూడ "........తప్పుగల్గినను దప్పని సత్కృపమీరదిద్దుఁడీ!" అని పండితులను బ్రార్థించుచున్నాఁడు. వీరందఱికంటెఁ బెద్దన యీవిషయమును విస్పష్టముగఁ జెప్పుచున్నాఁడు.

మ. ప్రతిభాకంపన మబ్బినం గవులచేఁ బాటిల్లుశబ్దార్థసం
గతదోషంబులు గొన్నికొన్ని ధరసత్కావ్యంబులం
దైనను, తిథవేగాకులితాపగావితతిలో డిండీరపిండా
కృతిన్, ధృతిసందర్భముచోట వానిఁ గని దింటఁ
బంపగున్ సత్కవుల్.

మొత్తముపైఁ గావ్యరచనయందుఁ బ్రతిభాకంపనముచేఁ గవికిఁ గలుగు దోషము నొకప్పుడాంధ్రలాక్షణికులు క్షమించినక్షమింపవచ్చునుగాని సంస్కృతలాక్షణికులుమాత్రము క్షమింపరు. నాయకి యుత్తమనాయకి కాదని — భాషాప్రపంచమంతయు నెవని యుచ్ఛిష్టమైయున్నదో యట్టిమహాకవిశేఖరుండైన—బాణుని కాదంబరి నుత్తమకావ్యములనుండి బహిష్కరించుటయే దీనికిఁ దార్కాణము.

దోషరాహిత్యమును గూర్చిన మతభేదము లిట్లుండఁ గావ్యస్వరూపమును వర్ణించిన

యాంధ్రలాక్షణికులలో మూర్తికవి ప్రశంస నీయఁ దగుచున్నాడు. అతఁడు కావ్యేందిర నిట్లువర్ణించెను:

క. తనువగు శబ్దార్థంబులు
ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనరుగుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తులార కావ్యేందిరకున్.

కావ్యజీవము—రసము

కావ్యమునకు ధ్వని జీవమని యీపద్యమునందుఁ జెప్పఁబడినది. వస్తురసాలంకారరూపమగు ధ్వనిసంతతయును గావ్యమునకు జీవితంబైయున్నను, అందు రసధ్వనియే మహానందస్వరూపము గలదియగుటచే నదియే కావ్యమునకు జీవమని మూర్తికవి యభిప్రాయము. 'అదోషౌ పరిష్కృతౌచ వాగర్థౌ' అని కావ్యస్వరూపమును నిర్ణయించిన సందర్భమునందే 'సాధ్యోహి రసో యథాతథం కవిభిః' అని శబ్దశాసనుఁడు కావ్యజీవమైన రసమును సైతమును జేర్కొనెను. ఇట్లే విద్యానాథుఁడు సైతమును బ్రతాపరుద్రీయమునందు "అథ సర్వేషాం ప్రబంధానాం జీవితభూతస్య రసస్య..." అని చెప్పుచున్నాఁడు. అందుచేతనే కావ్యస్వరూపనిర్ణయములలోఁ గావ్యజీవమైన రసమునుగూడ మనయాంధ్ర లాక్షణికులు నుడువుచున్నారు.

కావ్యభేదములు

ఇట్లు కావ్యస్వరూపము నేర్పరచి కావ్యభేదములను వివరించుటలో లాక్షణికులు పద్యకావ్యములనియు గద్యకావ్యములనియు రెండు విధములైన కావ్యవిభాగములను గావించిరి. ఈవిభాగ మిటీవలివారైన యప్పకవ్యాదుల చేతనే కాక కవిజనాశ్రయకారుఁడైన భీమకవి నాఁటినుండియుఁ గావింపఁబడుచున్నది.

కవిజనాశ్రయము:

క. హృద్యానవద్యకావ్యము
గద్యము పద్యమని చెప్పఁగా ద్వివిధముగన్
గద్యం బపారపదనిక
రద్యోతిత నవరసార్థరచనలఁ జెల్లున్.

అనంతునిఛందము:

గీ. పరగుఁ గవిత గద్యపద్యంబు లనఁ బాద
కల్పనంబు వలదు గద్యమునకుఁ
బాదనియతి నొప్పుఁ బద్యంబు లవియు వృ
త్తములు జాతు లనఁగ నమరుఁ గృష్ణ!

కావ్యాలంకారచూడామణి:

గీ. అట్టి కావ్యంబు త్రివిధమై యతిశయిల్లు
నవనిఁ బద్యమయంబు గద్యాత్మకంబు.

మూర్తికవిప్రముఖులైన తక్కిన లక్షణకర్తలుఁగూడ నిట్లే గద్యకావ్యములనియుఁ బద్యకావ్యములనియుఁ గావ్యవిభాగమును గావించిరి. పురాతనకవికృతములైన గద్యకావ్యము లంతగా మనవాఙ్మయమున లేని యవస్థలో లాక్షణికు లిట్లు గద్యకావ్యములను గూర్చి పేర్కొనుట సంస్కృత గద్యకావ్యములను జూచి కాఁబోలు! మనలక్షణగ్రంథము లన్నియు నించుమించుగ సంస్కృతలక్షణగ్రంథములకు భాషాంతరీకరణములవంటివే కదా? అయినను మన మింతవఱకు దృష్టి చెందక పురాతనాంధ్రగద్యవాఙ్మయమును గూర్చి జాడ లేమైనఁ గనిపెట్టుటకుఁ బ్రయ

గద్యకావ్యములు

త్నింపవలసియున్నది. అట్టి ప్రయత్నము తలపెట్టినప్పు డప్పకవి మన కించుకసాహాయ్యకారి కాఁగలఁడు. అతఁడు తనలక్షణగ్రంథములో

మ. ధర సాహిత్యము గద్యపద్యములనం దా రెండు
భేదంబులై, పరగున్, గద్యమునందుఁ బాదనియతుల్
భావింపఁగా లేవు, వ్యాకృస్ఫురణంబై విలసిల్లఁగా ను
డువ నొప్పుం గావ్యఁ డెంతేనియున్, మరుతంద్రీ!
మఱి దీనికే వచననామంబయ్యె నాంధ్రంబునన్.

అని చెప్పెను. సాహిత్యము పద్యము గద్యము
నని రెండు విధము లనియు నాగద్యమే
యాంధ్రమునందు వచనమను పేర వ్యవహ
రింపఁబడుచున్న దనియు నప్పకవి లక్షణమును
జెప్పి దీనికి లక్ష్యముగా ని ట్లుదాహరించు
చున్నాఁడు.

గద్యము: శ్రీవిలాసినీ వక్షోరుహద్వయ
గిరిదుర్గ సర్వాధ్యక్ష పద్మజాండానేక భరణ
దక్ష దక్షజామాతృధాతృ ప్రథమదిశానే
తృప్రముఖనిఖిల బర్హిర్ముఖ ప్రస్తూయమాన
శుభశీల ధరణీతనూజాది దైత్యకాల కాలయ
వనజరాసుత ప్రభృతి దుష్టక్షితిపతి నిగ్రహో
పాయపారీణ సౌందర్యవిజితారవింద బాణ
బాణాభిధాన పూర్వగీర్వాణేంద్ర సహస్ర
బాహు రంభాస్తంభ సునిశితకుఠార ద్వార
కాపట్టణ విహార,................. ...వాసవర
త్నాభ వారిజనాభ నాగారిస్యందన నందగో
పనందన కరుణాలవాల కాంచనచేల భుజ
గేంద్రశయన ఉత్తరరక్షణపరాయణ గోవింద
ముకుంద నమస్తే నమస్తే."

గద్యము-వచనము

అప్పకవి కాలమునందుఁగాని తత్పూర్వ
మునందుఁగాని గద్యకావ్యములను రచించు
నాచార ముండి యుండవచ్చును. అట్టి యాద
ర్శమేమియు లేకుండ నప్పకవి గద్యకావ్యము
లకు లక్ష్యమునుజూప సాహసింపఁడు. అతఁడు
చూపినలక్ష్యము దండకమువలెఁ జదువుటకు
వీలుగలిగించుచున్నది. మఱియు ననుప్రాస
ముక్తపదగ్రస్తాది శబ్దాలంకారభూయిష్ఠమై
నది. అప్పకవి 'దీనికే వచననామం బయ్యె
నాంధ్రంబునన్' అని చెప్పినాఁడు. గద్య
మునకే యాంధ్రమునందు వచనమనుపేరు
వచ్చినదట. ఇది విమర్శనీయాంశము. ఆదినుం
డియు 'గద్య వచనము' లను నీరెండుపదము
లును నొకదాని కొకటి పర్యాయపదములు
గానే వాడఁబడుచుండె ననుటకు సందేహము
లేదు. తిక్కన కేవలపద్యభూయిష్ఠమైన తన
యుత్తరరామాయణమునకు 'నిర్వచనోత్తర
రామాయణ' మనుపే రిడెను. అట్టికట్టుబాటు
పెట్టుకొనకయే భారతమును రచింపఁ దలపెట్టి
నప్పుడు 'పద్యముల గద్యములన్ రచియిం
చెదం గృతుల్' అని చెప్పెను. గద్యవచనము
లకు భేదము లేదనియే తిక్కన యర్థమని
యిందువలనఁ దెలియుచున్నది. తిక్కన తరు
వాతికవులును, లాక్షణికులునుగూడ గద్యము
నకును వచనమునకును భేదములేదను భావ
ముతోడనే 'పద్యగద్యములు' అని వాడుచు
వచ్చిరి. 'గద్యము' 'వచనము' అను రెండు
పదములలోఁ గవులును లాక్షణికులునుగూడఁ
బ్రాయికముగా నుపయోగించుచున్నది 'గద్య'
మనుమాటయేకాని 'వచన' మనుమాటగాదు.
ఇది గద్యకంటె వచనము భిన్నమని యూహిం
చికాదు. 'పద్య' మను పదముతో 'గద్య'
పదగుంఫనము హృద్యముగా నుండుటంజేసి,
నమాసంపుసొంపు సంపాదించుటకు మాత్రమే
తలుచుగాఁ బద్యగద్యములని చెప్పుచువచ్చిరి.

ముత్తముపై మన కవితాప్రపంచమునందం
తట 'గద్య వచనము'లను పదములు రెండును
నేకార్థబోధకములుగనే యుపయోగింపఁబడు
చుండె ననుటకు సందేహ ముండదు.

### ఆశ్వాస పద్యములు

ఇట్లుండఁగా నాంధ్ర కావ్యములయందు
భారతమాదిగా, ఆశ్వాసాంతర్గతగద్యములకు
వచనములనియు, ఆశ్వాసాంతగద్య ము లకు
గద్యములనియు నొకనిబంధనముతో సంబం
ధించిననామకరణము లేర్పడియున్నవి. ఒక్క
గ్రంథమునందైనను, ఆశ్వాసాంతర్గతవచనము
లలో నొకదానికైన గద్యమని కాని, ఆశ్వా
సాంతగద్యములలో నొకదానికైన వచనమని
కాని పేర్కొనఁబడుట యెందును గానరాదు.
గద్యవచనములకు భేదమే లేదని పూర్వకవు
లూహించినప్పుడు కావ్యములలో నిట్టి నిబం
ధన మెట్లు వచ్చినదో మన మూహింపవలసి
యున్నది.

ఒకప్పు డిది కన్నడకావ్యమార్గానుసరణ
మేమో యని తోచుచున్నది. కర్ణాటగ్రంథ
ములలోఁగూడ నాశ్వాసాంతర్గతవచనములు
వచనములనియుఁ నాశ్వాసాంతగద్య ము లు
గద్యములనియుఁ బేర్కొనఁబడియుండుటచేతఁ
దత్కావ్యమార్గములను గొన్నిటి నవలంబిం
చిన నన్నపార్యుఁడు—ఈ యాచారముగూడ
భారతరచనయందువహించియుండును.తక్కిన
తిక్కనాదులును నన్నయదారినే త్రొక్కి
యుందురు. అట్లులైనచో నప్పకవిచెప్పినట్టు
లొక్క యాంధ్రమునందు మాత్రమే కాక,
సంస్కృతములోనిగద్యమునకు వచనమను
పేరు కన్నడమునందుఁగూడ వచ్చెనని చెప్ప
వలసియుండును. కన్నడమునందైననేమి యాం
ధ్రమునందైననేమి భేదములేని గద్యవచన
ములకు నాశ్వాసములయందీభేద మెట్లువచ్చి
నదో చర్చించుచు మనపురాతనగద్యవాఙ్మ
యమునుగూర్చి యింతకంటెను విపులముగ
విమర్శించుభారము సమర్థులైన మహాశయు
లకు విడిచి, కావ్యభేదములనుగూర్చి లాక్షణి
కులయభిప్రాయములను మఱికొన్నింటిని వివ
రించుచున్నాను.

### యక్షగానకవిత్వము

కావ్యవిభాగమును గావించి వివరించిన
లక్షణకర్తలలో నప్పకవి గావించినవివరణము
నందు గొంతనూతనత్వము గానవచ్చుచున్నది.

క. పుడమినిఁ గవిచేఁ జెప్పం
బడునది కావ్యంబటంచుఁ బలుకుదు రార్యుల్
తొడబడ నదియొకదా యి
ప్పుడు రామాయణమనంగ భూనుతచరితా!

ఆ. ద్వివిధమయ్యెఁ గావ్య మవని సంగీతసా
హిత్యసంజ్ఞలను మహేంద్రవంద్య!
సప్తతాళభవము సంగీత మాజయ
దేవకావ్య మదియహో వచింప.

కవిచేఁ జెప్పఁబడునది కావ్యం బనఁబడు
ననియు నాకావ్యము సంగీతము సాహిత్యము
నని రెండువిధములనియుఁ బేర్కొనుచు సంగీ
తమునకు లక్ష్యముగా జయదేవుని గీతగోవిం
దమునుజెప్పుచున్నాఁడు. యక్షగాన కావ్యము
లనుగూర్చి లక్షణకర్తలు తెలుపుచుగాఁ బ్రశం
సింపరు. ఆంధ్రకవితా ప్రపంచమునం దీయ
క్షగానకవిత్వము కావ్యకవిత్వముతోఁ బాటు
గ నాదినుండియు వచ్చుచుండినదియే కాని
నేడు క్రొత్తదిగాదు. మఱియుఁ గావ్యకవిత్వము

ప్రారంభింపఁబడని దశయందు యక్షగాన కవిత్వమే మనదేశమందాదికవిత్వమై యుండినట్టులు గూడఁ గానవచ్చుచున్నది. ఇట్టి కవితారచన గల గేయకావ్యములలోఁ ద్యాగరాయకృతులు, నధ్యాత్మరామాయణ కీర్తనములు మున్నగునవి యున్నతస్థానముల యందుఁ బూజింపఁబడుచున్నవి. త్యాగరాజ కృతులు మనయాంధ్రదేశమునందే కాక తమిళదేశమునందు సైతమును బూలరాసులవలెఁ బరిమళించుచున్నవి. ఇంక రామాయణ కీర్తనములన్ననో — ఈశ్వరుఁడు పార్వతికి నెఱింగించు రామాయణకథాక్రమంబంతయుఁ దత్కీర్తనములలో వినుచున్నంత సేపును శరీరమునందేమైనఁ జలనముండునా? బాహ్యప్రపంచములో నంతరంగమునకేమైనఁ బ్రచారము కలుగునా? ఈపారవశ్యము తత్కావ్యానందైక జనితమే కదా? అట్టి యానందమే

ఆనందమే రసము

రసము! ఆరసమే మహాకావ్యరచనాఫలము! అట్టిరసముకంటె నుత్తమకావ్యమున కావశ్యకమగు ముఖ్యలక్షణ మింకేమున్నది? భావములా? రీతులా? వృత్తులా? గుణములా? అలంకారాదులా? ఈభావ గుణాలంకారాదులైన లక్షణములు లేకుండ రస మెక్కడనుండి వచ్చును? రసదేవతకీ లక్షణములన్నియును నవయవములే కదా? అవయవములు లేనియాకారముండునా? 'పాయస' మనినంతనే కర్పూరశర్కరక్షీరాది యోగ్యవస్తువులనుచితగతి మేళవించి పాకసంప్రాప్తి గావింప సిద్ధించిన యొక మధురపదార్థమని వెంటనే స్ఫురించు నట్లు; రస మనినంతనే యేతద్భావగుణాలంకారాదిసకలలక్షణముల సముచితగతి మేళవించి రచింప సిద్ధించిన కావ్యఫలమని యేల స్ఫురింపదు? ఇట్టి రసానందమును సంఘటించు గేయకావ్యములు సకలకవితాలక్షణలక్షితములయ్యుఁ దమనియమముల ననుసరించిన ఛందోబద్ధములు కావనియో యష్టాదశ వర్ణనములును లేవనియో వాని కుత్తమకావ్యత్వమును గటాక్షింపక లాక్షణికులు బహిష్కరించిరి. ఛందోబద్ధముగాని రచనయందుఁ గవిత్వముండదా? అది కావ్యముగాదా? మహా

కావ్యము-ఛందోనిబంధనము

కవుల కావ్యములకీ ఛందోనిబంధనము లేల? ప్రకృతిసౌందర్యమును గనిపెట్టి మహానందనిమగ్నుఁడై తనమృదుమధుర పదసంపదలతో మహాకవి లోకవృత్తమును రసావేశమునఁ గర్ణరసాయనముగ నొక్కొక్కప్పుడు పాడుచుండును. అదియే మన యక్షగానకావ్యము! ఒక్కొక్కప్పుడు చదువుచుండును. అదియే మనపద్యకావ్యము! ఒక్కొక్కప్పుడు వక్కాణించుచుండును. అదియే మనగద్యకావ్యము. అట్లుగాక పాడవలదని కాని మాటాడవలదని కాని మహాకవులను శాసింపసాహసింపరాదు. ఒకానొక కవి లక్షణకర్తల ఛందోనిబంధాష్టాదశ వర్ణనాదు లన్నియుఁ జేర్చి రచించినంతమాత్రముచేతఁ దద్రచన కుత్తమకావ్యత్వము సిద్ధింపదు. ఈయష్టాదశ వర్ణనములును నంతశ్శుద్ధిలేని కుహనాభక్తుని విభూతిరేఖలే కాని వీనివలనఁ గావ్యరచనా ఫలము లభింపదు. ఆంధ్రలాక్షణికులైనను

సంస్కృతలాక్షణికులైనను మహాకావ్యలక్షణములని యిట్టివర్ణనములు విధించినవారు కావ్యరచనంగూర్చి యెట్టియుద్దేశములు కలవారై యుండిరో యూహింపుఁడు!

అష్టాదశవర్ణనములు

మ. పురవారాశి మహీధరర్తు శశిభృత్సూర్యోదయోద్యా
నపు, పుష్కరకేళీ మధుపానమోహన వియోగక్షేమ
యానస్వయం, వరపుత్రోత్సవ మంత్రదూత్యరణా
దోర్వైభవక్రాంతి సంకీర్తనా, కర మష్టాదశవర్ణనాన్వి
తము తత్కావ్యంబు భవ్యం బిలన్.

కావ్యాలంకారచూడామణి.

గీ. ఇంకఁ గావ్య ప్రభేదంబు లేర్పరింతు
వరుస నష్టాదశ విశిష్టవర్ణనములు
గలుగవలయు మహాకావ్యతిలకమునకు,
వలమిఁ దన్నామధేయంబు లట్టులనిన.

క. పురసింధు నగర్తు వ్యనశశి
సరసీవన మధురతి ప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయ నయ
విరచనయాత్రాజి సౌఖ్య విభువర్ణనముల్.

కావ్యాలంకార సంగ్రహము.

పైని వివరించిన వర్ణనములు చాలక వానికి మఱినాలుగు వర్ణనము లెక్కుడుగఁ జేర్చి మహాకావ్యమున కిరువదిరెండు వర్ణనము లుండవలయునని యప్పకవివిధించుచున్నాఁడు. కావ్యనిబంధనము లెంతయెక్కువగా విధించినఁ దమ కంతయాధిక్యము వచ్చునని లాక్షణికుల ప్రయత్నము. అప్పకవి గొప్పకొఱకు మఱినాలుగు వర్ణనము లెక్కుడుగా విధించినను, దత్పూర్వుఁడైనమూర్తికవి తా నాపదునెనిమిది వర్ణనములుమాత్రమే పేర్కొనుచు సంతతో విడువక

"గీ. ఇందు నొకకొన్ని కడమైన నేమిగాక
యదియుఁగూడ మహాకావ్య మనఁగఁబరగు."

అని యీపదునెనిమిదిలోఁ గొన్నివర్ణనములు లేకపోయినను మహాకావ్య స్వరూపమునకు భంగముండదని చెప్పుచున్నాఁడు.

ఇట్టి యవకాశములు లేకుండ లక్షణశాస్త్రములలోని ప్రతినియమము ననుసరించి కావ్యరచన గావించుట కేవల మసాధ్యము. శాస్త్రమునకును గావ్యరచనమునకును జాల దూరము. కవి శాస్త్రోక్తమైన ప్రతివిషయమును యథావిధిఁ దనకావ్యమునఁ జేర్పవలయునను నియమము పెట్టుకొనరాదు. అట్టి నియమమే యున్నయెడల నీలక్షణగ్రంథములలోని కావ్యలక్షణముల ననుసరించి మనవాఙ్మయమునందుఁ జాలభాగము సవరించి మార్పవచ్చును. ఈసవరణ యొక్కవాఙ్మయమునకే కాదు. రాజ్యములకుఁ గూడఁ గావలసియుండును. రాజులు తమతమకోటలను విఱుగఁ గొట్టించి, లాక్షణికులు వర్ణించిచూపిన విధమునఁ గ్రొత్తకోటలను నిర్మించుకొనవలయును.

స్వతంత్ర కావ్యరచన

అస్వతంత్రులగు కొందఱుకవులు రచించిన ప్రబంధములలో నొక్కటియే పట్టణమును, ఒక్కఁడే నాయకుఁడును, ఒక్కతెయే నాయికయు, నామమాత్రభేదములతో వర్ణింపఁబడి విసుగుపుట్టించుట కీలక్షణగ్రంథములే కారణములు. మహాకవులుమాత్ర మీనిబంధనము లైచ్ఛికములుగా గణించిరిగాని తప్పనివిధిగా నుపయోగింపలేదు. అట్టి రచనలు మహాకావ్యములుగా లోకమునఁ బూజింపఁబడుచున్నవి. ఈవిషయము లక్షణకర్తలు కనిపెట్టి—తాముండఁగా—ఒకానొకకావ్యము

మహాకావ్యమని లోకము నిరయించుట తమ కవమానమని యెంచి అట్టి కావ్యమును దాముఁగూడఁ బరిశీలించి, 'పుర' మనుమాటగల చోట నిది పురవర్ణనమనియు, 'పర్వత' మను పేరువచ్చిన నిది పర్వతవర్ణనమనియు, 'వన' మనినచోట నిది వనవర్ణనమనియు, సముద్ర మనియున్నచోట నిది సముద్రవర్ణనమనియు, ఇట్లు మొత్తముపైఁ దమయష్టాదశవర్ణనములనుగూడ మెల్లగ సమర్థించి, కట్టించి. 'మహాకావ్యమే' యని తాము లోకముతోఁ బాటు శిర మూపుచున్నారు.

లాక్షణికు లిట్లు మత్సరప్రధానులగుట చేతనే మహాకవులు వారిని విశ్వసింపరు. విపరీతమతస్థాపకులై కవుల నిరసించుచుండుటయే వారి వ్రతము. కవిజిహ్వాబంధనమట! కవి సర్పగారుడమట! కవికంఠపాశమట! ఇవి కొందఱు లాక్షణికులు వ్రాసినలక్షణగ్రంథములు. వీనింబట్టి కవులయెడలలక్షణకర్తల హృదయధర్మము లెట్లుండునో కవితామర్మజ్ఞు లూహింతురుగాక!

### లక్షణకర్తల మతభేదములు

ఇట్లు సకలవిధములఁ గవులపై విజృంభించు నీలక్షణకర్తలకు వారిలోవారి కైకమత్యము సున్న. మతభేదములు మెండు. అంట, కొంట, కూతురికి, చేతును, మొదలగుపదములు సాధువులని కొందఱు, అసాధువులని మఱికొందఱు; అచ్చు పరంబగునపుడు ద్రుతమునకు ద్విత్వరూపమగు సంశ్లేషము కూడునని కొందఱు, కూడదని మఱికొందఱు; అఖండవడి చెల్లునని కొందఱు, చెల్లదని మఱికొందఱు; 'ఇందుకు' అని కొందఱు 'ఇందునకు' అని మఱికొందఱు; 'వల్ల' అని కొందఱు, 'వలన' అని మఱికొందఱు; ఇట్లొకటియా? రెండా? మనలక్షణకర్తల మతభేదములు వందలు వేలు నున్నవి. మఱియు,

క. విరచించెను శ్రీనాథుఁడు
ధరణిని శృంగారనైషధంబున 'కూర్చుం
డిరి యెండొరు' నని కానక
పరపురుషక్రియలఁ బ్రకృతిభావము కలదే?

అని యప్పకవి శ్రీనాథకృతమగు 'కూర్చుండిరి యెండొరున్' అను ప్రయోగమును నధిక్షేపింప నహోబలుఁడు దానిని సమర్థించుచు నప్పకవి భ్రాంతిపడెనని పరిహసించెను. మఱియు,

గీ. చెల్లునని ముందు భీమన చెప్పెననుచు
గలుపుదురు రేఫములును ఱకారములును,
దుష్టకవు లవియొకటైనఁ దొంటిపెద్ద
లందఱును నేల విభజింతురని తెలియరు.

అని రేఫఱకారములపట్ల పరిశీలన గావింపలేదని యప్పకవి పోతనామాత్యాదుల నధిక్షేపించి, తానే యాదోషము నీక్రింది పద్యములోఁ గావించుచున్నాఁడు.

### స్వమతాతిక్రమణములు.

మ. పురిటింటం బసిబిడ్డ చందమున వాపోవంగ నాఁ డా
త్మలో, మురువొప్పన్ విషదుగ్ధముగ్ధకుచయై ముద్దా
డు రాకాసి గు, ర్తెఱిఁ గిప్పంబునఁ బాలుఁద్రావుమి
షచే నిర్దైన్యనకాలంబునన్, ధరణిం గూల్చిన నంద
పుత్రుపలనం దార్క్యాణ ధర్మస్థితుల్.

ఈపద్యమునందలి రెండవయసందర్భము 'క్త్వార్థేత్సంధి.' శబ్దదోషములలో 'అప్రయుక్తదోషము'ను జేర్కొనుచు నప్పకవి తానే దానినిఁ బాటింపఁడు. 'వాక్స్ఫురణంబై విలసిల్లఁగా నుడువ నొప్పుంగావ్యఁడెంతేనియున్'

కావ్యఁ దనుపదము అసురగురువైన శుక్రుని విషమున నేకాని కవిపక్షమున నుపయోగింపఁ బడినట్లు సాహితీ ప్రపంచమున సామాన్యదృష్టి కెందును గానరాదు. కవులు ప్రయోగింపని పద ముపయోగించుటయేకదా యప్రయుక్త దోషము! మఱియు నింకొక చోట,

'ఎన్నఁగ నన్నయాఖ్యకవి యొకవి కాదిని.................................'

అనియు, మఱియొక చోట,

'వికృతియగుఁ దంగెడాహ్వాయ విషయ వాస' అని చెప్పి తనవ్యాకరణమునే చూచుకొనెనుగాని యశ్లీలదోషముల నీలాక్షిశికుఁడు గుర్తింపఁడయ్యె. కాళ్లు, చెవులు, మొదలగు పదములు గ్రామ్యములనియు, ప్రయోగార్హములు కావనియు శాసించినయప్పకవి 'ద్రోహి చావుమనుచు ఖరునిఁ ద్రోచెఁ గాళ్లుమీఁదు గాన్' అని యొక చోటను,

'.........కవులకుఁ జెవుల పండువులు సేయు' అని మఱియొక చోటను జెప్పి తనశాసనమును దానే యతిక్రమించుచున్నాఁడు.

లక్షణకర్తలపైన విశ్వాసము

ఇట్లు లాక్షణికులెల్లరు నొకమార్గము నొక మతమునులేక, యొకరికన్న నొక రధికుల మనిపించుకొను తలంపున నొండొరుల నధిక్షేపించుకొనుచు, ఒక్కొక్క విషయ మొక్కొక్క రొక్కొకవిధమునఁ జెప్పచుండుట కనిపెట్టి, అబ్బయామాత్యుఁడు పాపము ప్రాణము విసిగి రసజ్ఞుల నిట్లు ప్రార్థించుచున్నాఁడు.

ఉ. చెల్లునటంచు నొక్కకవి చేసినలక్షణ మొక్క రివ్వలం, జెల్ల మిఁకేసి తా నొకటి చెప్పఁగ ఛాందసవిస్తరంబు సం, ధిల్లుటఁ గావ్యకంక లవనిం దఱుచయ్యె? రసజ్ఞులార! నా, యుల్ల ప్రసాదవీథిఁ గొలువున్న సరస్వతి సత్యవాణి నా, తల్లి యొసంగు పల్కులివి తప్పులు సేయక చిత్తగింపుఁడీ!.

సులక్షణసారకారుఁడైన తాతంభట్టు తానును లాక్షణికుఁడేయయ్యు,

'కొండ తెంచిన నీతుఁ గొండ తెంచరు'

అని లాక్షణికులఁ బరిహాసించుచున్నాఁడు.

ఇట్లు నాఁటివారికేకాక నేఁటివారికి సైతమును లక్షణగ్రంథములపై విశ్వాసము లేదనుటకుఁ గీర్తిశేషులైన బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి వాక్యములే మనకుఁ బ్రమాణములు.

† "లక్షణకర్తలందఱు నొకరిపై నొకరు పోటీగానే చెప్పిరిగాని, సూటిగాను, నిర్మత్సరముగాను, నిష్పక్షముగాను, నిర్దుష్టముగాను, గ్రంథము లొనరించిరని నమ్మఁజాలము. కావునఁ బురాతన మహాకవిప్రయోగముల కన్న మత్సరప్రధాన లక్షణగ్రంథము లెక్కువగావని నాయభిప్రాయము. లక్షణగ్రంథములలోఁ జిక్కువడక, చక్కని కవిప్రయోగంబులే శరణంబులుగాఁ గవితాసరణిం బురణించి ప్రసిద్ధికెక్కిన వారే బుద్ధిమంతులని తలంతును."

క. "వ్యాకరణ మొక్కత్రోవ మ
హాకవు లొకత్రోవ కోశమఖిల మ్మొకత్రో
వై కనుపట్టెడి నీభా
షాకావ్యమ్ములను దఱుచు చదివినకొలఁదిన్."

శ్రీ తిరుపతి వేంకటకవులు

† Telugu magazine No-7-8-p. 38



# ఏకాంత సేవ

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

పసరుమొగ్గకు గంధ పరిపాక మబ్బె
బూపపిందెకు ఫలా భోగంబు గలిగె
నలుసంతకంటెను నావంటిగోల
నిత్యసుందరమూర్తి నినుఁజూడఁగలిగె.

౬౩

చిట్టిను గింజలోఁ జేర్చినచేయి
నాచేతులను బట్టి నడపించుచుండ
బొగ్గులో రత్నంబుఁ బొదిగినమూర్తి
నామూర్తిలోనుండి నడయాడుచుండ
నణువులో బ్రహ్మాండ మడఁపినశక్తి
నాశక్తిలో నిండి నలువొందుచుండ
నే నేమియెఱుఁగక యిన్నాళ్లదాఁక
విశ్వమంతట నిన్ను వెదకులాడితిని
నెలచెంతనుండి వెన్నెలచెంతనుండి
యుష్ణాతపంబులో నుడికిపోయితిని
చలువపందిటనుండి స్వామితోనుండి
విరహానలంబులో వేఁగిపోయితిని
ఆనందమున దుఃఖ మనుభవించుటకు
నానాథ! యీభ్రాంతి నాకేలగలిగె?

౬౪

పరిమళరజముతోఁ బ్రసవరసంబు
గ్రీష్మాతపంబులోఁ గెరలుటఁజూచి
ప్రణయరాగంబుతో భ్రమరసంగీత
మశనిఘోషంబులో నడఁగుటఁ జూచి
జీవధనంబులోఁ జిన్నారినౌక
మున్నీటితెరఁగలోఁ మునుఁగుటఁజూచి
చివురాకుతోడి సంజీవనీలతిక
దావానలంబులోఁ దగులుటఁజూచి
విమలతేజంబుతో వెన్నెలరేక
చీకటిముసుఁగులోఁ జిక్కుటఁజూచి
తలపోసి తలపోసి తత్త్వమూహించి
భౌతికసౌఖ్య విభ్రాంతులు డించి
నామనోనాథ! నీ నామామృతంబు
సేవించుకొంటకె నే జీవించియుంటి.

౬౫

ఈపల్వలం బింకి యీనాటికైన
నీలమేఘంబుతో నింగి నల్లాడి
తపియించి, మధురామృతస్వరూపమును
నమృతాబ్ధిఁ జేరిన దంతియేచాలు
కరుణాణువులతోడి కన్నీటిచినుకు
లిరిగొండచరియల నింకినచోట
నానందవల్లిక లలరిన నేమి
హాలాహలజ్వాల లడరిన నేమి
నానాథ! నీమూర్తి నాకన్నులందె
యంకితంబై యుండె నంతియేచాలు.




మేడేపల్లి వేంకటరమణాచార్యులు గారు

(గతసంచిక తరువాయి)

మాల్య. వత్సా! వినుము చెప్పెద. కార్యగతి నెఱింగిన దానవు. వానరులకు మంత్రియగు జాంబవంతుడనువా డొకడు కలడు. అతడు మతంగాశ్రమవాసిని యగు శ్రమణాయను నొకశబరయోగిని నిట్లు ప్రార్థించెను. వాలి విరక్తుడగుటవలన నతనిప్రజలు దారిద్ర్యపీడితులయి కిష్కింధయందు సుగ్రీవునికి బట్టముగట్ట దలంచి రామభద్రుని సహాయునిగా గోరుచున్నారు.

శూర్ప. (ఆతంకముతో) ఎట్లెట్లూ? ఈక్షత్రియకుమారుని వాలినిగ్రహమందు సహాయునిగా గోరుచున్నారా?

మాల్య. తరువాత అయోధ్యనుండి కైకేయిచే భరతునియొద్దకు బంపబడిన మంథరయను వృద్ధదాసి ఆతపబాధకోరువలేక మిథిలాప్రాంతవనమందున్నదని హనుమంతుడు నాతో చెప్పినాడు. ఇపుడు నీవు హనుమంతునిచే గాపాడబడిన శరీరముగలదానవయి పరకాయప్రవేశవిద్యచే మంథరాకళేబరమందు బ్రవేశించి యీసంవిధానము దశరథునికి దెలియునట్లు చేయుము. ఇట్లు పిత్రాజ్ఞచే రాముడు వ్యాళపాషాణకంటకబహుళమగు దండకారణ్యమునందు బ్రవేశించి వైదేశికుడగును. ఇతడు స్వకార్యగౌరవమువలన వాలివధపూర్వకమగు సఖ్యసంధిచే సుగ్రీవుని బరిగ్రహించును.

శూర్ప. కౌతుకముతో ఆసంవిధాన మెద్ది?

మాల్య. (చెవిలో జెప్పుచున్నాడు).

శూర్ప. (నవ్వి) ఓహో! వృద్ధభల్లూకముయొక్క బుద్ధికుశలత! తరువాత నేమి జరిగినది?

మాల్య. తరువాత నాశబరయోగిని సుగ్రీవప్రాణానురాగముచే నట్లే చేసెద నని యంగీకరించి విదేహాభిముఖియై బయలుదేఱినదని జనస్థానవాస్తవ్యులగు రాక్షసులు నాతో జెప్పిరి. బలవాయిసంగా జాంబవత్ప్రయోగముచే విరాధాది రాక్షసాధిష్ఠితమగు వింధ్యారణ్యమందు సంచరించుచుండెడి రాముని కళత్రము నపహరించుట సులభము. పురందరోపదిష్టమాయామహామంత్రధారియగు దశరథునిదగ్గఱ మనమాయలు పనికిరావు.

శూర్ప: సమీపమునకు వచ్చిన రాముని నేల యిట్లు చేయవలయును?

మాల్య: వత్సా! నీదృష్టి వృద్ధదృష్టితో సంవదించునది. ఎవ్వడుపనతుని దారపుత్రుల నవమానించునో వానిని బరిమార్చుట కాదేశప్రజలు ప్రయత్నింతురు.

శూర్ప: రామభద్రు డిట్లు చేయునా?

మాల్య: సంశయ మేమి? మహానుభావులు రాజ్యభోగముల నేవగింతురు.

శూర్ప: ఇందులో మఱియొకయనర్థము సంభవించునని నే నూహించెదను.

మాల్య: ఏమిటిది?

శూర్ప: జనకపురమునుండి మరలివచ్చుచుండగా వింటిని. హరధనుర్భంగకుపితుడైన పరశురాముడుమాత్సర్యము గలవాడై రామునిమీదికి యుద్ధమునకు వచ్చునట.

మాల్య: పరశురాముడైనను రాముని జయింపలేడు.

శూర్ప: ఈరకంఠుడగు నాక్షత్రియశిశువునం దింత మాహాత్మ్య మారోపించుచున్నారేమి?

మాల్య: వత్సా! నీకు దెలియదు. సర్వరాజకదుర్ధర్షము సర్వదేవతామయమునగు ధూర్జటిచాపమును విఱిచిన రామునిచే ముల్లోకములు జయింపబడినవని నమ్ముము. సర్వక్షత్త్రియకులాంతకు డగు పరశురాముడు రాగలడు. ఏమి జరుగునో తెలియదు. రాజకులమూలోనిక పోవుదము రమ్మని యిద్దఱు నిష్క్రమించిరి.

మహావీరచరిత్ర తృతీయాంకములో వర్ణింపబడిన రామ పరశురామసమాగమము చదివితీరవలెను. ఇందులో ధీరోదాత్తనాయకు డగు శ్రీరామచంద్రుని వినయము, గాంభీర్యము, నిగూఢమానము, సత్త్వావష్టంభము, పరగుణగ్రహణపారీణత, మొదలగుగుణములు, ధీరోద్ధతు డగు పరశురాముని మాత్సర్యము, చండవృత్తి, వికత్థనత్వము, సులభక్రోధము మొదలగు గుణములు నౌచిత్యానుసారముగా వర్ణింపబడినవి.

"తతః ప్రవిశతి క్రుద్ధోద్ధతః పరశురామః.

పరశురామః: అహో దురాత్మనః క్షత్త్రియవటో రనాత్మజ్ఞతా.

శ్లో. నత్రస్తం యదినామ భూతకరుణా సంతానశాంతాత్మన, స్తేన వ్యారుజతా ధను ర్భగవతో దేవా ద్భవానీపతేః; తత్పుత్రస్తు మదాంధతారకవధా ద్విశ్వస్య దత్తోత్సవ, స్స్కంద స్కంద ఇవ ప్రియో౽హ మధునా శిష్యః కథం నశ్రుతః.

రామః: అకలితతపస్తేజో వీర్యప్రథిమ్ని యశోనిధా,
వవితథమదాధ్మాతే రోషా న్మునా వభిధావతి;
అభినవధనుర్విద్యాదర్ప క్షమాయచ కర్మణే,
స్ఫురతి రభసా త్పాణిః పాదోపసంగ్రహణాయ చ.

కిం త్వవిషయ స్తావ దాచారస్య.

జామదగ్న్యః: భోభోః పరిస్కందాః! క్వ రామో దాశరథిః?

రామః: అయ మహం భోః, ఇతఇతో భవాన్.

జామదగ్న్యః: సాధు రాజపుత్త్ర! సాధు. సత్య మైక్ష్వాకః ఖ ల్వసి.
అన్విష్యతః ప్రమథనాయ మమాద్య ధర్మా
దాత్మాన మర్పయసి జాతివిశుద్ధసత్త్వః,
గంధ ద్విపేంద్రకలభః కరికుంభకోట
కుట్టాకపాణికులిశస్య యథా మృగారేః."

రామునిజూచి తనలో అహో ఈక్షత్త్రియకుమారు డెంతరమణీయముగా నున్నాడు. ఇతడు నాకంటబడినది మొదలుకొని సహజ సౌందర్యసంపదచే నామనము నాకర్షించుచున్నాడు. కాని యితనిని జంపవలసివచ్చెను కదా యని ప్రహారము నా వీరవ్రతమును నిందించుకొనుచున్నాను. (పైకి) ఎన్నడు భంగ మెఱుగని మా గురువుగారి ధనుస్సునకు భంగము గలిగించితివి గావున నీపరశువుచే నీ కంఠము ద్రెళ్ళ నేసెద. ఈపరశువుచేతనే కదా మాగురువుగారికి ఖండపరశువని లోకములో బ్రసిద్ధిగలిగినది.

రాముడు: సపరివారకార్తికేయ విజయావర్జితు డగు ధూర్జటి తమకు బ్రసాదించినపరశు విదేనా?

పరశురాముడు: (తనలో) ఆశ్చర్యము. ఇతనిరీతి క్రొత్తగానున్నది. ఇతని పౌరుషావష్టంభ ముత్సాహసంరంభగంభీరమై యున్నది. ఇత డిట్టిమాహాత్మ్యము సౌజన్యము గలవాడై యుండుటకు గారణ మేమో తెలియదు. (పైకి) దాశరథీ, మా ఆచార్యులవారికి బ్రియమైనపరశు విదియే.

రాముడు: అందువలననే తమకు బరశురాముడని మూడులోకములయందు బ్రసిద్ధిగలిగినది. లోకములో మీకు సాటి యెవ్వరు? కన్నవాడా జమదగ్ని; గురువా భగవంతు డగుపరమేశ్వరుడు; దోర్వీర్యమా వాగతీతము; అది మీపనులచేతనే వెల్లడియయినది. మీ త్యాగము చూడబోతే సప్తసముద్రావృతభూమండలదానావధికము; క్షత్త్రబ్రహ్మతపోనిధులగు మీమాహాత్మ్యమా లోకోత్తరము.

పరశు: భవాదృశాద్భుత వీరలాభమువలన నామనస్సు నిన్ను గౌగిలించుకొనుట కభిలషించుచున్నది.

రాముడు: ఆర్యా! కౌగిలించుకొనుట ప్రస్తుతప్రతీపము గదా.

పరశు. ఈరాజపుత్త్రుని యంతఃకరణము పరగుణోత్కర్షమును సహించునదియై సౌజన్యపూరితమై యున్నది. ఇతని యహంకారగ్రంథి పారమార్థిక వినయదుర్విభావ్యమై నిపుణబుద్ధిగ్రాహ్యమై యున్నయది.

### తెరలో

జనకుడు ధనుష్పాణియై తనపురోహితుడగు శతానందుని వెంటనిడుకొని యిటు వైపు వచ్చుచున్నాడు.

పరశు: (విని) ఈజనకుడు సద్వృత్తిముగలవాడు, సూర్య శిష్యుడగు యాజ్ఞవల్క్య డితనికి బ్రహ్మవిద్య నుపదేశించెను. కాని క్షత్రియుడని నాకుశిరశ్శూలమును బుట్టించుచున్నాడు.

తరువాత సంభ్రాంతుడై జనకుడు శతానందుడు ప్రవేశించుచున్నారు.

శతానం: మహారాజా! ఈ పరశురాముని విషయమయి మన మేమి చేయవలయును?

జనకుడు: ఇతడు ఋషి; శ్రోత్రియుడు; మనయింటి కతిథిగా నేతెంచినవాడు. కావున అర్ఘ్యము, పాద్యము, ఆసనము, అటుపైని మధుపర్కము నొసంగవలయును; లేక మనయందు శాత్రవము వహించి రామునితో ద్వేషించెనేని నయవిహీనుడైన యితని విషయమయి కార్ముకము తప్ప రెండవది పనికిరాదు.

రాముడు: (పరశురామునితో) తమరేల కన్నీరు నించుచున్నారు.

పరశు: మరేమియు లేదు. జగన్మోహనమగు నీరూపము నాకు నేత్రపర్వమొనర్చుచున్నది. మాగురువుగారిని బరిభవించిన యిట్టి నిన్ను ఒంపవలసివచ్చెను గదా యని దుఃఖించుచున్నాను.

రాముడు: మీరు నాయందు గనికరము గలవారని నే నెఱుంగుదును.

పరశు: ఓరీ! యేమి యిట్లు భయపడుచున్నావు? నీకంఠమందు నాకుఠారము పడక మానదు.

రాముడు: ఓహో! తమరు నిజముగా నాపై గనికరవహించినవారివలె నున్నారు.

పరశు: నన్ను జూచి బొమలు ముడిచుచున్నావేమి? ఓరీక్షత్రియడింభ! నీవు సుందరుడవనియు, నవవధూ పరిగ్రహుడవనియు, బాలుడవనియు మే మెంతో వ్యథ నొందుచున్నాము. పరశురాముడు తనతల్లి శిరస్సు ఛేదించినవాడను ప్రవాదము లోకప్రసిద్ధము. ఓరీ మూఢుడా! క్షత్రియజాతిపైనున్న కోపముచే గర్భమందున్న పిండముల నైతము ముక్కలుగా గోసి యారక్తముచే నిండిన హ్రదమందు స్నానముచేయుట వలన మందగించిన క్రోధాగ్నిగల నా స్వభావము సకలప్రాణులకు దెలియును.

రాముడు: క్రౌర్యము పురుషదోషముగదా! దాని కింత శ్లాఘన మేల?

పరశు: ఓరీ! నిర్భయుడా, క్షత్రియవటుడా! మిక్కిలి ప్రగల్భములు పలుకుచున్నావు. నీవు ముందు నన్ను గొట్టుము. ముందు దెబ్బదినుట నాకిష్టము. నేను మొదట నిన్ను గొట్టగా నీపని యేమగునో దలియునా? నా కుఠారము నీశరీరమునుండి శిరస్సును వేరుచేయును.

జనకశతానందులు: బాబూ! రామభద్ర నోరెత్తవద్దు బోకు.

రాముడు: అన్నా! ఎంతకష్టము. పెద్దలఆజ్ఞ మన్నింపవలసివచ్చెను.

పరశు: ఓయి శతానందుడా! సుఖముగా నున్నావా?

శతానం: విశేషించి తమదర్శనమునవలన. ఆర్యా! నీవు మాకు బూజ్యతముడవయిన అతిథివి. ఆతిథ్యము చేయుటకు సిద్ధముగా నున్నాము.

పరశు: యాజ్ఞవల్క్యశిష్యుడగు మీరాజు సుచరిత్రుడు. అంతయు దగియున్నది. కాని నే నాతిథ్యము నపేక్షించి రాలేదు.

శతానం: అక్రమముగా కన్యాంతఃపురమును జొచ్చుటచే మా మర్యాదను దూషించితిరి.

పరశు: నే నరణ్యవాసిని, బ్రాహ్మణుడను. మీ రాజుగారి గృహమర్యాదల నే నెఱుగను. క్షమింపుము.

జనకుడు: మా రక్షణలోనున్న రాఘవశిశువు విషయమయి నీ కేల యింత క్రౌర్యము?

కంచుకి: (ప్రవేశించి) మహారాజ! కంకణమోక్షము కొరకు దేవేరులు వరుని బంపమని చెప్పినారు.

జనకశతానందులు: బాబూ! రామభద్ర! శ్వశ్రూజనము నిన్ను బిలుచుచున్నారు. పోయిరమ్ము.

పరశు: లోకధర్మము ననుసరించుము. నిన్ను నీ బంధువులు చూతురు గాక. కాని ఆరోగ్యకులు గ్రాము

ములలో జిరకాలముండరు. కనుక కాలవిలంబను చేయకూడదు.

రాముడు: మంచిది; ఆలాగుననే అని (నిష్క్రమించెను.)

మురారికృత మగు ననర్ఘరాఘవమందు గూడ రామపరశురామ సంవాదము దీని ననుసరించి వ్రాయబడి నట్లు కానవచ్చుచున్నది. ఈ రెండు నాటకములలోనున్న సంవాదములలో గొన్ని శ్లోకములుకూడ సజాతీయాభిప్రాయములు గలిగి యున్నవి.

### మహావీరచరిత్రము

"ఉత్పత్తి ర్జమదగ్నితః స భగవాన్ దేవః పినాకీ గురుః, శౌర్యం యత్తు న తద్గిరాం పథి నను వ్యక్తం హి తత్కర్మభిః; త్యాగ స్సప్తసముద్రముద్రితమహీనిర్వ్యాజదానావధిః, సత్యబ్రహ్మతపోనిధే ర్భగవతః కిం వా న లోకోత్తరమ్".

### అనర్ఘరాఘవము

"ఆదేష్టా భగవాన్ భృగు ర్జననయో రుత్పత్తి క్షాత్రబ్రాహ్మ్యయో, ర్దేవో ధూర్జటి రస్త్రకర్మణి గురు ర్వీర్యంతు దూరే గిరామ్; సప్తద్వీపవతీం దదద్భువ మభి ప్రైషీ ర్ద్విజాన్ కశ్యపప్రాయా న్ప్రతిమప్రభావ భవతే కస్మైచి దస్మై నమః.

### మహావీరచరిత్రము

అన్విష్యతః ప్రమథనాయ మమాపి దర్పా దాత్మాన మర్పయసి జాతివిశుద్ధసత్త్వః; గంధద్విపేంద్రకలభః కరికుంభకూట కుట్టాకపాణికులిశస్య యథా మృగారేః॥

### అనర్ఘరాఘవము

సవిధ ముపసర న్నపూలకాపం కషితనృపాస్వాయ మధ్యమాం ధినోషి; హరి మివ కరికుంభకూటకోటి ప్రకటకఠోరనఖాంకురం కురంగః.

ఇట్టిశ్లోకము లింక మఱికొన్ని యున్నవి గాని గ్రంథవిస్తరభీతిచే వాని నిచట నుదాహరింపలేదు.

మహావీరచరిత్రలో కైకేయీ వార్తాహారిణియై మిథిలకు బోవుచుండెడు వృద్ధదాసియగు మంథరయొక్క శరీరమందు శూర్పణఖ మాల్యవంతుని ప్రేరణచే ప్రవేశించి కైకేయీసందేశమును రామదశరథాదులకు వినిపించి రాముడు సీతాలక్ష్మణులతో నరణ్యమునకు బోవునట్లు చేసెనని చెప్పబడియున్నది. ఎట్లనగా:—

రామః: (ఉపసృత్య) అయి మంథరే! అపి కుశల మంబాయాః?

శూర్ప: కుశలం సుఖం చ వత్స! సా సదా ప్రసృతస్తనీ మధ్యమా తే మాతా త్వాం పరిష్వజ్యాజ్ఞాపయతి; "పుత్రక! పురా ప్రతిజ్ఞాతౌ ద్వౌ వరౌ మహారాజం జ్ఞాపయామి. తత్ర మే విజ్ఞప్తిహారకో భవ." ఏష తే తాతస్య కార్యలేఖః.

లక్ష్మణః: (గృహీత్వా వాచయతి)

"అస్త్యేకేన వరేణ వత్స భరతో భోక్తాధిరాజ్యస్య తే, యా త్వన్యేన విహాయ కాలహరణం రామో వనం దండకామ్; తస్యాం చీరధర శ్చతుర్దశసమా స్తిష్ఠత్వసౌ తం పున, స్సీతాలక్ష్మణమాత్రికాత్పరిజనా దన్యో నచానువ్రజేత్."

రామః: అహో ప్రసాదోత్కర్షః. తత్రైవ గమనాదేశో యత్ర పర్యుత్సుకం మనః, న చేష్ట విరహో జాత స్స చ వత్సోనుజో ఽనుగః.

కైకేయి సకలసంపత్సమృద్ధమయి నిష్కంటకమగు రాజ్యమును భరతుని కిచ్చివేసి జటావల్కలముల ధరించి నీవరణ్యమునకు బొమ్మని యాజ్ఞాపింపగా మహాప్రసాదమని తలంచి "తత్రైవ గమనాదేశో యత్రపర్యుత్సుకం మనః" అని ఆనందించినవాడై "అహో తస్యాభిషేకాయ విసృష్టస్య వనాయ చ, నాల్పోపి లక్షిత స్తస్య రామస్యాకారవిభ్రమః" అన్నట్లు లేశము ముఖమందు విన్నదనము లేకుండ "మా చ లక్ష్మణ! సంతాపం కార్షీర్లక్ష్మీవిపర్యయే, రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః. అహం హి వచనాద్రాజ్ఞః పతేయ మపి పావకే, భక్షయేయం విషం తీక్ష్ణం మజ్జేయ మపి సాగరే." అని పిత్రాజ్ఞా పరిపాలనమే హెచ్చని తలంచి తదాజ్ఞానుసారముగా వనమునకు బోవుటయే మహోదయముగా నెంచి రాజ్యమును తృణప్రాయముగా విడిచిపెట్టి యరణ్యమునకు బోయిన యీ మహానుభావుని పితృమాతృభక్తి, సోదరస్నేహము, రాజ్యభోగపరాఙ్ముఖత్వము, ధార్మికత్వము మొదలగు సద్గుణము లిందువలన ప్రకటింపబడుచున్నవి. తనకు మహాపకార మొనరించిన కైకేయిని దానెపుడు

నిందింపలేదు సరియేకదా యొరులామెను నిందింపగా విని సహింపలేడని యీ దిగువ శ్లోకములవలన స్పష్టమగుచున్నది. "న లక్ష్మణాస్తి ఖలు కస్త విఘ్నమాతా; యదీయ స్మతిశంకనీయా అత్యంత సుఖసంవృద్ధ స్సుకుమారస్సుఖోచితః; కథం న్వపర రాత్రేషు సరయూమవగాహతే. జితస్స్వర్గ స్తవ భ్రాత్రా భరతేన మహాత్మనా, నపిత్ర్య మనువర్తంతే మాతృకం ద్విపదాంఇతి. ఖ్యాతో లోకప్రవాదో ఽయం భరతే నాన్యథాకృతః, భర్తా దశరథో యస్యాః సాధుశ్చ భరతస్సుతః. కథంను సాంబా కైకేయీ తాదృశీ క్రూరశాలినీ; ఇత్యేవం లక్ష్మణే వాక్యం స్నేహా ద్బ్రువతి ధార్మికే. పరివాదం జనన్యాస్త మసహ న్రాఘవో ఽబ్రవీత్ నతేం ఽబామధ్యమాతాత! గర్హితవ్యా కదాచన.

## అనర్ఘ రాఘవములో

(ప్రవిశ్య) లక్ష్మణః: ఇయ మార్యాయా మంథరోపనీతా మధ్యమాంబాయాః పత్రికా. (రామ: నాపన్యోన్యం సవితర్కం పశ్యతః)

రామః: (సహర్షం) వత్స! లక్ష్మణ! అపి సపరివారాయాః కుశల మంబాయాః కథయ త్యార్యా మంథరా?

లక్ష్మణః: అథ కిం?

రామః: నూన మస్మత్ప్రవాస కౌర్మనస్య మంబాం పీడయిష్యతి. (జనకః లక్ష్మణ హస్తాత్పత్రికాం గృహీత్వా వాచయతి.)

"స్వస్తిః మహారాజ దశరథం కైకేయీ విజ్ఞాపయతి:
తస్మైవర ద్వితయమాశ్రుత పూర్వమేవ
యాచే బిభర్తు భరత స్తవ రాజ్యలక్ష్మీమ్;
వర్షాణి తిష్ఠతు చతుర్దశ దండకాయాం
సౌమిత్రి మైథిలసుతా సహితశ్చ రామః."

అని వ్రాయబడినది.

ఇందులో జాంబవంతుని ప్రేరణచే మంథరా కళేబరమందు శ్రమణ యనెడు శబరయోగిని పరకాయ ప్రవేశ విద్యచే ప్రవేశించి సందేశమును జెప్పినట్లున్నది. భవభూతి మురారులిద్దరు రామవివాసన హేతుత్వమును కైకేయినుంచి తొలగించి పరులపై బెట్టిరి. ఈరినాటకములలో రామవివాసన ప్రయోజనములు వేరువేరుగా నున్నవి. మహావీరచరిత్రములో రామవివాసనము రావణునికి సీతాపహరణమందు సౌకర్యము నాపాదించుటకును అనర్ఘరాఘవమందు రాముడు వాలిని వధించి సుగ్రీవునికి కిష్కింధారాజ్య మొసంగుటకునని కల్పింపబడినది.

మహావీరచరిత్రములో విభీషణశరణాగతి యిట్లు కల్పింపబడినది.

రామలక్ష్మణులు దండకారణ్యభూభాగమందు సంచరించుచుండగా వారిని వెదకుచు వచ్చు శ్రమణ వనమధ్యమందు దను కబందునిచే జీవగ్రాహముగా బట్టుకొనబడి మొఱలిడుచుండగా రాము డామెనువిని లక్ష్మణుని బంపెను. లక్ష్మణుడు దానవుని తల నరికివేసి యా సిద్ధతాపసిని విడిపించెను. పిదప నత్తాపసి రాముని సన్నిధి కేతెంచి నమస్కరించి విభీషణుని పత్రిక నిచ్చెను. లక్ష్మణు డిట్లు చదువుచున్నాడు.

స్వస్తి - శ్రీ రామదేవం ప్రణమ్య విభీషణో విజ్ఞాపయతి:

విశ్లిష్ట భాగధేయానాం త్వమిహ నః పరమా గతిః,
ధర్మః ప్రకృష్యమాణో వా గోప్తా ధర్మస్య వా భవాన్.

రామః: వత్స! బ్రూహి. కిం సందిశ్యతా మేవం వాదినః ప్రియసుహృదో లంకేశ్వరస్య మహారాజ విభీషణస్య?

లక్ష్మణః: యదా లంకేశ్వరః ప్రియసుహృ దిత్యుక్త మార్యేణ తత్కిమనశిష్యతే సందేశస్య?

రామః: యదాహ సౌమిత్రిః.

శ్రమణా: అనుగృహీతా స్మీతినిష్క్రాన్తా

రావణునిచే ధిక్కృతుడై విభీషణుడు శ్రీరామచంద్రు నాశ్రయించెనని వేగులవాండ్రగు శుకసారణులు మాల్యవంతునితో జెప్పినట్లు మురారి కల్పించెను.

## వాలి వధ

మహావీరచరిత్రములో చతుర్థాంక ప్రారంభమందు మాల్యవచ్ఛూర్పణఖాసంవాదములో

"కింతు ప్రాక్ప్రతిపన్న రావణ సుహృద్భావేన భీమౌజసా, శత్రు ర్వజ్రధరాత్మజేన హరిణా ఘోరేణ ఘానిష్యతే" అనిమాల్యవంతుడు శూర్పణఖతో జెప్పినట్లు పంచమాంకములో మాల్యవంతుడు వాలియొద్దకువచ్చి

రాముని వధింపుమని ప్రేరణచేసి లంకకు మరలిపోగా రామవధరూపమగు నకార్యము నే నెట్లుచేసెద నని వాలి తనలో దా నిట్లు చింతింపసాగెను.

"ఈరీతిగా బుధులకార్యకరణతత్పరులై నిర యద్వారమందు గూలెదరు. తొల్లి నేను రావణు నితో జేసిన సఖ్యమును నాకిపుడు జ్ఞాపకముచేసి మాల్య వంతుడు పూజ్యుడగు రఘూద్వహుని జంపుమని నన్ను నియోగించెను. ఏల నా కీనిర్బంధము? ఈ రాముడు ధర్మాత్ముడు. జగత్పూజ్యుడు. మాయూరి కేతెంచిన అతిథి, నిరపరాధి. ఇట్టివానిని వాక్కుచే నైన నారా ధింపలేదు సరియేకదా! మీదు మిక్కిలి దారుణకర్మ నొనర్చుటకు సమకట్టితిని. నే నవశ్యము శ్రేయోలాభము కొఱకు యత్నింపవలెగాని యిట్టి పాపకార్యమును జేయగూడదు. శరచ్చంద్ర నిభ మగు నాకీర్తి దిగంత ములయందు వ్యాపించినది. అట్టి నాకీర్తి చంద్రున కీదుష్కార్యము కళంకావహము కాదా! సకలశ్రేయో మూలకమగు సుజనచరిత్రమందు నా కభిరుచి హెచ్చు. సుహృద్వాక్య మనతిక్రమణీయము. (విచారముతో తచ్చాడుచున్న పురమునుండి రామునిజూచి) ఇత డచిం త్యాద్భుతమహిమానుభావుడు. అప్రతిహతానంత శక్తి. అప్రాకృత దివ్యతేజోరూపుడు. నిజముగా జగముల న్నియు నీతని దివ్యతేజోవిలాసరూపములని పౌరాణిక ప్రసంగములయందు వినియున్నాను. (పరదేవతా ప్రతిపత్తి పూర్వకమగు భక్తి నభినయించుచు) "యథా యం నిధ్యాత స్స్ఫురతిస్ఫుటి సంభావిత పర్వగ్వస్రస్ర బ్రహ్మాండ ప్రళయ పునరుద్భాసిపథపః; తథామన్యే నూనం జగదవనహేతోరపత రంగతో దేవ స్సాక్షాజ్జ యతి భువినారాయణ ఇతి" ఇట్టి మహాత్మునియందు బాపకర్మ నాచరించుటకు నిశ్చయించితిని. ఛీ! ఛీ! రావణా! సౌహార్దము నశించునుగాక! అందువలననేమి యుప్రత్యవాయము లేదు. "అధర్మో ధర్మతామేతి వ్యాదృతే పరమేశ్వరే, ధర్మోప్యధర్మ ఏవ స్యాత్త్ర మనాదృత్య భావితః" అని శాస్త్రము చెప్పుచున్నది. (తిరుగ విచారముతో) మహావీరులయెదుట నేను మాల్య వంతునికి వాగ్దానముచేసి యిపుడు రామునితో యుద్ధము చేయుటకు వెనుదీసినయెడల నన్నుగూర్చి వారేమి తలం చెదరు? చిరకాలార్జిత మయి విశ్వవ్యాపకమగు నా కీర్తికి భంగము కలుగదా? ఇక్కడ నేమిసమాధానము? (ఆలోచించి) ఇట్లు చేసెదను. వాలి యెప్పుడును సమానబలులతోనే యుద్ధముచేయువాడని లోకములో నాకొక ప్రసిద్ధిగలదు. నా ప్రతిజ్ఞకూడ నట్లనే. "నేను సత్యప్రతిజ్ఞుడను కావున నేను నీతో సమానబలుడనని" నన్ను నమ్మించుట కొక పందెము వేయుమని రాము నడిగెదను. (మరల నాలోచించి) మహాప్రభావసంపన్ను డగు రామునికొక యసాధ్యమయిన పనిలేదు. దుందుభి కంకాళమును పాదాంగుష్ఠముచే వింధ్యాద్రి యవతలకు జిమ్మివైచెను. (మరల నాలోచించి యవజ్ఞతో) వీడైన నొక ప్రత్యాయన మడిగెదను. నిజావమానహేతు వగు ప్రత్యాయనమందు రాముడు ప్రవర్తింపడు. అందువలన నా కోర్కె సిద్ధించును. (తిరుగ నాలోచించి విచారముతో) ఆమహాత్మునితో నిట్టిమాట యెట్లుచెప్పగలను? ప్రత్యవాయముతోగూడిన యీ వక్రమార్గములో నేమిపని? యుద్ధము మానుకొను టయే దీమార్గము నిష్కళంకమయినదిగాను బుజు వయినదిగాను కాన్పించుచున్నది. కావున నీ నిశ్చయము విడిచెదను. "నీవు జగత్పూజ్యుడవు. మాయొద్ద కతి థిగా నేతెంచితివి" అని బహుమానవచన పురస్సరముగా నాతనితో సఖ్యముచేసికొనియెద. వానరులు రాక్ష సులు వారివారి యిష్టముచొప్పున నన్నుగురించి అను కొందురుగాక! (మరల విచారముతో) లోకప్రసిద్ధ మయిన వాలి రావణుల సఖ్యమును రాము డెఱుంగను. నన్నిపుడు మాల్యవంతుడు ప్రోత్సాహపరచుట సమీప మందున్న రాము డెఱింగియే యుండును. రావణ మైత్రిని విడచిపెట్టుటచే నన్ను రాముడు మిత్రద్రో హిగా దలంచి యంగీకరింపకపోవును. సమయము రాగా రావణునివలె నన్నుగూడ నితడు విడుచునని రాముడు నాయందు విశ్వాసములేనివాడగును. కావున రామునితో సఖ్యము దుర్ఘటము. అందువలన సావ జ్ఞప్రత్యాయన ప్రార్థనమే మంచిదని తలంచెదను. ఈ పక్షమందు సుహృత్కార్యవిరోధ మేమియు లేదు. సర్వవిధములచేతను సత్యప్రతిజ్ఞ బలవత్తర మయినది. అటులనే హరిశ్చంద్రాదులు సత్యప్రతిజ్ఞ ననుసరించి చండాలదాస్యమును సైత మంగీకరించిరి. రాముని

కిది యవమానహేతువై కోపమును బుట్టింపదు. మహానుభావు డగు నాతనికి మావంటివారివలన నవమాన మెట్లు గానేర్చు? మహాపరాధములచే మహాత్ములకు గోపము గలుగును. మావంటివారిమాటలచే రామునికి గోప ముదయింపదు. కాబట్టి యీ మిషచేత యుద్ధమును దప్పించు కొందును. నరకహేతువగు రావణసఖ్యమును నిరసించెదను. రాక్షసులందరు నశింతురుగాక (అనిచూచి) ఓహో రాముడు నాకు దగ్గరగా వచ్చుచున్నాడే!"

(రామునితో)

"మహావీరుడ వగు నీకు స్వాగతము."

రాముడు: మహావీరలాభముచే నా బాహుబలము సాఫల్యమునొందును గావున నిపుడు నేను మహావీరుడనై తిని.

వాలి: వీరస్పర్ధను విడిచిపెట్టిన నామహావీరత్వము కాల్చనా? జగత్పూజ్యులయిన తమవంటివారిని సంతోషపెట్టుటయే వీరునిధర్మము.

రాముడు: నా బాహుఫలసాఫల్యము నాకు బరితోషహేతువు.

వాలి: నేనొకటి విన్నవించుకొనియెద, దానిని తమరను గ్రహించి తెలుసుకొందురుగాక.

రాముడు: అదేమి?

వాలి: ఇంతకాలము నాకు సమానబలులతోనే యుద్ధము పొసగెను. మీరు నాతో సమానబలము గలవారని నాకు నమ్మకము పుట్టునట్లు చేయుడు

రాముడు: నే నేమిచేసిన మీకు నమ్మకము పుట్టును?

వాలి: వృక్షాంతర్లీనమూర్తిః ప్రణిహితమనసా సమ్యగాలోక్యలక్ష్యం, వక్షస్యాభోగయుక్తే మమ నిశితశరం ముంచ గాఢప్రహారమ్; తచ్చేద్భిద్యేత గాఢప్రసరమపి భవేత్ త్వద్వ్యథేతా ఽపియద్వా తే నాశంకాని రానే నను తదనుమత స్తుల్యసారో మమ స్యాః" (ఒక చెట్టుచాటుననుండిసావధానచిత్తముతో నావెడదయురమును గురిచేసి వాడియయిన బాణముచే గొట్టుము. ఆదెబ్బచే నాగుండెలు బ్రద్దలయి రక్తము చిమ్మినను లేక నేబాధనొందినను నీవు తక్కువబలము గలవాడ వనుశంక పోవును, అప్పుడు నీవు నాతో సమానుడ వనుకొందును.)

రాముడు: (కోపముతో) ఓరీ! దురాత్ముడా! వీరాధముడా! నన్ను వ్యాఘ్రప్రాయునిగా భావించి పరిహసించుచున్నావా? నన్ను బరిహసించుటకుగూడ నీకు యోగ్యత లేదు. నిజముగా నీవు యుద్ధమునకు భయపడి యిట్టి మిష నొకదానిని బన్నితివి గాని మఱియొకటి కాదు. నీవు నాతో యుద్ధము జేయకుండ బోతివేని నాకు గొప్పద్రోహము జేసినవాడవగుదువు. ఎట్లనగా:—నీవు నన్నుపహసించుచున్నను నే నుదాసీనుడనై యున్నచో యిల మహావీరులు నన్ను పరమదుర్బలునిగా దలంతురు. అందువలన లోకములో నాకు నపవాదు సంభవించును. మానవంశమందు బుట్టిన నాపూర్వులకెట్టి యపవాదు కళంకమును గాలేదు. నీకళంకకారణము నాయపకీర్తి మిక్కిలి వ్యాపింపజేయుచున్నది.

వాలి: (మనస్సులో) అహో! ఏమి ఈవిపరీతము. నే నేదియనుమానిలుని నిలంనితినో అదియే ప్రతికూల మయినది. మొదట నితనితో యుద్ధముచేయుట ద్రోహమని దలంచితిని. ఇపుడు యుద్ధముచేయక పోవుట మహాద్రోహమని తలంచుచున్నాను. ఇతని యందుఁ బరమేశ్వరబుద్ధి గలవాడనై నేను నికృష్టుడ ననుకొంటిని. నేను గొప్పవీరుడనని నాయందు దితనికి బరమోత్కృష్టబుద్ధియే కలదు. నా గురుబుద్ధిచే నేను తన కపరాధముచేసితి నని తలంచుచున్నాడు.

(పైకి) ఓయి మహానుభావుడా? నన్ను నీవాని నిగా భావించి నాదురుక్తిని క్షమియింపుము. బుద్ధిమంతులు దావాగ్నియందు దహనశక్తి కలదా లేదా యని పరీక్షింతురా, కావున గమ్ము. యుద్ధయోగ్యము మగు భూమికి బోదము. (అని నిష్క్రమించిరి).

తరువాత ద్వితీయాంకప్రారంభమందు, రామునివెనుక వాలి కొంతదూర మఱిగి యదవల నదృశ్యుడు కాగా రాముడు వెదకి వెదకి వానినిగానక యెదురుగావచ్చు సుగ్రీవునిజూచి రూపసాదృశ్యముచే వాలియని భ్రాంతినొంది వానిపై బాణమును విడువ సిద్ధముగానుండ నింతలో హనుమంతుడు "వీడు సుగ్రీవుడుగాని వాలి కా" డని చెప్పెను. అపుడు రాముడు తా నెక్కుపెట్టిన బాణము వ్యర్థముకాకూడదని చెప్పి యా

సమయమున నరణ్యమందు సంచరించుచున్న యొక హరిణమును గొట్టెను. ఆ క్షణమం దామృగము తన మృగశరీరమును విడిచి దివ్యపురుషుడై రాముని స్తుతించి యిట్లనిరా. "ఓయి మహానుభావుడా! నేను వాలిని. పూర్వమందు నేను మదోన్మత్తుడనై మతంగమహామునిని లక్ష్యము సేయక దుందుభిమృతకళేబరము నాతనియాశ్రమపరిసరమందు బడునట్లు విసిరితిని. తద్దేహగళిత రక్తబిందువులచే నాయాశ్రమము దూషింపబడగా నాముని కోపించి "దేహావసానమందు మృగరూపమును ధరించి వీరధర్మవిరుద్ధమగు కుత్సిత మరణమును బొందగలవని శపించెను" అంత నే నతనిపాదములపైబడి బతిమాలగా వేదాంతవేద్యుడగు పరమపురుషుని వలన మరణము నొందెదవని మరల ననుగ్రహించెను. యుద్ధముచేయుటకు నేను నీవెంబడి వచ్చుచుండగా నా మునిశాపము వలన మృగమునై స్వస్వరూపమును మరచి పలాయితుడనైతిని. నీయనుగ్రహమువలన నాకు గలిగిన శాశ్వత పదమునకు బోయెద" నని చెప్పి రామునియొద్ద సెలవు పుచ్చుకొని తన యిచ్చ జనెను.

ఇట్లు రామభక్తాగ్రగణ్యుడైన భవభూతి "భక్తస్య తత్ర సమరం నతమేఽపివాచః" అని యీనాటక ప్రస్తావనయందు చెప్పినట్లు "యత్తద్రదేశ్య మగ్రాహ్యమ్" అను శ్రుత్యుక్త రీతిగా వాచామగోచరమగు రామదేవుని పరతత్త్వమును త్రికరణైక్యముచే భావించిభావించివాలిని ద్వారముగా జేసి స్తుతించి తన సరస్వతికి సాఫల్యమాపాదించుకొనుటయే కాక రాముడు వాలిని నిర్నిమిత్తముగా జంపెనని లోకములో వ్యాపించిన యపవాదను చక్కని సంవిధాన పరికల్పనచే దొలగించెనని సహృదయులభినందింతురుగాక!

అనర్ఘరాఘవమందు వాలివధ విషయక మయిన సంవిధాన మింతవిపులముగాను యింత విచిత్రముగాను వర్ణింపబడి యుండలేదు.

జాంబవంతుడు వానరుల మంత్రి. సుగ్రీవ పక్షపాతి. వాలియందు వైరాగ్యముచే ప్రజలందరు క్షీణులు బాపసారితులయి కిష్కింధకు సుగ్రీవుని రాజుగా నభిషేకింపదలంచి రామభద్రుని సహాయునిగా గోరుచున్నారని తెలుసుకొని రామునిమీదికి యుద్ధమునకు బొమ్మని వాలిని ప్రోత్సాహపరచెను.

పరాక్రమవంతుడైన వాలిని విడిచి సుగ్రీవుని జేపట్టుటకు గారణమేమని లక్ష్మణుడు రాము నడిగెను.

లక్ష్మణః: యద్యేవ ముపయుజ్యమాన మింద్రసూను ముపేక్ష్య సుగ్రీవేణోపయోక్ష్యమాణేన సిద్ధిరితి వక్రః పంథాః.

రామః: సస్మితం వత్స! సాధ్వేవం బ్రవీషి! కింతు,

ప: దృష్యత్త్వాల స్త్యకండూభిదురభుజధరోస్మార్యమాణః కకీంద్రో, నాయంనస్సం దధీత క్వచి దపి చ విధా నైవ సాహాయ్యకామః; సో ఽహం సుగ్రీవ మేత ద్దమన దృఢకరం మిత్ర మిచ్ఛామి పశ్చా, త్త్వర స్త్రైణేయ పుత్రవ్యయ శిథిలకుచం శక్ర మారాధయామః.





# వలపు

దుర్గుమహంతి సీతారామశర్మ గారు

కన్య

నెలరాతిన్నియలంపుం జిత్తరువుల న్నిర్మించి నిర్మాణ కౌ
శలముం గాంచి ప్రియస్వరూపమని హర్షంబంది ప్రేమాస్రువుల్
దళుకాడంగ రతిక్స్వత ప్రణయ గీతాగానముం జేయుచున్
వలరాజుం దొలి పూజసేయఁదొడఁగ న్వాంఛాప్రసూనంబులన్. ౧

యువతి (ఆత్మగతము)

గీ. లలిత శారద కౌముదీలహరియందు, సోఁకులాడుచు బిగి కౌఁగిలించునపుడు
విరులజొంపమ్ము నీడను విశ్రమించి, కొసరి నవ్వుచు ముద్దిడుకొన్నయపుడు
భావసుమమాలికలను మత్ప్రణయమూర్తి, ననిశ మీరీతిఁ బూజించుకొనెదఁ గాక. ౨

గీ. రమ్య శశికాంత వేదికాగ్రమ్మునందుఁ, గూరుచుని ముచ్చటల్ సెప్పుకొన్నయపుడు
నలరుఁ దావుల తెమ్మెర లలరుతావు, లందుఁ గ్రమ్మరి పొలయఁక్కనందునపుడు
భావసుమమాలికలను మత్ప్రణయమూర్తి, ననయ మీరీతిఁ బూజించుకొనెదఁ గాక. 3

గీ. సమదరోలంబ మధురగానమును వినుచుఁ, గుసుమ పరిమళానిలము మూర్కొనుచుఁ దనిసి
బాలలవలీలతాజాలడోలికాళి, నెంతొరులు మతి హాయిగా నూఁగువేళ
భావసుమమాలికలను మత్ప్రణయమూర్తి, ననిశ మీరీతిఁ బూజించుకొనెదఁ గాక. ౪

గీ. అల యనంతంబుకంటె ననంతమయ్యు, గంధవహునికంటెను నిరాకారమయ్యు
మెఱపుఁదీవియకంటెను మినుకునయ్యు, నట్టి విట్టివి యనిచెప్ప నలవికాని
భావసుమమాలికలను మత్ప్రణయమూర్తి, ననయ మీరీతిఁ బూజించుకొనెదఁ గాక. ౫

గీ. రాగభరితముగా సుధాలాపములకు, సొక్కి ప్రేమపాశములచేఁ జిక్కి ప్రియుని
బజ్జ విహరించి చను చక్రవాకసతికి, నిందుబింబోదయము లేక నెనఁగుఁగాత. ౬

లోల (ఆత్మగతము)

సీ. మురువైన ముత్యాలసరమున రాణించు, తక్కువెక్కులకంటె ధవళమేమొ!!
నిండు పున్నమరేయిఁ బండువెన్నెల తేట, వన్నియకంటెను మిన్నయేమొ!!
సుకుమార సౌందర్య సుమమాకలిత యోషి, దధరామృతముకంటె మధురమేమొ!!
శ్యామలజలదమాలామధ్యమున నాడు, చంచలకన్న నిశ్చలనమేమొ!
గీ. బాలసహకార సౌధాగ్రభాగమందుఁ, గొలువుఁదీరిసి కోయిల చెలువ కఱచు
సరసగీతంబుకంటెను శ్రావ్యమేమొ!! వదలిచనకున్న దింక నీ వలపుమాయ. ౭



# భాషా కుటుంబములు

కోరాడ రామకృష్ణయ్యా గారు

(గత సంచిక తరువాయి)

ఇట్లే యాంధ్రభాషాపదములవిషయమునఁగూడ శబ్దరత్నాకరమందలిపదములు చూడఁగా దేశ్యపదములు 12337 అయియుండఁగా, సంస్కృతసమములు 14814 ను, తద్భవములు 2000 ను ఉన్నట్లు తెలియుచున్నది. ఇట్లు తెలుఁగులోని సంస్కృతపదములు దేశ్యపదములకంటె నెక్కుడుగాఁ గన్పడుటచేఁ దెలుఁగు సంస్కృతమునుండి వచ్చినదిగనే కన్పడును. కావుననే సంస్కృతభాషాపండితులై దానియందు విశేషాభిమానముగల ప్రాచీనాంధ్రవైయాకరణులందఱు నిది సంస్కృతమునుండి పుట్టినభాషయే యని చెప్పుటకూడ తటస్థించినది. సంస్కృతపదములే కాక యింక ననేకభాషలనుండి యనేక పదములు తెలుఁగులో వచ్చి చేరినవి. అయితే, యింతమాత్రమున వాఙ్మయకర్తలు చెప్పినట్లు "నూటికేబదికంటె నధికముగఁ దత్సమపదములు, నూటికి 15 వంతునఁ దద్భవములు, నూటికి 10 వంతున వైకృతములు, 4 వంతున తురకపదములు, 5 వంతున నాంగ్లపదములు నీవిధముగఁ దీసివేసికొనుచు వచ్చుచున్నయెడలఁ దెలుఁగుభాషయే శూన్యమగును." అను భయము మాత్రము మనము పడవలసిన యవసరము లేదు. నిత్యవ్యవహారములోనుండి సుమారు రెండుకోట్ల జనులచే మాట్లాడఁబడుచుండెడిభాష హఠాత్తుగా శూన్యమగుటయెట్లో తెలియకున్నది. అట్లే యైనచో భూభాగమందనేకప్రదేశముల వ్యాపించి యెక్కువవ్యాప్తి గలదని చెప్పఁబడుచున్న ఇంగ్లీషుభాష యింతకంటె శూన్యమైనది కావలసి వచ్చును. ఒకభాషే మాటలాడుజాతి లేక సంఘమంతయు అల్పసంఖ్యాకంబై హఠాత్తుగా నశించుట సంభవించినఁగాని, లేక, కారణాంతరములచే వారు తమకుఁ బరిసరప్రదేశములఁగల మఱియొకభాష నవలంబించి మాతృభాషయందలి యభిమానమును బొత్తుగా విడుచుట తటస్థించినఁగాని యొక్కొకప్పుడు భాషకు నాశమనునది కలుగవచ్చునేమో? మఱియు నొక్కొకప్పుడు గ్రాంథికభాషకును వ్యావహారికభాషకును విశేషభేదము కలిగి కాలక్రమమున నాగ్రాంథికభాష వ్యవహారమునుండి తప్పిపోయి వ్యాకరణనియమబద్ధమై మార్పులేక అభివృద్ధిఁబొందుటకు వీలులేని స్థితిలోనికి వచ్చినచో నద్దానిని మృతభాష (Dead Language) యనిచెప్పుట కలదు. సంస్కృతము, ప్రాచీనల్యాటిన్ మొదలగుభాష లిప్పుడు నిత్యవ్యవహారములో నంతగా లేనివై క్రొత్తమార్పులకు లోఁబడనివగుటచేఁ గొందఱు వీనిని మృతభాషలని చెప్పుదురు. మార్పు, అభివృద్ధి యనునవే భాషయొక్క సజీవత్వమును వ్యక్తపఱచునవగుటచే, నొకభాష యితరభాషాపదముల నెరవు తెచ్చుకొని వానిని స్వసంప్రదాయానుసారముగ మార్పుల నొందించి తనలోఁ గలుపుకొనుచుఁ దానభివృద్ధి నొందుచున్న భాష నశించునని తలంచుట కవకాశము లేదు. ఒకవేళ నితరభాషలనుండి యెరువుదెచ్చికొనిన పదము యీభాషకు సహజములగు పదములను గొన్నిటిని నిత్యవ్యవహారమునుండి పాఱఁద్రోలినఁ ద్రోలవచ్చును గాని యింతమాత్రమున నాభాషాతత్త్వమే మాఱునని గాని యది నశించునని గాని తలంప వీలులేదు. తెలుఁగున విందు శబ్దం బొకటి దేశ్యము కలదు. దీనికి చుట్టములు మొదలగువారికిఁ బెట్టెడు భోజనము అనియు, ఆతిథ్యమనియు నర్థములు కలవు. ఇంతేకాక ఇది చుట్టము' 'అతిథి' యను నర్థములఁగూడ మునుపు వాడు

కలో నున్నట్లీక్రింది యుదాహరణములవలనఁ దెలియు చున్నది.

> "......భూసురేశ్వర ప్రీతిన్
> బొందితి నినుఁగని తగియెడు
> విందవయితినాకు ......"
>
> భార. శాం. ౮ ఆ.

> క. భూసుర కైతవకుసుమశ
> రాసన మాయింటివింద వైతివి కైకో
> మ్మాసముదంచన్మణిభవ
> నాసీనత సేవదేరి యాతిథ్యంబున్.
>
> మను. 2 ఆ.

కాని యిప్పు డతిథిశబ్దము వాడుకలోనికి వచ్చుటచేఁ గాఁబోలు నీ'విందు' శబ్దమున కిట్టి వ్యవహారము తప్పిపోయినది. మన బంధుమిత్రుల కిప్పుడు 'విందు' చేయుట కలదుగాని వారిని 'విందుల'ని పిలుచుట వ్యవహారమున గానము. ఇట్లే తమిళమున 'కత్తు' శబ్దభవము వాడుకలోనికి వచ్చినతర్వాత 'చంకె' పదమునకు ప్రాచీనరూపమగు 'కైక్కుళి' యనునదిగాని దానినుండి వచ్చినపదముగాని యాభాషయం దంతవాడుకలో లేదు. పరిశీలించినచో నింకె నిట్టివనేకములు గన్పడకపోవు.

ఇట్లొకవేళ భాషకు సహజములగుపదము లనేకములు వ్యవహారమునుండి తొలఁగిపోవుట తటస్థించినను, అందలి వాక్యరచనారీతులు వ్యాకరణాంశములు, జాతీయములు మొదలగుభాషాసాంప్రదాయము లాభాష యొక్క వ్యక్తిత్వమును నిలుపుచు నది సహజముగ నేకుటుంబమునకుం జెందునో సూచించుచునే యుండును. లేనిచో మనుచరిత్రమందలి

> "అటఁజని కాంచె భూమిసురుఁ
> డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
> .................కలాపిజాలమున్
> కటకచరత్కరేణుకరకంపితసాలము
> శీతశైలమున్"

మొదలగునవి కొన్ని సంస్కృతపద్యము లేమో యని భ్రమపడుట కవకాశము లేకపోలేదు కాని 'మొదటి అట, చని, కాంచె' యను పదములును, తరువాతి దీర్ఘసమాసముల తుదినున్న 'ము' ప్రత్యయములు నీ పద్యము తెలుఁగు పద్యమనియే సూచించుచున్నది. అట్లే "మాకు Necessary things అన్నీ Supply చేయ డానికి ఒక coolyని engage చేసినాము"అని యిప్పుడు మనము సామాన్యముగా వినుచుండెడి 'ఇంగ్లీషు తెలుఁగు' వాక్యములలో నింగ్లీషుపదములే విశేషముగఁ గనపడుచున్నను, ఇందలి సర్వనామములు, సుప్తిఙాదిప్రత్యయములు, సహాయక్రియలు (Auxiliary verbs) వాక్యరచనారీతి మొదలగునవన్నియు, అనగా నెరువుతెచ్చుకొనిన యాపదముల నర్థబోధకంబుగ నొక వాక్యములో నుపయోగపఱచుటకు వలయు సాధనము లన్నియు, నాంధ్ర భాషకు సంబంధించినవే యగుటచే నిది యాంధ్ర భాషావాక్యమగుచున్నది. కాని యాంగ్లభాషావాక్యమని చెప్పుటకు వీలు లేకున్నది. కావుననే భాషాకుటుంబముల నేర్పాటుచేయుటలో అనఁగా నేభాష యే కుటుంబమునకుఁ జెందునను విషయములోఁ బదముల కంటెఁ గూడ బలిష్ఠతరములగు ప్రమాణము వ్యాకరణాంశములే యగుచున్నవనియు నొకభాషకు సహజములగు పదము లితరభాషాపదముల దాడికాఁగలేక వ్యవహారమునుండి తప్పిపోయినను, ఆ భాషయొక్క వ్యాకరణాంశములే దాని నిజతత్త్వమును, సంబంధ బాంధవ్యములనుగూర్చి తప్పక తెలుపఁగలుగుననియే భాషాతత్త్వవేత్తలు తెలుపుచున్నారు.

"This is the reason why grammar is made the criterion of the relationship and the base of the classification in almost all languages, we may form whole sentences of English consisting entirely of Latin or Romanic words yet whatever there is left of grammar in English bears unmistakable traces of Teutonic workmanship."

ఇట్లు వ్యాకరణాంశములందలిసామ్యమే భాషల సంబంధబాంధవ్యములను దెల్పుటలో పరమసాధనమగుచున్నది. భాషకుఁ బరస్పరము గలిగెడి సంసర్గముచే నొకదానినుండి మఱియొకటి యెన్నియేని పదముల నెరువుతెచ్చుకొన్నను వ్యాకరణాంశములను మాత్ర మేభాషయు నెరవు తెచ్చుకొనుట సంభవింపదు. అన్యభాషాసంసర్గముచే వేఱభాషయందువలె వ్యాకరణాంశములందుఁ గొన్నిమార్పులేమైనఁ గలుగుటగాని లేక

యనవసరములైన యంశము లేమైనఁ గొన్ని లోపించుట కాని తటస్థింపవచ్చును. ప్రాచీనంబగు 'ఇండోయూరోపి యన్' భాషయందలి విభక్తిరూపములు (సంస్కృతభాషలోవలె నేడు) గ్రీకు మొదలగు భాషలలో సంక్షిప్తములగుటయు, (గ్రీకులో నేడు విభక్తులు లేవు. మూఁడే విభక్తులు) వైదికభాషలో తుమున్నర్థరూపములు (infinitives) అనేకములైయుండ (cf తుమర్థేసేసేనసే అసేన్ క్సేకసే నధ్యై అధ్యైన్, కధ్యైకధ్యైన్, శధ్యై శధ్యైన్‌తవైతవేఙ్ తవేనః" పాణిని అష్టాధ్యాయి) కాలక్రమమున నివియన్నియు వ్యవహారమునుండి పోయి యొక్క తుమున్నంతమే మిగిలియుండుటయు, లేడాది (Subjunctive mood) లిజంతరూపములుగూడ వ్యవహారమున జారిపోవుటయు, నీమొదలగు మార్పులన్నియు నన్యభాషాసంపర్కఫలములే కావచ్చును. కాని వ్యాకరణము మాత్రము క్రొత్తదికాలేదు.

"It is almost unanimously admitted by philologists that however large a borrowing of foreign vocables may take place, there is no satisfactory evidence that foreign grammar is ever borrowed to any appreciable extent by a truly live and spoken language" (Tucker's Natural History of Language)

కావున భాషల సంబంధబాంధవ్యమును నిర్ణయించుటలో పదముల సారూప్యముకంటెఁగూడ వ్యాకరణాంశములందలి పోలికయే యుత్తమసాధనమని తెలియుచున్నది. ఇంతమాత్రమునచేఁ బదపరీక్షవలనఁ గలుగు ప్రయోజనమేమాత్రము తగ్గదు. సామాన్యముగా భాషలకు సంబంధమున్నదని తెలిసికొనుట సారూప్యపదసహాయముననే జరుగుచుండును. రెండు భాషలయందొకేయర్థముగలిగి సరూపములగు పదములు కొన్ని కనఁబడినపుడే యాభాషల కేమైన సంబంధము కలదేమో చూడవలయు నను కుతూహలమును, అట్టివింకనెన్ని కలవో వానిని సంగ్రహింపవలయునను తలంపును గలుగును. పిదప నివి నిత్యవ్యవహారమున నుండి యంపబడుఁ దేటతెల్లంబుగ నర్థంబగు పదములే యైనచో నీభాషల సహజసంబంధమును రుజువుచేసికొనుటకును, వ్యాకరణాంశముల పరిశీలన యావశ్యకంబగును. కావున పదముల సారూప్యవిషయమైన పరిశోధనఫలరహితము కాదు. కాని పరిశీలించునపుడు దాయసారూప్యమెట్టిపదములలోఁ గన్పడుచున్నది యను విషయమును మాత్రము జ్ఞాపక ముంచుకొనవలయును.

ఇంతేకాక భిన్నభాషలలోని పదములసారూప్యమును బట్టి వాని సాజాత్యము నిశ్చయించునపుడును మఱియొక విషయమునుగూడ మన దృష్టిపథమున నుంచుకొనవలెను. ఒకమూలభాషయందలి ఒకపదము కేవల మారూపముననే తజ్జన్యభాషయందు సైతము నగపడుచుండునని తలంచుట కవకాశము లేదు. ఒక్కచో నివసించుచు నొక్క భాష మాట్లాడువారిలోనే కొందఱొకధ్వని నొకరీతిగను మఱికొందఱు మఱియొకరీతిగను నుచ్చరించుచుందురు. కావున నొక్క మూలభాష నుండి వచ్చినవైనను కాలక్రమమున భిన్నములైన యాయా భాషలను మాట్లాడు వారి యభ్యాసవిశేషములనుబట్టియుఁ, గొన్నికొన్ని ధ్వనుల యుచ్చారణవిషయమున వారివారికిఁ గలుగు వికారప్రవృత్తులవాటు లనుబట్టియు, మూలభాషకుఁ జెందినయొకపదములోని ధ్వనులే యనేకవిధముల మాఱుచుండును గావున, నాయాభాషలలో నాపద మొకప్పుడు విశేషపరిశీలనవలనఁగాని గుర్తించుటకు వీలులేకయుండును. కావున నాయావికారములను దృష్టికొని యవిసునిశితంబుగ నాయాపదమున సారూప్యమును నిర్ణయింపవలెను. ఒకకాలమున నొకరీతిగ నుచ్చరింపఁబడినపదము మఱికొంతకాలమునకు మఱియొకరీతి నుచ్చరింపఁబడి వేఱొక రూపమును బొందవచ్చును. సంస్కృతమునందలి 'పితా' 'పితృ' లేక 'పితర్' అనుశబ్దము కలదు. దీనికి మూలభాషయందలి మూలరూపము 'పటేర్' ('Peter') అనియుండ నది గ్రీకు, ల్యాటిన్ భాషలలో విశేషభేదము లేక ('Pater', 'Pater') అనియు, సంస్కృతమున 'పితర్' అనియు (ఇందు మొదటి 'అ'కారము 'ఇ'కారముగ మారినది) నుచ్చరింపఁబడఁగా గాథిక్ భాషలో ('fadar') అనియు ఆంగ్లోసాగ్సన్ భాషలో 'faedar' అనియు, నైనది. తుదకింగ్లీషుభాషలో (Brother) శబ్దసామ్యముచే ('Father') అనురూపమును బొందినది. ఇట్లే, సంస్కృతపదములు తెలుఁగులోనికి వచ్చునప్పు డనేకమార్పులఁ జెందినవి. యజ్ఞంబు జన్నంబైనది. యత్నము జతన మైనది.

యంత్రంబు జంత్రంబు; యముఁడు జముఁడు; యక్షులు జక్కులు; యోధుఁ జోదు; శాణము సాన; శవము సబము; యశము అసము; దోషము దోసము; రోషము రోసము; భాష బాస; ఇత్యాదులనేకములుగలవు. సమానార్థకము లగుపదములలో తమిళమున 'క'కారము కన్పడిన కొన్ని పదములలోఁ దెనుఁగున 'చ'కారము కన్పడుచున్నది. తమి. కివి, తె. చెవి; గిళి-చిలుక; కయి-చెయి; కంబోన్-చెంబు. ప్రాచీన ద్రావిడభాషయందలి కైక్కులీయను పదము కైఙ్కులీ, చైంకులి, చంకులీ, సంకులి, చంకల్, అయి తుదకు 'చంక' అను రూపమున నిప్పు డాంధ్రమున వ్యవహారములో నున్నది. ఇట్టియొక్కొక్క విధముగు మార్పు అనేకములగు పదములలోఁ గన్పడుచుండును. ప్రాచీనద్రావిడ భాషలోను తక్కినద్రావిడ భాషలన్నిటిలోను, ప్రాచీనకన్నడమునను గూడ నున్న యనేక పదములలోని 'ప'కారమాధునిక కన్నడభాషలో 'హ'కారముగ మాఱినది— పొన్ను-హొన్ను; పాలు-హాలు; పసిపు-హాసిగు; పదు-హది.

ఒకభాషలోని పదము లనేకంటిలో నిట్టిమార్పులు నియతముగ పొసఁగుచుండుటచే నది యాభాషను మాట్లాడుజనుల యుచ్చారణమునకు సహజంబగు నొక వికారమని చెప్పవలసినదేకాని వేఱువిధమున దానిని సమర్థింప వీలులేదు కావున ననేకపదములను పరిశీలన చేసి యాయాభాషలయం దిట్టివికారములను గుర్తించి యొకధ్వని యాయాభాషలయం దాయాకాలముల నానావికారములఁ బొందుచున్నదని నిరూపించినచో, సోదరీభాషలయందుఁ గలసజాతీయ పదములయందలి యత్యంచిద్భేదములు సహేతుకములుగనే కన్పడును. ఇట్టి ధ్వనివికారములఁగూర్చిన నిరూపణములనే స్వర సూత్రములు లేక స్వరనియమములు (Phonetic laws) అని చెప్పుదురు. ఈస్వరనియమముల కపవాదము లనఁగా నీనియమములను దాటిపోయినపదములు భాషలో నుండిన నుండవచ్చును గాని, యవి యట్లు దాటిపోవుటకుఁ గారణము లుండకపోవు. ఆకారణములను నిరూపించి యారూపములను సహేతుకముగ సాధించుట భాషాశాస్త్రజ్ఞుని పనియైయున్నది.

దీనినిబట్టి యొకానొక పదము సోదరభాషలన్నిటిలో నొకేరూపముకలదై యుండకపోయినను, అనఁగా సారూప్యముగలదిగాఁ గన్పడకపోయినను అది యాయాభాషల స్వరనియమములకు లోఁబడి యుండినచో నాపదముల సోదరభావమును గూర్చి మనము శంకింప నవసరములేదు అని తేలుచున్నది. కావున 'పితర్' 'father,' 'మాతర్,' 'mother,' అశ్వ, horse, కిళి-గిళి-చిల్క, కివి-చెవి, కంకుల్-చంక; మొదలగు పదముల సహజసంబంధము లేక సౌందర్యమును గూర్చి శంకింప నక్కఱలేదు. ఒక్కొకప్పుడు సహజసంబంధములేని భాషలలో నక్కడక్కడ కొన్ని పదములు సరూపములును సమానార్థకములునై కన్పడుచుండుఁగలదు. అట్టివి ఆంగ్లమున Prop, తెలుఁగు ప్రాపు; mouth, మూతి మొదలగునవి ఆంగ్లమునకే విశేషణ విశేష్యభావములను దెల్పెడి 'sorry' (దుఃఖకరమైన) sorrow (విచారము) అను రెండు పదములు సమానార్థకములై కన్పడినను వాస్తవముగ నా రెండు నొక్కమూలరూపమునుండి వచ్చినవికావు. కావున పదములయందలి కేవల సారూప్యమే వాని సౌందర్యము నెల్లప్పుడు తెలుపునని కూడ తలంచుటకు వీలులేదు. యత్యంచి ద్భేదముకలవైయున్నను, ఆపదములందలి భేదము లాయాభాషలయందలి స్వరనియమములకు లోఁబడియుండి, వానిరూపనిష్పత్తి క్రమమును బరిశీలించినప్పుడవి యొక్క మూలరూపము లేక ధాతువునుండియే నిష్పన్నంబైనట్లు తేలినవచ్చినచో నాపదముల సాజాత్యమేకాక వానిమూలమున నాభాషల సంబంధబాంధవ్యములు కూడ నిశ్చయింపఁబడగియున్నవి.

ఇఁక (నెట్టి) పదములందలి సారూప్యము (కూడ) భాషల జన్యజనక సంబంధమును, సన్నిహితత్వమును నిర్ణయింపలేవనియు, అవియట్లు నిర్ణయింపగలిగినచో నీక్రింది యుదాహరణములఁ బట్టి యాంగ్లేయ భాష తెలుఁగుకంటె సంస్కృతమునకుఁ జేరువగఁ గనఁబడునని చెప్పవలసి వచ్చుననియుఁ జెప్పుచు, నాంధ్రవాఙ్మయ కర్తలు చైకొనిన యుదాహరణములనే గ్రహించి యా పదముల పరస్పరసంబంధమెట్టిదో పరిశీలించి దానివలనఁ దేలుఫలితమును విచారింతము. ఆయుదాహృతపదముల పట్టి నీక్రిందఁ బొందుపఱచుచుఁ, దెనుఁగుపదముల ప్రక్కను తమిళ కన్నడ పదములనుగూడ నిచ్చుచున్నాను:—

| ఇంగ్లీషు | సంస్కృతము | తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|---|---|
| Father (ఫాదర్) | పితర్ | తండ్రి | తందై | తందె |
| Mother (మదర్) | మాతర్ | తల్లి | తాయి | తాయి |
| Brother (బ్రదర్) | భ్రాతర్ | అన్న | అణ్ణన్ | అణ్ణ |
| Horse (హార్స్) | అశ్వ | గుఱ్ఱము | కుదిరై | కుదిరె |
| Heart (హార్ట్) | హృదయ | గుండెకాయ | | గుణ్డిగె |
| Debauchery (డిబాచరీ) | వ్యభిచార | అంకుతనము | | |
| Book (బుక్) | పుస్తక | పొత్తము | పుత్తగం | పుస్తగం |
| Orange (ఆరెంజ్) | నారంగ | నారింజ | నారంగ | నారంగ |
| Pot (పాట్) | పాత్ర | కుండ | | కుంటె, కుండె |

పైపట్టికలోనిపదములు తొమ్మిదింటిలో మొదటి మూఁడును బాంధవ్య రూపసంబంధమును (relationship) తెలియఁజేయుపదములు. నాలుగైదు తొమ్మిది పదములు మనకు పరిచితములగు వస్తువులనుగూర్చి తెలుపునవి. ఎనిమిదవపద మీభాష లన్నిటిలోనుగూడ మఱియొకభాషనుండి ఎరవుగాఁ దెచ్చుకొనఁబడిన పదము. ఏడవది సంస్కృతమునుండి తెలుఁగు, తమిళకన్నడములలోని కెరవుగా వచ్చినది. ఆఱవపదముయొక్క వ్యుత్పత్తి సందేహాస్పదమగుటచే నింగ్లీషు సంస్కృతరూపములగల పోలిక యాదృచ్ఛికమని చెప్పవచ్చును. కావున నీపైనఁ జూపఁబడిన సంస్కృతపదములన్నిటి కాంగ్లపదములతో గల సారూప్యము కేవలము యాదృచ్ఛికమని కొట్టివేయుటకుఁగాని యాకారణమున సంస్కృతాంగ్లములకు సంబంధము లేదని తలంచుటకుఁగాని యాధారము కనఁబడదు.

తల్లి, తండ్రి, అన్న యనుసంబంధవాచకములను బాలుడు పిన్ననాఁటనే నేర్చికొని వ్యవహరించుచుందురు. కావున నట్టిప్రథమసంబంధమును దెలియఁజేయు పదములు ప్రతిభాషకును సహజములై యుండును. సామాన్యముగా నట్లత్యావసరములై నిత్యవ్యవహారములోనుండు పదము లితరభాషలనుండి యెరవు తెచ్చుకొనుట సంభవింపదు. కావున నిట్టిపదములలోఁ గలసారూప్య మాభాషలసోదరభావమునే సూచించునని యింతకుఁబూర్వమే చెప్పఁబడినది. పైపట్టిలోని మొదటిమూఁడుపదము లిట్టి సంబంధమును తెలియఁజేయున వగుటయు, నివి యొక్క సంస్కృతాంగ్లములయందే కాక ఇండోయూరోపియన్ కుటుంబమునకుఁ జెందినవిగాఁ జెప్పఁబడిన భాషలన్నిటిలోఁగూడ సమానరూపముగలవియు, నగుటచే సంస్కృతాంగ్లపదములందు గన్పట్టిన సారూప్యము యాదృచ్ఛికమనిగాని, దానివలన నీభాషలకు జన్యజనకభావసంబంధముగాని సోదరీభావసంబంధముగాని లేదని నిశ్చయించుట కేమాత్రమును వీలులేదు. తక్కినభాషలలో వీని రూపముల నిచ్చటఁ జూపుచున్నాను.

| ఇంగ్లీషు | సంస్కృతము | లాటిన్ | గ్రీకు | గాథిక్. |
|---|---|---|---|---|
| Father (ఫాదర్) | పితర్ | Pater (పతెర్) | Pater (పతేర్) | Fadar (ఫదర్) |
| Mother (మదర్) | మాతర్ | Mater (మాతెర్) | Mater (మాతేర్) | Mouter (మౌతెర్) |
| Brbther (బ్రదర్) | భ్రాతర్ | Frater (ఫ్రేటర్) | Phrater (ఫ్రేటేర్) | B othar (బ్రోథర్) |
| Horse (హార్స్) | అశ్వస్ | Equos (ఎక్వొస్) | Hippos, Ikkos (ఇక్కొస్) | Aih-va (ఏయిహ్వ) |
| Heart (హార్ట్) | హృదయ | C-r-d (కోర్డ్) | Kard-ia (కార్డియ) | Hairt-o (హైర్టొ) |

ఆయాభాషలలోని కొన్నిపదములు యత్కించిద్భేదములు కలవై యున్నట్లు కన్పడినను, అవి యాయాభాషలకు స్వాభావికములగు స్వరనియమముల (Phonetic laws) ననుసరించి యున్నవేయగుటచే వానిసౌందర్యమునుగూర్చి శంకింప నవసరము లేదు. పైపదములన్నియు ఇండోయూరోపియన్ కుటుంబములోని భాషలన్నిటిలో సమానార్థకములై కన్పడుచు

సంస్కృతభాషకు (లేక ఆర్యభాషాశాఖకు) సోదరియగు జర్మానిక్ భాషాశాఖకుఁ జెందిన గాథిక్ భాషనుండి ప్రాచీనాంగ్లభాషామూలముగా నాధునికాంగ్లమునఁ జేరినవి. కావున నాంగ్లభాషకు సంస్కృతము వృద్ధమాతామహియగునని చెప్పవచ్చును. పదములయందలి సారూప్యము సూచించిన యీభాషల నేకకుటుంబత్వమును వ్యాకరణాంశములుకూడ దృఢపఱచుచున్నవి.

| సం. | గ్రీ. | లా. | గా. | ఇంగ్లీ. |
|---|---|---|---|---|
| భరా(మి) | Phero (ఫెరో) | Fero (ఫెరో) | Baira (బైర) | Bear (బేర్) |
| భరామః | Pheromes (ఫెరోమెస్) | Ferimus | Bairam | |
| భరన్తి | Pheronti (ఫెరోంతి) | Ferunt | Bairand | |
| అస్తి | Esti (ఎస్తి) | | Ist | Is |
| అశ్వస్ | Hippos (హిప్పొస్) | Equos | | |
| అశ్వం | Hippon (హిప్పొన్) | Equom | | |
| అశ్వాయ | Hippoi (హిప్పొయ్) | Equi | | |
| అహం | Ego(n) (ఎగో(న్) | Ego | Ik | I |

ఇట్లే క్రియారూపములయందును నామరూప (అనగా తిఙంతములయందును సుబంతరూపములయందును), సర్వనామముల యందును ఆయాప్రత్యయముల యందును గన్పడుచున్న పోలికలనుబట్టి యీ భాషలన్నియు నొక మూలభాషనుండి వచ్చినవేయని చెప్పకున్నచో, నా పోలికలకు తగినకారణమును మనము నిరూపింపలేము. వీనిలో నొకభాషకు నొకభాషకును బాంధవ్యము దగ్గర కావచ్చును; దూరమును కావచ్చును; కాని యివియన్నియు నొకకుటుంబమునకుఁ జేరినవి యనిమాత్రము నిశ్చయించుటకు సందేహ మక్కరలేదు. ఇట్టిపోలికలు హిందూదేశము లేక హిందూస్థానము మొదలుకొని ఐరోపాఖండమందలి పడమటికొనవరకు గలభూభాగములో వ్యవహరింపఁబడుచుండెడి భాషలు లేక భాషాశాఖ లన్నిటిలో అనఁగా ఆర్యభాషాశాఖ, ఆర్మీనియన్, ఆల్బెనియన్, బాల్టోస్లవోనిక్, ఇటాలిక్, జర్మానిక్, గ్రీక్, కెల్టిక్ అనుభాషాశాఖలన్నిటిలోఁ గన్పడుచుండుటచే, నీభాషాశాఖల నన్నిటికిని "ఇండోయూరోపియన్" భాషాకుటుంబమని భాషాశాస్త్రజ్ఞులు నామకరణము చేసినారు. ఇట్లే ఆయాభాషలయందుగల పోలికలనుబట్టి ఇండోయూరోపియన్ కుటుంబముకాక యట్టివి 'సెమెటిక్' 'ఊరల్ ఆల్టాయిక్' 'మలయోపోలినీషియన్' 'బాంటు' 'ద్రావిడ భాషాకుటుంబము,' అను మఱియైదుకుటుంబము లింతవఱకేర్పరుపఁబడియున్నవి.

ఈ ద్రావిడ భాషాకుటుంబములో మొదటినుండియు దక్షిణహిందూదేశమున వ్యవహరింపఁబడు భాషలన్నిటితోపాటు తెలుఁగుభాషయుఁ జేరియున్నది. ఈద్రావిడభాషాకుటుంబము ఏ భాషాకుటుంబమునకుఁ జేరునదగానున్నది యను విషయమున భిన్నాభిప్రాయములున్నను తెలుఁగు, తమిళము మొదలగునవి యన్నియు నొక్కకుటుంబములోఁ జేరినవనుటలో మాత్రము పలువురేకాభిప్రాయులై యున్నారు. సంస్కృతాంగ్లము లొక్కకుటుంబమునకుఁ జెందియున్నవని యెట్టిసాధనములవలన గ్రహింపఁబడినదో యట్టిసాధనములే యీదక్షిణహిందూదేశభాషలన్నియు నొక్కకుటుంబమునకుఁ జెందినవై సోదరభావమును వహించియున్నవని సూచించుచున్నవి. పైపట్టికలోని సంస్కృతాంగ్ల పదములయందుఁ గల సారూప్యమును బరిశీలించి చూచినపు డెట్లది వాని సన్నిహితత్వమును దెల్పునదయ్యెనో,అట్లే యాసంస్కృత పదములతో సమానార్థకములైనను శుద్ధమైరూప్యమే కలవగుటచే వారిలో నెట్టిసంబంధము నున్నదని చెప్పుటకు వీలులేని తెలుఁగుపదముల కఱవుకొన్న డపదములతోఁ గల సారూప్యమే యీభాషలకుఁ గలసన్నిహితసంబంధము లేక ఏకకుటుంబత్వమును సాధించుచు వివి సంస్కృతాంగ్లములక్కంటె భిన్నమగు భాషాకుటుంబమునకుఁ జేరియున్నవని తెల్పుచున్నవి. పైపట్టికలోని పదములేకాక నేను, మనము, నీవు, వాడు; తమి. నాన్, నామ్, నీన్, అవన్; కన్న. నాను, నావు, నీను, అవను;

సర్వనామరూపములును; తెలుఁగు. ఒండు, మూఁడు, పది; తమి. ఒంౘ్రు, మూంౘ్రు, పత్తు; కన్న. ఒందు, మూరు, పత్తు (హత్తు) అను నీమొదలగు సంఖ్యావాచకశబ్దములును; చేయుచున్నాను, చేసితిని, చేయును, చేయు(న్), చెయ్యి; తమి. శెయ్‌గింౘ్రేన్, శెయ్‌దేన్, శెయ్‌గుమ్, శెయ్యు, శెయ్; కన్న. గెయ్‌దపెం, గెయ్‌వమ్, గెయ్‌వం, గెయ్యు, గెయ్; మొదలగు క్రియారూపములును, ఆయారూపముల నిష్పత్తిక్రమమునుగూడ, నీభాషలన్నియు నేకకుటుంబమునకు జెందిన వనువిషయమునే ధ్రువపఱచుచున్నది. అయితే యివన్నియు నొకకుటుంబమునకుఁ జెందినవని చెప్పినంతమాత్రముననే యొకటి రెండవదానికంటెఁ బ్రాచీనమనిగాని, యొకదానికొకటి తల్లివంటిదనిగాని చెప్పినట్లుకాదు. ఏకకుటుంబత్వము, సన్నిహితసంబంధము నిరూపించినంతమాత్రమున జన్యజనకభావము నిర్ధారితమైనదని తలంచుటకవకాశ మెంతమాత్రమును లేదు. ఇవన్నియుఁ బ్రాచీనంబగు మఱియొకభాషనుండి వచ్చినవై సోదరీభావమునే వహించియుండవచ్చును. అఱవమున నొకవేళ ప్రాచీనతరంబగు వాఙ్మయముగాని, లేక ప్రాచీనభాషాలక్షణములుగాని తక్కినవానికంటె నెక్కుడుగానున్నను, అది తక్కినవానికి తల్లిభాష కానేరదు. కొన్నివిషయములలో నది ప్రాచీనభాషాలక్షణములఁ జూపుచుండ మఱికొన్నివిశేషములు తక్కినభాషలఁ జూపుచుండును. పదములలోను, వ్యాకరణాంశములయందును సంస్కృతాంగ్లములకు సన్నిహితత్వము నిరూపింపఁబడినను, ఇంగ్లీషు సంస్కృతమునకుఁగాని, సంస్కృత మింగ్లీషునకుఁగాని తల్లియని చెప్పుట కెట్లు సాధ్యపడదో, అట్లే తమిళాంధ్రములయందలి పదములసారూప్యమును వ్యాకరణాంశములయందలిసామ్యమును వానిసన్నిహితత్వము లేక బాంధవ్యమును గూర్చి నిశ్చయింపఁగలిగి, అంతమాత్రమున నొకదానినుండి మఱియొకటి పుట్టినదని చెప్పుట కవకాశము లేదు. ఆయా భాషలపరస్పరసంబంధ మిట్టిదని నిరూపించుట కాభాషాచరిత్రలు బాగుగఁ బరిశీలింపఁ బడవలయును. ఇతరనివర్తనము లనేకము కావలయును. ఇండోయూరోపియన్ భాషాకుటుంబము విషయమున జరిగిన యపారంబగు భాషాపరిశ్రమ యీదక్షిణదేశభాషల విషయమున జరుగలేదు. కనుక, యట్లు జరిగినచో నీభాషలకన్నిటికి మాతృభాష యేదో, దెట్టిస్వరూపముకలదో నిరూపించి, వీనిలో వీనికిఁగల పరస్పరసంబంధ మిదియని మనము నిరూపింపగలిగియే యుందుము. కావున మాతృభాషాభిమానులందఱు నీవిషయమునఁ దగినపరిశ్రమను జేయుదురుగాక.

# ప్రియనిరీక్షణము

"సౌదామిని"

చింతమానుకొమ్మపైన
వింతగాను గువ్వజంట
సంతోషముతోడ సరస
సల్లాపము లాడుచుండ.
పొద్దుటాకులన్నియు పడి
పాదల న్నాకుచు పోరున్.

చల్లని చిరుగాలిపాట
మెల్లగ వీనులసోకగ,
వాకిట నిలబడి అడుగుల
చప్పుడైనయప్పుడెల్ల
ఆత్రముతో నీవె వచ్చి
తని శ్రమపడి చూతు నాథ!




## ప్రహసనము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

[గతసంచిక తరువాయి]

శాండి—(విని) ఆహా! కోయిలకూత! (చెవి ఒగ్గివిని) కోయిలకూతగాదు. నేయిపోసినపాయసమల్లే బల్లేమధురంగా ఉంది. ఎవరోపాటపాడుతున్నారు! కాస్త పోయి చూస్తాను. (కొంచెము నడచి చూచి) బలే! బలే! ఎవర్తోగదా యీపడుచుపిల్ల! మంచి అందగత్తె; దీని అలంకారాలు పెట్టేవి తీసేవి గావు. సహజాలంకారాలు. ఆచూపు! ఆరూపు! ఆహా! ఈ ఉద్యానానికంతా అలంకారంగా ఉందిగదా!

చేటి—అజ్జుకా!

శాండి—అశ్శే! ఆఁ! ఇది భోగంది! 'అజ్జుకా' అని పిలుస్తున్నది! డబ్బుగలవాళ్లకుంది అనుభవము! ధనవంతులు ధన్యులు!

చేటి—అజ్జుకా! ఇంకోపాట పాడుదూ!

గణి—అట్లాగే (పాడుచున్నది).

### గేయము

వసంతసమయప్రాభవదర్పం
బెసఁగ విషమశరుఁడు, అశోక,
ప్రసవబాణధరుఁడు, మునిమా
నసములైనఁ జెదరఁగ, జేయఁగ,
గసిక్కుమన నేయఁగ.

శాంతి—అతి మధురముగా స్రవిస్తున్నది, కంఠములోనుంచి. స్వాములవారూ! వినండి!

పరి—ఓయి! చెవులున్నవిగావున శబ్దము నవి గ్రహించుచున్నవి. వినుటయం దాసక్తి నాకు లేదు.

శాండి—ఆసక్తి పుట్టుతుంది బాబూ! ఇప్పుడు గనక చేతిలో పైసా ఉన్నదీ అంటే;

పరి—ఆఁ! ఆఁ! తిన్నగా మాటాడుము.

శాండి—కోప్పడకండి అయ్యా! కోప్పడకండి. స్వాములవార్లు కోప్పడరాదు.

పరి—ఓయీ! ఇదిగో! మాటాడను.

శాండి—సరి. అయితే మీ రిప్పుడు సిసలైన స్వాములవార్లు.

(యమపురుషుఁడు ప్రవేశించును.)

యమపురుషుఁడు—ఇదిగో వచ్చితిని.

గీ. పుణ్య పాపకృత్యముల సాక్షి, జీవులఁ
గడపువాఁడు కర్మ ముడిగినంత



అతిమధురము ప్రవిస్తున్నది, కంఠములోనుంచి స్వాములవారూ ! వినండి !

సంతసంబందు జీవితాంతమావారికి
యాతనాంగ మొసఁగు మనియె నన్ను.

శా. నానారాష్ట్ర నదీవనాచలవతీ
ధాత్రీన్ విలోకించుచున్
బైనీర్నిండిన మబ్బులుబ్బకొని క్ర
మ్మన్ దప్పికొంచుం బయిం
బై నాచారణసిద్ధకిన్నరయుతా
భ్రంబందు నేతెంచుచున్
నే నయ్యంతకుఁ డానతిచ్చినటుగా
నీయూరికిన్ జేరితిన్.

కాని ఆ స్త్రీ యెక్కడనున్నదో! (చూచి) అదిగో! ఉన్నదే! అదే!

గీ. చివురుగుబురుల బలసి పసిండిమిసిమి
గలయశోకంపుఁబూగుత్తు లలమికొనఁగఁ
జాటువడి నీటుగుల్కు నీచాన, సంజ
మబ్బు లలమఁగా లేఁజందమామవోలె.

కానీ, ఇంకను గొంచెము కర్మావశేష మున్నది. ముహూర్తముండి ప్రాణముల హరింతును.

చేటి—అజ్జకా! ఎంత అందముగా ఉందే ఈ అశోకంచిగురుటాకు! దీన్ని తుంచుతాను!

గణి—వద్దు. నీవు వద్దు. నేనే తుంచుతాను.

యమ—సరి. ఇదే అదను. సర్పాకారము ధరించి అశోకశాఖ నధిష్ఠించి, దీని ప్రాణములఁ దీసెదను. ఇదిగో యిప్పుడు!

సీ. పడుచుప్రాయపుబెడంగడరుముద్దులగుమ్మ
నగవుపొల్పారు నెమ్మొగముచాన
పిక్కటిల్లుపిఱుందు టెక్కు గల్గినయింతి
తియపల్కు లొల్కు వాతెఱమిటారి
కలువరేకులవంటి కన్నులు గలపొల్తి
గందంబుపూసిన యందగత్తె
ఆసేచనకమైన మైసొగసు గలలేమ!
వారుణీమదము చెన్నారుసారి!

అరరె! మజ్ఝారె! యయ్యరే! యట్టిదాని
సర్వసౌభాగ్యమును రిత్త సమయునట్లు
బాల నిదె యొక్కత్రుటిలోనె గాలయముని
ప్రోలికిని నే నిదే కొనిపోవువాఁడ.

గణి—(చిగుళ్లు గోయుచున్నది)

యమ—ఇదే అదను కాటువేయుటకు.

గణి—అయ్యో! ఏదో కరిచింది నన్ను.

చేటి—(తరుశాఖనుజూచి) అమ్మయ్యోవు!
అజ్జుకోవు! ఇదుగో అశోకపుచిగుళ్ల చా
టున తాచుపామేవు!

గణి—ఆఁ! ఆఁ! పాము కే! పాము కే!!

(అని క్రిందఁ గూలుచున్నది)

శాండి—(చేరఁబోయి) అమ్మా! ఏమిటిది?

చేటి—అయ్యో! ఈ అజ్జుకను పాముకరిచింది.

శాండి—అయ్యో! స్వాములవారూ! ఈబో
గంపిల్లను పాము కరిచిందండి.

పరి—దానికేఁ గర్మఫలయ మనుచుదికాఁబో
లును. ఏమనఁగా:

గీ. జన్మమందుచునుందురు స్వస్వకర్మ
మనుభవింపఁగాఁ బ్రాణు లీయవని దఱచు
కర్మ మది తీఱఁగా మృతిగాంచుచుందు
రవల వేఱొక్కచో జన్మమందుకొఱకు.

చేటి—అజ్జుకా! బాధగాఉందా?

గణి—నావొళ్లు విడివిడి పోతున్నట్టుంది. నా
ప్రాణాలు లేచి పోతున్నట్టున్నవి. పడుకో
వలెననిపిస్తున్నది.

చేటి—తిన్నగా పడుకో అమ్మా;

గణి—ఓసీ! అమ్మకు దణ్ణం పెట్టానని చెప్పు.

చేటి—ఇంటికి వెళ్లి అమ్మకు నీవే దణ్ణంపెట్టు
దువుగాని.

గణి—రామిళకయ్యను కౌగిలించుకొన్నానని
చెప్పు.

(అని మూర్ఛితయై పడుచున్నది)

చేటి—హా! అయ్యో! పడిపోయిందే అజ్జుక.

యమ—అబ్బ! ప్రాణములు లాగితిని. ఇదిగో నేను.

సీ. ఉత్తరంగను గంగ నుత్తరింతు శుభ ప్ర
వాహ నర్మద నంగి పైచి చనుదు
సహ్యాద్రి పయినుండి సాగుదు గోదావ
రీ కృష్ణవేణ్ణల నాక్రమింతు
శ్రీపర్వతమ్మును గాంచీపురమ్మును మీఱి
నెగయుచుఁ గావేరి నిస్తరింతు
తామ్రపర్ణిని దంగిదాఁటుచు మలయప
ర్వతముఁ గుప్పింతు సంద్ర ముఁదరింతు

గీ. లంక సంగవించి లంఘింతు నంతట
విక్రమించి వాయువేగమునను
ధర్మరాజు రాజధానికిఁ బూనికి
మీఱి గంతుగొంచుఁ జేరుకొందు.

చేరుకొని యచ్చట విశాలశాఖమగు
వటవృక్షము క్రింద గూర్చున్న చిత్రగుప్తునిఁ
గలిచెదను. (వెళ్లును)

చేటి—అయ్యో! అజ్జుకా!

శాండి—స్వామీ! ఈబోగంపిల్ల తనప్రాణా
లను విడుస్తున్నది.

పరి—మూర్ఖుఁడా! ప్రాణులకుఁ బ్రాణములు
పరమప్రియములు గదా! ప్రాణములే శరీ
రమును విడచి పోవుచున్నవనుము.

శాండి—ఛీ! లేచిపో! జాలిమాలినవాడా! చ
నవులేనివాడా! రాతిగుండెవాడా! రోత
మనసువాడా!

పరి—నీకోరిక యేమోయి?

శాండి—మరేమీ లేదు, నీకు అష్టోత్తరశత నామాలు పారాయణ చెయ్యవలెనని.

పరి—కానిమ్ము. నీయిష్టము.

శాండి—అయ్యో! స్వాములవారూ! నాకడుపు తరుక్కు పోతున్నదండీ!

పరి—ఎందుకోయికు?

శాండి—మనకు స్వజనమంటే ఈబోగంది.

పరి—ఏమీ! స్వజన మెట్లగును?

శాండి—ఈబోగందికూడా పరివ్రాజకులుమల్లేనే ఎక్కడా స్నేహం పాటించదుగాదండీ!

పరి—నిజమే! స్నేహము దుర్లభమే! అయినను అర్థసంబంధ ముంటేనేని వేశ్య స్నేహముపాటించును. అట్లే

గీ. తద్ధనిర్మములై మోక్షు మున్దైసించి
శాస్త్రహితమగు నడవడి జరుపువారు
వారు ప్రేమపరాఙ్ముఖుల్ వారిహృదయ
ములనుగూడ గుణాపేక్ష మొలకలెత్తు.

శాండి—అయ్యో! స్వాములవారూ! నిబ్బరించుకోలేకుండా ఉన్నానండీ! దగ్గరకుపోయి యేడుస్తాను.

పరి—వలదు వలదు, పోవలదు.

శాండి—కోప్పడకండి. స్వాములవారు కోప్పడరాదు. (చేరబోయి) హా! అజ్జుకా! వలపులకుప్పా!

చేటి—అయ్యో! ఏమిది?

శాండి—అమ్మా! స్నేహమే! కడుపు తరుక్కుపోతున్నదే.

చేటి—(ఆత్మగతముగా) అవును. నిజమే! సాధుజనులంటే అందరిమీదా అనురాగం గలవారు గదా!

శాండి—అమ్మా! తాకిచూస్తాను దీన్ని.

చేటి—అయ్యో! దానికేమి తాకి చూడండి.

శాండి—హా! అజ్జుకా! (పాదములు తాకును)

చేటి—అయ్యో! వద్దండీ. ఇవికాళ్లు మీరు పట్టుకోవద్దు.

శాండి—(స్వగతము) అయ్యో! నామనస్సంతా చెదరిపోయింది. తలేదో కాళ్లేవో తెలుసుకోలేకుండా ఉన్నాను. తాటిపళ్లవలె బలిసి, అగరుపూతతో, గందముపూతతో, పరిమళిస్తూ, వాలిపోకుండా నిక్కబొడుచుకొని ఉన్నవి, ఈ స్తనాలు. ఆహా! ఈపడుచు బతికి ఉండగా పట్టుకోలేకపోతిని! అభాగ్యుణ్ణి!

చేటి—(ఆత్మగతము) ఇట్లా చేస్తాను. (ప్రకాశము) అయ్యో! కొంచెముసేపు అజ్జుకను చూస్తూఉంటారా! ఇంతలో మాఅమ్మను పిలుచుకొనివస్తాను.

శాండి—వెళ్లు శీఘ్రంగా, తల్లివచ్చేదాకా నేను తల్లికి మల్లే చూస్తూఉంటాను.

చేటి—(ఆత్మగతము) జాలిగలవాడీబ్రాహ్మడు, అజ్జుకను విడిచిపెట్టడు, పోయివస్తాను. (వెళ్లును).

శాండి—వెళ్లిందిఇది. ఇహ బాగా ఏడుస్తాను హా! అజ్జుకా! హా! మధురగాయనీ! (ఏడ్చును)

పరి—శాండిల్యా! ఏడ్వరాదోయి!

శాండి—తొలగిపో! దయాదాక్షిణ్యాలు మాలినవాడా, నీవంటివాణ్ణే అనుకొన్నావా యేమిటి నన్ను కూడా?

పరి—నాయనా! ఇటురావోయి! అధ్యయనము చేయుమోయి!

శాండి—అయ్యో! స్వాములవారూ! అయితే అధ్యయనం చేస్తే చికిత్స చేయవచ్చునా యేమిటి? ప్రాణంపోతున్న యీ గడుచుకు; పాపము! దిక్కు లేకుండా ఉన్నది!

పరి—నీవు చదువునది ఔషధశాస్త్రమను కొంటివా యేమి?

శాండి—అయితే పాపమే నీ యోగాభ్యాసానికి ఫలము.

పరి—(స్వగతము) అయ్యో! ఈ తెలివిమాలినవాడు, కర్తవ్యాబోధ్యుండగుటచేతం దన యాశ్రమస్థితిని, లోకప్రవాదమును గూడ గుర్తింపంజాలకున్నాండు. మహేశ్వరాదులైన యోగాచార్యులచేత నిందుక తెలిసికొంటిని. శిష్యుమీంద దయచేత నగు సంగము బాధింపదు. కావున వీనికి యోగమనంగా నిట్టిదని నమ్మకము పుట్టించుటకై యోగావిష్టుండనై ఈ వేశ్య శరీరమున నాప్రాణములను బ్రవేశపెట్టుదును. (అట్లు చేయును)

గణి—(లేచి) శాండిల్యా! శాండిల్యా!

శాండి—(సంతోషముతో తనలో) ఆహాహా! ప్రాణాలు వచ్చినవి. బ్రతికింది, ఈ వేశ్య! (గణికతో) భవతీ! ఇదుగో ఉన్నాను. (అని తాంకంబోవును)

గణి—కాలు సేతులు కడిగికొనక నన్ను స్పృశింపకుము.

శాండి—అతిపవిత్రురాలుగా ఉంది ఈ వేశ్య.

గణి—రా నాయనా! అధ్యయనము చేయుము.

శాండి—ఇక్కడా అధ్యయనమేనా? అధ్యాయానికి మాస్వాములవారిదగ్గరకే పోతాను. (చేరంబోయి) అయ్యో! స్వాములవారూ! అయ్యో! ప్రాణంపోయిందే స్వాములవారికి! హా! వాచాల! హా! అతియోగదక్షు! హా హా! ఉపాధ్యాయ! అయ్యో! సర్వమూ తెలిసినవారు; ఇటువంటివారికి కూడా మరణించుటమేనా?

(ప్రవేశించి తల్లియు చేటియు)

చేటి—రా అమ్మా! రా అమ్మా!

మాత—ఎక్కడనే నా బిడ్డ ఎక్కడనే?

చేటి—ఇదుగో అజ్జుక! పాముకరచింది చిగురు టాకులుకోయబోతేను:

మాత—అయ్యో! అయ్యో! నా కొంపకూలింది. నే చచ్చాను, అమ్మయ్యో!

చేటి—ఏడవకమ్మా! ఏడవకు! ఇదుగో అజ్జుకకు ఒళ్లు నిమ్మళించింది. లేచికూర్చుంది.

మాత—అమ్మయ్యా! ఇదుగో (చేరంబోయి) బిడ్డా! వసంతసేనా! ఏమిటమ్మా ఇది!

గణి—వృషలవృద్ధా! నన్ను స్పృశింపకుము, తొలంగిపొమ్ము.

మాత—అయ్యో! ఇదేమిటే!

చేటి—విషం తల కెక్కినట్టుంది.

మాత—వెళ్లి దబ్బున వైద్యుణ్ణి పిలుచుకొని రా! పో! దబ్బున పో.

చేటి—అమ్మా అట్లాగే. (అరిగెను.)

(అంతట రామిళకుఁడు చేటి వచ్చుచున్నారు.)

చేటి—రండి బావా! రండి; మీరు కనపడక పోవడంచేత అజ్జుక అవస్థపడుతున్నది;

రామి—

గీ. కోరి నే నీవిశాలాక్షికుల్కుఁబల్కు [దు ముఱిపములవిందు మొగమందు ముద్దుగొం నెఱవిరిసినట్టి పొందమ్మివిరిని ముట్టి వ్రాలి చుంబించుతుమ్మెదఁబోలి యిపుడు (చేరఁబోయి) ఏమిది ! నన్నుఁజూచి మొగముత్రిప్పికొన్నది!(ప్రైటకొంగుపట్టుకొని)

గీ. తరఁగతాఁకున వ్రాలు సెత్కమ్మిఁబోలు చన్నమోమింత యిటు ద్రిప్పసన్నతాంగి! నించుముదమించుకయుఁ దోఁచినీమొగమ్ము నలినలిగఁ ద్రాగు చేచాఱసలిలమట్లు.

గణి—ఓయి అజ్ఞానుఁడా! విడువుమోయి నా వస్త్రాంతమును.

రామి—భవతీ! ఏమిది?

చేటి—పాముకరచినతర్వాత ఇట్లాపిచ్చిమాటలు మాట్లాడుతున్నదండీ!

రామి—అదే

గీ. స్పష్ట మిద్దాని చిత్తమ్ము సంచలించెఁ జిత్తము చలింపఁగా నంతఁ జేతన చెడి రిత్తయై తత్తరిల్లు శరీరమందు జడుపుగొలిపినా రెవ్వారో సత్త్వయుతులు.

(వైద్యుఁడు, చేటి, ప్రవేశింతురు)

చేటి—రండి, రండి, అయ్యా!

వైద్యుఁడు—(ప్రవేశించి) ఎక్కడ ఆమనిషి?

చేటి—ఇదుగో అజ్జుక! ఏమో చాలా జబ్బుగా ఉన్నదండీ!

వైద్యు—ముదురుతాచు బుస తగిలేటప్పటికి మనసు చెదిరిపోయింది, అపైన అదికర చిందికూడాను.

చేటి—ఏమి ఏమిటీ! అయ్యా! మీకెట్లా తెలిసింది.

వైద్యు—ఎట్లా తెలిసిందా! కనపడడంలేదా! విషవికారము! తీవ్రముగాఉంది! ఇట్లా తీసుకురా! నాచేతనయినంతవరకూ విషతంత్రంలో అన్ని ఉపాయాలూచేసి చూస్తాను. (కూర్చుండి మండలమురచించి) కుండలకుటిలగామిణి! మండలంపవిశ!పవిశ! వాసుకిపుత్రిర ! తిష్ఠ ! తిష్ఠ ! క్షూ ! క్షూ!

(ఊఁదును మంత్రించును,)

సిరావేధ చేయవలెను; ఏదీ కత్తి?

గణి—మూర్ఖవైద్యుఁడా! అవస్థపడకు;

వై—అఁ! పైత్యంకూడాఉన్నది. నేను నీ పైత్యాన్ని, వాతాన్ని, శ్లేష్మాన్ని, అన్నింటినీ నాశంచేస్తానుసుమా! ఏమనుకొన్నావో!

రామి—తగినమందు గట్టిగాఁ బ్రయోగింపుము తండ్రీ! నీమేలు మఱవము. తగినబహుమాన మొసఁగుదుము.

వై—సుందరగుళికుడని సర్పవైద్యుడున్నాడు ఆతణ్ణి పిలుచుకొనివస్తాను. (వెళ్లును.)

(అంతట యమపురుషుఁడు ప్రవేశించును)

యమ—అయ్యో! యమధర్మరాజు నన్నుఁ బొడిపొడిచేసెనుగదా!

గీ. ఈవసంతసేన యేఁ జెప్పినదిగాదు శీఘ్ర మీమె మేనఁ జేర్పు మోయి!

వేఱె యొకతె బ్రదుకుతీఱిన దున్నది
యావసంతసేన నడిచితెమ్ము.

అని; దీనిశరీర మగ్నిసంస్కారముఁ బడయక పూర్వమే కొనిపోయి యందు జీవమును బ్రవేశపెట్టవలెను. (చూచి) అన్నా! లేచియున్నదే యిది. ఇది కాదా!

గీ. దీనిప్రాణముల్ మదీయకరస్థము
లిదియు లేచి యిచట మెదలుచుండ
నెచ్చటేని యిట్టియచ్చెరియము భువి
యందుఁజూచి యెఱుఁగ మిందనుకను.

(అంతటను గలయఁజూచి) ఓహో! ఇదె యిక్కడ యోగియగు పరివ్రాజకుఁడు క్రీడించుచున్నాఁడు. ఇప్పుడేమి చేయుదును! కానీ! కనుఁగొంటిని. ఇట్లుచేయుదును. ఈగణిక జీవమును పరివ్రాజక శరీరమందుంచిపోయి నాపని ముగిసినతర్వాత మరలవచ్చి యథాస్థానమునఁ బ్రవేశపెట్టుదును.

(అట్లు చేసి)

గీ. విప్రునిశరీరమందుఁ బ్రవేశపెట్టి
నాఁడ నే నాఁడుదానిప్రాణముల నిపుడు
తత్త్వమునకు శీలమునకుఁ దగినయట్లు
ప్రాయికమ్ముగా వికృతిని బడయఁగలవు.

(నిష్క్రమించును)

పరి—(లేచి)పరభృతికా! పరభృతికా!

శాండి—అమ్మయ్యో!స్వాములవారి ప్రాణాలు మళ్లీ వచ్చినవి. నేననుకొంటాను; కష్టాలనుభవించేవాళ్లు దబ్బునచావరు.

పరి—ఏడీ! ఏడీ! రామిళకయ్యా!

శాండి—స్వామీ! ఏమిటిది! కమండలము పట్టుకోదగిన మీ యెడమచెయ్యి ముత్యాలగాజులు మోస్తున్నదానికిమల్లే కనపడుతున్నది!

పరి—రామిళకయ్యా! నన్ను కౌగిలించుకోవూ!

శాండి—ఛీ! ఛీ! ఆమోదుగుచెట్టును కౌగిలించుకో.

పరి—రామిళకయ్యా! నా కేమోవికారంగా ఉందిగదా!

శాండి—కాదుకాదు, మదపిచ్చి యెత్తింది.

రామి—స్వామీ! ఆశ్రమ విరుద్ధములైన యాలాపము లాడుచుంటి రేల?

పరి—కల్లు తాగుతాను.

శాండి—ఏమంతాగు (ఆలోచించి, తనలో) కానీ! ఇదేమో నవ్వులాటకథగా ఉన్నట్టు లేదు చూస్తే. స్వాములవారు స్వాములవారుగాలేరు. అజ్జుక అజ్జుకగాలేదు. ఇదే మిటో భగవదజ్జుకముగా ఉన్నది! కానీ ఏమవుతుందో చూస్తాను.

పరి—పరభృతికా! నన్ను కౌగిలించుకోవూ!

చేటి—ఛా! పో! బాపనసన్నాసీ!

మాత—అమ్మా! కూతురా! వసంతసేనా?

పరి—అమ్మా! ఇదుగో నేనిక్కడున్నానే! దణ్ణమే!

మాత—స్వామీ! ఇదేమిటి?

పరి—కనుక్కోకుండాఉన్నావు నన్ను;(రామిలకునిఁజూచి) రామిళకయ్యా! ఇవ్వేళ ఇంత ఆలస్యముచేశా వేమి?

రామి—స్వామీ! అవశుఁడనై యున్నాను. నా కేమియుఁ దోఁచకున్నది.

శాండి—శాస్త్రీ! చూస్తాను!

(వైద్యుఁడు ప్రవేశించును)

వైద్యుఁడు—ఎనిమిది గుళికలు తీసుకువచ్చాను. మంచిమందులు తీసుకువచ్చాను. బతికేదీ బతకనిదీ అటవ్వేదీ ఇటవ్వేదీ నిమిషములో తేలుతుంది. నీళ్లేవీ! (చేరఁబోవును.)

చేటి—ఇవిగో నీళ్లు!

వై—గుళికను అరగదీస్తాను. ఓహోహో! ఈమెకు పాము కరవడమే కాదు. ఏదో ఆవేశించినట్టుగాకూడా ఉంది.

గణి—మూర్ఖవైద్యుఁడా! వృథావృద్ధుఁడా! ప్రాణులకు నంతకుఁడ వగుటనుగూడ సరయఁజాలకున్నాఁడవు. ఈయాఁడుదాని నే జాతి సర్పము కఱచినదో యెఱిఁగితి వేని చెప్పుము.

వై—చెప్పడంలో ఆశ్చర్యమేముంది?

గణి—శాస్త్రము కలదా?

వై—కావలసినంతఉంది. సవాలక్ష గ్రంథం ఉంది.

గణి—ఏదీ చెప్పుము ఆవైద్యశాస్త్రమును.

వై—వినవమ్మా! చెప్పతున్నాను. వాతికాః పైత్తికాశ్చైవ శ్లై—ఇస్—ఆఁ! (పైకిఁ జూచుచు నాలుకకఱచుకొని) పుస్తకము, పుస్తకము!

శాండి—(తనలో) బలేవైద్యుడు! తగిన వైద్యుడు! ఒక్కముక్క చెప్పాడో లేదో అంతలోనే మరపు అడ్డం వచ్చింది. నాకు పెద్దన్నయ్యల్లే ఉన్నాడు చూడగా. అయ్యో!! (ప్రకాశము) అయ్యా, ఇదుగో పుస్తకము!

వై—(పుస్తకముచూచి) ఐతేవినుు, ఇదుగో వినిపిస్తున్నాను.

శ్లో. వాతికాః పైత్తికాశ్చైవ
శ్లైష్మికాశ్చ మహావిషాః,
త్రీణి సర్పా భవంత్యేవ
చతుర్థో నాధిగమ్యతే

గణి—అపశబ్దమయ్యా అది! 'త్రయస్సర్పా' అని చెప్పవలసియుండఁగా, నీవు 'త్రీణి సర్పా' అనుచున్నాఁడవు. 'త్రీణి' అనునది నపుంసకలింగము. 'సర్పాః' అనునది పుంలింగము. తప్పు శ్లోకము చదివితివి.

వై—అయ్యయ్యో! వైయాకరణసర్పమిప్పుడు నన్ను పీకిందే.

గణి—విషవేగములెన్ని?

వై—విషవేగాలు వందలు.

గణి—కాదు, కాదు, విషవేగము లేడు. ఏవనఁగా!—

శ్లో. రోమాంచో ముఖశోషశ్చ
వైవర్ణ్యం చాపి వేపథుః,
హిక్కా—శ్వాసశ్చ సమ్మోహ
స్సప్తైతే విషవిక్రియాః.

ఈయేడు విషవేగములకంటె దాఁటిన దాని నాశ్వినేయులు వచ్చినను జికిత్సింపఁజాలరు; అయినను నింకను నీవెఱిఁగినది, చెప్పవలసినది, యుండెనేని చెప్పుము.

వై—(స్వగతము) ఓరిబాబో!! మాకేమీ అందేటట్టులేదే చూస్తేను! (ప్రకాశము) అమ్మా నీకో దణ్ణం. పోయివస్తాను. (వెళ్లును.)

(సశేషము)




మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారు

ప్రకృతి మెప్పింప నీశ్వరుని మెప్పింపఁ
గవియొనర్పఁగ లేని కార్యంబుగలదె?
చూడఁ గష్టంబైన చోటులం జూడ
వినఁగఁ గష్టంబైన వింతలన్ వినఁగఁ
గవియె చాలునుగాక, కలఁడె వేఱొకఁడు?
తలఁపఁ గష్టంబైన తలఁపులం దలఁపఁ
బాడఁగష్టంబైన పాటలం బాడఁ
గవియె నేర్చునుగాక, కలఁడె వేఱొకఁడు?
కవి చేయఁగాలేని కార్యంబుగలదె?

* * *

వేసవి దీర్ఘమై వెడలిపోదయ్యె;
విమల ప్రతాపంబు వెలుఁగ సూర్యుండు
వేయుఁజేతులతోడ విరఁజల్లె నగ్గి;
దప్పిన తెరువరి దప్పిఁదీర్పంగఁ
బానీయ మీయక వరుణుండు డాఁచె;
ఊపిరాడుటకైన నొక్కింత లేక,
గాలి యెందుండెనో, కానరాదయ్యె
కన్నెత్తి తన్నింత గననైన వలను
కానిచందంబున గగనంబు తోఁచె;
వర్షసఁ జేరిన ప్రాణిఁ జలిచీమఁబోలె
మలమల మాడ్చుచు మహి మండుచుండె;
పగలు రే యనకిట్లు పంచభూతములుఁ
బగలు చూపుచునుండఁ బ్రాణులెల్లెల్లొ
దినములు సాగించి, మనుచుండె;

ఇట్లు

చనియెను రథయాత్ర; చనియె శ్రావణియు
అతిలోభిచందాన నట్టిట్టు చూచి
వసున్రల నొక్కొక్కవసుధరుం డొసఁగ,
నాకులపాలైన, హాలకర్మములు
నాకులపాటుతో నందందుసాగె
గణనాయక చతుర్థి కడచనేగాని,
యణఁగ దావంత యావంతయు;

నపుడు

నిఖిలలోకము బాధ నిజబాధగాఁగ
నరయుచుండిన కవీశ్వరుఁ డొక్కరుండు
బాలములఁ గనుఁగొంచుఁబోయియాడాడఁ
దల ప్రేలఁగా వైచి, వెలవెలఁబారి
కార్చుట కొక్కింత కన్నీరులేక
వంతనొందుచునున్న వరికన్నెఁ జూచి,
వరికన్నె కాపత్తు దరికొన్న కతన,
గుండియల్ తటతట కొట్టుకాడంగ,
మది దిగుల్ సెందంగఁ బెదవులెండంగ,
విన్నఁబాటొదవంగ, వెడనవ్వు నవ్వి,
యీమూల నామూల నేడ్చుచున్నట్టి

కాఁపు కన్నులఁజూచి, కడుజాలినొంది
కళ్లంబునకె నొక్కగట్టుపై నున్న
నున్నఁగాయలపొన్న గున్నక్రేనీడఁ
గూర్చుండి, ధ్యానించి, కొంత సేపటికి
భావంబులోనుండి పైకుబ్బురీతిఁ
గన్నీళ్లు కాల్వలై కాఱుచుండంగ
నీరెలుంగునఁ గంఠమెత్తి యేమేమొ
పరమేశ్వరునిగూర్చి పాడఁగా సాగె

* * *

ఏపాట పాడెనో యీశ్వరుం డెఱుఁగు;
ప్రకృతియొఱిఁగిన పగిదిఁ గన్పట్టె;
ఆపాటఁగలయర్థ మరసి కాఁబోలు
'రామరామా' యంచు రాచిల్కయొకటి
పొన్నపైఁ గొమ్మపైఁ బొంచుండిపలికె;
ఏమూలనుండియో యేతెంచి బల్లి
'కృష్ణకృష్ణా' యంచుఁ గేరుచుంబల్కె;
ఎందుండియో వచ్చి యెదురుగావ్రాలి
'వాసుదేవా' యంచుఁ బలికెను గ్రద్ద
ప్రక్కపుట్టలనుండి ప్రాకుచున్ వచ్చి,
'యుస్సుస్సు'రనుచుండె నురగంబొకండు;
కలఁతనొందుటనేమొ, తలయూఁచసాగె
నెదుటిగట్టుననున్న యీఁతచెట్టొకటి;

డాఁగినగుహనుండి డాయ నేతెంచి
పలుకరింపఁగఁ జొచ్చె పవనదేవుండు;
అంబరకాంత నీలాంబుదాంబరము
మోమున సిగ్గుతో ముసుఁగిడియుండ
దానిచాటుకుఁబోయి దాఁగె సూర్యుండు.
పాటలో భావంబు భావించియిట్లు
ప్రకృతి యుత్తలపాటు, భంగపాటొంద,
సానుభూతిని దేవుఁ డస్రుకణల్ రాల్చె
ననుకీతిఁబైనుండి యమృతంబు గుఱిసె;
తాపంబు చల్లారె దానఁ బ్రాణులకుఁ
గోపంబు చల్లారెఁ గువలయంబునకు;
ముసుఁగూడ్చి గగనంబు ముసిముసినవ్వఁ
దన ప్రతాపము తగ్గి తరణి కన్పట్టెఁ;
బిల్లతెమ్మెర వచ్చి మెల్లఁగా వీఁచి
యెల్లరయుల్లముల్ చల్లఁగావించె;
దలయెత్తి వరికన్నె కలకలలాడి
యానంద వారినోలాడుచునుండె;
వరికన్నె మోదంబు పరికించి యుప్పొ
డాకాపుకన్నియ లందందు నెందు
నాటలాడుచు మేలిపాటఁ బాడుచును
బరుగెత్తసాగిరి పరితోష మొప్ప.
పరమేశ్వరుని కృపావైచిత్రి కలరి
పాటఁబాడుచుఁ గవీశ్వరుఁ డింటి కేగె.






గిడుగు వెంకట సీతాపతి గారు

బ్రహ్మశ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులవారు పరిషత్పత్రిక రౌద్రి జ్యేష్ఠాషాఢముల సంచికలో ఆంధ్రఛందస్సును గూర్చి ఒకవ్యాసము వ్రాసినారు. అందులో యుద్ధమల్లుని శాసనము నందలి మధ్యాక్కరలకున్నూ నన్నయభారతమందలి మధ్యాక్కరలకున్నూ లక్షణము నిరూపించుటకు ప్రయత్నించి, అందుకు అనుకూలముగా అశ్రుతపూర్వమైన ఇనేంద్రగణ ప్రస్తారమొకటి కల్పించి ప్రకటించినారు. దీనిలో పూర్వలాక్షణికులు ఎవ్వరూ చెప్పని గణములు చేర్చుకొన్నాడు.

పిమ్మట వావిళ్ల వారు ప్రకటించిన అనంతుని ఛందోదర్పణమునకు నేను ఉపోద్ఘాత మొకటివ్రాసి, అందులో మధ్యాక్కరల లక్షణము గురించి చర్చిస్తూ, శాస్త్రులవారి వాదము విమర్శించినాను.

నా విమర్శనము విమర్శిస్తూ సీతారామస్వామి శాస్త్రులవారు విజయనగరం మహారాజావారి కాలేజీ "మ్యాగజీన్" లో అక్కరల గురించి వ్యాసమొకటి వ్రాసి ఇప్పుడు ప్రకటించినారు. ఇందులో తమ మొదటివాదము కొంత మార్చుకొని, ఇనేంద్రగణముల సంఖ్య అధికము చేసుకొని వాటికి 'అనుగమము' ఒకటి కుదురుపరచి నన్నయ మధ్యాక్కరల లక్షణము నిరూపించినారు.

సీతారామస్వామి శాస్త్రులవారివంటి పండితుల వాదము సరిగాలేదని నావంటివాడు చెప్పడము సాహసముగానే కనబడవచ్చును; గాని, నేనున్నూ శాస్త్రులవారి వలెనే ఛందస్సుకు సంబంధించిన విషయములు కొంతకాలమయి విమర్శిస్తూ, నన్నయ మధ్యాక్కరల లక్షణము తెలుసుకొనుటకు ప్రయత్నిస్తూ ఉన్నవాడను; గనుక, ఈవిషయమును గూర్చి నాకు యథార్థమని తోచినది ప్రకటించుటకు సాహసిస్తున్నాను.

నన్నయ మధ్యాక్కరల లక్షణము నిరూపించుటకు ఇంతగా వాద ప్రతివాదములు ఎందుకు జరగవలసి వచ్చినదంటే, వ్రాతప్రతులలోని పాఠములున్నూ, అచ్చుపడ్డ ప్రతులలోని పాఠములున్నూ పరిశీలించి చూడగా మన లాక్షణికులు చెప్పిన లక్షణమునకు అవి కొన్నిచోట్ల సరిపడకుండా ఉన్నవి. అందుచేత వాటి లక్షణము కొత్తగా నిరూపించవలసివచ్చినది. శాస్త్రులవారు చెప్పినది నాకున్నూ, నేను చెప్పినది వారికిన్నీ, అసమ్మతమగుటచేత వాద ప్రతివాదములు పెరుగుతూ ఉన్నవి. అయితే, మేమిద్దరమున్నూ మిత్రుల మగుటచేతను, ఇద్దరమున్నూ సమానముగానే యథాస్థితి తెలుసుకోవలెనన్న కోరికగలవార మగుటచేతను, వాదప్రతివాదముల వల్లనే నిజము నిలకడమీద తేలగలదన్న నమ్మకముగల వార మగుటచేతను, ఈవిషయము విపులముగాచర్చిస్తున్నాము. అందువల్ల ఇద్దరమున్నూ సరియైన మార్గములోనికి రావచ్చును. శాస్త్రులవారు విజయనగరం కాలేజీమ్యాగజిన్ లోవ్రాసిన వ్యాసము సుమారు 32 పుటలుగల గ్రంథము. అందులో నేను విమర్శించవలసిన విషయములు అనేకముగా ఉన్నవి. అవి అన్నీ విమర్శిస్తూ పెద్దవ్యాస మొకటివ్రాసి ఆపత్రికకే పంపదలచినాను. అయితే అది త్రైమాసిక పత్రిక గనుక, అందులో నావ్యాసము ప్రకటితమయే సరికి చాలాకాలము పట్టును. అదిగాక, శాస్త్రులవారు భారతి 7-8 సంచికలలో కవిజనాశ్రయము గురించివ్రాసిన వ్యాసమందు అక్కరల గురించిన మా వాదము సూచించినారు. అది చదివినవారికి మా వాదప్రతివాదము లెట్లున్నవో తెలుసుకోవలెనన్న కోరిక ఉండవచ్చును. శాస్త్రులవారి వాదమునకు మూలాధార

ముగా ఉన్న ముఖ్యవిషయము పండితులు విమర్శించ దగిన విషయముగనుక, తక్కిన విషయములను విడిచి పెట్టి ఈముఖ్యవిషయము మాత్రమే ఇప్పుడు విమర్శించ దలచినాను. దీనిగురించి నాకున్నూ మాకాలేజీలో పండితులుగా ఉన్న వాసా సూర్యనారాయణశాస్త్రిలుగారికిని జరిగిన సంభాషణము పొందుపరచి ఇక్కడ ప్రకటిస్తున్నాను. దీనిని బట్టి సీతారామస్వామిశాస్త్రిలవారి వాదమెట్లున్నదో నలుగురికి విశదము కాగలదు. విచక్షణులు తమ అభిప్రాయములను తెలియజేసి నావాదమందు దోషములుంటే, కనబరుతురు గాక!

## సంభాషణము

సూర్యనారాయణ శాస్త్రిగారు:—అక్కరల గురించి విజయనగరం మహారాజాస్ కాలేజీ మ్యాగజీన్ లో బ్రహ్మశ్రీ వజ్ఝలచిన సీతారామస్వామిశాస్త్రిలవారొక పెద్దవ్యాసము వ్రాసినారు; మీవాదాన్ని ఖండించి, మధ్యాక్కరలకు క్రొత్తలక్షణ మేదో చెప్పినారు; చూచినారా?

నేను:—చూచినాను; చాలా అద్భుతంగా ఉంది. దాని సారం మనవిచేస్తాను. వినండి. (అని, నారాయణశాస్త్రిలుగారు అన్నమాటలు వెంటనే కాగితము మీద వ్రాసి) శాస్త్రిలుగారూ; సీతారామస్వామి శాస్త్రిలవారు చెప్పిన లక్షణము అంగీకరిస్తే, మాట్లాడినదెల్లా మధ్యాక్కరగానే గణబద్ధమై ఉంటుంది సుమండీ; అందుకు నిదర్శనముగా మీరిప్పు డన్నమాటలే, ఏమిన్నీ సవరించకుండానే, చూమకోవచ్చును. అవి పద్యపాదములవలె వ్రాసి గణవిభజనచేసి చూపిస్తున్నాను; చూడండి;—

"అక్కరల| గురించి| విజయ|నగరం మ॥హారా జాస్|కాలేజీమ్యాగ| జీన్ లో బ్ర| హ్మశ్రీ॥ వజ్ఝల| చినసీతా| రామస్వామిశా| స్త్రిలవా రొ|క పెద్ద| వ్యాసము॥ వ్రాసినారు| మీవా,దాన్ని ఖం|డించిమ|ధ్యాక్క|రలకుక్రొ॥ త్తలక్షణ| మేదో॥

దీనిలో ప్రాసం మాత్రము లేదు గాని, నాలుగు చరణాలలోను కాకతాళన్యాయంగా వడినియమము కూడా కుదిరి ఉన్నది

సూర్య:—ఏమి టీగణవిభజనము! ఇందులోనివి మధ్యాక్కర గణము లేనా?

నేను:—సీతారామస్వామిశాస్త్రిలవారు చెప్పిన లక్షణమునకు అను గుణముగా ఉన్న గణములే కాని అందుకు విరుద్ధమైనవి కావు. పాదమునకు రెండింద్రగణములు, ఒక సూర్యగణము, రెండింద్రగణములు, ఒక సూర్యగణము ఉండునని నలుగురితోపాటు వీరున్నూ అన్నారు. ఇకను వీరు క్రొత్తగా ఇనేంద్రగణములకు కుదురు పరచిన 'అనుగమము' ఎట్లున్నదో చూడండి. "ఇనగణములు మూడుగాని నాలుగుగాని మాత్రము గలిగియుండి ద్వ్యక్షరములో త్ర్యక్షరములోనైయుండును. ఇంద్రగణములు 4, లేక, 5, లేక 6 మాత్రలు గలిగియుండి, త్ర్యక్షరములో చతురక్షరములో నై యుండును" అనికదా వారు 91-వ పుటలో వ్రాసినారు.

సూర్య:—అయితే, వారి మతమున ఏర్పడ్డ సూర్యగణము లేవి?

నేను:—ఏవి—UU గగము; |U వగణము; ||U సగణము; U| హగణము; |U| జగణము; ||| నగణము U|| భగణము.

సూర్య:—వీటిలో హగణ (U|), నగణ (|||) ములు రెండేకదా మన తెలుగు లాక్షణికులు సూర్యగణములుగా అంగీకరించినారు?

నేను:—ఆలాగు సనకండి. వ్యాలంకార చూడామణిలో......

సూర్య:—అవునవును-చిన్నకోటపెద్దన, "ఓలి రెండు మూడు నాలుగు గురువుల| నైన గణము లిన సురాధిపేందు| గణము" లన్నాడుగాని, అందులో మొదటి రెండేసిగణములున్న విడిచిపెట్టవలెనని చెప్ప లేదు. ఆవిషయము మీరు గ్రహించలేదనేకదా సీతారామస్వామిశాస్త్రిలవారు మిమ్ములనున్ను జయంతి రామయ్యపంతులుగారినిన్ని ఈ మ్యాగజీన్ లోనూ, భారతిలోనూ ఆక్షేపించినారు?

నేను:—నిజమే; ఈవిషయ మొక్కటే, వారు నాకు చూపించినదాకా నేను జూచియుండలేదని వారు తమ వ్యాసము నాకు చదివి వినిపించినప్పుడు నే నొప్పుకొన్నది. అది ఆధారముగాచేసుకొని వారు నావిషయమై ఎట్లు వ్రాసినారో (పు. 72 లో ఉన్నది) చూడండి.

"కొన్ని స్పష్టమయినచోట్లఁ దమవాదము సరికాదని యొప్పుకొని, మఱికొన్నిచోట్ల నింకను విచారింపవలసి యున్నదని సెలవిచ్చిరి." అని వ్రాసినారు.

సూర్య:—ఈ ఒక్కవిషయమేగా? ఏయే విషయములలో మీరే మీవాదము సరికాదని ఒప్పుకొన్నారో ఇంకా అడిగి తెలుసుకొందామనుకొన్నాను. సీతారామస్వామిశాస్త్రిల వారికై నా పరిషత్పత్రికలో తమ వ్యాసము ప్రకటించిన నాటికి కావ్యాలంకార చూడామణిలో ఇనేంద్ర చంద్రగణములగురించి చెప్పినది తెలిసినట్లు కనబడదే. తెలిసి ఉంటే, "తెలుఁగున నట్టి మూఁడుఛందములందును మొదటి రెండేసి గణములను విడువఁగా మిగిలినవానిలోఁ గేవల గుర్వాదులును లఘువు ముందుచేర్చిన లఘ్వాదులును వరుసగా నినేంద్రచంద్ర గణములుగా నెన్నఁబడును" అని పరిషత్పత్రిక (సంపుటము ౯ సంచిక ౨ పుట ౮౬) లో ఎందుకు వ్రాసినారో తెలియదు. ఆవ్యాసములో ఎక్కడా కావ్యాలంకారచూడామణిలోని ఈవిషయము ఆయన సూచించనైనా లేదు.

నేను:—అట్లే కావచ్చును. ఏమైనా ఆవిషయము నాకంటె వారే ముందుగా తెలుసుకొన్నారు. కావ్యాలంకారచూడామణిలోను, కవిజనాశ్రయములోను అక్కరలగురించి చెప్పినచోట ద్విత్రిచతుర్గురు జనితగణములు రవీంద్రచంద్రగణములని ఉండుటచేతను, మొదటిరెండేసి గణములున్ను విడిచిపెట్టవలసినపని చెప్పకపోవుటచేతను, అక్కరజాతులలో వచ్చే రవీంద్రచంద్రగణములు కన్నడ లాక్షణికులు చెప్పిన బ్రహ్మవిష్ణు రుద్రగణములే అని తేలినది. అయితే, ఈవిషయము నేనిదివరకు గ్రహించక పోవుటచేత, అక్కరలలక్షణము కుదరక చిక్కులుపడియున్నానని శాస్త్రిలవారు వ్రాయడము మాత్రము వింతగా ఉన్నది. ఈవిషయము గ్రహించిన శాస్త్రిలవారుకూడా ఈలక్షణ గ్రంథములందు చెప్పిన ఇనేంద్రగణములతో మధ్యాక్కరల లక్షణము నిరూపించలేక ఎందుకు విపరీతమైన చిక్కులు పడవలసి వచ్చినదో తెలియలేదు. ద్విత్రిచతుర్గురు జనితగణములతో—అనగా కన్నడలాక్షణికులుచెప్పిన బ్రహ్మ విష్ణుగణములతో—సీతారామస్వామిశాస్త్రిలవారు మధ్యాక్కరలక్షణము నిరూపించి ఉంటే, నావాదము విడిచిపెట్టుకొందును. గణముల విషయములో "నన్నయ కన్నడ లక్షణము ననుకరించి ఉండునని వేదమూర్తి రాజగోపాలరావు పంతులుగారు ఊహించిరి. ఇది నాకు సమ్మతమే" అని ఛందోదర్పణమునకు నేను వ్రాసిన ఉపోద్ఘాతమందు చెప్పేఉన్నాను. కన్నడ లాక్షణికులు మన మధ్యాక్కరకు సరిపడియున్న తమ దొరె యక్కరలో 4 లేక 5 మాత్రల విష్ణుగణములే ఉండునని చెప్పినారు గనుక, ఈపద్యములకు సంబంధించినంతవఱకు వారి విష్ణుగణములున్ను అనంతుడు, అప్పకవి మొదలయిన మన తెలుగు లాక్షణికులుచెప్పిన ఇంద్రగణములున్ను నల, నగ, సల, భ, ర, త గణములే అయినవని చెప్పినాను. పోనీండి, వీటితో పాటు మగణ, సగములు కూడా చేర్చుకొని వన్నయాక్కరల లక్షణము శాస్త్రిలవారు నిరూపించగలిగి ఉంటే సంతోషింతును. అయితే, వారు అట్లు నిరూపించలేక, లాక్షణికులు ఎవరూ చెప్పని గణములు ఇంకా ఎన్నో చేర్చుకోవలసి వచ్చినది. వీరి మతమున ఏర్పడ్డ సూర్యగణాలు ఏడున్ను చూచినారు గదా. ఇకను ఇంద్రగణములగురించి వారు ఏమని చెప్పినారో చూడండి:

"ఇంద్రగణములు 4, లేక 5, లేక 6 మాత్రలు గలిగియుండి త్ర్యక్షరములో చతురక్షరములో నైయుండును" అని (19-వ పుటలో) వ్రాసి ఉండుటచేత,

(1) UUU (మ)
(2) IUU (య)
(3) UIU (ర)
(4) IIU (స)
(5) UUI (త)
(6) IUI (జ)
(7) UII (భ)
(8) IIUU (సగ)
(9) IUIU (జగ)
(10) UIIU (భగురు)
(11) IIIU (నగ)
(12) IUUI (యల)
(13) UIUI (రల)
(14) IIUI (సల)

(15) UU|| (తల)
(16) |U|| (జల)
(17) U||| (భల)
(18) |||| (నల)

అనే 18 గణాలున్ను ఇంద్రగణములుగా ఏర్పడినవి.

సూర్య:—ఇన్నిగణములు క్రొత్తగా తెచ్చిపెట్టుకొన్న సీతారామస్వామి శాస్త్రిలవారికి ద్విత్రిచతుర్గురు జనిత గణములలో మొదటివి రెండేసిగణములున్ను విడిచిపెట్టినారా లేదా అన్న విచారమెందుకు?

నేను:—"క్రొత్తగా తెచ్చిపెట్టుకొన్న గణము" లంటే సీతారామస్వామి శాస్త్రిలవారికి కోపము వచ్చినది. ఎవరయినా లక్ష్యమునుబట్టికదా లక్షణము చెప్పవలెను; నన్నయ మధ్యాక్కరలలో ఈగణము లున్నవనిన్ని తా మేమీ క్రొత్తగా కల్పించలేదనిన్ని కాబోలు వారు అనుకొన్నారు. అయితే, వారు క్రొత్తగా లక్షణము కల్పించి, లాక్షణికులు ఎవరూ చెప్పనిగణములు సూర్యేంద్రచంద్రగణములలో వారు క్రొత్తగా చేర్చుకొన్నప్పుడు వారు ఆ గణములు క్రొత్తగా తెచ్చిపెట్టినారంటే తప్పేమి?

సూర్య:—సరే; బోధపడినది. భారతం వ్రాతప్రతులు చూచి వారు తమ ఇష్టానిష్టములబట్టి పాఠములు సవరించి నిర్ణయించుకొన్నారు. అందులో కనబడ్డ గణములు పట్టికలో చేర్చుకొన్నారు. వాటినిబట్టి నన్నయ మధ్యాక్కరల లక్షణము కుదిరినదో లేదో చూచుకొమ్మన్నారు.

నేను:—బాగానే ఉన్నది. లక్ష్యమును బట్టి కదా లక్షణము ఏర్పడవలెను. అయితే, మనము నిరూపించిన లక్షణము సరిగా ఉన్నదో లేదో చెప్పవలసి వచ్చినప్పుడు కొన్నివిషయము లాలోచించవలసి ఉన్నది. నన్నయ ఈమధ్యాక్కరలను క్రొత్తగా సృజించినవాడు కాడు. అతనికిపూర్వము కన్నడవాఙ్మయమందు అక్కరలుండెను. వాటినిబట్టి ఇనేంద్రగణముల తీరు ఎట్లుండునో కొంతవరకు ఊహించగలము. కన్నడ లాక్షణికులను అనుకరించి అక్కరల లక్షణమును చెప్పిన మన తెనుగు లాక్షణికుల మతమునకు కేవలము విరుద్ధముగా సూర్యేంద్రగణప్రస్తారం చేయగూడదుగదా. మనకు కనబడినదెల్లా లక్ష్యముగా గ్రహించి లక్షణము చెప్పినయెడల ఆలక్షణమందు అతివ్యాప్తిదోషము దొర్లక తప్పదు. మనము తీసుకొన్నలక్ష్యములు సరియైనవో కావో చెప్పడము కష్టమైనప్పుడు మనము ఏర్పరచిన లక్షణము సరియైనదో కాదో చెప్పడముకూడా కష్టమే. అయితే సీతారామస్వామి శాస్త్రిలవారు చెప్పిన లక్షణమునుబట్టి చూస్తే ఏవచనమైనా మధ్యాక్కర గణలక్షణమునకు సరిపడవచ్చునని స్పష్టమయినది. అందుకు నిదర్శనముగా మీ మాటలే ఉదాహరించి చూపించినాను గదా.

సూర్య:—అవి కాకతాళన్యాయముగా సరిపోయి ఉండవచ్చును.

నేను:—మీ కింకా అట్టిసందేహ మున్నదండీ? సరే.........అయితే, సీతారామస్వామి శాస్త్రిలవారి వ్యాసములోని మొదటివాక్యములే చూడండి :—

ఆంధ్రవా|ఙ్మయములో|నగప|డుచున్న|| యక్క|రల|లక్షణముల వి|షయమున| ననే| కవిధము|| లగు వివా|దములు గల్గియున్న|వి వానిలోఁ|బ్రాచీ|నమధ్యా|| క్కరల ల|క్షణ మిం|దమిత్థమ్మ|ని నిర్ణ|యిం|చుటకు|వలనుప||డకున్న|ది|సామా|

* * * *

ఇందులో వారుచెప్పిన మధ్యాక్కర గణములు కుదిరి ఉన్నవో లేవో చూడండి. ఇదికూడా కాకతాళన్యాయంగానే సరిపోయి ఉండవచ్చునని మీకు తోచినయెడల, వారు మధ్యాక్కరకు చెప్పిన గణనియమమునకు విరుద్ధముగా ఏదైనా ఒకవచనము రచించగలరేమో చూచుకోవచ్చును.

సూర్య:—(కొంతసేపు ఆలోచించి, కాగితము మీద కొన్నివాక్యములు వ్రాసి చూచుకొని) ఇది నాకు అసాధ్యంగానే ఉన్నది. ఎట్లు వ్రాసినా, అందులో వారు చెప్పిన ఇనేంద్రగణములు కనబడుతూనే ఉన్నవి. రెం డింద్రగణములు, ఒక సూర్యగణము, రెం డింద్రగణములు ఒక సూర్యగణము వరుసగా ఏర్పడుతూనే ఉన్నవి. మన లాక్షణికులు చెప్పిన వృత్తములలో కొన్ని శాస్త్రిలవారు చెప్పిన లక్షణమునుబట్టి చూస్తే, మధ్యాక్కరలు కావచ్చును గాబోలు.

నేను:—కాకేమి? మాటకు—పంచచామరము, మందాక్రాంత, పృథ్వి, హారిణి, చంపకకేసరి, మత్త

కోకిల, కుసుమితలతావేల్లిత, నిశ, తరళ, వనమంజరి, మణిమాల, మేఘవిస్ఫూర్జితము, భూతిలకము, కవికంఠభూషణము, చంద్రకళ, అంబురుహ, ఉత్పలమాల, చంపకమాల, ఖచరప్లుతము, ప్రభాకలిత, కనకలత, కరిబృంహితము మొదలయిన వృత్తముల పాదములలో సీతారామస్వామి శాస్త్రిలవారు మధ్యాక్కర పాదమునకు చెప్పిన గణములు సరిగా కుదిరి ఉన్నవి. శిఖరిణి, హరనర్తనము, క్ష్మాహారము - వీటిలో వడినియమముకూడా కుదిరి ఉన్నది. చూడండి:—

ప్రజాతా|హ్లాదంబై|శిఖరి|ణియనా|| భాసుర|మగుక్ష
ఖ్యావిరా|మముశేఫ|సజ్యభ|రేఫంబుల్||హరన|ర్తనక్ష
క్ష్మాహారం|బుమనయ|తనర్తం|బుల్ చెంది||మనునునం|నంబై

సూర్య:—ఎక్కడ చూచినా మధ్యాక్కరలే కనబడుతున్నవి. ఇందు గలవందు లేదని సందేహము లేదు.

నేను:—ఒక్క మధ్యాక్కరలే కాదు; అక్కరలన్నీ అని చెప్పవచ్చును. మధ్యాక్కరలో చంద్రగణ ప్రసక్తి లేదు గనుక సీతారామశాస్త్రిలవారు చంద్రగణములకు కుదురుపరచిన 'అనుగమము' విమర్శించలేదు. ఈచంద్రగణములకు కన్నడ లాక్షణికులు పెట్టినపేరు రుద్రగణములు. ఇవి చతుర్గురు జనితములు గనుక 16 కంటె ఎక్కువలేవు. శాస్త్రిలవారు చంద్రగణములు 6, లేక 7, లేక 8 మాత్రలు గల్గియుండి చతురక్షరములో లేక పంచాక్షరములో నైయుండును అని చెప్పుటచేత 84 గణములు ఏర్పడినవి. ఏలక్ష్యములను చూచి సీతారామస్వామి శాస్త్రిలవారు ఈచంద్రగణములను నిరూపించగలిగిరో నాకు తెలియదు. 7 సూర్యగణములు, 18 ఇంద్రగణములు, 84 చంద్రగణములు గ్రహించినయెడల, ఎవవనమైనాసరే ఏఅక్కరైనా కావచ్చును.

సూర్య:—సరే; వాఙ్మయమంతా అక్షరమయమే కదా!

నేను:—అవును; మరియొక విచిత్రము. ఒక్కగణమే సూర్యేంద్రగణములు రెండున్నూ కావచ్చునని మన తెలుగు లాక్షణికు లెవరైనా చెప్పినారా? ఒక్కగణమే బ్రహ్మవిష్ణు గణములు రెండున్నూ కావచ్చునని కన్నడ లాక్షణికు లెవరైనా చెప్పినారా? సీతారామస్వామి శాస్త్రులవారు కుదురుపరచిన అనుగమమువల్ల 3 అక్షరములున్ను 4 మాత్రలున్ను గల గణములు సూర్యేంద్రగణములు రెండున్నూ కావచ్చును గదా. అనగా భ, జ, స గణములు మూడున్ను సూర్యగణములూ ఇంద్రగణములూకూడా కావచ్చునని తేలినది గదా.

సూర్య:—ఒక్కగణమే రెండున్ను కావచ్చునని వారు స్పష్టముగా ఎక్కడైనా చెప్పినారా?

నేను:—93 వ పుటలో చూడండి. ఇదిగో! "జగణమినేంద్ర గణములు రెండును గానోపునని గ్రహింపక కావలయు (భారత సంస్కర్తలు) సవరించియుందురు". అని స్పష్టముగా వ్రాసినారు.

సూర్య:—అయితే, జగణమూ ఇంద్రగణమయి, "జగ"మూ ఇంద్రగణమయితే, ఏదైనా మధ్యాక్కర పాదము గణవిభజనము చేసినప్పుడు ఎక్కడికి గణము పూర్తిగా అయినట్టు?

నేను:—ఏలాగు కుదిరితే ఆలాగే; సీతారామస్వామిశాస్త్రిలవారి మతమున,

"మొనసిరి మఱిపాండవ కౌరవ భేదమూల మిట్టిదయ" అనేపాదము ఎన్నివిధములుగా గణవిభజనము చేయవచ్చునో చూడండి:—

మొనసిరి| మఱిపాం| డవకౌ| రవభేద|| మూలమి| ట్టిదయ
మొనసిరి| మఱిపాండ| వకౌ| రవభేద|| మూలమి| ట్టిదయ
మొనసిరి| మఱిపాండ| వకౌర| వభేద|| మూలమి| ట్టిదయ

మరియొక విచిత్రం చూడండి:—

| UII | UUI | UI | IUI | UII | UU |
|---|---|---|---|---|---|
| భ | త | హ | జ | భ | గగ |

ఇది సీతారామస్వామి శాస్త్రిలవారి మతమున మధ్యాక్కరపాదము. దీనికి ఒక U (గుర్వక్షరము) చేర్చండి; అప్పుడు కూడా ఆయనమతమున అది మధ్యాక్కరపాదముగానే ఉంటుంది. అందులోని గణములు మారిపోయినా, శాస్త్రిలవారు చెప్పిన లక్షణము నిలిచే ఉంటుంది. చూడండి:—

| UII | UUI | UII | UIU | IIU | UU |
|---|---|---|---|---|---|
| భ | త | భ | ర | స | గగ |

దీనికి మరి ఒక లఘ్వక్షరము చేర్చినా, మధ్యాక్కరపాదముగానే ఉంటుంది! చూడండి:—

U|| UU| U|| U|U ||UU U|
భ త భ ర సగ హ

(ఈపాదము మరికొన్ని విధములుగా కూడా గణ విభజనము చేసుకోవచ్చును)

దీనికి ఇంకను మరి ఒక లఘ్వక్షరము చేర్చినా మధ్యాక్కర పాదముగానే ఉంటుంది సుమండీ!

సూర్య:—సరే, బోధపడినది. ఈలాగున ఎన్ని అక్షరాలు చేర్చవచ్చునో చెప్పండి.

నేను:—నాలుగక్షరాలకు మించిన ఇంద్రగణమున్ను మూడక్షరాలకు మించిన సూర్యగణమున్ను లేదని శాస్త్రిలవారు సూచించినారు గనుకను, పాదమందు 4 ఇంద్రగణాలు 2 సూర్యగణాలు ఉండునన్నారు గనుకను, 22 అక్షరాలయిన దాకా పాదము పొడిగించవచ్చును; గనుక, మొదట కనబరచిన 16 అక్షరాలపాదమునకు మరి 6 అక్షరాలు కలపవచ్చును. U||| UU|| U|| ||U| U||| UU—ఈగణాలకు U|| ||U కలిపినా మధ్యాక్కరపాద లక్షణము చెడిపోదు. చూడండి:—

| U||U | U|U| | |U| | U||U | UU| | ||U |
|---|---|---|---|---|---|
| భగురు | రల | జ | భగురు | తల | స |

ఇవి శాస్త్రిలవారు కదురుపరచిన అనుగమము వల్ల ఏర్పడిన గణాలే కదా!

సూర్య:—చాలా విచిత్రముగానే ఉన్నది. ఇటువంటి ఛందోలక్షణమునే నెక్కడా చూడలేదు. సీసపద్యములో చతుర్మాత్రా కేంద్ర గణము లుండ వచ్చును; లేదా "మందార మకరంద మాధుర్యమునదేలు మధుపంబు వోవునే మదనములకు" అని అయిదుమాత్రల ఇంద్రగణములు గల సీసపాదము లుండవచ్చును. పాదములోని మాత్రలసంఖ్య 30 మొదలుకొని 36 వరకు ఉండవచ్చును; కాని 30 మాత్రల సీసపాదము వ్రాసి దానికొక్క అక్షరమైనా కలపవలెనంటే వీలుపడదే. కలిపితే గణభంగమవుతుందిగదా.

నేను:—పద్యపాదమంతా చూడ నక్కరలేదు. గణముల సంగతి చూడండి. సీస గీతాదులకు కావలసిన 6 ఇంద్రగణాలలోను 4 మాత్రల గణములు రెండు ఉన్నవి; అనగా భగణము, నలము; 5 మాత్రల గణములు నాలుగు ఉన్నవి; అనగా నగము, సలము, రగణము, తగణము. భగణానికిగాని నలమునకుగాని ఒక లఘ్వక్షరము చేర్చిన యెడల, అది మరి ఇంద్రగణముగా ఉండనే ఉండునుగదా. 5 మాత్రలగణములలో దేనిలోనైనా ఒక లఘ్వక్షరము తీసివేస్తే, అది మరి ఇంద్రగణముగా ఉండనే ఉండదుగదా. కన్నడ లాక్షణికులు చెప్పిన బ్రహ్మ విష్ణు రుద్రగణాల నియమము చూచినా, మన తెలుగు లాక్షణికులు చెప్పిన సూర్యేంద్రచంద్రగణాల నియమము చూచినా ఇటువంటి పని సాధ్యంకాదని చెప్పగలము. వాటి వ్యవస్థ ఇంత చక్కగా ఏర్పడి ఉన్నది. అయితే, సీతారామస్వామి శాస్త్రిలవారు చెప్పిన సూర్యేంద్ర చంద్రగణముల వ్యవస్థ ఎంత అస్తవ్యస్తముగా ఉన్నదో చూడండి. "చిత్రాలు"—అనే శబ్దము ఇంద్రగణము. "విచిత్రాలు", ఇదికూడా ఇంద్రగణమేనట! "మసంబు" ఇది సూర్యగణమట! "మసం" ఇదికూడా సూర్యగణమే నట! మరియొక విషయము. లఘువు తర్వాత గురువుగల గణములు అనగా వగణ, జగణ, యగణములు, కన్నడ లాక్షణికులు తమ బ్రహ్మ విష్ణు గణాలలోగానీ, తెలుగు లాక్షణికులు తమ సూర్యేంద్ర గణాలలోగానీ, పేర్కొన్నారేమో చూడండి. ద్విత్రిచతుర్గురు జనితగణములలో "లఘువు మొదల లఘు విడవలయు" నని చెప్పినప్పుడు, ఈగణములకు ప్రవేశము ఎట్లుండగలదు? ఈగణములను పూర్వలాక్షణికులు చేర్చుకోకపోవుటకు కారణము లేక పోలేదు. వీటి నడకకున్ను రెండు లఘువులుగాని గురువుగాని మొదటనుండే గణములనడకకున్ను చాలా భేదమున్నది. లఘువు తర్వాత గురువుగల వగణ, జగణ, యగణ గణముల నడక మృదంగవాద్యములో ఎదురు దెబ్బవలె ఉంటుంది. గనుకనే, తక్కినగణముల తోపాటు వీటికిన్ని చోటిచ్చినయెడల పద్యము నడక పాడయిపోతుంది.

సూర్య:—లోగడ పరిషత్పత్రికలో ప్రకటించిన వ్యాసమందు సీతారామశాస్త్రిలవారు ఇన్ని సూర్య గణాలున్ను ఇన్ని ఇంద్రగణాలున్ను అనుశాసించినట్లు కనబడదే.

నేను:—గనుకనే అప్పుడు కొన్ని పాదములందు మాత్రలు సరిపడలేదని వారు వ్రాసుకోవలసి వచ్చినది.

ఇటీవల ఎప్పుడో వివిధములయిన ఈ గణములు గ్రహించి ఉంటారు. ఇప్పుడా పాదములకు లక్షణము కుదురుపడినదని వారు సంతోషిస్తున్నారు గాబోలు.

సూర్య:—కేవల వచనమందే మధ్యాక్కరకు వారు చెప్పినగణములు వరుసగా కనబడుతూ ఉంటే, ఏదువ్రప్రతిలో కనబడ్డ మధ్యాక్కరపాదమైనా లొంగక ఏమిచేస్తుంది.

నేను:—మరియొక విషయము. పద్యమునకునడక ప్రధానము గదా. దానిలో ఏదో ఒక నియతమైన లయ (తాళము, rhythm) ఉండవలెను. సీతారామస్వామిశాస్త్రిలవారు చెప్పిన లక్షణముచొప్పున మధ్యాక్కరలు రచిస్తే, విచిత్రమైన నడకలు గల పద్యములు రావచ్చును. 6 భగణాల మధ్యాక్కర, 6 జగణాల మధ్యాక్కర, 6 సగణాల మధ్యాక్కర, సర్వగణ సంకీర్ణమధ్యాక్కర అనగా వచనమువలెనే నడిచే మధ్యాక్కర—ఈవిధములుగా ఎన్నో నడకలుగల మధ్యాక్కరలు ఏర్పడవచ్చును. లక్షణకర్తకు పద్యము నడక బాగుగా పట్టుపడి ఉండవలెను గనుక, ఈలక్షణమును కల్పించిన సీతారామస్వామిశాస్త్రిలవారికి నన్నయ మధ్యాక్కరల నడక ఎట్లుండునని తోచినదో తెలుసుకోవలసి ఉన్నది.

సూర్య:—నన్నయ మధ్యాక్కరలలో ఏదో ఒక నియతమైన నడక ఉన్నదిగాని లేకపోలేదు. ఐతే ఒక్కపద్యమునకే వివిధములయిన నడకలు (తాళము, లయ) ఉండకూడదా?

నేను:—పద్యమునకు ఏ నడక అనుశ్రుతముగాను సుప్రసిద్ధముగాను ఏర్పడి ఉంటుందో ఆ నడకకు భంగముకలగకుండా ఉండేటట్లున్ను, ఆ నడకకు భిన్నమైన నడకలుగల పద్యములు ఏర్పడుటకు వీలులేకుండా ఉండేటట్లున్ను లక్షణము చెప్పవలెను. పద్యమునకు నడక ప్రాణమువంటిది; గనుక నడకలేని పద్యమునకున్ను వచనమునకు భేదముండదు. పద్యములలో దేని నడక దానికి నియతమై ఉంటుంది. దానికి భంగము లేకుండాచెప్పిన లక్షణమే లక్షణ మనిపించుకొంటుంది.

సూర్య:—అవును; అయితే సీతారామస్వామిశాస్త్రిలవారు ఈవిషయములు పాటించినట్లు కనబడదు. మధ్యాక్కర పాదమునకు వారుచెప్పిన లక్షణము ఏవచనమునకైనా సరిపోతూ ఉంటే, వారుచెప్పిన లక్షణము లక్షణ మనిపించుకోదు.

చాలా వేళ అయినది. మరియొకసారి కలుసుకొని తక్కిన విషయములు పరిశీలింతాము.

నేను:—అలాగునే... సీతారామస్వామిశాస్త్రిలవారు చెప్పిన లక్షణమునకు ఆధారమేమో తెలియదు; సరియైన ప్రమాణము కనబడదు; వారుచేసిన వ్యవస్థ చూడగా మైనముముద్దవలె నున్నది.

సూర్య:—వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిలవారు సామాన్యులు కారు; పెద్దపండితులు; ఇంత అవ్యవస్థగా లక్షణముచేసి ఉందురా అని మాత్రం సందేహము కలుగుతున్నది.

నేను:—నాకూ ఆసందేహము కలుగుతున్నది. నేను భ్రమపడి, వారి మతము తిన్నగా బోధపరచుకోకుండా ఉన్నానేమో? పోనీండి, వారి వాక్యములు మీకు మరియొకలాగున అర్థమవుతున్నదేమో చెప్పండి.

సూర్య:—మీకెట్లు అర్థమయినదో నాకూ అట్లే అర్థమయినది:

నేను:—ఆయన మతము మనము సరిగా అర్థము చేసుకొన్నదీ లేనిదీ తెలుసుకోవలెనంటే వారినే అడుగవలెను. సరే, మన చర్చ నలుగురికీ తెలియజేదాము. ఇందులో మన పొరపాట్లు ఏవయినా ఉంటే విచక్షణులు దిద్ది తెలియజేస్తారు.

మనము మరియొకసారి కలుసుకోవలెను. నేను విమర్శించవలసిన విషయములు ఇంకా అనేకముగా ఉన్నవి. నేనేమేమో వ్రాసినా ననిన్ని, నేను వ్రాసినది సుసంగతమై ఉండనందున విమర్శసహము కాదనిన్ని ఆయన వ్రాసినారు. వీటికి నేను చెప్పే సమాధానము విందురుగాని.

సూర్య:—అలాగునే మరియొకసారి కలుసుకొందాము.





# యామినీరమణీ—చంద్రదర్శనము

చెలికాని వేంకటనరసింహారావు గారు

శ్రీరవి పశ్చిమాచలవిహార మొనర్చుచునున్న వేళలన్
కైరవనేత్ర యొక్కతె వికాసితభూషలఁ దాల్చి నాథుకై
కోరి చకోరదూతికలఁ గొంకక పంచి వినీలకేశసం
స్కార మొనర్చి యందు ఘనకాంతిపరీతములై యొసంగునా
తారల పూలమాలికగఁ దాల్చి విలాసముతోడ నాబహి
ర్ద్వారమునొద్ద నిల్వ వనితాతనుకాంతులు గప్పె నెల్లెడన్
దీరని ప్రేమ నాతరుణి దృక్కుల దిక్కులఁ బర్వఁ జేసి వి
స్తారవియోగవారిధిని దాఁటఁగ లేక విచారమందుచున్
జేరగ రార! నాథ! 'యని చిత్తమునం దలపోయుచుండె న
వ్వారిజనేత్ర తన్వున నపారముదాన నలందు చందనం
బారకయుండియున్ దరుణి నారడి సేయఁ దొడంగెఁ జల్లనౌ
మారుత మగ్నికల్పమయి మాటికి మాటికి నేఁచసాగె "నే
తీరున నే భరింతు నిఁక దేనికినై తనుప్రన్ ధరింతు నా
కూరట యెట్లు గల్గు నయయో విరహానలమెట్లులింకఁ జ
ల్లారు'నటంచుఁ జింతిలఁగ నాకసమందున నిందుబింబ మొ
ప్పారఁగ యామినీరమణి యాననసీమ విలాసశోభితం
బై రహిమించె నామెకు నిజాత్మను సిగ్గొకయింత దోఁపఁగాఁ
జారెడిపయ్యెదన్ వడి భుజంబెనయన్ సవరించి లోనికిం
దారుచు నాథుఁజూడ తనతాపము వాయునటంచు నెంచ నా
తారలఱేఁడు కూరిమిని దన్నునయంగని లోని కేగి తాఁ
జేరునొ జేరఁడొకో యని చెచ్చెర నామెయుఁ దొంగిచూచెడిన్.






విద్వాన్ రెట్టి సాంబమూర్తిశాస్త్రి గారు

—౨

## మృచ్ఛకటికము-ముద్రారాక్షసము

(గతసంచిక తరువాయి)

మృచ్ఛకటికము రెండునాటకములై యుండి యుండుననియు, నెవరో యా రెండు గ్రంథములను గలిపి యొక గ్రంథముగాఁ దయారుచేసి యుందురనియు, ఈవఱకు మృచ్ఛకటికమును గూర్చి వ్రాయుచు నిరూపించియుంటిని. కావుననే మృచ్ఛకటికమను దశాంకపరిమితగ్రంథమున బీజాదులు సమముగా లేవు. రెండునాటకములుగాఁ దీసినచో నాటకబీజములు రెంటను సమముగానే యున్నవి. నాందీశ్లోకములవలనగూడ నీవిషయమే స్పష్టపడుచున్నదని నిరూపించియుంటిని. ప్రస్తావనలోని

"తయో రిదం సత్సురతోత్సవాశ్రయం
నయప్రచారం వ్యవహారదుష్టతామ్,
ఖలస్వభావం భవితవ్యతాం తథా
చకార సర్వం కిల శూద్రకో నృపః"

దానిలో పేర్కొనఁబడిన వన్నియు షష్ఠాంకప్రభృతిదశాంకపరిమితగ్రంథభాగములోనివే యనియు, దానినే శూద్రకుఁడు రచించెననియు మిగిలిన మొదటి యైదంకములను భాసుఁడే రచించియుండుననియు, చారుదత్తముచూచిన నీవిషయము తేటతెల్లమగుననియు నందే వ్రాసియుంటిని.

ముద్రారాక్షస మపూర్వనీతిప్రకాశకమై పాఠకులకు దుర్బోధమై తుదిని నత్యంతాశ్చర్యములను గలుగఁజేయుచుండును. అందాకవి యత్యంతనీతిశాస్త్రపారంగతుఁడై కామందకచాణక్యాది నీతిశాస్త్రనిష్ణాతవలెఁ గనుపించును. గ్రంథములోని కవిత్వము కాళిదాసకవిత్వమువలె మృదుమధురమై సరసభావసంపూరితమై వ్యర్థపదములుకానిదై యత్యంతానందదాయకమై విరాజిల్లుచున్నది. దానికితోడు నీయద్భుత కథాకల్పనము బంగారమునకు పరిమళము దెచ్చినట్లున్నయది. పాఠకమహాశయులందఱు నిట్టి గ్రంథరాజమును జూచి యానందించుట సహజమేకదా?

ఈకవియే నాటకబీజములను బీజబింద్వాదులను నాటకమంతటను సమముగా నిక్షేపించెనని తన ముద్రారాక్షసములోఁ గొంతకొంతగాఁ జెప్పియున్నాఁడు.

మృచ్ఛకటికమున షష్ఠాంకప్రభృతి దశాంకపరిమితకథాభాగమును గ్రహించినచో నందును బీజబింద్వాదులు సమముగాఁ గుదురునని క్రిందటివ్యాసములోనే వ్రాసియున్నాను. అట్టియెడ నీమృచ్ఛకటికముకూడ నీతిప్రధానమగు నాటకమే యగును. ముద్రారాక్షసము నీతిప్రధానగ్రంథమని యెల్లరకుఁ దెలిసియుండుటచే మరల నిచట వ్రాయ నక్కఱలేదు. ఈరెండుగ్రంథములను రచించినవారును రాజులే కాన వానిని రెంటిని జూచి కొంచెము పరిశీలించెదముగాక. వింతలేమైన జనించునేమో?

ముద్రారాక్షసమును సరిగా విమర్శించినచో నయ్యది యొకగ్రంథమున కనుకరణమని తేలకపోదు. స్వతంత్రగ్రంథమైనచో నట్లు మొదటియంకమే దురవగాహమై యుండఁజాలదు. కాన నయ్యది యొకగ్రంథము

ననుకరించుచున్న దనవలసియున్నది. అయ్యది మృచ్ఛకటికమున కనుకరణమేయని యీవ్యాసములో నిరూపించుచున్నాను.

చూడుఁడు: మృచ్ఛకటికములో నాభరణములే చారుదత్తుఁడు వసంతసేనను జంపెనని రుజువు చేసినవి. అట్లే ముద్రారాక్షసములో ముద్రతోఁ గూడినలేఖ రాక్షసామాత్యుఁడు ద్రోహియని నిరూపించినది. మృచ్ఛకటికమున విమర్శకుఁ డధికరణికుఁడు. ముద్రారాక్షసమున మలయకేతువు. మృచ్ఛకటికమున వసంతసేన చారుదత్తునిబండియెక్కి పుష్పకరండక జీర్ణోద్యానమునుగూర్చి క్రీడించుటకై వెళ్లుచున్నదని రక్షకభటాధ్యక్షుఁడగు వీరకునిసాక్ష్యము. అట్లే ముద్రారాక్షసమునఁ జాణక్య ప్రేరితాభరణముల సాక్ష్యము. మృచ్ఛకటికమున వసంతసేన చచ్చిపడియున్నదని వీరకుఁడు చూచివచ్చిచెప్పుట. ముద్రారాక్షసమున మలయకేతుతండ్రియగు పర్వతకుని రాక్షసుఁడే చంపినట్లు పాత్రభేదము కలిగి యొకదాని నొకటి యనుకరించుచున్నట్లు కన్పట్టుచున్నది. మృచ్ఛకటికమును ముద్రారాక్షస మనుకరించినదా ముద్రారాక్షసమును మృచ్ఛకటిక మనుసరించినదాయని యిప్పుడు విచారింపవలసియున్నది. దానినే నాశక్తికొలఁది విమర్శింప ప్రయత్నింతును.

మృచ్ఛకటికములోని నీతిప్రయోగము ముద్రారాక్షస నీతిప్రయోగ మంత దృఢమైనది కాదని యూహించుచున్నాను. మృచ్ఛకటికములోని నేరమును నిపుణముగా పరిశీలించిన కేసు కొట్టివేయవచ్చును. ముద్రారాక్షసమున నెంత నిపుణముగా నాలోచించిన నంతవిపులముగా శిక్షవిధించుచు తీర్పు చెప్పవలసియుండును. దానినిబట్టి మృచ్ఛకటికము మొదటిదనియు దానినిజూచి ముద్రారాక్షసము రచింపఁబడినదనియు నిరూపింపవచ్చును.

మఱియు మృచ్ఛకటికమును విమర్శకులందఱును B. C. 3 శతాబ్దములోనిదనికాని A. D. I. శతాబ్దములోనిదనికాని యనుచున్నారు. ముద్రారాక్షసము నందఱును 8 A. D. లోనిదని యనుచున్నారు. కాఁగా ముద్రారాక్షసము మృచ్ఛకటికమునుజూచి పుట్టినదన వచ్చును.

మఱియు మలయకేతుపరివారమంతయు చాణక్య ప్రేరిత కపటపరివారమే. మృచ్ఛకటికమున నిట్లు లేదు.

"చారుదత్త వినాశాయ కరోమి కపటం నవమ్,
నగర్యాంహి విశుద్ధాయాం పశుబంధమివ దారుణమ్.

అను మృచ్ఛకటికములోని శ్లోకము ననుకరించి

"కౌలూత శ్చిత్రవర్మా మలయనరపతి
సైన్ధవ స్సింధుషేణః,
కాశ్మీరః పుష్కరాక్షః క్షతరిపుమహిమా
వీరసింహో నృసింహః;
మేఘాఖ్యః పంచమోస్మిన్ పృథుతురగబలః
పారశీకాధిరాజో
నామా న్యేషాం లిఖామి ధ్రువ మహమధునా
చిత్రగుప్తః ప్రమార్ష్టు"

అను ముద్రారాక్షసశ్లోకము రచింపఁబడినది. మఱియు శ్రీచారుదత్తుఁడు వ్యవహారమండపమునకుఁ బోవుసందర్భములోని

"జ్ఞాతోఽపి కిన్ను ఖలు బంధనవిప్రయుక్తో
మార్గాగతః ప్రవహణేన మయాపనీతః,
చారేక్షణస్య నృపతేః శ్రుతి మాగతో వా
యేనాహ మేవ మభియుక్త ఇవ వ్రజామి"

అనుశ్లోకము ననుసరించి సందర్భానుసారముగా మార్చి

"భేతవ్యం నృపతే స్తత స్సచివతో
రాజ్ఞ స్తతో వల్లభా
దన్యేభ్యశ్చ వసంతి యేఽస్యభవనే
లబ్ధప్రసాదా విటాః
దైన్యా దుచ్ఛ్రయదర్శనాపలపనైః
పిండార్థ మాయాస్యత
స్సేవాం లాఘవకారిణీంకృతధియ
స్థానే శ్వవృత్తిం విదుః"

అని చెప్పియున్నాఁడు.

చందనకవీరకులవలెనే సిద్ధార్థక సమిద్ధార్థకులను ముద్రారాక్షసములో నిలిపెను. అపాపుఁడగు చారుదత్తునివలెనే నిష్కల్మషుఁడును ధీరుఁడునగు స్వామిభక్తిరతుఁడు నగుచందనదాసునకు మరణదండనము విధింపఁబడెను. వసంతసేనవచ్చి చారుదత్తుని విడిపించిన

ట్లమాత్యరాక్షసుఁడు వచ్చి చాణక్యునికి వశపడి చంద్రగుప్తమంత్రిత్వము నంగీకరించి చందనదాసుని విడిపించెను. ఇట్లీముద్రారాక్షసకథా భాగమంతయు మృచ్ఛకటికమును జూచి పుట్టినది. కాని యిందలినీతి దృఢపడుటకై సిద్ధార్థక జీవసిద్ధి భాగురాయణాదులను నిలిపి మంచి నిపుణముగా నీతిప్రయోగమును జేయించెను. మృచ్ఛకటికమున శకారపాత్ర తప్ప మిగిలినపాత్రములన్నియు సద్గుణవిరాజమానములని విమర్శకులకుఁ దెలిసియేయుండును. అట్లే రాక్షసుఁడుతప్ప మలయకేతుసమీపవర్తులందఱును చాణక్యప్రేరితులైన కపటులే యని తెలియవలసియున్నది.

ఇట్లన్నివిషయములలోను ముద్రారాక్షసము మృచ్ఛకటికము ననుసరించుచున్న దని గ్రహింపవలసియున్నదిగదా! ఇఁక నీగ్రంథములగూర్చి మఱికొన్ని యుదాహరణలు చూపవలసియున్నవి. కాని గ్రంథవిస్తరభీతి వానినన్నింటి నుదాహరింపక విడిచితిని.

మృచ్ఛకటికకర్త శూద్రకరాజని క్రిందటివ్యాసమున వ్రాసియుంటిని. ముద్రారాక్షసకర్త విశాఖదత్తుఁడనుమహారాజు. వీరిరువురును క్షత్రియపుంగవులే. కవితల్లజులే.

ముద్రారాక్షసమున విదూషకుఁడు లేఁడనియు మృచ్ఛకటికమునఁ గలఁడనియు, కొందఱు తెలుప వచ్చును. కాని మృచ్ఛకటికములోని విదూషకుఁడు విదూషకకృత్యము జరిపియుండలేదని సవినయముగా మనవి చేయుచున్నాను.

ముద్రారాక్షసము మృచ్ఛకటికమును షష్ఠాంక ప్రభృతి దశాంకపరిమితకథాభాగమునుమాత్రమే సంపూర్ణముగా ననుకరించినది కాని మొదటియైదంకముల ననుకరించినదికాదు. దానికిఁ గారణము ప్రత్యేకముగా మృచ్ఛకటికము(షష్ఠాంకప్రభృతి దశాంకపరిమితకథాభాగము) లభించుటయే యైయుండవచ్చును. కాకపోయిన మొదటి యైదంకములలోను జిత్రముగాఁ జూపినద్యూత చౌర్యాదులను ముద్రారాక్షసమందును సలుపఁ బోవునా? మొదటి నుండితుదిదాఁక యనుకరించినమహాశయుఁ డొక్క ద్యూత చౌర్యాది చిత్రప్రదర్శనముల ననుకరింపకుండ విడిచె ననుట యసంగతము కాకుండు నా? మఱియు నీయిద్దఱు కవులును రాజనీతిని ప్రకాశింపఁజేయు గ్రంథములనే చేసిరి. అందు మృచ్ఛకటికమును బదియంకముల నాటకముగానే గ్రహించినచో దారిద్ర్యద్యూత చౌర్యాదులు గూడ శూద్రకరచితములే యని యంగీకరింపవలయును. శూద్రకుఁడు చక్రవర్తియని యందే వర్ణింపఁబడియున్నది. అట్టి మహారాజునకు చేతిలో కానియైన లేక తినఁ దిండియుఁ గట్టవస్త్రము లేక దారిద్ర్యము ననుభవించుచు గౌరవనీయులకు వెలిఁగించుచు సంపన్నులనే వశీకరింపఁబడుచున్న నిరుపేద యవస్థ యెట్లనుభవములోనికి వచ్చెను? లేనున్న నాదారిద్ర్యము నట్లనుభవపూర్వకముగా నున్న ట్లెట్లు వర్ణింపఁ గలిగెను? ఇట్లే ద్యూతచౌర్యాదులనుబట్టియుఁ గూడ మన మూహింపవచ్చును. ఇఁక రాజనీతివిషయములు రాజులకందఱు కంటె నెక్కువగాఁ దెలియుననుట నిర్వివాదము. వారు రాజనీతియందలి యభిమానముచే తమగ్రంథములలో నారాజనీతిని నిలుపఁ బ్రయత్నించుట సహజమే. అంతియకాని తన కననుభూతములగు దారిద్ర్యము చౌర్యము మున్నగువానిని స్వానుభవముకలవానివలె నట్లు శూద్రకమహారాజు వర్ణించెననుట యసహజమును నసంగతమును నని మనవిచేయుచున్నాను. మృచ్ఛకటిక షష్ఠాంకప్రభృతి దశాంకపరిమిత కథాభాగమేయనియు మొదటియైదంకములును భాసరచితమైన చారుదత్తమనియు, శూద్రకుఁడు షష్ఠాంకప్రభృతిదశాంకపరిమిత కథాభాగమునుమాత్రమే రచించెననియు నీవఱకు వ్యాసమున వ్రాసియుంటిని. ముద్రారాక్షసమును బట్టి యీవిషయమే తేలుచున్న దని యిందు నిరూపించినాను. దీనిగూర్చి ప్రాచ్యపుస్తకపరిశోధకులు పరిశీలించిన నెచ్చటనైన షష్ఠాంకప్రభృతి దశాంకపరిమిత కథాభాగము మృచ్ఛకటికమను పేరితో దొరికిన దొరుకవచ్చునని యూహించుచున్నాను పరిశోధకులు పరిశీలింతురుగాక.

మృచ్ఛకటికములోని సౌభాగ్యములఁ గూర్చి యింకొకపరి ముచ్చటింతును.



# గౌతమీ స్రవంతి

గొల్లమూడి రామనాథము గారు

అనవరతంబు నాత్మఁ బరమాత్మఁ దలంచుచు నిర్వికారతన్
దనరెడు మౌనిమానస విధంబున నిర్మలమై ప్రశాంతమై
అనయము మంథరానిలమునై ప్రతిబింబితశ్యామలాంబరం
బనయి ప్రభాతవేళలఁ బ్రమోదముఁ గూర్తువు సాత్త్వికాకృతిన్.

మ. పరమప్రేమరసార్ద్రమై, ముదితమై, భావింపఁ జింతాపరం
పరఁ గల్లోలితమౌ గృహస్థసుమనఃపద్మంబు మాక్కిన్ రయో
ద్ధురతాయాతసమీరసంహతి సముద్భూతోన్నతాభంగశీ
కరఫేనాంచిత మౌచుఁ బొల్తు సుభగాకారంబునన్ సందెలన్.

ఉ. పావనమూర్తి! నీయుదయభాగ్యము గాంచుట నాసికాపురం
బావిధి తీర్థరాజమయి వాసికి నెక్కె భవత్స్రవంతి యిం
పావహిలంగఁ గాలిడుట నాంధ్రవసుంధర ధన్యయయ్యె శో
భావహనారికేళపనసామ్రకనత్కదళీద్రుమాళికే
ళీవనరాజమై ప్రకృతిశ్రీవిభవోజ్జ్వలలాస్యరంగమై.

చ. మహితుఁడు సత్తపోధనుఁడు మాన్యుఁడు గౌతమసంయమీంద్రుఁ డీ
మ్మహిఁ గొని తెచ్చి నిల్పెనట మన్ననమై మునిసత్తకంబు లో
కహితనివిష్టచిత్తమునఁ గైకొనినారట వేల్పుదంపతుల్
రహి నిను మెట్టినారట చిరమ్ముగ భారతులెల్ల భక్తిమై
నహరహముల్ భజింతురట హా! మఱి భాగ్యమనంగ నున్నదే?





# నిరీక్షణము

'చంద్రమౌళి'

అది శరత్కాలము. పాలవెల్లివంటి చంద్రుని వెన్నెల కన్నులపండువుగా ఉన్నది. నేను దొడ్డిలో కుర్చీవేసికొని కూర్చున్నాను. నాముందు రెండుగజాలదూరములో ఉన్న పిల్లఅరటిచెట్లు ఆవెన్నెలలో చూచుటకు ఎంతో ముచ్చటగనున్నవి. చల్లని పిల్లగాలి వీచేటప్పుడెల్ల మిలమిలలాడుతు ఊగుతూ ఉన్న ఆకులు శాంతిగీతము పాడుతున్నవా అన్నట్లు ఉన్నది. వాటికికూడ ఆమనోహరమైన వెన్నెలలో ఆనందము అనుభవించుటకు శక్తి ఉన్నదేమో అనిపించినది. నా కుర్చీకి రెండుప్రక్కల నవనవలాడుతు కన్నులకు ఇంపుగా పెరిగిన గోరింటమొక్కలు కలకలలాడుతూ ఉన్నవి. ఆవెల్లవెన్నెలలో ఆగోరింటపువ్వులసొగసు ఏమని చెప్పను? ఎరుపు-తెలుపు: సగముఎరుపు-సగము తెలుపు-రంగురంగులపువ్వులు: అన్నీ పువ్వులే కాని ఆకులు కనబడుటయే లేదు. పగలు పూసిన గోరింటపువ్వులు ఇంకా రాలిపోక నన్ను చూచి మందహాసము చేస్తూ ఉన్నవి. ప్రతిపువ్వు, ప్రతిఆకు నాకు ఏదో రహస్యము చెప్పుతూ ఉన్నట్లు తోచినది. చెవి ఒరగా పెట్టుకొని ఆలకించుట మొదలుపెట్టినాను. నావైఖరిచూచి చంద్రుడు నవ్వుతూ ఉండెనేమో నేను కనిపెట్టలేదు. ఆతేటవెన్నెల తేటు చూచినా, పిల్లగాలిలో ఉయ్యాలలూగే ఆయాకులరీతి చూచినా, కలకల విరగబడి నవ్వే ఆపువ్వుల విలాసము చూచినా ఇట్టిదని చెప్పుటకు వీలులేని ఒక ఆనందతరంగము పుట్టినది. ఆరాత్రియంత అందముగా అంతమనోహరముగా ఏరాత్రీ కనబడలేదు. ఏమి ఆనందము! ఏమిహాయి! ఆహా అనిపించినది.

ఎన్నిమారులు చూచినా తనివితీరని ఆప్రకృతి సౌందర్యము వేయికళ్లు పెట్టుకొని ఆనందిస్తూ ఉండగా నాస్నేహితుడు విశ్వనాథరావు మాట జ్ఞాపకము వచ్చినది. అతడు మంచి వ్రాతకాడు. కాస్తో కూస్తో కవిత్వము కూడ అల్లుతాడు. అతడు వ్రాసినపుస్తకములు నాదగ్గర కొన్ని ఉన్నవి. అవి తీసిచూడవలెనని బుద్ధిపుట్టి ఆపుస్తకములకట్ట, ఒక హరికేన్‌లాంతరు తీసుకొని వచ్చితిని. నాకున్న ప్రక్క బల్లమీద లాంతరు పెట్టి కట్టవిప్పి ఒకొక్కటే చూచుట మొదలుపెట్టితిని. ఆకట్టలో కొన్నిపుస్తకములు అమ్ముడైనా, మరికొన్ని ఇంకా అమ్ముడుకావలసి ఉన్నవి. నా చేతనైనన్ని గ్రంథాలలో ఒకటో రెండో నేనే అమ్మివేయించినాను. ఒక పుస్తకము నాకు కృతియిచ్చి ఇచ్చినాడేమో. మంచి వాడు. నాస్థితికి అతడుఎప్పుడూ చెంగ పెట్టుకొని వీనిని బాగుచేయుట ఎట్లుఅని ఆలోచిస్తూ ఉండేవాడు. నీతులు చెప్పేవాడు. ననవుచేతనే అనుకొండి. అతడట్లు చెప్పినప్పుడెల్ల నాకు కోపమెత్తుకొని వచ్చేది. ఒక్కొక్కప్పుడు నేను తూలుగా కూడ మాట్లాడేవాడనేమో. అతని లోకవిచిత్రచర్య. ఉన్నవాడు ఉన్నట్లుగా ఒకనాడు మాయమైనాడు. కారణము తెలియదు. అతడు కనబడుటలేదనే సంగతి తరువాత నాకు ఎప్పటికోకాని తెలియలేదు. అతనిని గురించి తలచుకొనినప్పుడెల్ల నాకు విచారము ఒక్కసారిగా వస్తూ ఉంటుంది. ఇప్పటికీ అప్పటికీ అతనిజాడ తెలియనే లేదు. అదేపోక పోయినాడు. ఇందుకు నేను కారణభూతుడను కానుకదా అనుకొంటూ ఉంటాను.

ఆపుస్తకాలకట్టలో అమ్ముడుకాని పుస్తకములు వెదకుతూ ఉండగా 'వ్రజభుజంగము' అనేపుస్తకము కనబడినది. అదిబాగా ఉంటుంది. చదివి వినిపిస్తాను అని అతడు ఎన్నోమారులు అంటూవచ్చినాడు. కాని ఆరోజులువేరు - నిత్యకల్యాణము; పచ్చతోరణముగాను. నాకు ఇట్టిగ్రంథాలు వినుటకు అవకాశమెక్కడిది? రాత్రింబగళ్లు నాసొంతపనితో నాకు తీరిక అయ్యేదికాదు. అట్టిది ఇతనిపుస్తకము వినుటకు తీరిక ఎక్కడ? కాని దీనిని అతడు ఎందరికో చదివి వినిపించినాడు. విన్నవాళ్లు అందరూ చాలా మెచ్చుకొన్నారట. అచ్చువేయించ వలసినది అని చాలా ప్రోత్సహించినారట. కాని బీద

వాడు: పొట్టగడవడమే కష్టముగా ఉన్నప్పుడు అచ్చు కూడ ఎక్కడ? అందుచేత అతడు వ్రాసినగ్రంథములు ఎవరైనా వింటేనే చాలును అని తృప్తిపడేవాడు పాపము.

ఆపుస్తకము చదువవలెనని బుద్ధిపుట్టినది. దాని లోని పుటలన్నీ అకటావికటముగ చెదరిపోయినవి. చెదరినవన్నీ ఒకదరికి చేర్చినాను. ప్రకరణాలే ఎగిరి పోయినవి. కొన్ని అయినా దొరకుతవేమో అని కట్ట కట్టంతా చాలాసారులు వెదకినాను. ఎంతవెదకినా కార్యము లేకపోయినది. ఉన్న పుటలైనా కొన్ని చిరిగి పోయినవి; కొన్ని నలిగిపోయినవి. అవి అన్నీ చేర్చి చూడగా అది ఏడవప్రకరణము అయినది. అది ఇట్లున్నది.



ఊరంతయు నట్టుడుకిన ట్లుడికి పోవుచున్నది. హంతకులజాడ లేమియుఁ దెలియుటలేదు. పోలీసువారు వేయికన్నులతోఁ బురమంతయు గాలించుచున్నారు. ఇప్పటికీవిధముగ నాలుగైదు దినములనుండి సర్వథా ప్రయత్నించుచున్నను పోలీసువారి చేయి ఇంతవఱ కెవ్వరిమీఁదఁ బడలేదు. జరిగినదారుణవధకుఁ గడుంగడు భీతిల్లి పురజనులు సందెచీఁకటి పడునప్పటికే తలుపులు మూసికొని వీథులలోనికి రాత్రులువచ్చుటకు జంకుచుండిరి. కాని పోలీసువారికిఁ గొందఱి మీఁద ననుమానము కలదనియు, వారిని ద్వారలోఁ బట్టికొందురనియుఁ బ్రవాదములు మాత్రము దట్టముగఁగలవు.

ఇట్టి పరిస్థితులలో నొకనాఁటి సాయంకాలము మహేంద్రపురమునకుఁ బశ్చిమదిశనున్న పద్మాకరతీరమునంగల మామిడితోఁట లోనుండి నడిమివయస్సుగల యొకవర్చస్వి యటునిటుఁ బరికించుచు మెల్లమెల్లన నరుగుచుండెను. సన్నని సేలము ఉత్తరీయమును, ఉప్పాడదోవతియు, 'ఫ్లాల్లుషర్టు'ను ధరియించి, 'టెన్నిస్‌బూట్సు' తొడుగుకొని, చేత నొక మిలిటరీబెత్తము పట్టుకొనిన ఆయన కులీనుఁడనియు, నుద్యోగస్థుఁడనియుఁ జూచువారికిఁ దోఁచకమానదు. ఆతనిదృష్టి యాతనికంటికిఁ గనఁబడువస్తువుమీఁద నుండలేదనియు, మధ్య మధ్య శిరము పంకించుచుండుటం బట్టి యాతఁడు దీర్ఘాలోచనాపరుఁడై యుండెననియు నాతనిం గాంచినంతనే సులభముగఁ జెప్పవచ్చును.

ఇట్లు పోవుచుండిన యావర్చస్విని చెఱువునకు నీళ్ళుముంచుకొనుటకువచ్చిన కమల చూడలేదు. అప్పటికప్పుడే ప్రయాససాధ్యమైన దినప్రయాణమును జాలించి కర్మసాక్షి పశ్చిమదిశ నేఁగుచుండెను. క్రమక్రమముగ వ్యాపించిన నీరెండ రసాల వృక్షశాఖాగ్రముల వ్రాలి చివుళ్ళకు మెఱుఁగులు వెట్టుచుండెను. దుష్టసంకల్పము పవిత్రజీవితమును మసకపఱుచునట్లుగనే యనతికాలమునఁ దమస్సువిజృంభించి దిగ్వీథిని నలుపు చేసెను. ఇట్టి సమయమునఁ గమల నీళ్ళు

ముంచుకొని వెళ్ళక దిక్కులు పరికించుచు నెవ్వరి
కొఱకో యెదురుచూచుచు నా చెఱువు
రేవులో నిలువంబడియుండెను. దీర్ఘాలోచ
నానిమగ్నురాలై యున్న యారాజేశ్వరరావు
కమలను జూడకపోలేదు; కాని యామెకు గన
బడకుండ నొక చెట్టుచాటున నామెకు రేవు
ననే కూరుచుండి యాతఁడామెను బరికించు
చుండెను. ఎందులకో తెలియదు. ఆ మావాస్య
యగుటచేతఁ జీకటికి నాఁడు పర్వదినము.
కమల చూచిచూచి యెంతకు నెవ్వరు రాక
పోవుటవలననో, మరియే కారణముననో ఖిన్న
మనస్కయై నీళ్ళుముంచుకొని యింటికిఁ బోవుచుం
డెను. ఇంతలో నొక పనిదాసి వచ్చి కమలను
జూచి దిక్కులిటునటు బరికించి యామెకేదో
యొక యుత్తరమిచ్చెను. కమల దానిని
నెమ్మదిగ రైక జేబులో దాఁచి 'పనీ! నిన్న!
ఇంత ఆలస్యము చేసితివి? రెండుదినములు
నుండి ప్రతిదినము నీవేళ కిక్కడికివచ్చుచు
నేమిసమాచారము దెత్తువోయని యాత్ర
ముతో నీకొఱ కెదురు కన్నులు చూచుచుం
టిని. నీవు నిన్నను మొన్నను రాలేదెందు
వలన?' అని యడిగెను.

'అమ్మా! మీకుఁ దెలియదు. రామచం
ద్రరావుగారి మీఁదఁగూడఁ బోలీసువారికను
మానముతగిలిన దనియు, దీనినిగుఱించి
యింకను బోలీసులు లోఁతుకై యటకుఁ బ్రయ
త్నించుచున్నారనియుఁ దెలియుచున్నది.
అందువలన నిట్టి పరిస్థితులలో నిచ్చటనుండుట
సముచితము కాదని నిన్నటిదినము వారు
చెన్నపురి వెళ్ళినారు. వెళ్ళుచు నీయుత్తరమును
వ్రాసి దీనిని మీకు భద్రముగ నందీయవలె
నని చెప్పినారు. ఊరిలో నెంత గందరగోళముగ
నున్నదో మీకేమి తెలియును?'

'అయితే రామచంద్రరావుగారు ఎప్పుడు
మఱలి వచ్చెదరు?'

'ఇక్కడి గందరగోళము శాంతింప
వలెను.—అమ్మా! ఇవియన్నియు నిప్పుడేల?
పోలీసు ఇన్స్పెక్టరుగారు నీకేసు ఆనోటీ తీయు
టకై రహస్యముగ నూరివెంటఁ బలుమందిని
విచారించుచున్నారట. ఈ మాటమాటాడిన నేమి
యుపద్రవము వాటిల్లునో! అతిప్రసంగ ప్రసం
గము చేయరాదు. పోదము.'

నీ రిట్లు మాటాడుచుండ నింతలో నిరు
వురు విద్యార్థులు కాళ్ళుకడిగికొనుటకై రేవుకు
వచ్చిరి. వారిని జూచినంతనే కమలాపన్నమ్మ
లిరువురు సంభాషణమును చాలించిరి. విద్యార్థు
లనుజూచి కమల తలయెత్తుకొని యొయ్యార
ముగ నింటికి దిరుగుచెంచెను. ఇంతలో నామె
పోవుదారిలో మ్యునిసిపలులాంతరు నీడను
నిలుచుండిన యిరువురిలో నొకఁడు రెండవ
వానితో "సీతాపతీ! ఎల్లప్పుడు గుమ్మముకొద్ద
నిలుచుంబడి దారింబోవువారిపై పదేవిధముగఁ
జూచుచుండునంటివే నీ ఈటక్కులాడి నేఁ" అని
నవ్వుచుండెను. ఆ ముక్క కమలకు వినఁబడక
పోలేదు. అందుల కామెకు నవ్వువచ్చెను కాఁ
బోలును, ఒయ్యారమొలుకునట్లు నవ్విన యా
సందర్భమున నిండె యొక ప్రక్క కొరిగి
నీళ్లు పైఁట, చెఱఁగుపై నొలికి చీర చెఱఁ
గంతయుఁ దడిసెను. ఎచ్చటినుండియో వెనుక
నుండి వచ్చుచున్న గోవిందరావుగా రీమె

యొయ్యారమును, నీళ్లోలుకుటనుజూచి పెద్ద నిట్టూర్పుఁ బుచ్చి ఓరగ విసురుగ నడచి పోయెను. కమల యాగోవిందరావుగారినిజూచి యుండఁబోలును యానుగూడఁ ద్వరితగతినింటికిఁ బోయెను. ఇప్పుడామె నడకవిసురేకాని యొయ్యారము కనిపింపలేదు. ఈమె రేవునుండి వెళ్లిపోయిన కొంతసేపటికి రామేశ్వరరావు గారు చెట్టుచాటునుండి 'దొరకెనిదిరా కీలకము' అనుచు లేచి నడివడిగఁ బురమువంక వెళ్లెను.

గోవిందరావుగారింటికి వచ్చి కమలను పిలిచి 'ఏమే! మధ్యాహ్నము నీవెక్కడికి వెళ్లితివి?' అని సక్రోధముగ నడిగెను.

'ఎక్కడికి వెళ్లలేదు'

'తెలిసినదిలే నీసంగతి—నేనిదివరకు నుంచి కనిపెట్టుచునేయుంటిని. కాక నావలె నింతనయమున మిరాంతనిచ్చిన గొంతుకోసి పెంపుడి చేసి కొనినవారిలో నెవ్వఁడపడినవా గదా?' అని గోవిందరావుగారు తోకగాలునలేచి యెచ్చటికో వెళ్లఁబోవుచుండ నింతలో పోస్టుమానువచ్చి టెలిగ్రామునిచ్చి వెళ్లిపోయెను. తెరచిచూడ టెలిగ్రాము నందిట్లున్నది.

'వ్యవహారము మించెను చెయిదాఁటలేదు. ఆఁకట్టియుంచినాను. తక్షణము బయలుదేరవలసినది.'

మూర్తి

ఇది చూచుకొని గోవిందరావు అప్పటికే ప్యాసెంజరు వచ్చువేళ యగుటవలన నింట భోజనముచేయకయే 'నేనుబెజవాడ వెళ్లివచ్చెదను,'అని కమలతోఁ జెప్పి, 'భోజనముచేయుఁ'డని యామె యెంతచెప్పినను వినక చిన్న ట్రంకుపెట్టె తీసికొని వెళ్లిపోవుచు—'ఇఁక నీ యిష్టము. ఇంటికి నీవే రాణివికదా'అని దీర్ఘ నిశ్వాసమును వదలి గడపదాఁటెను.

*  *  *  *

ప్రకరణమంతా చదివినాను. పూర్వాపరసందర్భములు తెలుసుకోవలెనని కుతూహలము ఎక్కువయినది. మిగతప్రకరణములు దొరకుతవేమో అనే ఆశతో పురల కట్ట అంతా తిరగవేసినాను. కనపడలేదు. మిగత ప్రకరణములు పోయినందుకు చాలా విచారించినాను. పూర్వకథ ఎట్లా ఉంటుంది? ఉత్తర కథ ఎట్లుఉండవలెను? అని ఆలోచించినాను. ఆలోచిస్తే సరా? ఎట్లుంటుందో ఎట్లుండవలెనో అది వ్రాసేవానికి తెలియవలెను. కాని ఆప్రకరణములోని సంగతులు ఆధారము చేసుకొని కథ అల్లితే బాగుండును అనుకొన్నాను. కాని ఇంతవరకు ఎప్పుడూ ఇట్టి కథా కర్తృత్వము ఎరిగిన వాడను కాను. ఇందుకు సాధనము ఏమిటి? అని ఆలోచిస్తూ చంద్రుని చూసి చూస్తున్నాను.

ఎక్కడనుంచి వచ్చినవో చూస్తూచూస్తూ ఉండగా మేఘాలువచ్చి శరచ్చంద్రుని కమ్మివేసినవి. ఇప్పటివరకు నవ్వుతూ ఉన్నచంద్రునికి ఎంతలో ఆపద వచ్చినది! ఇంతేకదా లోకవృత్తము! ఉత్తరక్షణము ఎట్లా ఉంటుందో మనకు తెలియదుకదా అనుకొన్నాను. ఆమేఘాలపట్టు తప్పించుకోవలెనని చంద్రుడుగిజగిజలాడుతూ ఉన్నాడు. వెన్నెల మందగించినది. చంద్రుని స్థితికి లోకమంతా శోకాకులము అయినదా అనిపించినది. గొప్పవాని ఆపద లోకమునకు దుఃఖహేతువుకదా! అనుకొన్నాను. మబ్బుతునక చుక్కను మ్రింగితే కించిత్తు అయినా లోకమునకు లోటురాదు.—ఏవో ఇట్టి ఆలోచనలు బైలుదేరినవి. దృష్టి చంద్రునిమీదనే ఉన్నది. మరొకధ్యానములేదు పుస్తకము-కథ: ఇది కూడ మరచినాను. తపస్సమాధిలో ఉన్నట్టుఉన్నాను. అంతలో సంభవించిన ఆమార్పు, ఆస్థితి చూస్తే కడుపులో ఏదో బెంగపడినట్లు అయినది. 'ఏదో దిగులు ఆహా! ప్రకృతిఎంతలో వికృతిగా మారినది! క్షణభంగురము

ఎక్కువైనది: సందడి హెచ్చినది. ఇరుగు పొరుగువారు అంతా గుమికూడినారు. ఏమిటంటే ఏమిటన్నారు. అనోటా ఆనోటా నా సంగతి అందరికీ తెలిసినది. "సానిది సిఫార్సా? వెంకట్రాయుడుగారికి అవతల పెద్దమనుష్యుడు ఇయ్యవలసిన బాకీకి ఈయన జామీనా?" అని కొందరు నవ్వినారు. 'సానిసంపర్కమునకు ఇట్టి సౌభాగ్యాలు గాక ఇంకేమి ఉంటవి?' అని కొందరు వెటకారించినారు. 'శాస్తి కావలసినదే. ఎంతదుర్మార్గుడు ఎంతదుర్మార్గుడు! నిక్షేపమువంటి భార్యను విడిచిపెట్టి, పెద్దలు గడించిన ఆస్తి అంతా ఊడ్చిపెట్టిన నిర్భాగ్యునికి శాస్తి కావలసినదే' అన్నారు కొందరు. 'ఎంత పోతరించినా కళ్లు అంత [illegible]ద పెట్టుకొని తిరగకూడదు' అని మందలించినారు కొందరు. ఒకటికాదు; రెండుకాదు. ఇట్లు నలుగురూ నాల్గుమాటలూ అన్నారు. కళ్లనుంటు నీళ్లు కాల్వలు కట్టుతున్నవి. వెంకట్రాయుడుగారు తొందర చేస్తున్నారు. కష్టసుఖములు అనుకొనేవి మనంతట మనము తెచ్చుకొనేవేకాని పైనుంచిరావు అనుకొన్నాను. దైవమన్నదిలేదు; మనుష్యుని సుఖదుఃఖములకు మానవుడే కర్త అని గట్టినమ్మిక కలిగినది. దారిపోవు కన్నయ్యకూడా 'గొప్పోరు, గొప్పోరంటారు. గొప్పోరిసంగతులు ఇల్లా ఉంటాయి' అన్నాడు. ఎప్పుడైతే ఒకరి సృష్టిలో పలచన అయినానో అప్పుడే లోకమునకంతకు పలచనైతిని కదా అనుకొన్నాను. ఇట్టి ఆలోచనలు అప్పుడు తట్టినమాత్రను ఏమిప్రయోజనము? చేయి కాలిన తరువాత ఆకులు పట్టుకొంటే కార్యమేమిటి? వ్యవహారము చేయి దాటిపోయినదనుకొన్నాను. డబ్బు ఉన్నన్నినాళ్లు అంతా నా చుట్టూ తిరిగేవాళ్లే; నేను ఏపని చేసినా అంతా మెచ్చుకొనేవాళ్లే. ఇప్పుడో అంతా నాచర్య నిందించేవాళ్లే; నన్ను చూచి దూరదూరమునకు తొలగేవాళ్లే; జగమంతా డబ్బులో ఉందికదా అనుకొన్నాను.—ఇంతలో ఎవరో ఎవరికో 'ఆయనే శ్యామలరావుగారు' అని చూపెట్టినారు. క్రింద చూస్తూ దిగాలుపడి నేను నుంచున్నాను. 'నాయనా! అనుభవము మీదకాని మంచిచెడ్డలు తెలియవు' అని ఒక వృద్ధుడు [illegible] వెంకట్రా[illegible] ఎవ్వరితోనూ అనలేదు.

ఇట్టి సమయములో అచ్చటికి ఒకస్త్రీ పరుగెత్తుకొనివచ్చెను. అది నన్నుచూచి గుండెలు బాదుకొంటూ వెళ్లిపోయినది. దానిని ఎక్కడనో చూచినట్లు నాకు జ్ఞాపకము. మరికొంతసేపటికి నన్ను పట్టుకొనుటకు వచ్చిన వారిలో ఒకరో ఇద్దరో ఆస్త్రీ వెళ్లినవైపు వెళ్లిరి. ఎందుకో తెలియదు. ఇంతసేపూ ఆస్త్రీ ఎవరా అని ఆలోచిస్తూనే ఉన్నాను. తెలుపుతీసినవాడను తీసినట్లుగానే నిలబడిపోయినాను. కదలలేదు. మెదలలేదు. వెంకట్రాయుడుగారు నావద్దకువచ్చి నాచెయ్యి పట్టుకొన్నారు. తేరిపార నాముఖము తేరిచూచి 'ఏమిటి? సొమ్ముమాట ఇస్తారా లేదా?' అని ఒక్కఉరుము ఉరిమినారు. విచారాయత్తచిత్తముతో ఉన్న నాకు ఒళ్లు ఝల్లుమన్నది. ప్రాణాలుపోయినవనుకొన్నాను. ఇంతలో ఎవరోవచ్చి వేంకట్రాయుడుగారిని అవతలకు ఎందుకో పిలుచుకొనివెళ్లినారు. పిదప ఏమిజరిగినదో నాకు తెలియదు. నాతో ఏమీ చెప్పకుండానే తెల్లవారకట్ల నక్షత్రముల లాగు ఒక్కరొక్కరే అంతర్హితులైనారు. కారణము ఆలోచించినాను. కాని ఏమీ నాబుద్ధికి తట్టలేదు.

## ౩

అంతా తుపానుసద్దు అణగినట్లు అణగిపోయినది. ఆరాత్రి వెంకట్రాయుడుగారు అంత గందరగోళముచేసి నన్ను ఎందుచేత వదలిపెట్టి వెళ్లిపోయినారా అని చాలా విమర్శించినాను. కారణము తెలియలేదు. నేను పూచీపడ్డబాకీ ఎవరో తీర్చివేసినారని తరువాత నాకు తెలియవచ్చినది. అంతా నన్ను ద్వేషిస్తూనే ఉన్నప్పుడు నామీద ఇంకా ఇంత అకారణప్రేమ ఎవరికి [illegible] అనుకొన్నాను. ఇది నిజమా అబద్ధమా అని శంక [illegible]నది. అబద్ధమైతే నాకు ఆయననుంచి వి[illegible] ఎ[illegible] అందువలన ఇదినిజమే అయియుండును [illegible] అని నాలో నేను మరల సమర్థించుకొన్నాను. అయినా దీని నిజము ఏదో తెలుసుకోవలెనని ఒకనాడు ఉదయమున వెంకట్రాయుడుగారి యింటికి బయలుదేరినాను. [illegible] అడుగుపెట్టునప్పటికి [illegible] ఆయనే [illegible] వచ్చినారు. చిరునవ్వు నవ్వుతూ ఉన్నది [illegible]. [illegible] నన్ను "శ్యామలరావుగారూ మిమ్ములను [illegible] కష్ట పెట్టినాను. క్షమించండి. [illegible]

మయినది. ఇక మీకూ మాకూ ఏవిధమైన పేచీలూ లేవు. ఎప్పటివలె మనముమరల స్నేహితులమేసుమండీ” అన్నాడు. అప్పుడు అదివరకు నా చెవినిబడ్డసంగతి నిజమే అనుకొన్నాను. పెద్దబరువు వదలినదని సంతోషించినాను కాని నావిముక్తికి తోడ్పడిన మహాత్ములు ఎవరో నాకు తెలియలేదు.

‘మీకు రావలసినసొమ్ము’ అన్నాను.

‘ఒకరు ఇచ్చివేసినారు మీపక్షమున’ అన్నారు ఆయన.

‘నామీద ఇంతఅకారణముగ దయచూపినవారు ఎవరో నేను తెలుసుకోకూడదా?’

‘వారు ఎప్పుడూమామీకు ఎరిగినవారే. అట్టివారు మీకు చెప్పితేమాత్రము ఏమి తెలుస్తుంది?’

‘నేను ఎరుగనివారికి నామీద ఇంతదయ ఎట్లు వస్తుంది?’

‘మీరు వారిని ఎరుగకపోయినా వారు మిమ్ములను ఎరుగుదురు.’

‘నన్ను వారు ఎప్పుడు ఎక్కడచూచినారు? ఇంతటిప్రేమ ఎట్లు పుట్టినది?’

‘నిరంతరము వారు మిమ్ములనే చూచేది. వారికి మీరు ప్రాణాధికులు.’

‘అనగా?’

‘నా మాటలు మీకు అర్థము కావు.’

అనిచెప్పి వెంకట్రాయుడుగారు ఇంక ఆగకుండా వెళ్లిపోయినారు.

ఆయన వెళ్లినతరువాత వెంకట్రాయుడుగారు [illegible]ముగ మాటలాడినవారు ఎవరా అని ఆలోచించినాను. ఆనాటిరాత్రి పరుగెత్తుకొనివచ్చి రోజుచు పోయిన ఆస్త్రీ ఎవరు? నావిముక్తికి ఆస్త్రీ కారణభూతురాలుకాదు కదా అనుకొన్నాను. నేను ముఖ్యముగనూ ఎరుగని ఆమెకు నావ్యవహారముతో సంబంధము కలదంటే అది నాకెంత నమ్మదగిన విషయముగా కనబడలేదు.—ఒకవేళ నీలాచలమే ఈబాకీ తీర్చినదా!— నన్ను ఎప్పుడో ఒకమాటు [illegible] [illegible] [illegible] ఉండునా?—[illegible] అనుకొన్నాను.—ఇక [illegible] [illegible] [illegible] [illegible]

ఎవ్వరు?—ఒకవేళ ఇంతపనిచేసినది నాభార్య కాదు కదా అని ఒకచూపు తట్టినది. కాని నేనంటే నా భార్యకు కిట్టదని, నాపేరు చెప్పితే మండిపడుతుందని నా నమ్మకము: అట్టిది ఇట్లు చేస్తుందా అని సంశయించితిని.— నా భార్యకాకపోతే నామీదఅంతప్రేమతో నాకోసము ఈ బాకీ తీర్చినారు ఎవరు?—ఇట్లు నాలో నేను వితర్కించినాను. వితర్కించినకొద్ది నాకు ఇంకా పెద్దసమస్య అయినది. కాని ఎవరోనన్ను అకారణముగ ప్రేమించి దయయుంచి ఈబాకీనుంచి నన్నుతప్పించి ఉంటారని అనుకొన్నాను.—ఇదివరకు నామనస్సు గ్రహించని ప్రేమ రసప్రవాహము ఈప్రపంచములో వ్యాప్యము అనుకొన్నాను. ఇంతవరలో నన్ను ఎందరు ప్రేమించినట్లు నటించినా అదివట్టి డబ్బుమీద ప్రేమకాని నామీద ప్రేమ కాదని కొద్దికాలము క్రితమే నాకు అర్థమయినది. ప్రేమ రసబిందుపాతమునకు నామనస్సు చాతకముగా పరితపించి పోతూఉన్నది. ప్రేమగా మాటాడేవారు లేరు. మనసు ఇచ్చేవారు లేరు. నా ఆవేదనను తీర్చేవారులేరు. నామీద ప్రేమతరంగము పొంగి పొర్లిపోతూ ఉన్నదని భ్రమించి ఎందరిదగ్గరకు పోయినాను? ఎందరిమాయ మాటలు నమ్మినాను? వేశ్యలు చెప్పిన కపటపుమాటలకును, వారి నాపట్ల ప్రేరితమైన బూటకపు ప్రేమకును లోబడి నిజముగా అదేసౌఖ్యమని భ్రమపడినాను. కల్లకు దాంపు కానిమాపు అలవడినది. మనసుకు రుచికాని రుచిమీద బుద్ధిపారినది. ఎండమావులు చూచి నీటి కొలనులని భ్రమపడినాను. వేశ్యల ధనాశాపరత్వమును ప్రేమస్వరూపముగా అనుకొన్నాను. భోగలాలసత్వమును సౌఖ్యమను కొన్నాను. ధనముప్రేమనుకూడ సాధించగలిగినదనుకొన్నాను. ఎట్టిప్రేమ! ఎట్టిమాయ!—ఇన్నేళ్లు, ఇన్నాళ్లకు మనస్సుకు తగినమనస్సు, మనస్సు చల్లబరచు ప్రేమామృతబిందువు సంపాదించుకోలేక పోతినికదా!—ఇట్లు ఒకటేమిటి ఎన్నో ఆలోచనలు వర్షాకాలపు మేఘాలవలె మనస్సులో పరుగెత్తుట మొదలుపెట్టినవి. ఈ యాలోచనలలో నాశరీరము నాకు తెలియలేదు. నేను ఏస్థితిలో ఉంటినో కూడ నేను ఎరుగను. అనేక [illegible], నవరసములు మనస్సులో [illegible] [illegible] ఉన్నవి. [illegible] కటకటభాగవతము కట్టి [illegible] అనుకొంటిని. మనస్సు ఈయాతనతో దహించు

కొని పోతూ ఉన్నది. ఈ హృదయదాహము చల్లార్చుటందుకు ప్రేమరస వర్షము ఏది? ఎక్కడ?—దిక్కులు మారుమ్రోగినవి—ఏది? ఎక్కడ?—ఇదే ప్రతిధ్వని. దిగాలుపడి ఒకచోట గుభాలున కూలబడితిని. కన్నీరు కాల్వలై ప్రవహించెను. లోకమంతా అంధకారమై పోయెను. ప్రళయమా ఇది అనుకొన్నాను. జీబురుమని పెద్ద ధ్వనులు చెవులు బ్రద్దలయ్యేటట్లు వినబడుతూ ఉన్నవి. ఎక్కడికి పోకను? ఎక్కడికి పోను? దారిచూపుటకు ఆశాజ్యోతియే లేదు.

భగవన్నామము అప్పుడు జ్ఞాపకము వచ్చినది. భగవంతుడు ఆర్తత్రాణ పరాయణుడు. ఆపద్బాంధవుడు. దీనపోషకుడు అని విన్న సంగతి అప్పుడు మనస్సుకు తట్టినది. భగవన్నామోచ్చారణమే నాకు ఇంక గతి అనుకొన్నాను. 'స్వామీ! క్షమింపనా నన్ను స్వామీ' అని ఒక్క అరుపు అరచినాను. ఇక నాకు పైని తెలియదు.

* * * * *

'శ్యామలరావుగారూ?' అనే పెద్ద కేకతో నాకు తెలివి వచ్చినది. కళ్లు తుడుచుకొని తలుపు తెరచి చూచినాను. పిలచినవాడు పోస్టుజవాను. నాకు ఒక ఉత్తరమిచ్చి వెళ్లిపోయినాడు. ఉత్తరము చింపబోగా చేతులు వడకినవి. చించి చూడగా ఉత్తరములో ఇట్లున్నది.

ప్రాణనాథుని పాదపద్మములకు

మీచరణ సేవకురాలు మీనాక్షి త్రికాలముల యందు నమస్కరించి చేసే విజ్ఞాపనము. నాకు చాలరోజుల నుంచి ఖాయిలాగా ఉన్నది. ఇక నేను బ్రతుకను. బ్రతుకవలెనని ఆశకూడ లేదు. అంత్య ముహూర్తము లోపల మీరు ఒకమారు కళ్లబడినట్టయితే ఈజన్మలో నాప్రాణనాథుని, నాపరమదైవమును కళ్లజూచితిననే తృప్తితోను ఆనందముతోను కళ్లుమూసెదను. నాకింక కోరిక లేవీలేవు. ఇదే కోరిక. నాకోరిక నెరవేర్చవలెనని నాప్రార్థన. నాకోరిక సఫలమైతే నేను భాగ్యవంతురాలను అనుకొంటాను. మీదమీచిత్తము; నాభాగ్యము. శ్రమ ఇస్తూ ఉన్నందుకు క్షమింపగోరెదను.

—ఇంట్లో, } చిత్తగింపవలెను. విధేయ సేవకురాలు,
—చీ థ. } మీనాక్షి.

అది చదువుకొన్నాను. కట్టతెగిన ప్రవాహము లాగు నావిచారము పొంగి పొర్లి పోయినది. ఆపుటకు అడ్డుకట్టలు లేవు. అప్పుడు నాఅవస్థ చూస్తే నాగుండెలు బ్రద్దలవుతవా అనిపించినది. ఏమివేదన! ఏమివేదన! దుర్భరము! దుర్భరము! అనుకొన్నాను.—కొంతసేపటికి తెప్పరిలి ఆయుత్తరము చేతపట్టుకొని బయలుదేరినాను.

## ౪

—పురము నాలుగువీధులు గాలించినాను. మట్టమధ్యాహ్నమయినది. ఎండ మండుచుంటూ ఉన్నది. నెత్తి మాడుతూ ఉన్నది. చేతులో పట్టుకొన్న కవరు చేతులోనే ఉన్నది. కాలికి చెప్పులు లేవు. తలకు గొడుగు లేదు. తైలసంస్కారము లేక 'క్రాపింగ్' ముంగురులు నుదిటిమీదపడుతూ మధ్యమధ్య వీస్తూఉన్న గాలిమూలమున చెదర సంపగ ఉన్నవి. చవిటిభూమి అగుటచేత కాళ్లు అంటుకొనుచున్నవి. ఉత్తరీయము భుజముమీదనుండి క్రిందకు జీరాడుతూ ఉన్నది. గడ్డలు చెమటతో తడిసి అసహ్యముగా ఉన్నవి. దాహముగు చున్నది. ఒకచేపోక పోయినాను.

వెళ్లివెళ్లి ఒకయింటివద్దరనున్న ఒకరిని వారి ఇల్లెక్కడ? అని అడిగినాను ప్రక్కరెండిళ్ల తరువాత ఉన్నయిల్లు చూపినారు. బరువెక్కిన మనస్సుతో ఉస్సురుస్సురంటూ ఆయింటికి వెళ్లినాను. అదివరకు ఏదో పెద్దతప్పు చేసినానని నాకు తోచినది. ముందు ఇంటిలో అడుగు పెట్టదామంటే ఏదో భయము. గుండెలు దడ. ఎట్లయినా నేమి తలుపు తీసి ఉన్నది. లోపలికి వెళ్లినాను.

పెళ్లి అయినతరువాత నాభార్యముఖము చూచుటకు అదే మొదటిమారు. నాభార్య ఈయూరు ఎప్పుడు వచ్చినదో నాకు తెలియనే తెలియదు. పుట్టింటియొద్దనే ఉన్నదని నా ఊహ. తల్లిదండ్రులను విడిచిపెట్టి ఎప్పుడు ఈయూరు వచ్చినదా అని ఆలోచిస్తూ ఆయింటిలో నడుస్తున్నాను. అందు అడుగు పెట్టినప్పటినుండి నాభార్యముఖము ఎట్లు ఉండునో జ్ఞాపకము తెచ్చుకొనుటకు ప్రయత్నించినాను. చిన్ననాటి మాపెళ్లి ముచ్చటలు 'సినీమా' ప్రదర్శనములోలాగు మనస్సులో కనబడినవి. నాభార్య పల్లకీలో ఊరేగుతూ ఉన్నప్పుడు నాకేసి ఓరచూపులుచూచి మందహాసముచేయుట; పసుపుతో

నరిచేటప్పుడు బుగ్గలకు కొంటెతనముగా ఏమరిపాటున గంధము రాయుట, బంతులాడించేటప్పుడు పూలచెండ్లతో ఛటేలున తీక్ష్ణమైన చూపులతో పరిహాసముగ కొట్టుట, వంటబ్రాహ్మణులు మమ్ము ఎత్తుకొని వండాడించే టప్పుడు బుక్కాతో సరసములాడుట- ఇన్నిటిని మించి తొలిచూపు కలిసే ఆతలంబ్రాలవేళ చిరునవ్వుతో, మను సిగ్గుతో, ఉత్సాహముతో తలంబ్రాలు పోయుట- ఇట్టివి ఎన్నని—ఆ పెళ్లివైభవము కళ్లకు కట్టినట్టు కనబడినది. నా భార్య పెళ్లినాటిరూపము మనస్సుకు తట్టినది. పెద్ద దైనపిదప ఎట్లుఉన్నదో ఇంతవరకు నాకు తెలియదు. ఆహా! నా జీవితమంతా ఎంత ఇంద్రజాలమైనది! చిన్న నాటికి ఇప్పటికి ఎంతవ్యత్యాసము! పూర్తిగ ఒక్క యుగమే—అనేక భావ పరివర్తనములతో, అనేక చిత్ర విచిత్ర పరిణామములతో ఒక యుగమే కడచినట్లయినది. ఈమధ్యకాలమంతా నాది ఒక పెద్ద నాటకము! అందు లో ఎన్ని రసాలు! ఎన్ని దృశ్యాలు! నాకథ నాకే ఆశ్చర్యము కలిగించినది. ఆశకు దాసుడనై పెద్దకలాపము వినిపించినాను. ఎంతచిత్రచర్య! నడుస్తూనే ఉన్నాను. మేల్కొని ఇట్లు కలలు కంటూనే ఉన్నాను. నడచుట కాని, కలగనుటకాని నాప్రోద్బలము, నాయోచనక లేకయే జరిగిపోతూ ఉన్నది.

వెళ్లగ మధ్యసావిడితలుపు వేసిఉన్నది. ఆకస్మికముగ తెలివివచ్చినది. ఇంటిలో అలుకుడైనా లేదు అంతా నిశ్శబ్దము. ఎవరినిపిలుతును? ఏమనిపిలుతును? ప్రక్క గదితలుపుతీసిఉండగా దానిలోనికి వెళ్లినాను. ఆగదిలో ఒకమూల ఒక ట్రంకుపెట్టె ఉన్నది. మరొకచోట చిరిగిపోయిన ప్రాతకోకపేలిక లున్నవి. ఇంకొకచోట చీపురుకట్టకలదు. చాలారోజులనుంచి ఆగది తుడుస్తూ ఉన్నట్టులేదు. ఒకమూల అమ్మవారి సింహాసనమువంటి ఎత్తయినపీఠము కలదు. అందు రోజూ పూజ చేస్తూఉన్న ట్టుకనబడినది. మందారపుష్పములు, దేవకాంచన పుష్పములు ఒత్తుగా కలవుకాని అవి బాగా వాడి ఉండుట చేత ఒకటి రెండురోజులక్రిందట పూజచేసినవేమో అనుకొన్నాను. అక్కడనుండి మరొకగదిలోనికి వెళ్లినాను కాని ఆగదికి అవతల ప్రక్క గొళ్లెము వేసిఉన్నది. అందువలన మరల అమ్మవారిపీఠము ఉన్నగదిలోనికి వచ్చినాను. అక్కడ అమ్మవారిపీఠము కనబడలేదు. నేను అవతల గదిలోనికి వెళ్లినప్పుడు ఎవరో తీసుకు వెళ్లినా రనుకొన్నాను. ఎట్లయితేనేమి ఆగదిలోనుంచి ఆగదిలోనికి, ఆగదిలోనుంచి ఆగదిలోనికి వెళ్లినాను. వెళ్లగా వెళ్లగా దొడ్డిగుమ్మమువద్ద చాలామంది జనము ఉన్నట్లు కనబడినది. పెద్దసందడిగ ఉన్నదక్కడ. అదేమిటో అని తలుపుచాటున పొంచిఉండి చూస్తూ అవతలివారిమాటలు విన్నాను. 'పటము ఇటు తేవే.' అని ఒక హీనస్వరము వినబడినది. ఇంటిలో ఎవరూ లేరు. అంతా ఆకం పులోనే ఉన్నారు. నేను తలుపుసందులలో నుంచి తొంగిచూస్తూ ఉన్నాను. స్వరము నూతిలో నుంచి వస్తూఉన్నట్టు ఉన్నది. ఆతలుపుసందులోనుంచి చూడగా కనబడినది ఏమిటి!—అమ్మవారిపీఠము నుంచి ఒక పటముతీసి ఒకస్త్రీ నాపమీదపడియున్న ఆవిడకు ఇచ్చినది. ఆయిచ్చినది విగ్రహము కాదు: ఛాయాపటము. ఆయిచ్చిన స్త్రీ నాకు స్ఫురణకు వచ్చినది. ఆరాత్రి వెంకట్రామయ్యగారు నన్ను పట్టుకొనుటకు వచ్చినప్పుడు వెన్నెలలో పరుగుపరుగున వచ్చి గోడ దూకిపోయినది ఆమనిషే. వెనుక ఒకమారు నిర్ధనుడనై కానివాడల పంచలబడి పలవించుచుండగా నాతో మాటాడకయే డబ్బుసంచి నాముందుపడవేసి నేను ఆ మన్నను ఆగక చక్కాపోయినదికూడ ఆమనిషే అని నాకిపుడు జ్ఞాపకము వచ్చినది. ఈస్త్రీ నా భార్య దాసి అని నాకు దోచినది. నా భార్య నాసౌఖ్యములో తనసౌఖ్యము, నాసంతోషములో తన సంతోషము చూచుకొని నాకు కష్టము సంభవించినప్పు డెల్ల ప్రచ్ఛన్నముగ నావెంటనుండి నన్నుకనిపెట్టుతూ వచ్చినదని ఇప్పటికి పూర్తిగ నాకు నమ్మకము కలిగినది. ఇట్టిసందర్భములు ఒకటా? రెండా? ఎన్నని చెప్పను? నా భార్య నిష్కళంకప్రేమ, భక్తి తలచుకొంటే దుఃఖము సముద్రపు కెరటములవలె అంతులేకుండ పొర్లిపొర్లి వచ్చినది.—ఎంతఅపరాధిని అనుకొన్నాను. నిష్కారణముగ నిరపరాధురాలైన దానిని ఎంత ఉసురుపెట్టితిని? అని ఆవేదన కలిగినది.

నాబట్లు నాకు తెలియకుండా ఏడుస్తూ వెళ్లి నా భార్యపరుపను కూలబడినాను. అనాఘ్రాతమైన పుష్పము మీనాక్షి: అంత్యముహూర్తమునకు ఎదురు చూస్తూ ఉన్నది. వక్షస్థలముమీద నాఛాయాపటమును చూచినాను. అది నాచిన్ననాడు మాపెళ్లిలో ఇరువురిని

కూర్చుండబెట్టి తీయించినది. ఆపటము దగ్గరపెట్టుకొని రోజూ పూజచేస్తూ ఉండేది కాబోలు అనే ఊహ తట్టగానే నిర్విణ్ణుడనైపోతిని. నేను ఎంతటి మందభాగ్యుడను! దేవుడు నా భార్యను దిగబెట్టి నన్ను తీసుకువెళ్లిన బాగుండును అనిపించినది.

నేను దగ్గర కూర్చోగానే మీనాక్షి మూతలు పడుతూ ఉన్నకళ్లు నిమ్మళముగా తెరిచినది. ఒంటిలో రక్తమాంసములు లేవు. పట్టె ఎముకలపోగు. అయినా ముఖమున కళకాంతులు మాసిపోలేదు. అప్పటికీ ముఖము ఎంతో సుందరముగా ఉన్నట్లు కనిపించినది. పాతివ్రత్యమే సౌందర్యమా అనుకొన్నాను. ఆమె నావేపు చూస్తూ ఉన్నదని నేను ఎరుగుదును. కాని నాకళ్లు నీళ్లతో తొణకుటవల్ల దృష్టి మందగించినది. మాటాడుటకు నోరు రాలేదు. కంఠము పూడిపోయినది. పెదవులు ఎండుకుపోయినవి. కౄరచూపుతో నా భార్యను చూచినాను. నాకన్నీళ్లు ఆమె చెక్కిళ్లమీద పడ్డవి. అది గ్రహింపకపోలేదు ఆమె. ఆవిడకుకూడ కడకంటినుండి నీళ్లు తొరగినవి. పాలిపోయిన తనకుడిచేతిని ఎత్తి నాబుగ్గలమీద పడిన కన్నీళ్లు తుడిచినది. నలుగురు నన్నుగాంచి నిందింపసాగిరి. వారివైపు గ్రుడ్లు మీదికెత్తి కష్టముతో చూడదొడగినది. అది వారిని వారించుటకు అనుకొన్నాను. అప్పటికీ వాళ్లు ఊరుకోలేదు. వారివైపు చూచి 'తప్పు, అట్లు అనకండి' అని కాబోలు ముక్కుమీద వ్రేలుపెట్టుకొన్నది. నాతో ఏదో చెప్పబోయినది కాని మాట రాలేదు. నాకుడిచేతిని ఎత్తి కళ్లకు అద్దుకొన్నది. బలవంతముగ తెచ్చిపెట్టుకొని ఒకనవ్వునవ్వినది. అది పెదవులను బ్రద్దలుచేసుకొని వస్తూ ఉన్నదా అనుకొన్నాను. ఏమినవ్వు అది? తాను జయించితిని అని విజయసూచకమా? తాను అదృష్టవంతురాలను అని అదృష్టసూచకమా? ఒళ్లు తెలియక ఆమె ముఖముమీద ముఖముపెట్టి ఏడుస్తూ కూర్చున్నాను. ఎంతసేపు అట్లు ఉన్నానో నాకే తెలియదు. కొంతసేపటికి తెప్పరిల్లి చూచినాను. ఇంక ఏమున్నది? అప్పటికి అప్పుడే దయనీయమైన మీనాక్షికథ ముగిసినది.



" నా కుడిచేతిని ఎత్తి కళ్లకు అద్దుకొన్నది."

౫

రోజులు గడచినవి. నెలలు జరిగిపోయినవి. ఏడాది, రెండేళ్లుకూడ గతించినవి. నా భార్య పోయిననాడు స్తంభించిపోయినదా అనుకొన్న ప్రపంచము యథాప్రకారముగా ఇప్పుడు సాగిపోతూ ఉన్నది. మీనాక్షి మాట నాకు ఎట్లు మరపువస్తుందా అని నాలో నేను అనుకొంటూ ఉంటాను. ఎప్పుడూ ఇంటిపట్టున ఉండకుండా ఏ పురాణ కాలక్షేపమునకో ఏగుళ్లకో, ఏసాధువుల దగ్గరకో వెళ్లుతూ ఉంటాను. ఇంటికివెళ్లుట అన్నభయముయినది. ఇంటికి వెళ్లితే నాకు వండిపెట్టే నాముత్తవతల్లి 'సంబంధములు వస్తూ ఉన్నవిరా. పెళ్లిచేసుకోరా' అని నన్ను వేధిస్తూ ఉంటుంది. పెళ్లి అంటే ఇక రోతపుట్టినది. ఆడవాళ్లలో ఎంతటి పవిత్రచరిత్రలుఉన్నారు అని నాలో నేను అనుకొని మీనాక్షిని జ్ఞాపకము తెచ్చుకొంటూ ఉంటాను.

తరుచు నా బంధువులు - దగ్గరబంధువులు కారను కోండి - నాకు మంచిసంబంధములు తెస్తామనీ, పెళ్లి చేస్తామనీ అంటూవచ్చినారు. 'ఈడుచిన్నది. ఇకముందు నీ బ్రతుకు ఎట్లురా? ఎల్లకాలమూ నేను బ్రదికి ఉంటానటరా' అని మాఅవ్వ అంటూ ఉండును. అప్పుడు నాకు పట్టరానిదుఃఖము వస్తుంది. ఇక నాకు ఎవ్వరూ లేరా? నేను ఏకాకినేనా? అనుకొందును.

ఇట్లు ఉండగా ఒకమారు పెళ్లివారు వచ్చినారు. నన్ను చూచినారు. నాసంగతి వీరికి పూర్తిగా తెలిస్తే వీరు నాకు పిల్లను ఇస్తారా అనుకొన్నాను. కాని నా బంధువులు ఏమి మాయచేసినారో నాకు తెలియదు. పిల్లను చూచుటకు రావలసినదన్నారు. మాయవ్వ పోరుచేత అయితేనేమి, బంధువుల బలవంతమున అయితేనేమి పిల్లను చూచుటకు వెళ్లక తప్పినదికాదు.

వెళ్లితిమి—ఊరు; చూచితిని పిల్లను. జ్యేష్ఠమాసమునకు పదమూడేళ్లు వస్తవన్నారు. చక్కగా బొద్దుగా ఉన్నది పిల్ల. చంద్రబింబము వంటి ముఖము; విశాలముగా తామరరేకులవలె ఉన్నవి కళ్లు. ప్రక్కపాపిడి అందముగా తీసినది. చెవులకు తెల్లరాళ్లదుద్దులు ఉన్నవి. అందమైన పట్టుజాకెట్టు తొడిగినది. చేతులకు క్రొత్తరకము బంగారు సన్నగాజులు ఉన్నవి. పిల్ల అందమైనదే అనుకొన్నాను. చిన్నతనములోనే ఒడుపులు, కులుకు బెలుకులు నేర్చినది. నడచినదా చాలా ఒయ్యారముగా నడుస్తుంది. నవ్వినదా ఆనవ్వుహృదయఫలకము మీద హత్తిపోతుంది. కడకంటిచూపు బరపినదా ఇట్టిదనరాని ఒకవిధమగు ఆనందము పుట్టుతుంది. హార్మనీ వాయిస్తుంది. నేను దగ్గర ఉండగానే ఒకటో రెండో కృతులు పాడించినారు. కంఠము అంతసున్నితమైనది కాకపోయినా పాట ఒక మోస్తరుగా బాగానే పాడుతుంది. రోజూ ఒక భోగమువాడువచ్చి ఫిడేలు చెప్పి పోతూఉన్నాడు. కుమారీశతకము తెప్పించి అందులోనివి రెండుపద్యములు చదివించినారు. ఖంగారుపెట్టకుండా ఉంటే అక్షరమూ అక్షరమూలో పలకూడబలుక్కొని ఒకమోస్తరుగా చదువుతుంది. సలక్షణమైనది. కడుపునిండైన పిల్ల. చూచితిమి. వెళ్లిపోతిమి.—పెళ్లికూతురునిగురించి ఇంతవిమర్శ చేయుటకు మగవానికేనా అధికారము? కలకాలమూ కలిసిఉండే ఆడది మగవాని మంచిచెడ్డలు విచారించుకోనక్కరలేదా? అనుకొన్నాను. కాని సమాధానము అప్పుడేవచ్చినది: మగవాడు స్వార్థపరుడు.—

## ౬

ఒకనాడు మరల మాదొడ్లో కూర్చున్నాను. ఏను కటిదొడ్డే! అకాలమే శరత్కాలము! తెల్లనివెన్నెల నురువు బ్రహ్మాండమంతా నిండినది. కాని ఆదొడ్లో మునపటి గోరింట మొక్కలు లేవు. మునుపటి అరటిచెట్లు లేవు. ప్రేమలేని హృదయమువలె బీడుపడి ఉన్నది దొడ్డిఅంతాను. మరల నాకాపురము కుదుట బడినదని నాఅవ్వా, బంధువులూ సంతోషించినారు. నాభార్య కాపురమునకు వచ్చుటమాత్రము చూచినది మాఅవ్వ.

పేముకుర్చీమీద నేను కూర్చున్నాను. ప్రక్క ఇంకొక కుర్చీమీద శకుంతల కూర్చుండి తమలపాకులు రాస్తూఉన్నది. జరిగిపోయినదే ఒకస్వప్నము—ఇప్పుడు జరుగుతూ ఉన్నదే నిజము అనుకొన్నాను.

తుపానుగాలి సద్దడగినది. వాతావరణము ప్రశాంతమైనది. ఆకాశము నిర్మలముగా ఉన్నది. ఎప్పుడో యుగయుగముల క్రితము జరిగిపోయినరాత్రి జ్ఞాపకము వచ్చినది. 'వజ్రపుటుంగరము' మాట మనస్సుకి తట్టినది. నాస్నేహితుని పుస్తకములకట్ట మరల ఇంకొకమారు విప్పినాను. వజ్రపుటుంగరము ఏడవప్రకరణము మరల నాలోనేను చదువదొడగితిని. ఆప్రకరణములో ఒక్క విషయమునకు నాకు విచారము కలిగినది. కమలపాత్రమును అంత అయుక్తముగ అంత చెడ్డగ చిత్రించినాడేమి చెప్పుమా అని అనుకొంటిని. లోకానుభవము లేను అతనికి. స్త్రీలలో ఎంతటి పవిత్రచరిత్రలు కలరో ఆతడు కనిపెట్టలేకపోయినాడు అని తోచినది.

ఇంతలో మాయింటిప్రక్క కాపురమున్నవారి అమ్మాయి ఆరేళ్లదివచ్చి 'ఇదిగో! వదినా! మాఅన్నయ్య నీకు ఈపుస్తకము ఇచ్చిరమ్మన్నాడు' అని చెప్పబోతూ ఉండగా పిల్లకు అడ్డమువెళ్లి పుస్తకము పుచ్చుకొని 'సరేలే. వెళ్లు' అన్నది శకుంతల. 'నీదగ్గర ఏదో రాజుగారికథలు ఉన్నవట. అవి చదివినట్లయితే ఇమ్మన్నాడు' అన్నది పిల్ల. 'రేపు ఇస్తానులే. వెళ్లు' అని పిల్లను గెంటుకు వెళ్లినది నాభార్య. 'ఏమిటి అది?' అన్నాను నేను.



" ఇదిగో ! వదినా ! మా అన్నయ్య నీకు ఈపుస్తకము ఇచ్చిరమ్మన్నాడు. "

'ఏమీ లేదు. ఒంటరిగా ఉంటే ఏమీతోచక ప్రక్క ఇంటివారిదగ్గరకు వెళ్లి వారిపుస్తక మొకటి తీసుకొని వచ్చినాను. అది చదువుట అయినట్టయిన ఇప్పుడు ఇవ్వవలసినదని వారు కబురుపంపినారు. రేపు ఇస్తానని పిల్లను పంపివేసినాను.' అన్నది. 'ఆపుస్తకము ఏమిటి? ఏదీ?' అని పుస్తకముకోసము చెయ్యిచాచినాను. 'పోనిద్దురూ' అని 'పైకిచదువుదురూ అదేదోతీసినారు'అని హెచ్చరించినది శకుంతల. 'ఏదీ చూస్తాను. ఆపుస్తకము, ఏదీ?' అని మరల అడిగినాను. 'అబ్బ! ఎందుకు?' అని విసుగుకొని శకుంతల ఆపుస్తకమును చూపీచూపనట్లు నాకు ఒక్కమారు కనబరచి సుతారముగా వెంటనే లాగివేసినది. అట్లు లాగుటలో దానిలోనుంచి ఏదో కాగితము క్రింద పడ్డది. 'అది ఏమిటి' అని నేను ఆకాగితము తీయబోతూ ఉంటే శకుంతల అడ్డువచ్చి దానినితీసి 'అబ్బ! అవి అన్నీ మనకెందుకు! ఏమి కాగితమో ఏమిటో! వారివి మరల వారికి భద్రముగా అప్పగించవలెను—ఈకబుర్లకేమి, చదువుదురూ!' అని నన్ను హెచ్చరించి తమలపాకుల చిలుకలు నోటికందించి 'చాలా లేత ఆకులు సుమండీ ఈపట్టు తెచ్చినవి చాలా బాగున్నవి. కామా!' అని శకుంతల ఒక్కవిలాసము చూపినది, విలాసవంతమైన ఆమె ముఖము చూచేటప్పటికి నాకు అపరిమితానందము కలిగినది. నేను ప్రకరణముచదివివినిపిస్తూ ఉంటిని. పాము చెవులతో శకుంతల దానిని వింటూ ఉన్నది. చదివినది అర్థము చేసుకొనేపాటి జ్ఞానము ఉన్నందుకు నాకు చాలా సంతోషమయినది. చదువుట పూర్తి అయిన తరువాత 'ప్రకరణములో చెప్పిన ఆడది నీవంటిదే: కులుకులాడీ: వగలాడీని. కాదూ! అని నవ్వుతూ అన్నాను. మాట మీదపడనీయలేదు. తక్షణము ఒకవిధమైన నవ్వుతో 'నేను ఆడదవంటి దానవైతే మీరు గోవిందరావుగారివంటివారు కారా?' అన్నది శకుంతల. ఆ నవ్వు సామాన్యమైనది కాదనుకొన్నాను. అందులో రోషము, అధిక్షేపణకూడ కనబడినది. 'ఎంతటి దానవే' అన్నాను. తటాలున కుర్చీలోనుంచి లేచి గిరుక్కున తిరిగి ఇంటిలోనికి వెళ్లిపోయినది శకుంతల. లోపలికి వెళ్లినతరువాత మరల ధ్యానము వజ్రపుటుంగరము మీదికి పోయినది.

ఆప్రకరణమును ఆధారము చేసుకొని ఒక కథ అల్లితే బాగుండును అనుకొంటిని. కాని నాకు ఆపాటిప్రజ్ఞ లేదు. నాకు వ్రాత చేతకాదు. వ్రాయనేర్చిన వానినిపట్టుకొని కథ పూర్తిచేయించవలెననుకొన్నాను. తరువాత నాజీవితకథ జ్ఞాపకము వచ్చినది. వజ్రపుటుంగరము అనే కథలో నాకథకూడ చేర్చి వ్రాయుమందునా అనుకొన్నాను. అట్లు చేసినట్టయితే ఒక కథలో నాజీవిత కథకూడ కలిసిఉండును అనుకొంటిని. నాపాడుజీవితచారిత్రకథను ఒక కథలోచేర్చి వ్రాయించుట ఎందులకో నాకే తెలియదు. అట్లువ్రాస్తే ఏమి అనుకొన్నాను. ఎట్లయితేనేమి ఇట్లు కొంతసేపు వితర్కించుకొని, వ్రాయించవలెనని నిశ్చయపరుచుకొన్నాను. అట్లయిన నాజీవితకథ పైకథలోఎట్లు

చేర్చవలెను? అది ఎక్కడనుండవలెను అనుకొన్నాను. ఈగొడవఅంతా నాకెందుకు! బంగారము ఇచ్చేపనే మనదికాని నగ ఎట్లు అందముగ చేయవలెనో అది కంసాలి ఆలోచించుకొనవలసినవిషయమే అని నాలో నేను సమర్థించుకొన్నాను. నమ్మకమైనవాడు, రహస్యము దాచేవాడు, మంచివ్రాతకాడు దొరకితే బాగుండునని అట్టివాడు ఎవ్వడు ఉన్నాడా అని ఆకాశముకేసి చూస్తూ ఆలోచిస్తూ ఉన్నాను.

పుచ్చపువ్వువంటి వెన్నెల ఇంకా మనోహరముగనే ఉన్నది. రాత్రి ప్రశాంతముగనే ఉన్నది. ఇంతలో పాలసముద్రములోనుండి హాలాహలము పుట్టినది. పెద్దకేకలు, రోదనధ్వనులు— పెద్దగంద్రగోళము వినబడినది. తటాలునలేచి పరుగెత్తుకొని వెళ్లి తలుపుతీసిచూచినాను. మాయింటిదగ్గరనే కొంపలు అంటుకొన్నవి. నావెనుక శకుంతలకూడ వీధిలోనికి పరుగెత్తుకొని వచ్చినది. మంటలెగసి మాయింటిదాకా వచ్చినవి. ఒకపెంక అంటుకొన్నది. పనిమందీచేరి ఆర్పివేసినారు.

అంతా కొంతసేపటికి చల్లారినది. గంద్రగోళమంతా సద్దణగినది. ఎక్కడివాళ్లు అక్కడ మరల కుదుటబడినారు. అప్పుడు నాశకుంతలకోసము వెదకితే కనబడలేదు. చాలాసేపు వెదకినాను. ఆమె జవాబూ జాడా తెలియలేదు. ఇంకా నాశకుంతలకోసము నిరీక్షిస్తూనే ఉన్నాను. నానిరీక్షణమునకు అంతమెప్పుడో?



# రాజమహేంద్రవరము

పె. లక్ష్మీపతి గారు

ఏనాడు నృపతి యాస్థానాన నన్నయ్య, కవితాసతికి గజ్జె గట్టినాడొ?
యేనాడు రాజరాజేంద్రుండు కొనియెనో, రాజవీథులను నీరాజనములు?
నేనాడు ధర్మహర్మ్యానీకములపైన, నాంధ్రధ్వజము నాట్య మాడినదియొ?
యేనాడుకవిరాజు శ్రీనాథు డేతెంచి, నినుజూచి పొంగి వర్ణించినాడొ?
నాటివైభవమంతయు నీటిబోయె, పోయె నదియెల్ల యనుచు వాపోదుగాని
యాశలను నీపు చందందునడగియుండి, పూర్తిగా వాసనలు మాసిపోవలేదు. ౧

సీ. తనుజూచి హోరుహోరున నేడ్చునదియందు, ప్రతిఫలించుచునున్న పాడుకోట
పూర్తిగా నీటిలో మునిగి చావగలేక, నిలిచియందరిబిల్చు నీళ్ళరేవు
తెలుగక్కరములు గోడల ప్రేలగా మసీ, దైనిల్చియున్న దేవాలయంబు
తలనెక్కి దొరగారి నిలయంబు తనుద్రొక్క, గ్రుంగిపోవుచునున్న కోటబురుజు

నేటికిని నాటిసాక్షులై నిలిచి తమ్ము, నరయులేని బ్రతికి చెడ్డయాంధ్రజనుల
గాయమొనరింపకయ యెదగాడునమ్ము, లేయు మాటల మర్మంబు లెత్తిపలుకు. ౨

గీ. కనబడెడువీని జూచుచుఁ దనివి చనమి, చూపులను ద్రిప్పి లోలోన జూచుకొందు
గర్వము విషాదమును నెద గ్రమ్ముకొనగ, పొంగిపొంగిక్రుంగుచు నున్నపూర్వచరిత. 3

ఉ. నన్నయముఖ్యు లాదికవినాథులు వ్రాయరె తెల్గులక్ష్మికిన్
వన్నియ బెట్టునీవిభవమైఖకు? లాగతికావ్యదర్పణో
త్పన్నము లైనవాని పటభాగముపైన లిఖింప రారె యీ
కన్నులు, బొమ్మలైన గను కల్మివహింపగ జిత్రలేఖకుల్? ౪

గీ. ఆంధ్రవైభవ మిందు రాజ్యంబు నేలె; నాంధ్ర భారతి యిచట నృత్యంబు సల్పె,
నాంధ్రపౌరుష మిట చరితార్థమయ్యె; నాంధ్ర తేజ మిచ్చటన మిన్నంటి వెలిగె. ౫

ఉ. కట్టడికాలమూర్తి యసిఘాతల జావక; తెల్గువారు మా
పట్టణమిద్ది మాసిరులపట్టని గర్వము జెంది పల్కగా
బట్టయి యాంధ్రదేశమున బశ్చిమ పూర్వకళావిలాసనం
ఘట్టన కాలయం బగుచు గ్రాలెదు నేడును రాజ్మహేంద్రమా! ౬

గీ. నిన్నుగని మేము మముజూచి నీవు నేటి, దాక వెలిగ్రక్క యున్నట్టి శోకమందె
యరయలేమైతి మచిరకళ్యాణసమయ, సూచకములైన మంగళశ్లోకములను. ౭

గీ. పౌరుషోద్దీపకములగు ఫలములందు, కొనెదు; రాజ్మహేంద్రమ! రిత్తసనునె, నాడు
నన్నయాదులు కలసిన మన్నులోన, రాజరాజు చల్లినక్షాత్రబీజము లవి? ౮

గీ. ఆంధ్రదేశాంగనకు హృదయంబునీవ, యివురబారిన సప్తధాతువులు చేవ
జేరరక్తనాళంబులబూరగించి, నిగుడజేయువెచ్చని తెల్గునెత్తురులను. ౯

సీ. కవికోకిలలు పాడగా దొడంగెను వసం,తాగమసూచకంబైన గీతి
కళలతో విలసిల్లి గగనంబునం దాంధ్ర, విజ్ఞానచంద్రు డావిర్భవించె
కదసి తన్నిమ్మగిన కాలగర్భము జీల్చి, యెగయుచున్నది తెల్గు మగతనంబు
ప్రబలవ్యక్తిత్వ ప్రభావాభిరాములై, కట్టుచున్నారు బంగారుగద్దె
తేజరిలు నాంధ్రదేవి దేదీప్యమాన, మహితలావణ్యరూప సన్మాన్యయగుచు
విశ్వమానవభావ పవిత్రదర్ప, ణమున దను జూచు కొనెడు విన్నాణ మొప్ప. ౧౦





# విజ్ఞానుడు

ఇంద్రగంటి నాగేశ్వరశర్మ గారు

అది కార్తీకమాసము. రాత్రులయందు చలి యుపద్రవముగనేచుచుండెను. దానంజేసి, రాజమందిరపురవాసు లెవ్వరును కాకులుకూసి భళ్లున తెల్లవారువరకును వీథులలోనికి వచ్చుటలేదు. కాని యప్పురమందలి యాడువాండ్రు ముఖ్యముగా పూర్వసువాసినులు కొందరుమాత్రము తాము పాడెడిపాటలచే నావీథులయందలి నిశ్శబ్దము జీల్చుచు, జాము రాత్రి యుందనగానే బయలుదేరి గోదావరీ స్నాన మాచరించి, సూర్యోదయమునకు పూర్వమే యిండ్లకేతెంచుచుండిరి. రాజమందిరపురవాసులందరికిని మిగుల వెరపుగలిగించిన యాచలిదేవత వీరినిమాత్రము చేరవెరచుచుండెను.



ఒకనాటిరాత్రి తెల్లవారుగట్ల నాలుగు గంటలాయెను. అపుడు వైగ్రాముర్లోయున, జానకమ్మయను నొకయువతీలలామ తనకక్షంబున నొకయిత్తడిబిందె నిరికించుకొని, బయలుదేరెను. ఆపె గోదావరిని జేరి యపుడే స్నానము జేయ నుద్యమించుచున్న యొక ముసలవ్వతో నిట్లు సంభాషించెను.

జాన:—పాపము! వృద్ధులు. చలిలో స్నానమునకు వచ్చారూ!

ముస:—చలేమిటమ్మా? ఇట్టి సమయాన గోదావరిలో సూర్యోదయానికి ముందుగా స్నానంచేస్తే పాపాలన్నీ పోతాయి. ఈమాసమేకదా అమ్మా, చేసినా మానినా!

జాన:—అవును లెండి. ఇంటివద్ద నవరైనావున్నారా? మీరే తంటాలుపడాలా? చలికాలం; పెద్దలయిపోయారు.

ముస:— అన్నట్టు చెప్పడం మరచిపోయాను. మాకుఱ్ఱవాడికీమధ్య వివాహం చేశాము విన్నారా?

జా:—సంతోషము. కట్నం లేమిచ్చారమ్మా? నగలేమయినా పెట్టారాఅండి?

ము:—2000 రూ. కట్నం యిచ్చినారు. ఉభయఖర్చులు పెట్టారు. మేము నగలు మాత్రము ప్రస్తుతము పెట్టలేదునుమండీ.

జా:—ఏవూరమ్మా వియ్యాలవారిది?

ము:—కోనసీమ. చాలాడబ్బున్నవాళ్లేలెండి. పిల్లపెద్దదే. రెండుమూడేండ్లలో కాపురానికివస్తుంది.

జా:—బాగానేవుందండీ. మావిజ్ఞానానికికూడా పెళ్లిచేయాలని వుందండీ. వీడూ బి.ఏ. చదువుతున్నాడు. సంబంధాలు వస్తూనే ఉన్నాయండి. వాళ్ళతండ్రి కేమీనచ్చటంలేదు. కట్నంకుదిరితే పిల్ల బాగుండదు, పిల్ల బాగుంటే కట్నంలేదు. మావాడేసంబంధము పనికిరాదంటాడు. ఏమీతోచటంలేదు. నాకు పెద్దకట్నంపుచ్చుకొని సరదాగా త్వరగా పెళ్ళి పెళ్లిచేసుకునివద్దా మని యన్నది. ఏంజరుగుతుందో తెలియదు.

ము:—ఏముటో కుట్టినాగమ్మ: వాడికేమితెలుసును? ఏదోచేసేయండి.

అని యీవిధముగా నాయిరువురును ప్రసంగించుచుండ, బాలభానుడప్పుడే తన కిరణములనల్దెసల వ్యాపింపజేయుచు, నభోమండలమున బారెడుదూర మెగబ్రాకి గోదావరీతరంగమాలికల కొకింత వన్నెపెట్టుచుండెను. జానకమ్మ మునలమ్మ లిరువురును, మాటలసందడిని ఆలస్యమయినదను కొనుచు పూజాదివిధులను త్వరితముగా నెరవేర్చి, స్నానమాచరించి, నీళ్ల బిందెలతో గృహాభిముఖులయిరి.

౨

ఆపురంబుననే క్రొత్తగా తమకుమారుని విద్యాభ్యాసమునకై యొక పేదసంసారులు కాపురంబునకు వచ్చిరి. వారికొక కూతురు గలదు. ఆమెపేరు సుగుణమణి. కుమారునిపేరు రామారావు. సుగుణ తలిదండ్రులు పేదవారైనను మిగుల మర్యాదగలకుటుంబములోని వారలు. జానకమ్మకుమారునకు పిల్లనిచ్చెదమన్నవారలలో వీర లొకరు. ఈసంగతి విజ్ఞానున కేమియు దెలియదు.

కళాశాలలోని స్నేహముచేత యొక నాడుసాయంకాలము రామారావు ఇంటికి విజ్ఞానుడే తెంచెను. వారలిద్దరును వాకిటనున్న కుర్చీల నలంకరించి, పేపరును జదువుకొనుచుండిరి. కొంతసేపయినతరువాత వార లీ విషయము నావిషయమును ప్రసంగింప దొడంగిరి.

ఇంతలో సుగుణమణి తనవినీలకుంతలముల సిగవైచికొని, మాలతీకుసుమంబులచే నలంకరించుకొని మందగమనయై వచ్చియు రాని నునుసిగ్గు దొంతరలతో నటునిటు తన చూపుల బ్రసరింపజేయుచు వాకిటనుండు మాధవీలతం జేరి బ్రోదిచేయుచుండెను.

సుగుణమణి కప్పుడే యౌవన మంకురించుచుండెను. ఆమెశరీరము పసిమిచాయ గలిగియుండెను. కొంచెము వయసునకు మీరిన పొడవరి. ఆమె శిరోజములు, విశాలనేత్రములనుండి వెడలుకాంతులు, నామెముఖసీమ



కెంతయు వన్నెవెట్టుచుండెను. సుగుణమణి తనసోదరునికి దెలియనీకుండ, తన వీక్షణములు విజ్ఞానునిపై ప్రసరింపజేయుచు, నంతలోనే లజ్జాభయరజ్జువు వెనుకకులాగ తన శిరంబును వంచుకొనుచుండెను. విజ్ఞానరావును తన హితునితో మాట్లాడుచున్నాడన్నమాటయేకాని, కాలమంతయు సుగుణ సుందర విగ్రహావలోకనమందే గడపివైచెను. వీరిద్దరి చూపులు నేకమాయెను. ఇంతలోనే చీకటులు నల్దెసల గ్రమ్మదొడంగెను.

"భోజనమునకు వేళయైనది. అన్నయ్యాను రమ్మను" మని లోనుండి కేక వినబడియెను. విజ్ఞానుడాతనియొద్ద సెలవుగైకొని నిజగృహంబున కరిగెను.

3

విజ్ఞానరావారోజున తానుజూచినసుందరి రామారావుసోదరియని తెలిసికొనెను. అప్పటినుండియు నాతడు తరుచుగా రామారావు ఇంటికిబోవుచు నాసుగుణం గాంచుచుండెను. విజ్ఞానునకు సుగుణయందమితవాత్సల్యముదయించెను. సుగుణగూడ తన్ను ప్రేమించినట్లు గ్రహియించెను. ఆపె నెన్నడైనపలుకరింప వలయునని కుతూహలపడుచుండెను; గాని యేమి మాట్లాడవలయునో యాతనికిదోచలేదు.

ఆత డామెను వివాహమాడుటకు తన తలిదండ్రు లియ్యకొనరనియపుడపుడు భయపడుచుండెను. దీనికి కారణము సుగుణ తలిదండ్రులు భాగ్యవంతులు గారనియు, తమతో సరిగా తూగలేరనియునే. రామారావుగూడ సుగుణ నెటులయిన తనకిచ్చి వివాహము చేయ నుద్దేశించియున్నసంగతి గ్రహియించి, విజ్ఞానుడు లోన నెంతయు సంతస మొందుచుండెను.

౪

ఉదయ మెనిమిదిగంటలప్రొద్దెక్కెను. విజ్ఞానుడప్పుడే గోదావరియందు స్నానమాచరించి దుస్తులను ధరియించుకొని, తాను చదువుకొనుగదియందొకకుర్చీపై గూరుచుండెను. ఈతనితండ్రి దామోదరుడు. విజ్ఞానుడు కొంచెము పొడవరియై సన్నముగా నుండును. చామనచాయగలశరీరము గలిగి, ఈకాలపు విద్యార్థులవలెనే క్రాపింగుగలవాడు. ఆతని ముఖారవిందమును, నాతని విశాలనేత్రములను జూడ, నాతడు విజ్ఞానమునకు నెలవగుమూర్తి కలవాడని తోపక మానదు.

విజ్ఞానుడు తన వ్రాయసమీద నొకపుస్తకమును దెరచి చదువుటకు మొదలుపెట్టెను. పత్రములను దిరుగవేయుచుండెను కాని మన మన్యథా యాకర్షింపబడుటచే తా నెంత చదువ ప్రయత్నించినను లాభములేకపోయెను. పాఠ్యము నచ్చట బారవైచి యేమియుం దోచనివానివలె నటునిటు చూడసాగెను. చొక్కాజేబులోని యొకకాగితమును దీసెను. నాలుగుసారులయినను జదివెను. తనివి దీరలేదు. మరల చదువసాగెను. తన బాష్పకణజాలముచే నాపత్రము దడిపివైచుచుండెను. 'ఉః' — అని నిట్టూర్పు విగిడ్చెను. ఎట్టకేలకు తనలో నేమియో గొణుగుకొనుచుండెను.

'ఆహా! లోక మెంత యజ్ఞానతిమిరమున మునిగిపోయెను! ఎక్కువ కట్నమిచ్చిన యాతనికూతునే చేబెండ్లాడవలయునా! ఇది యేశాస్త్రములో వ్రాయబడినదోకదా! పిల్ల యెంతకురూపియైనను తల్లిదండ్రులకు నచ్చిన జాలును. తల్లిదండ్రులకు కట్నమెవ రెక్కువిచ్చిన వారిపిల్ల నచ్చును. ఇది యెక్కడిగోలయోకాని, ఇట్టి వివాహములవలన వధూవరులయం దన్యోన్యప్రేమ జనించుట సున్న. * * * * ఎంతమంది తమకూతులవివాహములకతన మాసిపోయిరోగదా! * * * ఇంక, ధనములేక తమసంసారము లెంతయో కష్టములతో గడుపుకొనుచు, తమకుమారికా రత్నముల సత్కులీనులకును భాగ్యసంపన్నులకు నీయదలంచువారి యాశలన్నియు నట్టేట గలియవలసినదే. వార లెంతయో విచారించి, యెట్టకేల కేకురూపికో, లేక తమవలెనే దరిద్రదేవత కెరయగు నేసంసారికో తప్పక యిచ్చెదరు. ఈవిషయమున గొంత సంస్కరణము జరుగుట మేలుగదా!..............'

అంతలో సుగుణయే తన్ను వివాహమాడనున్నదని యనుకొని సంతోసింపసాగెను. మరల నేమియో గొణుగసాగెను. "మాతండ్రి నెట్లయిన నొప్పింపవచ్చునుగాని, మాతల్లి మూర్ఖపుపట్టుగలది. ఆమెను దోచదు. ఎవ్వరుచెప్పినను వినదు. కట్నము గావలయు ననెడి యాశయేకాని కుమా * * *"— అని యేదియో యనుకొనుచుండ "విజ్ఞానరావూ" అని వీథిలోనుండి కేక వినబడియెను. వెంటనే స్నేహితుడు రామారావు గదిలో ప్రవేశించెను. వీరలిద్దరు కలిసి కళాశాలకుం బోయిరి.

౫

ఆదివారము కచేరీకి సెలవుదినమగుటచే దామోదరుడుగా రింటియొద్దనే యుండిరి. సాయంత్రము మూడుగంటలవేళ, జానకమ్మతో కుమారునిపెండ్లివిషయము మాట్లాడుచుండెను. విజ్ఞానమునకు నూస్పునుంచి మంచి సంబంధము వచ్చినదనియు, మూడువేలుకట్నమిచ్చెదరనియు, లాంఛనములన్నియు జరిపెదరనియు, పిల్లమాత్రము కొంచెము చిన్నదనియు నేవేవో చెప్పదొడంగెను.

జా.— పోనిండు, యీయేడుకాకపోయిన మరియొకయేడు కాపురమునకు వచ్చును. తొందరేమి కుఱ్ఱవాడింకను చదువుచున్నాడు. పెండ్లిమాత్రము తప్పక యీమాఘమాసమున జేసివేయవలయును. సంబంధము

లీలాగునవస్తునే వుంటాయి. ఏదో వొకటి స్థిర పరుచు కోవలయునుగాని యెంతకాలం యీవిధానడు పేటు చేయడం." అన్నది.

దామో—అదే ఆలోచిస్తూవున్నాను. ఈవూర రామారావుగారిసంబంధ మొకటి యున్నది. ఈ రెంటిలో నేది నిశ్చయింపవలసి నదీ తెలియుటలేదు.

జాన:—కట్నాలా కానుకలా? ఎంత మందైనా వస్తారు. మనతో సరిగా తూగలే నిదే, ముద్దుముచ్చట లేలాతీరుతాయి? పిల్ల అందంగా వుంటే సరే! ఈపిల్లకున్న అందము దీనికుంది; వాళ్లపిల్ల కున్నయందము దాని కుంది. నాకేమీ ఈవూరిసంబంధము నచ్చుట లేదు. సాధ్యమయినంతమట్టుకు తూరుపు సంబంధము స్థిరపరచండి.

దామో:—ఏమో! యింతకూ మనవానికి కేదియిష్టమో.

జాన:—ఇష్టమేమిటి? మనం చెపితే ఒప్పు కుంటాడు, వానికేమి తెలుసును?" ఇంతలో విజ్ఞానుడు "మంచినీళ్లమ్మా" యని లోన ప్రవేశించెను.

జాన:—"నాయనా! కూర్చో" అని మంచి నీళ్లిచ్చెను.

దామో:—అబ్బాయీ! నీకు పెండ్లి చేయాలనీ మీ అమ్మ పట్టుపట్టుచున్నది. నీ యిష్టమేమిటి?

విజ్ఞా:—తొందరేమిటి? చేసుకోవచ్చును లెండు.

జాన:—ఈకబుర్లు కట్టిపెట్టు. మీదటికి నీవెవరో, మే మెవరమో! ఎప్పటిముచ్చట అప్పటిది. పెండ్లిచేసికోనంటావేమిటి? నిక్షే పములాగున యీరోజున మీనాన్నగారితో, నెవరో మంచిసంబంధము కుదురుస్తానన్నా రట. మూడువేలుకట్నము. పెద్దలమాట తీసి వేయగూడదు.

విజ్ఞా:—"సరి! కట్నమేనా యింకా యే వయినా కనుక్కున్నారా? కట్నములుంటే నేకాని పెండ్లి దలపెట్టగూడదు కాబోలు" అని మొగము చిట్లించుచు మెల్లగా ననెను.

జాన:—నీకేమి తెలుసును? పిలంనావారి కుఱ్ఱవానికి కట్నం లేకుండా పెండ్లి యినదంటే నలుగురిలోను నాకు చిన్నతనం వేస్తుంది. కట్నం లేకుండా.........ఇది యెక్కడైనా వుంటుందా!

విజ్ఞా:—కట్న ముంటేనేకాని పెండ్లాడ గూడదా యేమి? ఎవరో పిల్లనిచ్చెదరని మోస పొమ్మనెదనా! చెప్పెడుమాటలను వినడ మేనా! మనము వెళ్లి పిల్లను చూడలేదు. నా కేమియు నచ్చలేదు. ఈవూరి రామారావు గారి సంబంధ మెందుచేత చేసికొనగూడదు. అయినింటిపిల్ల; చదువుకొన్నది; దగ్గరనున్న సంబంధము యొక్కమంచిచెడ్డలు విచారించు కొనక, యెక్కడికో దూరముపోవుట మెందు లకు దూరపుకొండలు నునుపన్నట్లు"— అనుచు వెళ్లిపోయెను.

దా:—చూచితివా మనవానికబురులు. నీ కంతపంత మేమి? పోనీ వాడిఇష్టమువచ్చిన సంబంధమే స్థిరపరుచుకొందాము. ఈకాలము లో కుఱ్ఱవాండ్లయిష్టమువచ్చినట్లు నడవక పోతే మాట దక్కదు. వాడు చదువుకున్న వాడు. మంచిచెడ్డలు తెలుసును—

అని యీవిధి నచ్చజెప్ప బ్రయత్నించెనుగాని భార్య తనముద్దెందుచేత చెల్లింపగూడదని మాత్రము పట్టుపట్టి యుండుటచే దామోదరుడుగారి యుపన్యాసమేమియు నామెకు రుచింపలేదు. ఇంతలో సాయంత్రమగుచుండుటచే దామోదరుడుగారు క్లబ్బునకు వెడలిపోయిరి.

౬

విజ్ఞానుడు సుగుణంబుల ప్రోవు. వివాహములయందలి దురాచారములు కష్టసుఖములు చాలకాలము వితర్కించినవాడు. అనుకూలదాంపత్య సౌఖ్యముల కన్యోన్యప్రేమమే హేతువనియు, సద్దాని నీవరశుల్కము లక్ష్యము చున్నవనియు గ్రహియించినవాడు. తన యుద్దేశమును చివరకు తలిదండ్రులకు గూడ తెలియజేసెను. ఈతని వాక్యంబులు, వారలు సుంతయైన పాటింపక, కట్న మెక్కువయిచ్చు సంబంధమేస్థిరపరచుకొని వివాహప్రయత్నములను చేయుచుండిరి. విజ్ఞానుడు తన తండ్రిగూడ తల్లితో నేకీభవించినందుల కెంతయు జింతించెను. తల్లి, యీతనిని రామారావునింటికి పోనలదని యాజ్ఞాపించెను. పాపము! విజ్ఞానుడెప్పుడు తల్లిమాట జవదాటి యెరుంగడు. మునుపటివలె నిప్పుడాతనికి తన ప్రేమకు నెలవగు సుగుణమణి సుందరముఖావలోకనము తరుచులభించు భాగ్యముగూడ పోయెను. ఆతని కేమియు దోచుటలేదు. అట్లు సుగుణమణి ప్రేమానుబంధమును ద్రెంపివేయలేడు. ఇటు తల్లిమాటను జవదాటలేడు. ఎటుచేయుట కును దోపక నాతడు మతిబోయినట్లు గాన వచ్చుచుండెను భోజనంబైనను సరిగ చేయకుండెను.

తల్లిదండ్రు లీతనిసంగతి కొంచమైనను గ్రహింపలేదు.

౭

రాత్రి యెనిమిదిగంట లాయెను. నాడు పూర్ణిమయగుటచే చంద్రుడు షోడశకళాపరిపూర్ణుడై ప్రకాశింపదొడగెను. అపుడు సుగుణ తనసోదరుని గదితెరచి యందలి దీపము నొకింత పెద్దదిగాజేసి కుర్చీ నలంకరించి మొల్లరామాయణముం దెరచి తన మృదుమధురకంఠస్వరంబునెత్తి చదువదొడంగెను.

సుగుణమణి యారవ తరగతివరకును జదివినది. తనకు ప్రాయము రాదొడంగినది మొదలు బడిలోనికి వెడలుట మానివైచినది. తెలుగుభాషయం దభిరుచిగలదగుటచే, పనులెన్నియున్నను దీరిక గొదవజేసికొని, సద్గ్రంథముల జదువునలవాటుగలది. ఆమె యెల్లవేళల చదువునందే కాలముపుచ్చక, తనతల్లి కింటియందలి పనులయందుగూడ సహాయముజేయుచు తననామధేయమును సార్థకపరుచుకొనుచుండెను. తనకు ప్రాయమువచ్చినది మొదలు తనమనంబును విజ్ఞానరావునందే నిలిపి యాతనినే పెండ్లియాడ దలంచియుండెను. తనతల్లిదండ్రులుగూడ తనకోరిక కనుగుణముగ జరియించుచున్నట్లు గ్రహించి ద్విగుణీకృతోత్సాహముగనుండెను. విజ్ఞానుడు తన యింటికనేకమారులువచ్చుచుండినను, ఆమె కాతనితో మాట్లాడుటకైన వీలు చిక్కలేదు.

వీలుచిక్కినను లజ్జాభయరజ్జు వామెను వెను
కకు లాగివైచుచుండెను.

విజ్ఞానుడు భోజనముజేసి, యింటియొద్ద
కాలేజీ హాస్టలులోని కనిచెప్పి రామారావు
గృహంబునకై బయలుదేరెను. వీథితలుపులు
తెరచియుండుటచే విజ్ఞానుడు లోన ప్రవే
శించి, రామారావుగదియొద్దకు వచ్చి గుమ్మ
ములో నిలుచుండి సుగుణచదువుటను విను
చుండెను. కొంతసేపటికి కామె పైకిజూచి
గుమ్మములో విజ్ఞానునిగాంచి త్రపావశయై
గదిని వదలిపోవ యత్నించెను; గాని యాతడ
డ్డముగా నిలువబడుటచే వీలులేక అట్లే నిలు
వబడిపోయెను. ఆమెకు యెవ్విధమైన సిగ్గోజన
నాతని బలుకరింపవలెనని కోరిక వొడమెను.

విజ్ఞానుడా వామెం గాంచుచు అట్లే
నిలువబడిపోయెను కొంతతడవున కాతనిశరీర
మంతయు చెమటచేదడిసిపోవుచుండెను. ఆతని
విశాలనేత్రము లశ్రుపూరితము లగుచుండెను.
ఆతనిపెదవులు వణక దొడంగెను. సుగుణ
యిదంతయుగాంచుచు భీతచేతస్కయై తల్ల
డిల్లదొడంగెను విజ్ఞానుడు, పొంగిపొరలి
వచ్చు తనదుఃఖము నెట్టకేల కాపికొని 'సుగుణ
ముఖారవిందముం గాంచుభాగ్య మిదియే
తనకు కడసారియేమో'అనియు, నింకనేవియో
కొన్నివచనంబుల జెప్ప నాతనిమాటలు తడ
బడదొడంగెను. గద్గదికస్వరయై యాసుగుణాల
లామ యెట్టకేలకు కారణంబడుగ నాతడు
తనతల్లిదండ్రుల యుద్దేశముం జెప్ప నామె
వాతాహతింబడిన వల్లికవలె పడిపోయెను.
* * * * సుగుణ కొంతసేపటికి తెలివి
నొంది తనకు విజ్ఞాను డుపచారములు సేయు
చున్నట్లు గ్రహించి, మెల్లనలేచి నిలువంబడి
యెను. అపుడు 'సుగుణా! దైవానుగ్రహ ము
న్నచో మనకనుకూలముగ జరుగకపోవునా?
మనమంత దీనికై వెరవగూడదు. నేను మును
పటివలె మీయింటికివచ్చిన నాతలిదండ్రులను
మానపడియెదరు. వీలగునప్పుడెల్ల వచ్చుచు
ండని యనునంతలో 'సుగుణా! అన్నయ్య
వచ్చినాడు. తలుపుదీయు" మని కేక లోనుంచి
రా నాపె వెడలలేక వెడలెను.

విజ్ఞానుడును రామారావుతో సం
మూలుగా మాటలాడి తరువాత తనయింటికి
వెడలిపోయెను.

౮

నాటినుండియు సుగుణగృహంబున విచా
రమానసయై మెలగదొడగెను. విజ్ఞానుడు
మునుపటివలె తరుచుగా తన్ను జూచుటకు
వచ్చుట మానుటచే, నామె 'విజ్ఞానుని జూచు
భాగ్యమునకైనను నోచనైతి'నని, నెమ్మనమున
దిగులుపడజొచ్చెను. ఆమె విజ్ఞాను నెంతయు
ప్రేమించినది. ఇపుడామె యాతనిసందర్శనమే
లభింపనందున, నికముం దాతనిం దాను వివా
హమాడుట కల్లయని మిగుల బెంగగొనెను.

పెద్దదియై పుష్పించుట కుద్యమింపనున్న
యాప్రేమలత విలయకృశంబున కెరయగు
చున్నది. ఆహా! ఎవ్వరికైన నాపరమేశ్వరుని
తలంపులు దెలియ శక్యముగాదుగదా!

చివర కామె మంచము బట్టెను. దిన
దినమున కామె శరీరము కృశింపదొడంగెను.
విజ్ఞానునకు సుగుణం జూచుకుతూహల మమెం

డగుచుండెను. ఆతడు సుగుణక్షేమమును ప్రతి దినంబును రామారావు నడిగి తెలుసుకొనుచు నేయుండెను. ఏదినంబున కాదినమే విరక్తిచే నామెను జూచుట కశ్రద్ధ చేయుచుండెను ఇటుల నెలదినములు గడచిపోయెను. ఒకనాడు రామారావును కళాశాలయందు గాంచ నందున సుగుణ కెటులున్నదో యని త్వర పడుచు సెలవుదీసికొని, విజ్ఞానుడు సుగుణ యింటి కేగెను.

విజ్ఞానుడు సుగుణయున్నగదిం జొచ్చెను.



మెరుపుతీగవలె మెరయు నామెలావణ్యమంత యు వెలవెలబోవుచుండెను. ఆమెశరీరము పాం డించిపోయెను. ఆమె విశాలనేత్రములుమాత్ర మామెవదనమున కింకను వన్నెపెట్టుచునే యుండినవి. ఆమె యప్పటికే మాట్లాడుటలేదు. విజ్ఞానుడామెంగాంచి నిర్ఘాంతపోయెను. అత డామెమంచముచెంత జేరి కన్నీరు కాల్వలు గార విచారించుచుండెను.

రామారావు కొంతసేపటికి "సుగుణా! విజ్ఞాను" డని గట్టిగా జెప్పెను. సుగుణ ప్రయత్నమున తనమనోనాయకుని జూచుటకై నయనంబుల పైకెత్తి తనకరంబు నప్రయత్నమున నాతనిహృదయమున వైచెను. ... ఇంతలో సుగుణ ప్రాణంబు లెగిరిపోవుట గ్రహియించి విజ్ఞానుడు గట్టిగా రోదనము జేయదొడంగెను.

అప్పటినుండియు విజ్ఞానుడు కళాశాలకుబోవుట మానివైచెను. ఒకనాడాతని సహాధ్యాయులు పత్రికలలో "విజ్ఞానుడు మతిభ్రమచే నెక్కడికో పోయెను. ఆతని పట్టి దెచ్చిన పుణ్యాత్ములకు 500 రు. బహుమాన మిచ్చెద" ననియు, పోలీకలు మున్నగువానితో దామోదరుడుగారు ప్రచురించుట చదివిరి.——





# చంద్రగ్రహణము

చింతలపూడి సీతారామయ్యగారు

కలుకుచు సంభ్రమించెడుఁ జకోరము లంబరవీథిఁ; బొంగెడున్
జలనిధి; తెల్వి గాంచెడు దిశల్; విలసిల్లెడుఁ గల్వచెల్వ; యో
చలువలరాయ! నీ పొడుపుఁ బాయలు గోఁచినయంతి; నైన నీ
కిలకల నేఁడు తొలఁగినట్లెఁ గానఁగరా దదియేమి చిత్రమో!

* * * * *

సీ. మాధ్వితోఁ గలఁచితో మాస్వంతసుధనెల్ల, గంగాధరుఁడు కంఠంబునఁ దుండి
ప్రేసితో త్రవ్వితో విఱుగిదా కొలఁదిగా, మడిఁబుడుక లోనఁ జెన్నొత్తియుండి
నమలితో మ్రింగితో నాటదా యుష్ణదా, యేన గానఁ దెమలింప బుసిక యుండి
సుడిసితో నాఁకితో పొడువఁడా కొల్పఁడా, నేయిచేతుఁ గాసేఁడి వేలు పుండి
యకట! మా వెన్నముద్ద సుధామృతరాశి, మాపెలువగుఁ గ్రి మాచందమామ గిట్టి
పట్టి పాలార్చి నీస్పోట్టఁ బెట్టికొంటి, క్రూరఘనహాహస్త్యా! కుతారదంష్ట్ర!

* * * * *

సీ. విరహాశ్రుజలనిధి విరిసె నీ నెమ్మేను, కడు స్రుక్కి వగవకే కలువకన్నె!
క్షుద్వహ్నికీలాళి శోషిల్లె నీమేను, కుములు వందురకే చకోరకాంత!
గాఢవియోగాగ్నిఁ గందె నీ నెమ్మేను, జాలి గానిలుక సితావధూటి!
ఘనపిపాసాపీడఁ గ్రాఁగె నీ నెమ్మేను, జాలి గూలకె మోహనీలతాంగి!
ప్రకృతివశమున గ్రహచారబలమునను, వెలుగు నిలుగులు సన్మార్గగాములకును
నైన నేమాయె నేచాయ నరిగె నేమి, యమృతమయమూర్తి గాంచె మాయాత్మవిభుఁడు

ఉ. స్నానములందు మంత్రపఠనంబుల ధర్మములందు నిశ్చల
ధ్యానములందు భూరితరదానములందుఁ దపోవ్రతాద్యను
ష్ఠానములందు భక్తిమెయి సంభ్రమపాటు వెలార్చుచుండి రీ
మానవులాసుకల్ భయము మానుడు క్రమ్మఱ వచ్చుఁ జెచ్చెరన్

# జొన్న? కఱ్ఱ.

తాపి ధర్మారావు గారు

## 1

## స్వీయ చరిత్ర



"జొన్నకఱ్ఱప్రశ్న" అని వాడుకలో నున్నది కదా! కొందఱు జొన్నకఱ్ఱయనిన, మఱి కొందఱు చొప్పదంటందురు. కాదేని, కుండమార్పులు చేసి, "చొప్పకఱ్ఱ"యనియు "జొన్నదంటు" అనియు వాడుకొనవచ్చును. అటుగాక వీనిని కట్టగట్టి చొప్పకట్టప్రశ్నయనియు ననదగును. అందున దప్పేమియు లేదు. అట్లని మనవారికి సహనభావము కలదందురా! ఈలాగున పలికిన పడమటివారికి పట్టదు. అట్లుచ్చరించిన నుత్తరాదివా రొప్పుకొనరు. తూర్పువారు తోచినట్లు పలుకుదురు. ఇంక దక్షిణాదివారో వారికి చొప్పతోగాని జొన్నతోగాని పనియున్నట్టు కానరాదు. తినుట కున్నను లేకపోయినను తీయుటకు మాత్రము రాగములు వారికి గలవు. సంగీతమునకు జన్మస్థానమని చంకలు గ్రుద్దుట దక్షిణాదివారికి తల్లిపాలవాటివని తలంపు. అందుచేత వారికి జొన్నకఱ్ఱప్రశ్నయు లేదు; చొప్పదంటుప్రశ్నయు లేదు. వారి కున్నది మృదంగసందేహము. మృదంగసందేహము ముచ్చవలముతో తీఱునట, గాని మనజొన్నదంటుకు మాత్రము తెన్నున్నట్టుల వాడుక లేదు.

ఏతీరున బల్కినను, భావము మాత్ర మొక్కటియే. మనకప్పుడప్పుడు గలిగిన ధర్మసందేహముల నితరు లామోదించనప్పుడు, వారొనర్చిన నామకరణ మిది. సందేహమున కీపేరు పెట్టి పిలువగానే యందరు నవ్వుదురు. అడిగినప్రశ్నమునకు హాస్యము సేయుటయో, అనుకరించిన యుపమానమున కామోదించుటకో, యా నవ్వున కర్థమేమగును! నవ్వుదురు. నవ్వనిండు. నవ్వెడి వారికి ప్రపంచమంతయూ నవ్వే. ఏడ్చెడువారికి లోక

మంతయు నేడుపే. నవ్వినంతమాత్రమున ప్రమాద మేమి యు లేదు. నవ్వునపుడు నాలుగువిధముల రక్తము ప్రవహించి శరీరమును తేలికచేయును. ఏడాది దాటనిబిడ్డల కేడుపెట్లు మంచిదో చేతగాని వారికి చిఱునవ్వునట్లే లాభకరము. కాని పెద్దలు "నవ్వు నాలుగువిధముల చెఱుపు" అని చెప్పియున్నారు. అందులో నసందర్భపునవ్వు నవ్వినప్పు డాత్మకు గోచరముగు నాందోళనము మొదటివిధము కానోపును. పాపము మొదట ముక్కుమొగము తెలుగక నవ్వేను. తరువాత నసందర్భమని తానను గాని నవ్విన ప్రశ్నకు విశేష ముగు నర్థ మున్నట్లు బోధపడును. అదిగో, అట్టి సమయములో నవ్వు నాలుగు విధములేకాదు; నలుబదినాలుగు విధములనుగూడ చెఱుపునని చెప్పవచ్చును. కాబట్టి, యొకగు నవ్వుదురనియో, నవ్వినారనియో సందేహములను కడుపులో నుంచుకొనరాదు. సందేహము కలిగినప్పు డడుగవలసినదే; సమాధానము సాధ్యమైతే చెప్పవలసినదే. అడుగవలసినవన్నియు నడిగిననేకదా తెలిసికొనవలసినవన్నియు తెలియును. కనులు తెఱచికొని జీవించువానికన్నియు నడుగవలసినదే.

అయిన "జొన్నకఱ్ఱప్రశ్న యేమిటి?" యని యొకపండితు డడుగును. దీనికి బదులేమిటి?— జొన్నకఱ్ఱనుగూర్చిన ప్రశ్నయని; తత్పురుష సమాసము. "సరి సరి! తత్పురుషము తగులబడినట్లున్నది. అంతయు సంస్కృతమున నే యేడువరాదా? అనిమరల ప్రశ్న. సంస్కృతములో చెప్పవలెనన్న, మొదటి జొన్నకఱ్ఱ తెలుగుది. అది పుట్టినది తెలుగుదేశమున. దానిని తినుచుండినది తెలుగుదేశపుమాడ. "ఈద్వారమున రా లేదేమి"? యనియడిగిన మహానుభావు డాంధ్రుడు. కాబట్టి పండితునకు కోపమువచ్చిన వచ్చునుగాని, యతడు చెప్పినట్టు లంతయు సంస్కృతమున నేడువరాదు. సమాసము కొఱకు సంస్కృతము మీదబడిన, చరిత్రకు సరిపోదు. "అట్లయిన, తెలుగుననే యంతయుఁ జెప్పరాదా ?" యని యడుగును. చూచితిరా? అడిగినవాని కడ్డులేదు, చెప్పుచున్నవాడు చిదిగిపోవును. అంతయు తెలుగున చెప్పుటకు వీలులేదు. వీలు లేకపోవుట పండితులపాపము; మే మేమిచేయుదుము? ప్రశ్నయనుమాటకు తగిన తెలుగు లేదు. అడుగుకొనుట కాంధ్రులకు కావలసినన్నియున్నవి. కాని, యడిగినదాని కాంధ్రములో మాట లేదు. 'అడిగినది' యని 'అది' మీద పడవలయును. "అది" ఆంధ్రులకు అమర తరువువలె అగపడుచున్నది. జడముల కన్నింటికిని చెల్లునీ 'అది'ని తెచ్చి యాంధ్రులతిపూజ్యు రాంధ్రమిగు నాడునాంధ్రకు గూడ ప్రయోగింతురు. ఆని యొచ్చటి కేగ ననిన, గృహిణి యిట బోయెనని యర్థము. ఇంకొక్కడు సంభాషణమున కారంభమునందే 'అనకాదుగాని' అని యెత్తుకొందురు. అది కాదట; ఏదికానో ఈశ్వరునకే యెఱుక. ఇట్టి 'అది'చేర్చి 'యడిగినది' యనినయెడల, పండితుడు పక్కనట్లు సంస్కృతమున నేడ్చుటకాక, యాంధ్రములో నస్వోరించినట్లుండును. అటుగాక, గాంధ్రనిఘంటువు ననుసరించి 'యడుగుకోలు' అని ప్రయోగించిన, దానియందను దైవమునకు తెలియునుగాని మాటమాత్రము మోటుగా నుండకతప్పదు. కాబట్టి ప్రశ్నప్రశ్నయే. అట్లగుట, మాది జొన్నకఱ్ఱప్రశ్న. నిర్ధారితము ! పాపము పండితునిజిగూడ జొన్నకఱ్ఱప్రశ్నయే యాగాయెను! పోనిండు నాకథ వినుడు.

మాయమ్మ మిక్కిలి భక్తురాలు, ఒకనాడు మానట్టింటి కానుకొనియున్న తనదేవునిగదిలో నామె పూజ చేసికొనుచుండెను. దేవుని గదినిగూర్చి యిచ్చటించితినిగాన లోకములో నామబలము కంటికి కట్టినట్లు కానవచ్చుచున్నది. ఇప్పు డాగదిలో బొగ్గులు పిడుకలు కట్టెలు నిలువచేయుదురు. అయినను "దేవుడుగదిలోనికి పోయి పిడికెడుబొగ్గులుతె" మ్మనియే వాడుక. గదిలోని దేవుడు గతించిపోయినను, కాలుమోపుటకు వీలు కానట్లు కట్టెలతో నిండినను, అది యింకను దేవునిగదియే. నామబలమనిన నిజమే. ఈబలము బ్రాహ్మణ్యములేని బ్రాహ్మణునందును, నాచారము లేని యాచార్యునందును నేటికిని కానవచ్చుచుండును. అట్లు మాయమ్మ దేవపూజ చేసికొనుచుండగా, నేను వీధిబడినుండి వచ్చి, నట్టింటిద్వారమున కెదురుగ పడియున్న చాప మీద పండుకొని పదునేసవయొక్కమును వల్లెవేయుచుంటిని. మా పెద్దమంచమునకువలె చాపకు తలదిక్కునియు కాలిదిక్కునియు నిర్ధారణ లేకపోవుటచేతను గాభోలు

నేను పండుకొనియుండగా నా కాళ్లు దేవునితట్టు నూటిగా నుండెను. మాయమ్మకు కోపమువచ్చి, "ఛీగాడిదలాగ దేవునిదిక్కు కాళ్లు పెట్టితివి. తీయు" మని గద్దించి చెప్పెను. నే నతిభయముతో నింకొకదిక్కునకు కాళ్ల మఱ్ఱదిప్పి, యూరకొనక "అమ్మా! యీదిక్కునమాత్రము దేవుడులేడా" యని యడిగి, "ఇందు గల డందు లే డనుసందేహమువల" దని మాయమ్మ నేర్పిన పద్యము నే చదువుచుంటిని. అంత మాతల్లి "ఛీ, యీజొన్నకట్టిప్రశ్న లడుగక అవతలికి పో" మ్మని నన్ను సన్మానించెను. నేనును లేచి వెలుపలికి పోయితిని.

సాయంకాలము "ప్రభవ విభవ" చెప్పుకొని బడినుండి నేను తిరిగి యింటికి వచ్చినప్పటికి, మాయమ్మతో నిరుగుపొరుగున నుండునమ్మలక్కలందఱు మాటలాడుచు కొలువుచేయుచుండిరి. నన్ను చూచినతోడనే మాయమ్మ "అమ్మా, వీడు పట్టిజొన్నకట్టి!" యని యారంభించి నా తెలివితేటలను వారికి కొంత తెలియపఱచెను. వారిలో గొందఱుగూడ నాప్రశ్నల కంతకుముందు దాపటపట్టినవారై యుంటచేతనో యేమో యాదినము మొదలుకొని నన్ను "జొన్నకట్టా!" యని ముద్దుపేరున బిలుచుచుండిరి. తెల్లతెల్లగ, పొడుగుగ, సన్నముగ, జుంజురులను ప్రేలవైచికొనియుండుటచేత నట్లు పిలుచుచున్నారనియే తలుచుచు, పలుకుచుంటిని. గూఢార్థము బోధపడుసరికి, గుండె గుభిల్లుమన్నది. గుభిలుమన్న దేకాని గుణముమాత్రము పోలేదు, సందేహములును తక్కువపడలేదు. చదువు కొంత చదివితిని. ఇంతయో యంతయో యుద్యోగము చేయుచున్నాను. నలుగురిలో తిరుగుదును. ధనములో జోక్యము లేకపోయినను, మర్యాద నిచ్చిపుచ్చుకొందును. కాని, సందేహములు పోలేదు. గ్రంథములు చదివినప్పుడు సందేహమే, గర్భగుడిలోనికి పోవునప్పుడు సందేహమే. శాసనసభలన్న ప్రశ్నలే. చాకలివానిగన్న ప్రశ్నలే. అక్షరముచూచిన నడుగుటే. నక్షత్రముగాంచిన నడుగుటే. ఇట్లు సర్వత్ర జొన్నకట్టినే; అదిమాత్రము నిజము. సమాధానము దొరకినా చంకలు గ్రుద్దుకొందును. దొరకనప్పుడు తల్లడిల్లుచుందును. కాని యుద్యోగముచేతను విద్యచేతనే కాక, నెఱసిపోవుచున్న తలవెండ్రుకలచేతనుగూడ పెద్దవాడనగుచుండుటచేత గాబోలు, మొదటి యమ్మలక్కలు నన్నిప్పుడు జొన్నకట్టి యని పిలుచుట లేదు. అయినను నభ్యాసముచేతనేమో నా కాపేరు ముద్దుగానేయున్నది. నామకరణమునాడు నాయనగారు పెట్టినపేరుకన్న నానాడు మాయమ్మగారు పెట్టిన యీపేరే బాగున్నది. ఈనామమునుబట్టి నానక్షత్రము తెలియకపోయిన పోవునుగాని, లక్షణములుమాత్రము చక్కగా తెలియును. పేరన్న నిట్టిదే పేరు. కాకపోయిన పేరుపొందనివారెవరుగలరు? మంచిదో చెడ్డదో చిన్ననాడే పేరుపొందుదును. పేరు నిలువబెట్టుకొనువాడే ధీరుడని యందఱు నెఱుగుదురు. నాకు నదే కుతూహలము. నాజొన్నకట్టి నామము నాచంద్రతారార్కము నిలువబెట్టుటకే యీప్రయత్నము.

ఇంతియే కాదు. ఈప్రయత్నమువల్ల నేను పెద్ద ఋణమునుండికూడ విముక్తుడ నగుదును. ఎట్లనిన, నీజొన్నకట్టిగుణము నాకెన్నివిధముల మేలుచేసెను. చదువుసాములసహాయము చేసెను. ఉద్యోగమున కుత్సాహము నిచ్చెను. చరిత్రకు చేయూత నొసంగెను. మతములో మంచిచెడ్డ లెఱిగించెను. సంఘజ్ఞానము చక్కబరచెను. దేశవిశేషములు తేటచేసెను. ఇంక నెన్నియో విధంబుల లాభకారి యాయెను. యిట్టి యీజొన్నకట్టికి నాకృతజ్ఞతను జూపుట ఋణవిముక్తి కదా!






సాహిత్యసరస్వతి సీరిపి ఆంజనేయులు గారు

III

౮. గాయత్రీగీతలు—

ప్రణవనామాంకితుండు, సర్వజ్ఞమూర్తి,
గ్రహణయోగ్యుఁడు, నానందకరుఁడు హితుఁడు
సర్వశక్తిస్వరూపుఁడు, నిర్వికారుఁ
డనఁదనర్చెదునినుఁ గొల్తు మహరహంబు. ౧౮

ఆదిమూలుఁ డజుండు, నిరంజనుఁడు,
శ్రితజనోద్ధారకుండు, విస్తృతయశస్వి
నిఖిలలోకైకమాన్యుండు, నిర్వికల్పుఁ
డనఁదనర్చెదునినుఁగొల్తు మహరహంబు. ౧౯

సచ్చిదానందరూపుఁడు, సర్వభువన
రక్షకుఁడు, లయకారకుఁ డక్షరుండు
ఘనుఁడు, ధర్మార్థకామమోక్షప్రదుండు
ననఁదనర్చెదు నినుఁగొల్తుమహరహంబు ౨౦

ప్రభుఁడ! నీదు తేజస్స్వరూప మ్మనిశము
దుఃఖకరమార్గములనుండి తొలఁచి, నిత్య
సత్యపథమున మామనీషలను నడుప,
మేము నిను నుపాసించుచున్నాము కనుము.

౯. అభివాదనగీతలు—

పండితులప్రాపు, సుజనులప్రాణధనము
సర్వసత్యోపదేష్ట, సుస్వప్రకాశుఁ
డద్భుతస్వరూపుండు, విశ్వాత్మకుండు,
నన విరాజిల్లు నీకు వందనశతంబు. ౨౨

పరమహితకారి బుధులకు, పావనుండు,
సాక్షిభూతుఁడు జగతికి, సర్వమయుఁడు,
నేత బ్రహ్మాండమునకు, సనాతనుఁడు,
నన విరాజిల్లు నీకు వందనశతంబు. ౨౩

శివకరుఁడు సుఖాత్ముండు నశేషసౌఖ్య
దాయి భక్తవరదుఁడు సత్యస్వరూపి
మంగళాగుం డజన్ముండు మహితమూర్తి
యన విరాజిల్లు నీకు వందనశతంబు. ౨౪

౧౦. సమర్పణము—

ఓ మహేశ! దయానిధి! మే మొనర్చు
నఖిలసత్కర్మములు, నీకె యర్పితంబు
లయ్యెడును. చతుర్విధపురుషార్థములను
బొంది, మే మందుచే నిన్నుఁ జెందఁగలము.

దేవ! నీవెప్పుడు—






ఆచార్య పప్పు పార్వతీశంగారు, యమ్. ఏ., బి. ఎస్. సి.

(ఎనిమిదవ సంచిక తరువాయి)

## భూపదార్థములు

భూమియొక్క శిలలయందు మూలపదార్థములు డెబ్బదిరెండువరకున్నను నందులో ముఖ్యమైనవియు విరివిగా దొరకునవియు కొన్నిదిమాత్రమేయై యున్నవి. అవి యేవి యనిన; (1) ప్రాణవాయువు (Oxygen) (2) శైలము (Silicon) (3) అంగారము (Carbon) మిక్కిలి విశేషముగా గలవు. పిమ్మట 'అల్యూమినియము' (Aluminium) 'ఖటికము' (Calcium) 'మెగ్నీషియము' (Magnesium) 'పొటాసియం' (Potassium) 'సోడియం' (Sodium) 'ఇనుము,' చాలవరకు భూపదార్థములందు దొరుకును. మరియు 'భాస్వరము' (Phosphorous) 'గంధకము' (Sulphur) 'ఫ్లోరినం' (Florine) 'మాంగనము' (Manganese) 'భారం' (Burium) కొంతవరకు మాత్రమే భూమియందు దొరుకును. ఈ మూలపదార్థములలో రెండు గాని రెండుకంటె నెక్కుడుగాని చేరి ముఖ్యమైన ఖనిజములుగా నేర్పడుచున్నవి. ఇట్టి ఖనిజముల స్వభావమును నిర్ణయించుటకు వాటిప్రత్యేకస్ఫటికాకృతియు, గట్టితనమును కాంతియు, సాంద్రతయు, గరిమయు బీటలును, నవి పగులువిధమును, వాటిచూర్ణముల రంగును తోడ్పడును. 'సూక్ష్మదర్శిని' యంత్రసహాయమునగూడ వాటిస్వభావమును పూర్తిగనిర్ణయింపవచ్చును. శైలమును, ప్రాణవాయువును గలసిన పదార్థమే 'యిసుక' గా వ్యవహరింపబడుచున్నది. ఇది కొన్నిశిలలందు స్ఫటికాకృతిని గూడ దాల్చుచున్నది. రసాయనశాస్త్రజ్ఞులు దీనిని 'సిలికిత' మని (Silica) పిలుచుచున్నారు. ఇట్టి సిలికితము 'అల్యూమినియం' తో గలసి 'అల్యూమినియా సిలికిత' మేర్పడుచున్నది 'అల్యూమినియా సిలికిత' మను పదార్థముతో 'సోడియం' గాని 'పొటాసియం' గాని 'ఖటికము' గాని లేక వీటిలో నొకటికంటె నెక్కుడుగాని గలసినయెడల 'ఫెల్డుస్పార్' (Feldspar) అను తెలుపు రంగుగల ఖనిజ మేర్పడుచున్నది. ఇది శిలలందు మిక్కిలి విశేషముగా దొరకుచున్నది.

'పొటాసియం' 'అల్యూమినియా సిలికితము' తో జేరి సన్ననిపొరలుగల 'అభ్రకము' (Mica) యేర్పడుచున్నది. ఇది సాధారణముగా తెల్లనిరంగుగలిగి యుండును. అభ్రకముతో ఇనుముకూడ కలసినయెడల నల్లనిఅభ్రకము కలుగుచున్నది.

సిలికితముతో ఇనుము, మగ్నీషియం, సున్నము కలసినయెడల 'హారన్ బ్లెండు' (Horn-blende) 'పైరాక్సీన్' (Pyroxene) అనునల్లని లేక యాకుపచ్చని ఖనిజము లేర్పడుచున్నవి. చూపులకును, రసాయనికముగను నీరెండు పదార్థములు సమానముగ నున్నను కొన్ని ప్రకృతి భేదములచే వీటిని బోల్చవచ్చును.

సిలికితములో మగ్నిషియం నీరు గలసి 'టాల్కు' (Talc) అనుపదార్థ మేర్పడును. ఇది మిక్కిలిసన్నని పొరలుగల మెత్తనిపదార్థము. దీనితో 'మోము మెఱుగు పొడి' (Face-Powder) చేయుదురు.

సిలికితముతో మగ్నీషియం కలసినయెడల 'సర్పెంటైను' (Serpentine) అను మిక్కిలి మెరుసుగల ఖనిజ మేర్పడును.

ఇంతవరకు సిలికితములో యితరలోహములుగలసి యేర్పడుఖనిజములగూర్చి వ్రాసియుంటిని.

బొగ్గు, ఖటికము కలసి చలువరాళ్లును (Marbles) 'సున్నపురాళ్లు'ను (Limestones) నేర్పడుచున్నవి.

ఈ సున్నపురాళ్లతో 'మగ్నీషియం' చేరినయెడల 'డోలమైటు' (Dolomite) అను ఖనిజ మేర్పడుచున్నది. దీనిని బట్టీలలో గాల్చి సీమెంటున కుపయోగపఱుతురు.

గంధకముతో ఇనుముగాని రాగిగాని సీసముగాని తుత్తినాగముగాని గలసి చొకమైనస్ఫటికాకృతి గల పసుపుపచ్చనిధాతువు లేర్పడును. ఆ యా లోహముల యుత్పత్తికీ ఖనిజము లెంతయు నుపయోగకరములు.

రాతియుప్పు భూమియందు సముద్రములు మేటవేసి వాటి నీరావిరిరూపముగా గాని మఱియితరరూపముగా గాని హరించినయెడల యేర్పడును. ఇనుము శిలలయందంతట నణురూపమున వెదజల్లబడియున్నను గొన్ని స్థలములందుమాత్రమే ప్రొడ్డై లోహములు దీయుట కుపయుక్తములై యున్నవి.

మూలశిలలు పైజెప్పబడిన ఖనిజములలో రెండుగాని యంతకు మించినసంఖ్యగలవి గాని కలసి యేర్పడుచున్నవి. 'గ్రానైటు' (Granite) అనుమూలశిలయందు శిలాస్ఫటికమును, ఫల్డుస్పారును, అభ్రకమును శుద్ధమిశ్రణముగా గలసి యేర్పడుచున్నవి. ఇట్టిరాళ్లు పెద్దవిగ్రహముల జెక్కుటకును, స్తంభముల జేయుటకును మిక్కిలి యుపయోగపడుచున్నవి. ఇవి మిక్కిలి యందముగాను, గట్టిగాను నుండి చాలకాలము శిథిలము గాకుండ నుండగల్గుటచే నెంతయు భవనములకును, స్తంభములకును నుపకరించును. దీనిని నల్లరాయి యని వ్యవహరింతురు. మూలశిలలయందుండు ఖనిజములబట్టి వేఱువేఱువిధములగు శిల లేర్పడుచున్నవి. పొరలుగల శిలలు మూలశిలలనుండియేర్పడుటచే నటుగూడ కొంతవరకు మూలశిలలయందుండు ఖనిజస్ఫటికముల సమ్మేళనముచే నేర్పడుచున్నవని యూహింపక తీరదు. మూలశిలలయందుండుఖనిజము లన్నిటిలో శిలాస్ఫటికము మిక్కిలి గట్టిదియగుటచే శిలలయందుండుపదార్థములన్నియు కరగి రజోరూపమున నన్యప్రదేశములకు నీటిచే గొంపోబడినను నిది(శిలాస్ఫటికపుముక్కలు) మాత్రము మిగిలి ఇసుకగా బరిణమించుచున్నది.

## గనులు

పైనజెప్పిన ఖనిజము లొక్కొకచో శిలలతో గలసి యుండక వేరుపడి విడిగా ఘనీభవించుటయు గలుగుచుండును. అట్టిఖనిజములు మిక్కిలి యుపయుక్తములగు నమూల్యలోహములున్నయెడల నవి లోహపుగనులుగా వ్యవహరించుచున్నారు. భూగర్భమునందుండి వెలికుమ్ము పదార్థరాశితోపాటు లోహఖనిజములు భూమిపైకి వచ్చుచున్నవి. ఇట్లు కరగి వెలువడుభూగర్భపదార్థములు గట్టిపడునప్పుడు లోహఖనిజములు వేఱువేఱుగ ఖండముగా జేరి ఘనీభవించుటయు నొకానొకప్పుడు తటస్థించును. అప్పుడప్పుడు కరగినపదార్థములు ఘనీభవించి శిలలుగా నేర్పడునపుడు గానవచ్చుబీటలయందున నీలోహఖనిజములు చొచ్చి ఘనీభవించి గనులుగా నేర్పడును. ఇట్టిమూలశిలలు నీటిచేగాని వాయువుచేగాని శిథిలమై పొరలుగల రాయిగా నేర్పడునప్పుడు యీ లోహఖనిజములుకూడ పొరలుగలశిలలందు వ్యాపించుటయు దటస్థించుచున్నది. భూమిపైనుండుమూలశిలలనుండియు, పొరలశిలలనుండియు లోహఖనిజములు కొంతవరకు నీటిచే నన్యప్రదేశములకు గొంపోబడి భూమియొక్క బీటలయందును, రంధ్రములందును, గుహలందును ప్రవేశించి యచటగనులుగా నేర్పడుచున్నవి. స్వీడెన్ దేశమునందినుపగనులు భూగర్భమునుండి వెలువడినశిలలందు మిక్కుటముగా దొరకుచున్నవి. ఇంగ్లండు దేశమునందు కార్న్వాలు షైరునందు నాగ్తుతుంపుటకునందు విస్తారముగా దొరకుచున్నవి. మాంగనీసు (Manganese) అనులోహము హిందూదేశమునందు జాలచోట్ల దొరకుచున్నది. విశాఖపట్టణమునందు గొంతకాలముక్రిందట మాంగనీసు లోహముగలకొండను గనిపెట్టి దాని నాలోహముకొరకు ద్రవ్యలుకొట్టుచు వచ్చిరి. బంగారము భూమియందంతటను రజోరూపమున వ్యాపించియున్నను గనులుగా ద్రవ్వియెత్తుటకు గొన్ని స్థలములందుమాత్రమే లాభకారియగును. విస్తారము బంగారము ఆస్ట్రేలియాయందును, ఉత్తరఅమెరికాయందుగల కాలిఫోర్నియాయందును, దక్షిణఅమెరికాయందు గల బ్రెజిల్ అందును దొరకుచున్నది. ఆఫ్రికా దేశమునందును కొంతవరకు ట్రాన్సువాలునందును, గినీతీరమునందును

దొరుకుచున్నది. హిందూదేశమునందు మైసూరుసంస్థానమునగల కోలారునందు గూడ శిలాస్ఫటికముతో గలసి దొరుకుచున్నది. వెండి అమెరికాయందు మెక్సికోలోను నివాడాలోను స్పెయిన్ దేశమునందును విస్తారము దొరుకుచున్నది. పాదరసము కాలిఫోర్నియాయందును, స్పెయిన్ అందును విస్తారముగా దొరుకుచున్నది. సింహళమునందును చైనాయందునుగూడ కొంతవరకు దొరుకును. తగరము ఇంగ్లండునందును కార్నువాలు, డివను మున్నగాగల ప్రదేశములందు దొరుకుచున్నది. రాగి అమెరికాయందు సుపీరియరుసరస్సునందును, దక్షిణఅమెరికాయందును, సైబీరియాయందును విస్తారము దొరుకుచున్నది. బొగ్గు బ్రిటిషు ద్వీపములందును యునైటెడ్ స్టేట్సునందును, బెల్జియమునందును, ఫ్రాన్సునందును, నింకను నితర ప్రదేశములందును లభించును. హిందూదేశమునందు కలకత్తాకు పశ్చిమమున దొరుకుచున్నది. సైంధవలవణము ఇంగ్లండునందును, స్పెయిన్నందును పోలండునందును, కార్పతియన్ పర్వతపార్శ్వమునందును విస్తారము దొరుకుచున్నది. హిందూదేశమునందు, పంజాబు, సింధు ప్రదేశములందును దొరుకుచున్నది. ఇట్లనే పక్కనయుపయోగ్యమైన లోహములన్నియు గనులుగా ప్రపంచమునందచ్చటచ్చట దొరుకుచున్నవి.

భూతత్త్వశాస్త్రము మిక్కిలి గంభీరమైనదనియు, విషయబాహుళ్యమైనదియు నగుటచే నిట్టివ్యాసమునందు విపులముగాఁజర్చించుటకు నవకాశము లేనందున వెక్కు విషయముల వదలివేయవలసివచ్చినది. ఈశాస్త్రమునందెట్టివిషయములు చర్చింపబడునో స్థాలీపులాకన్యాయముగ సూచించి దీనియందు జరుగుచుల కషీరుచిపుట్టించుటమాత్రమే యీ నాప్రయత్నము యొక్క ముఖ్యోద్దేశము. ఈ సృష్టివైచిత్ర్యములగూర్చి చెప్పునదిగాన సృష్టికర్తయొక్క యనంతశక్తిని, యనంతజ్ఞానమును, అనంతవ్యాపకమునుజాటుచున్నది. మానవుడు కించిద్జ్ఞుడగుటచే నాసృష్టినిగూర్చి పూర్ణముగా గాని, నిశ్చయముగా గాని దెలియచెప్పబోవుట మిక్కిలి సాహసము. భూతత్త్వశాస్త్రమునుగూర్చి మొన్నమొన్నటివఱకు పాశ్చాత్యదేశములందుగూడ దెలియనే తెలియదు. ఇది మిక్కిలినూతనశాస్త్రమగుటచేతను దీనివిషయము సహజముగా దుర్గ్రాహ్యమగుటచేతను నీశాస్త్రమునగల సమస్యలనేకము లింకను ననుమానాస్పదముగనే యున్నవి. మఱియు భూమిపుట్టినచిరకాలమునకు మానవులు భూమియందు జనించుటచే బుట్టుపూర్వోత్తరముల బాగుగ దెలిసికొను నవకాశము లభింపదు. మిక్కిలి యెత్తైన పర్వతములుకూడ నాలుగుమైళ్లుభూమిపైనెత్తును మాత్రమే కలిగియుండుటచేతను, మిక్కిలి యఖాతములగు సముద్రములు సహితము నాలుమైళ్లలోతునే గలిగియుండుటచేతను శాస్త్రజ్ఞులు భూమియొక్క శిలావరణమునుపదిమైళ్లక్రింది వఱకుమాత్రమే పరీక్షింపగలిగియుండిరి. భూగర్భమును సముద్రములయధోభాగమునుజొచ్చి చూచుటకవకాశము లేకపోవుటచేతను భూమి పైభాగమునుండి భూమధ్యబిందువునకు గల దూరము రమారమి నాలుగువేలమైళ్లుండుటచేతను శాస్త్రజ్ఞులింతవఱకు పరీక్షింపగలిగిన భూగర్భము పదిమైళ్లుమాత్రమే యగుటచేతను నీశాస్త్రజ్ఞానము మిక్కిలియల్పము. అట్లయ్యు నీశాస్త్రవిషయమై పాశ్చాత్యులు పలువురు పలుదేశములందు మిక్కిలిపాటుబడి కొంతవఱకు నీశాస్త్రమును సాధించుచున్నారు.



# ప్రేమతత్త్వము

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

(ఉత్తరభాగము)

(ఎనిమిదవసంచిక తరువాయి)



నిష్కామసాత్త్వికప్రేమ

ఐహికాముష్మికసుఖంబు లాసపడని, కతన
సత్త్వమయంబయి క్రాలుకతన
నాత్మవిజ్ఞానకారణమైనకతనఁ
బ్రేమ నిష్కామసాత్త్వికప్రేమ మయ్యె.

క. ఇదియే కావలసినయది, యిదియే దుర్లభము కాని యిదియేజ్ఞేయం
బిదియే మనసున నిలిచిన, సదసత్తుల మార్గమెల్లఁ జక్కఁగఁ దెలియున్.

గీ. అన్నిమతములవారికి నందునందు, భేదభావంబు లేకపోలేదు కాని
విమలనిష్కామసాత్త్విక ప్రేమమందు, భేదమతి యెవ్వారికిఁగూడ లేదు లేదు.

క. మమకార మహంకారము, దమియించి సమస్తభూతదయతో సమభా
వముగల్గి యహింసావ్రత, మమలినమతి సల్పువారియం దిది నిలుచున్.

ఉ. వైరులు తమ్ముఁ దిట్టి పలుబాములఁ బెట్టినఁ దాము వారిపైఁ
గూరిమిఁ జూపి వారొరులకుం గలిగించెడి బాధకుం బ్రతీ
కార మొనర్చుచుండి యపకార మహింసయుఁ దాల్చినట్టి యా
కారము లా మహాత్ములముఖంబున నియ్యది తాండవించెడిన్.

ఉ. చేసినచేత వమ్మయినఁ జింతిల కయ్యది సిద్ధిఁగన్న సం
తోసముఁ జెంద కాత్మసుఖదుఃఖవిచార మొకింతలేక యే
యాసయులేక జన్మము పరార్థముగాఁ దలపోసి యెల్లెడన్
గాసిలు నమ్మహాత్ములముఖంబున నియ్యది నాట్యమాడెడిన్.

చ. పరుఁడొనరించు తప్పుతమపై నిడికొంచును దానఁగష్టముం
బొరసినవారి దుఃఖమును ముందుగఁ దాము వహించి వారికి
న్వరకు హితోపదేశమునఁ బొందొనరించు మహానుభావతా
కరులగు నమ్మహాత్ముల ముఖంబున నియ్యది గానమయ్యెడిన్.

చ. శమము దమంబుఁ గన్నుఁగవఁ జక్కఁగ నిక్కొనియుండ, దానస
త్యములును జేతవాత నొగిఁ దాండవమాడ, నహింస బుద్ధి నై
క్యముఁ గన, సర్వభూతకరుణాకరమై హృదయం బెలర్ప, స
త్త్వము మెయిదాల్చినట్టి సమదర్శులయం దిది గాననయ్యెడిన్.

క. పరమత ధర్మసహిష్ణుత, పరహితచింతనయు స్వార్థపరివర్జనముం
గరుణాపరత యహింసా, పరమార్థజ్ఞతయు దీని భవ్యగుణంబుల్.

ఉ. గౌతమ బుద్ధదేవుఁ డనఘుంబగు సర్వసమత్వభావనన్
భూతదయాపరత్వమున భూపరిపాలన వీతరాగుఁడై
నూతన తత్త్వమార్గము గనుంగొని, ఘాతుకవృత్తిఁ జేసి దు
ర్నీతిఁ జరించులోకము తరింప నహింసను బోధచేయఁడే!

చ. స్థిరమతి సత్యమూర్తియగు జీసుక్రీస్తు మహానుభావుఁ డీ
శ్వరు మతదూతనాఁగఁ దనపాటకుఁ ద్రిప్పుచు భక్తకోటి, ము
ష్కరులకుఁ జిక్కి వారు తనకాయము కీలనుసీలు మేకులం
బరపుచునున్న నోర్చికొని వారిని గూరిమితోడఁ జూడఁడే.?

ఉ. ముందును వెన్కయుం దెలియఁబోలక రోగజరాధిలగ్నమై
కుందుచు నుండు లోకమునకుం బరమౌషధ మీయఁగోరి భూ
మిం దను వెత్తు సత్త్వమన వించు జగద్గురుమూర్తి సచ్చిదా
నంద సుధారసంబు భువనంబునఁ జల్లుచు సంచరింపఁడే?

చ. బహుమతసారముల్ గలిపి బ్రాహ్మమతంబొనగూర్చునమ్మహా
మహుఁడగు రామమోహనుఁడు మానవకోటి తపించు ఘోరదు
స్సహ మతబంధముల్ తలఁగ శత్రుప్రలక్ష్యుచు నున్నఁ బూన్కిమై
సహగమనంబు మాన్పఁడొకో! సాంఘిక సోదరభావపూర్ణుఁడై.

గీ. భూతదయయు నహింసయు మోక్షకారణంబులనుచు హితోపదేశం బొనర్చు
నమ్మహావీరమునివీరుఁ డాదిమైన, యార్హతుల సాత్త్విక ప్రేమ మరుదుగాదె ?

గీ. వెలయ నిష్కామ సాత్త్వికప్రేమమునకు, నిట్టి దృష్టాంతములుగల వెన్నియేని
పులిని మేకను నొక్కచోఁ గలిపి నీరు, ద్రాగఁ జేయు మహత్త్వంబు తనరె నిందు.

క. ఇది వైరాగ్యంబొనరుచు, నిది భక్తిజ్ఞానమార్గ మేర్పడఁ జూపున్
ఇది జీవేశ్వర తత్త్వము, విదితంబుగఁ జేయు దీనివిధు లేమందున్ ?

గీ. ఎందఱెన్నిమతంబుల నేర్పఱించి, జననమరణ ప్రవాహసంసార జలధి
దాఁటిపోయిరో? వారి కందఱకుఁగూడ, నీమహాప్రేమమే నావయయ్యె నిజము.

ఆ. దీని విడిచి యింకఁ దెలియంగ వివరింతు, మతములందు సత్త్వమహితమగుచుఁ
బ్రేమ యెట్లు వెల్లి విరిసిలోకంబున, నలమికొనెను చూడఁ దఱుఁగతుల.

క. కనుఁగొన నీశ్వరుఁ డా లేఁ, డనునాస్తిక మతములందు నాత్మప్రేమం
బొనరుట ముందుగ దానిని, వినిపింతు మతంబు కూర్మి విషయంబగుటన్.

నాస్తికమతములు - ఆత్మప్రేమ

చార్వాకమతము :—

గీ. అసువులంగూడు దేహమే యాత్మకాని, యరయ దేహంబుకంటె వేఱాత్మలేదు
అంగనాలింగనాదిజన్యంబు సుఖము, పరమపురుషార్థ మిది బృహస్పతి మతంబు.

గీ. స్వర్గమనునది లేదపవర్గమనుట—కల్ల, వేదంబు శాస్త్రంబు కల్పితంబు
కర్మకాండంబు ఫలదాయకంబుగాదు, పారలౌకిక మాత్మనా భ్రాంతి వలదు.

గీ. పరులకష్టంబు తొలఁగింపవలయుఁగాని, జీవహింస యొకప్పుడుఁ జేయరాదు
త్రోసికొనివచ్చు దుఃఖంబు తొలఁచివైచి, సౌఖ్యమొందుట యొక్కటే జన్మఫలము.

గీ. చావు తప్పించికొనుట యశక్యమగును, మంటఁగలిసిన దేహంబు మరల రాదు
తగినసౌఖ్యంబు గనుటయే జన్మఫలము, కాన సుఖజీవనము చేయఁ గడఁగవలయు.

చ. అరయక యంగనాదివిషయంబులు దుఃఖముతోడివంచు ని
ర్భరసుఖసంగమంబున విరక్తినిఁ జెందుట మూర్ఖమార్గమే
వెరవిడిమైన భోజ్యమగు బియ్యముగల్గిన ధాన్యరాసులం
బొరపడి యూఁకయుం దవుడు పొల్లును గూడెనటంచు వీడునే ?

గీ. కానఁ బురుషార్థమనఁగ సుఖానుభవమె, యప్పుచేసియునైన నాజ్యంబుఁద్రాగి
బ్రతికినన్నాళ్లు సుఖముగా బ్రదుకవలయు, ననుట దేహాత్మవాదుల యభిమతంబు.

బౌద్ధమతము :—

గీ. కలఁడు లేఁడనువాద మగ్రాహ్యమనుచు, నీశ్వరాస్తిత్వమును నిర్ణయింపకునికి
వేదములఁ గర్మముల గౌరవింపకునికిఁ, బరఁగె నాస్తికమనుపేర బౌద్ధమతము.

గీ. అఖిలవిజ్ఞాని భగవానుఁడనుచుఁదొల్లి, యన్యమతకర్తలకుఁ బూజ్యుఁడైన విశ్వ
మాన్యగౌతమ బుద్ధునిమతమునందుఁ, గానఁబడు సాత్త్వికప్రేమ గలుగ దెందు.

గీ. కర్మ మొనరింపఁ గూడదు కర్మఫలము, ననుభవింపఁ బునర్జన్మ మందవలయు
దుఃఖసంసార మందాశ తొలఁగవలయు, నాత్మవిజ్ఞానమున మోక్షమందవలయు

క. సర్వము దుఃఖము దుఃఖము, సర్వము క్షణికంబు క్షణికసత్త్వాత్మకంబున్
సర్వము నిజలక్షణమగు సర్వము, శూన్యంబటంచుఁ జర్చింపఁదగున్.

క. వీనిని భావనలందురు, వీనివలనఁ గలుగునట్టి విజ్ఞానమునన్
మానవుఁడు తత్త్వవిదుఁడై, మానితమగు నట్టి ముక్తిమార్గము గాంచున్.

క. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ, మానసబుద్ధులను వెనుక మరలించుచు వి
జ్ఞానంబున రాగాది,జ్ఞానం బణఁగింప ముక్తిసంగతి గలుగున్.

చ. పరహితవర్తనంబు మృదుపావన భాషణముల్ విరాగసం
చరణ మహింస సర్వసమసమ్మతి భూతదయోపకారముల్
నరున కవశ్యకార్యము లనఁదగు వీనినిబట్టి ముక్తికిన్
దెరువగు తత్త్వబోధము జనించు నటంచును గౌతముం డనెన్.

ఆర్హతమతము :—

చ. హితమతి లోకతత్త్వము గ్రహించి యథార్థముగాఁగ భక్తసం
తతి కెఱిఁగించు నర్హదభిధానుఁడె యీశ్వరుఁడంచుఁ దెల్పి గ
ర్హితమతి వేదముల్ పరిహరించుట నాస్తికసంజ్ఞఁ జెందె నా
ర్హతమత మిందుఁ బ్రేమము దయామయమై విలసిల్లు వంద్యమై.

క. సమ్యక్చారిత్రంబును, సమ్యగ్దర్శనము నిత్యసత్యాకృతియౌ
సమ్యగ్జ్ఞానంబను నివి, సమ్యగ్గతి మోక్షమునకు సాధనములగున్.

గీ. చిన్న మొక్కనుగూడ హింసింపరాదు, హాస్యమునకైన దబ్బఱలాడరాదు
తనకు నీయనిపండైనఁ దాఁకరాదు, తనకునిచ్చిన మిగులఁ గైకొనఁగరాదు
బ్రహ్మచర్యంబు నాచరింపంగవలయు, ననెడియైదు వ్రతంబుల నాశ్రయించి
యుత్తమంబగు చారిత్ర మొప్పు, మఱియు- నర్హదీశ్వరుఁ డరసినయట్టి జీవ
తత్త్వమఖిలంబు గాంచుట దర్శనంబు, జనమునీంద్రుఁ డెఱింగిన జీవతత్త్వ
సత్యమఖిలం బెఱుంగుట జ్ఞానమగును, మోక్ష మొందఁగ మార్గ మీమూఁడు గలిసి
యేది లేకున్న నిర్వాణ మెనయరాదు, సకలవస్తు విరక్తియు సర్వజంతు
కరుణ యాత్మవివేకంబు గలుగఁజేయు, ననుచు బోధించుఁ బ్రేమ నార్హతమతంబు.

క. పరులకు మేలొనరించుచుఁ, బరమానందంబుగనుటఁ, బరమార్థంబున్
బరికించుచు నిర్వాణం, బరయఁగ గోరుటను బ్రేమ మాత్మార్థమగున్. (సశేషము)

# పచ్చియెరువు

## అందున కుపయోగించు సస్యములు

### (ఒక కృషీవలుడు)

### I

ఏ చెట్టుచేమల రొట్టయినను నేల కెరువుగా నుపయోగింపబడిన యెడల నది 'పచ్చియెరువు' అని పిలువబడును. అడవులందును బంజరునేలలందును బాటలు కాల్వలు మొదలగువాని ప్రక్కలను తమంతట తాము పెరుగు వెంపలి, కసింద, జిల్లేడు, తంగేడు మొదలగుజాతుల రొట్టనుగాని పెద్దపెద్ద చెట్లగు కదుగు వే, కానుగ (కాను), నిద్రగన్నేరు మొదలగువాని రొట్టనుగాని యిట్లెరువుగా నుపయోగించు నలవాటిపుడు చాలచోట్ల గలదు. పూర్వకాలమునందైనను ఇట్టియాచార మున్నట్లును ఇది పరంపరాప్రాప్తమయిన పద్ధతి యనియు దోచును. బసవేశ్వరకృతమని చెప్పబడు నొక చిన్నవ్యవసాయ గ్రంథమునందు* దోహదప్రకరణమున,

"శ్లో. ......................................

జీర్ణద్రవ్యాణి సర్వత్ర దోహదం సర్వభూమిషు.

శ్లో. పూతిద్రవ్యాణి సర్వత్ర కుత్సితాని తథైవచ,

......................................

శ్లో. వృక్షశాఖాకుత్సితం చ తథా పర్ణాదికుత్సితమ్,
కుత్సితం తృణసస్యాది, మృగచర్మాది కుత్సితమ్.

......................................"

అనియున్నది.

పైనిచెప్పినట్లు పచ్చిరొట్ట విశేషముగ లభించుటకు తగిన బంజరునేలలుగాని అడవులుగాని సామీప్యమున లేని ప్రదేశములందు జనుము మొదలగు కొన్నిజాతుల విత్తులను ఎరువువేయదలంచిన ప్రదేశమందే విత్తి సస్యమును కొంతవరకు పెరుగనిచ్చి దాని నందే కలియదున్నివేయుటయే పచ్చియెరువును వేయు విధానము. ఈపనియు హైందవ వ్యవసాయదారులు చిరకాలమునుండి చేయుచు వచ్చుచున్నదిగనే కన్పట్టుచున్నది.

వృక్షాయుర్వేదమందు:

"శ్లో. మృద్వీ క్షిప్తి వృక్షాణాం హితా; తస్యాం తిలాన్వాపయేత్, పుష్పితాం స్తాంచ మృద్నీయా త్తత్కార్యం ప్రథమం ధ్రువః

అనియు,

శ్లో. సమ్యక్కృష్టే సమే క్షేత్రే మాషానుప్త్వా తిలాం స్తథా, సునిష్పన్నాన్ [1]సముద్ధృత్య తత్రైవోప్తి రిష్యతే.

అనియు నున్నది. మరియు బలరామ కృషిశాస్త్ర[2]మను మరియొక చిన్నగ్రంథమున

శ్లో. ఉడు[3]రాంశ్చ తిలాంశ్చైవ వాపయేచ్ఛిద్రమాపకే, కుత్సితంతు లతాపత్రం దోహదంతు విధీయతే.

అనియున్నది.

ఏ పొలమందైనను ఇతర స్థలముల పెరిగిన ఆకలములను దెచ్చి వేసి త్రొక్కనిచ్చినచో నవి మంటిలో గలసిపోయి వానియందలి ద్రవ్యములు(ఆయాభూములనుండి

---

* ఇది యముద్రితగ్రంథమని దోచెడిని. దీని నకలొకటి విజయనగరమునందలి యొక మిత్రునిద్వారా నాకు లభించెను. ఈ గ్రంథకర్తయగు బసవేశ్వరు డెవరో, ఎప్పటివాడో, విషయమునుబట్టియు, శైలినిబట్టియు నిర్ణయింపవలసియున్నది. ఇది మిగుల చిన్నగ్రంథము. దీనిని ప్రచురింప ప్రయత్నించెదను.

(1) సముద్ధృత్య అనుటచే బాగుగ పెరిగినవెనుక వీనిని పీకవలెనని మాత్రమే గ్రహింపదగును. మరల నందు కలియదున్ని పిమ్మట విత్తులను జల్లవలెనను భావము అధ్యాహారముగ గాన్పించును.

(2) ఇదియు నముద్రితమనియే తోచెడిని. దీనినిగూడ ప్రచురింప యత్నించెదను.

(3) ఈశబ్దమున కర్థము తెలియుటలేదు. మినుమైయుండవలెనేమో.

తీసి కొనబడినవి) ఈపాలమున చేరును. ఇదియేకాక ఇట్టిస్థూలసేంద్రియ పదార్థములు నేలయందు చీకున ప్పుడు అందు జరుగు కొన్నిమార్పులకు సహాయము చేయును.

ఇతరస్థలముల పెరిగిన ఆకులములను దెచ్చివేయు టకు బదులు ఏపొలముకాపొలముననే జనుము మొదలగు సస్యములనుబెంచి యందే దున్నిన నాసేం కేమిప్రయో జనమని యడుగవచ్చును. జనుముమొదలగు కొన్నిసస్య ములు వానికిగావలసిన ముఖ్యాహారద్రవ్యములలో నొకటి యగు నత్రజనిని నేలనుండి యంతగా దీసికొన నక్కర లేకయే, వాయువునుండి కొన్నిసూక్ష్మజీవుల సహాయ మున సంపాదించుకొన గలుగును. ఇట్లు వాయువునుండి తీసికొనినద్రవ్యముకూడ సస్యమును నేలలో కలియ దున్నినప్పుడు అది చీకుటవలన నేలకు జేరి దానిసత్తువ వృద్ధియగును.

చిక్కుడు పూవులవంటి పూవులను బూయు జనుము, జీలుగ, నీలి, పెసర, బొబ్బర మొదలగుకాయ ధాన్యజాతులు మాత్రమే సామాన్యముగ పైనిచెప్పినట్లు వాయువునుండి నత్రజనిని సూక్ష్మజీవుల సహాయమున దీసికొనగలుగును. వీని వేళ్లను పరిశీలించినచో వాని యందు సూక్ష్మజీవులనివాసములగు నొకవిధమైన మొటి ములు గానవచ్చును. (క్రిందిపటమునుజూడుడు). ఈతరగ తికి జేరని జాతులవేళ్లపై నిట్టి మొటిములు గానరావు. కావున జనుము, జీలుగ మొదలగు కాయధాన్యపుజా తులు పచ్చియెరువునకు తక్కినవానికన్న ప్రశస్తము. వృక్షాయుర్వేదమున పచ్చియెరువునకుగాను పెంచదగిన విగ పేర్కొనబడిన రెండు సస్యములలోను జనుము కాయధాన్యములలోనిదే కాని నావు ఆతరగతిలోనిది కాదు. కావున నా కాలమున కాయధాన్యజాతులనే పచ్చియెరువుగా నెంచుట మంచిదని యెరిగియున్నట్లు తోచదు. పల్లపుభూములలో పెరుగుచున్న నావునేలను అధికసస్యములు గురిసి పనికిరానివని తోచినప్పుడు పచ్చి యెరువుగా దున్నివేయునాచార మిప్పటికిగలదు. అందు వలన కాయధాన్యపుజాతి పైగాను పెంచి దున్నినచో నంత ప్రయోజనము లేకపోయినను, ఆసస్యము మంటి తో కలిసి చీకుటవలన కొంత మేలుగలుగుటచేతనే అట్టి నేలలో మంచిపంటలు పండుచున్నవి. పాశ్చాత్యదేశము లలో సైతము కొంతకాలమునను పూర్వము అనగా



సూక్ష్మజీవులద్వారా కొన్ని జాతులమొక్కలు వాయువునుండి నత్రజనిని సంపాదింపగలవని తెలిసికొనక పూర్వము అవ మొదలగు కాయధాన్యేతర జాతులను పచ్చియెరువునకుగాను పెంచుచుండిరి.

అడవులనుండియు ఇతర కాళీస్థలములనుండియు తెచ్చివేయబడు రొట్టయందును సామాన్యముగ నత్రజనిని వాయువులోనుండికూడ సూక్ష్మజీవులసహాయముచే దీసికొనగలుగు జాతులరొట్టయే ప్రశస్తము. సామాన్యముగ పచ్చిరొట్ట కుపయోగించు జాతులుకొన్ని ఈ క్రింద పేర్కొనబడును.

**వాయువునుండి నత్రజనిని తీసికొనగల్గునవి:**

1. వెంపలి
2. కసింద
3. తంటెస

} ఈ మూడును ఏటేట పుట్టి పెరుగు ఏకవార్షికములు.

4. తంగేడు — ఇది తుప్పగా పెరుగును

5. కానుగ
6. రేల లేక రెల్ల

} ఇవి పెద్దచెట్లుగా పెరుగునవి.

**అట్లు తీసికొనలేనివి:**

1. జిల్లేడు
2. నేపాళం
3. అంకుడు

} ఇవి తుప్పలుగా పెరుగును.

4. అడ్డసరం
5. వేప
6. గంగరావి

} ఇవి చెట్లుగా పెరుగును.

వాయువునుండి నత్రజనిని దీసికొనజాలకపోయినను జిల్లేడుమొదలగు పాలుగలజాతులరొట్ట సత్తువచేయునని యనుభవమువలన గనుగొనబడెను. అడ్డసరం, వేప మొదలగు జాతులరొట్ట కొంతవరకు కీటకనివారకమని యెంచబడుచున్నది.

పచ్చియెరువునకుగాను ప్రత్యేకముగ పెంచబడు ముఖ్యసస్యము లీక్రింద పేర్కొనబడును. ఇవియన్నియు కాయధాన్యముల జాతిలోనివే.

1. జనుము.
2. జీలుగ.
3. తిగపెసర లేక గొడ్డుపెసర.
4. సీగ.
5. వెంపలి.

ఉలవ, బొబ్బర, వేరుసెనగ, గోరుచిక్కుడు మొదలగునవికూడ పచ్చియెరువునకు పెంచబడి దున్నివేయబడుచుండును.

పచ్చియెరువిప్పుడు దంప నేలలందే విస్తారముగ నుపయోగింపబడుచున్నది. త్వరలో చీకుటకు వీలెక్కువగనుండుటయే యిందునకు కారణము. మెట్టనేలలో పచ్చియెరువును కలియదున్నిన పిమ్మట తగినంతవర్షము లేనియెడల నది త్వరలో చీకక సస్యము విత్తుట కాటంకముగలుగును. ఒకవేళ సస్యమును చల్లినను, నేలయందలి కొంచెపు పదునును, యీసస్యమును, చీకుచున్న పచ్చియెరువును పంచుకొనవలసి వచ్చును. కావున చల్లిన సస్యమునకు మేలుకంటె కీడే హెచ్చుగ గలుగవచ్చును. కావున మెట్టనేలలను పచ్చియెరువువలన బలపరచవలెననిన సస్యమును విత్తుటకుగాని నాటుటకుగాని రెండుమాసములుముందే పచ్చియెరువును దున్నివేయవలయును. ఇట్లుచేసినయెడల నాయెరువు చీకుటకు తగినంత యవకాశముండును.

పైని పేర్కొన్న పచ్చియెరువు సస్యములను విత్తుట కేయేకాలము లనుకూలములో, యేయేసస్యములకు ముందు వీనిని పైరుచేసి దున్నివేయవలెనో, ఎన్నెన్ని విత్తులను జల్లదగునో మొదలగు విషయములు మఱియొక వ్యాసమున వ్రాయబడును.




కావ్యతీర్థ సుద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

మౌనుల్ వృద్ధులు శిష్యభూతులు పరబ్రహ్మైక నిష్ఠాపరుల్
ధ్యానింపంగను జిన్నవానిఁ దననున్ దాఁ బ్రహ్మతత్త్వమ్మునున్
మౌనవ్యాఖ్యను దెల్పునట్టి గురు నాత్మారాముఁ జిన్ముద్రితున్
ధ్యానింతున్ స్మితవక్త్ర హర్షయుతు మేధాదక్షిణామూర్తినిన్.

మ. తనగర్భంబున నున్న విశ్వమును నద్దంబందుఁ గన్పట్టు ప
త్తనరీతిం దనయందె తాఁ గనుచు నిద్రంబోలె మాయన్ జగం
బును బైకిం గనునట్లు చేసి కలుగన్ బోధంబు నద్వైతమూ
ర్తిని జూపించెడువాని కీనతి గురు శ్రీదక్షిణామూర్తికిన్.

శా. బీజంబందున నంకురంబువలె నీ విశ్వంబు ప్రాక్సృష్టమై
భ్రాజిల్లన్ మఱి దేశకాలముల సంబంధంబునన్ మాయచేఁ
దాఁ జూపించిన నింద్రజాలకుని చిత్రంబుల్ యథేచ్ఛం దప
శ్రీప్రౌఢుం డగువాని కీనతి గురు శ్రీదక్షిణామూర్తికిన్.

మ. స్థితిహీనంబులు పంచభూతము లివే దేవేశు సద్రూపమో
శ్రుతులం జెప్ప నెవండు 'తత్త్వమసి' యంచున్ భక్తకశ్రేణికిన్
మృతిజన్మంబులు సంసృతిన్ బడయవో యేదేవు సాక్షాత్కృతిన్
శ్రితసద్బోధకి వాని కీనతి గురు శ్రీ దక్షిణామూర్తికిన్.

మ. పలురంధ్రంబుల కుండలోపలి ప్రదీపప్రజ్వాల దీప్తుల్
వలె నేదేవుని చక్షురింద్రియ ముఖ ద్వారంబులన్ జ్ఞానమున్
వెలికిన్ వచ్చును, యేప్రకాశుఁ దెలియన్ వీక్షింతు నంచెంచి రా
జిలు నీలోకము వాని కీనతి గురు శ్రీదక్షిణామూర్తికిన్.

మ. బహుళభేదమ్ములచే 'నహమ్ము' నెనరుం బ్రాణమ్ము, దేహమ్ము, కుం
ఠితవిజ్ఞానము, శూన్య, మింద్రియము లిన్నింటిం బ్రశంసింత్రు వా
రతిమూఢాంధ వధూశిశూపములు మోహభ్రాంతు లామోహాస
వ్యాప్తిం గావిం చెడువాని కీనతి గురు శ్రీదక్షిణామూర్తికిన్.

శా. మాయాచ్ఛాదముచే గ్రహగ్రసితులౌ మార్తాండ చంద్రోపముం
డై యెవ్వండు హరించి యింద్రియతతి వ్యాపారముల్, నిద్ర స
త్తై యుండున్ మఱి లేచి నిద్రగనినా నంచుం బ్రతిజ్ఞానితా
యుక్తుండగు వాని కీనతి గురు శ్రీదక్షిణామూర్తికిన్.

మ. అల చైతన్య 'మహ' మ్మవస్థలను బాల్యాద్యాదులన్ జాగ్రదా
దుల సర్వంబుల నొక్కపోలిక సముద్భాతంబునౌచుం బ్రకా
శిలు, నారూపము నేనయం చెవఁడు తాఁ జిన్ముద్రతోఁ జెప్పు రా
జిలు భక్తాళికి వాని కీనతి గురు శ్రీదక్షిణామూర్తికిన్.

మ. జగముల్ దీని నపద్యచేత వృతుఁడై జ్ఞానాత్ముఁ డెవ్వాఁడు స్వ
ప్నగతావస్థను మేలుకొల్పునఁ గనుల్ గార్యంబుగాఁ గారణం
బుగ సేవ్యుండుగ సేవకుండు, పితయుల్ బుత్రుండుగా, శిష్యరా
జుగ నాచార్యుఁగ వాని కీనతి గురు శ్రీదక్షిణామూర్తికిన్.

మ. భువియున్ వారియు, వహ్ని వాయువు నభంబున్ భాస్కరుండున్ సుధాం
శువు [illegible]ండును జంగమాచర జగంబుల్ వెల్గు నేదేవుమూ
ర్తివిశేషంబయి, పోరికంఉ నిఁకఁ జర్చింపంగ వే ఉండదో
శివజిజ్ఞాసికి వాని కీనతి గురు శ్రీదక్షిణామూర్తికిన్.

మ. సకలం బాత్మపదార్థమే యనుచు స్పష్టంబౌనటుల్ చెప్పు నీ
యకలంక స్తవముల్ శ్రుతిన్ మననముల్ ధ్యానమ్ము సంకీర్తనా
దికముం జేసిన నీశ్వరత్వము విభూతిస్థానముం గల్గుఁ బా
యక చేకూరును సార్వకాలికము నష్టైశ్వర్యముల్ సొంతమే?





కాశీనాథుని భైరవమూర్తి గారు

శ్లో. గళే రేఖా స్తిస్రో గతి గమక గీతైక నిపుణే ।
వివాహ వ్యావద్ధ ప్రగుణ గుణసంఖ్యా ప్రతిభువః;
విరాజన్తే నానావిధమధుర రాగా కరభువాం ।
త్రయాణాం గ్రామాణాం స్థితి నియమ సీమాన ఇవ తే॥ (సౌందర్యలహరి)

శ్లో. యథాకుటుంబిన స్సర్వే ఏకీభూతా భవన్తిహి, తథా స్వరాణాం సందోహాః గ్రామ ఇత్యభిధీయతే. (సంగీతరత్నాకరం)

కొలదిమంది కలసి యొక కుటుంబమును కొన్ని కుటుంబములు చేరి యొక గ్రామమును నగునట్లు, స్వరమూర్ఛనకును, మూర్ఛనా పరంపరాజనితములగు మేళములకును కారకమగు స్వరసముదాయమే గ్రామ మనబడును.

శ్లో. షడ్జగ్రామో భవే దాద్యా మధ్యమగ్రామ ఏవచ, గాంధారగ్రామ ఇత్యేతే గ్రామత్రయ ముదాహృతమ్.

(శివతత్త్వరత్నాకరం)

ఈ గ్రామములందు షడ్జ, మధ్యమ, గాంధార గ్రామములని మూడు భేదములు గలవు.

శ్లో. గ్రామ స్వరసమూహ స్స్యాత్. మూర్ఛనాదిసమాశ్రయః, తౌ ద్వౌ ధరాతలే తత్ర షడ్జ గ్రామాధిప స్తథా.

(సంగీతదర్పణం)

శ్లో. గ్రామస్వర..............స్యా త్షడ్జ గ్రామ ఆదిమః. (సంగీతరత్నాకరం)

పై నుదహరించిన మూడు గ్రామములలో షడ్జగ్రామము ప్రధానమైనదిగను ఆదిమమైనదిగను నిరూపింపబడినది దీనికిదారాకృణముగ;

శ్లో. షడ్జప్రధాన ఆద్యత్వాత్ అమాత్యాధిక్యత స్తథా; గ్రామే స్యా దవిలోపత్వాత్ మధ్యమస్తు పురస్సరః.

"అవిలోప" యనుటకు "అవిరోధ" యని పాఠాన్తరము—(రత్నాకరం) అనగ

శ్రుతులన్నిటిలో ప్రధానమైనదియు, నాది
యైనదియు నగుటను నీ షడ్జగ్రామము షడ్జ
స్వరము నారంభించిన దగుటను, దీనికి
(షడ్జ గ్రామమునకు) మూడుగ్రామములలో
ప్రథమ ప్రధానస్థాన మొసగిరి. మఱియు
సంవాదిస్వరబహుళము నీ గ్రామమున విశే
షమగుట దీనికి ప్రాముఖ్యము కలిగినదనుట
నిర్వివాదాంశము.

శ్లో. ద్వితీయో మధ్యమగ్రామ స్తస్యో
ల్లక్షణ ముచ్యతే. (సం. దర్పణం—రత్నాకరం)

అనగా ద్వితీయస్థానము మధ్యమ గ్రా
మము వహించుటకు నాధారములు, సప్త
స్వరములలో చతుర్థస్వరమగుటచే మధ్య
వర్తియగుటను మధ్యమము సార్థకనామమును
గాంచి షడ్జమునకు సంవాదిస్వరమై దానిని
పురస్కరించుకొని యుండినది గనుకను అని
యుదాహరించియున్నారు.

ఈ సందర్భమున పంచమముగూడ షడ్జ
మును పురస్కరించుకొని యుండిన సంవాద
స్వరమే కనుక దీనికిమాత్రము గ్రామము
నెందుకు నేర్పాటు చేయలేదని శంకగలుగ
వచ్చును. దీనినిగూడ ఆధునికులలో గొందఱు
తమ మతమును వెలిబుచ్చియున్నారు. ఇది
యును సాధ్యమేకాని, ప్రథమమున నిరువది
రెండు శ్రుతులను షడ్జాదివరుసను నా యా
శ్రుతులలెక్కను పంచికొనివచ్చిన నయ్యావి
సంవాదిభూయిష్ఠములు కానిచో ప్రయోజన
కారి కాదుగదా. అందుకనే యీ బెడదలో
దిగిన మిక్కిలి చిక్కులలో బడవలెననియో
మరెందులకో పూర్వులు దీనిని చేకొనలేదు.
అదియునుగాక సామాన్యముగ మానవశారీర
మున రెండున్నర స్థాయిలకంటె నెక్కుడు
పలుకుట కవకాశముండుట మిక్కిలి యరుదు.
కనుక షడ్జమునకు మరియు దూరమగుచో
నీ రెండున్నర స్థాయీలవరకును గాక మఱియు
నొక యర్ధస్థాయి పోవలసి యుండుటచేతను
విరమించి రనవచ్చును. అట్లయిన ఋషభ
నిషాద గ్రామము లెందుకని గ్రహించలేదు?
షడ్జమునకు దగ్గరనే యుండు స్వరములే
గద యనిన షడ్జమునకు సంవాదిస్వరములు
గాకపోవుటయే కాక వివాదిస్వరములుగూడ
నగుటనని చెప్పనగును. మరియు నొక్క ధైవ
తము మిగిలినది. దీనికని గ్రామాధికారములేమి
పై రెండు కారణములు దీనియందిమిడియుం
డుటచే నని చెప్పవచ్చును గనుక గ్రామాధి
కారము నివ్వబడినవి. షడ్జ, మధ్యమ, గాంధార
ములనియే తేలుచున్నది. ఇదియేమి? ప్రస్తు
తము మనకు గానవ్యవహారమందున్న
పండ్రెండు స్వరములలో దేనినైనను మనము
శ్రుతిగా నుంచికొని పాడినచో దానిపైని
స్వరములు క్రిందిస్వరములు న్యాయసంబంధ
పరిమితిని (Proportion) స్వరస్థానముల జెందు
టలేదా? దీనినిబట్టి అన్నిస్వరములకును అన్ని
గ్రామాధికారము లేల లేకుండవలెను?
బ్రాహ్మణజాతి యని శాస్త్రమున నిరూపింప
బడిన, స, మ, ప స్వరముల ననుసరించిన
షడ్జ, మధ్యమ, పంచమ గ్రామములలో మానవ
లోకమున షడ్జ, మధ్యమ గ్రామముల నంగీ
కరించి, పంచమ గ్రామమును దూరముగ
త్రోసివేయుట యేమి? వైశ్యకులసంబంధ

ముగు గాంధారస్వరాలంబిత గాంధారగ్రామమును స్వర్గమునకు బంపుటేమి? అన్యాయము? సర్వసమత్వమే కావలెను. అనినచో నీ ద్వాదశశ్రుతులననుసరించి నిర్మింపబడు నిరువదిరెండు శ్రుతులలో శేషించిన పది శ్రుతులను వేంకటమఖిగారిచే నేర్పరుపబడిన 72 మేళకర్తలకును విరోధము కలిగించుచున్నది. వారు చెప్పినరీతిని ప్రస్తుతమునగల వీణమెట్లలో ననగా ద్వాదశ శ్రుతులమధ్య శేషించిన 10 శ్రుతుల నెట్లిమిడ్చినదియు తృతీయచక్రమున గాననగును. దీనియందు మొదటిది షడ్జముగను మిగిలిన ఋషభాది స్వరముల ననుసరించు శ్రుతులనుగూడ రి.రి.రి. యనియు, గాంధారము ననుసరించు శ్రుతులు గ. గ. యనియు, నిట్లె ఆయా స్వరములననుసరించు శ్రుతులకు ఆస్వరనామమే సులభముగ దెలియుటకై వ్రాయబడినది. ఇట్లే ప్రథమ ద్వితీయచక్రములు గమనించవలయును. పైన నిరూపించినరీతి నాయా శ్రుతులకు మార్పు గల్గుటచే యీ పండ్రెండు స్వరముల శ్రుతి విభాగము భిన్నమౌటచే నన్నిస్వరములకు గ్రామాధికారము గూడదు. గ్రంథవిస్తరభీతి నిది ప్రస్తుతము విరమితము. ఈకారణముల చేతనో మరే కారణములచేతనో గ్రామ త్రయమునే నిరూపించిరి.

శ్లో. ఏతత్కుల ప్రసూతత్వాత్ గాంధారోప్యగ్రణీ దివి. (రత్నాకరం)

ఈ కులమందు జనిత మగుటచే ననగా ఈషడ్జమధ్యమ పరస్పర సంబంధమువలెనే, షడ్జగాంధార పరస్పర సంబంధము, సంవాది భావము గలదగుటచే గాంధారగ్రామముగూడ నేర్పఱుపబడినది. ఇదియునుగాక,

శ్లో. క్రమాత్ గ్రామత్రయో ర్దేవాః బ్రహ్మ విష్ణు మహేశ్వరాః; హేమన్తగ్రీష్మ వర్షాసు గాతవ్యాస్తే యథాక్రమం; పూర్వాహ్ణకాలే మధ్యాహ్నే పరాహ్ణేఽభ్యుదయార్థిభిః. (రత్నాకర, శివతత్త్వరత్నాకరములు)

అనగా నీ గ్రామత్రయమునకు క్రమముగ బ్రహ్మ విష్ణు మహేశ్వరు లధిదేవతలనియు, హేమన్త, గ్రీష్మ, వర్షర్తువుల యందునను, పూర్వాహ్ణ, మధ్యాహ్న పరాహ్ణముల యందునను అభ్యుదయమును గోరువారు వీటిని గానమున నుపయోగింపవలసినదనియు నిరూపించియున్నారు.

"శ్లో. లక్షణం గ్రామయో ర్వక్ష్యే షడ్జమధ్యమసంజ్ఞయోః; షడ్జగ్రామః పంచమే స్వచతుర్థశ్రుతిసంస్థితే; సోపాన్త్యశ్రుతి సంస్థేస్మిన్ మధ్యమగ్రామ ఇష్యతి"

(సం. దర్పణం—రత్నాకరం, శి. రత్నాకరం)

అనగా షడ్జాదిగ్రామములకు లక్షణ మిచ్చుటలో ప్రథమమున పంచమమును గూర్చి దానిశ్రుతులను నాలుగును గల్గియుండుటచే స్వాభావికమై యుండుననియు, మధ్యమగ్రామమందు ఉపాన్త్యమాధ్యమ శ్రుతిని పొందు పంచమము గలదనియు నిరూపించిరి. (దీనివివరము ప్రథమచక్రమున గాననగును) దీని గమనించిన పంచమ మొక్కటితక్క శేషించినస్వరములన్నియు నీరెండుగ్రామము లందునను సమములే. కనుక పంచమమునే ప్రథమమున నిరూపించినహేతువు (ప్రథమ

చక్రమున చూడుడు) లావుగ వేయబడినగీతలు ప్రక్కన నుదాహరింపబడినస్వరముల నిరువది రెండుశ్రుతుల నడుమను, తత్తత్స్థానములం దెలుపును. మఱియు:

శ్లో. చ్యుతాచ్యుతాదిభేదేన మధ్యమం షడ్జమం భవేత్॥ పంచమే మధ్యమే గ్రామే త్రిశ్రుతి ర్జాయతేస్వరాః మధ్యమ స్సశ్రుతిం ప్రాప్య కైశికేషు చతుశ్శ్రుతిః। కైశికే కాకలిత్వేచ నిషాదస్య చతుశ్శ్రుతిః॥ ధైవతో మధ్యమగ్రామే వికృత స్స్యాత్ చతుశ్శ్రుతిః. (సంగీతదర్పణం)

చ్యుత, అచ్యుతాదిభేదములచే మధ్యమము షడ్జమాయెననియు మధ్యమగ్రామమున పంచమము మధ్యమసంబంధమగునట్టియు తనకు సమీపమగునట్టియు నొకశ్రుతిని జేరిన దాననియు, ధైవతము వికృతస్వరమై నాల్గుశ్రుతులుగల్గిన దేయనియు నిత్యాదికము సంగీతదర్పణగ్రంథమున గలదు. ఇంకను:

శ్లో. యద్వాథ త్రిశ్రుతిః షడ్జే మధ్యమేతు చతుశ్శ్రుతిః; రిమయోః శ్రుతి మేకైకాం గాంధారశ్చేత్ సమాశ్రితః, పశ్రుత్యేకో నిషాదస్తు ధశ్రుతి స్స శ్రుతిం శ్రితః.

(సం. దర్పణ—రత్నాకర, శివరత్నాకరములు)

దీనివలన స్వరస్థానములనడుమ నమరు శ్రుతులమార్పుల క్రమముగ బ్రథమచక్రమున గానసగును. దీనినిబట్టి షడ్జగ్రామమున పంచమము నిర్వికారిగ నుండుటచే ద్వావింశత్ శ్రుతుల్లలో వరుసగ 4. 3. 2. 4. 4. 3. 2 శ్రుతులను క్రమముగ స. రి. గ. మ. ప. ద. ని. యనుస్వరముల గలదియగును. మధ్యమగ్రామమున పంచమము తనశ్రుతియగు ఆలాపిని వీడి మాధ్యమశ్రుతియగు సాందీపినియను శ్రుతిని, జెందుటచే. 4. 3. 2. 4. 3. 4. 2. శ్రుతులవరుసను స్వరము లుండును.

ఇక గాంధారగ్రామము. దీనియందు అర్థశ్రుతితోగూడిన నిషాదమైతేను ధైవతము తనశ్రుతిని అనుసరిస్తేను గాంధారగ్రామమని నారదవాక్యము.

శ్లో. ద్వౌగ్రామౌ విశ్రుతౌ లోకే షడ్జమధ్యమసంజ్ఞకౌ. (భరతులు.)

శ్లో. గాంధారగ్రామమాచష్టే తథా తం నారదో మునిః॥ ప్రవర్తతే స్వర్గలోకే గ్రామోఽసౌ న మహీతలే. (శివరత్నాకరం)

అని ఇట్లు మిగుల పూర్వు లగు భరతశివాద్యనుసరణినిబట్టి చూడ షడ్జ,మధ్యమ గ్రామములు మాత్రము భూలోకమున వాడబడుచున్నట్లు తేలుచున్నది. పిమ్మట నిటీవల గ్రంథరాజములలో మిగులప్రాచీనమగు సంగీతరత్నాకరమున (శార్‌ఙ్గదేవకృతము) నందును నిట్లే చెప్పియున్నారు. సుమారు నన్నూరేండ్లకు బూర్వస్థమగు సంగీతపారిజాతమున గూడ,

శ్లో. "మూర్ఛనాధారభూతౌ స్తో, షడ్జగ్రామః త్రిషూత్తమః" అనియుండుటవలననప్పటికే మధ్యమగ్రామముగూడ గాంధారగ్రామమంత గాకపోయినను క్రమముగ నంతరించుచుండుటయు షడ్జగ్రామముమాత్రము విశేషావలంబనము నందియున్నదనియు గ ననగును.

శ్లో. తథాహి మధ్యమే గ్రామే త్రిశ్రుతిః పంచమఃఖలు। అస్మాభి ర్మధ్యమే గ్రామే ష్యస

## శ్రుతిగ్రామపద్ధతి - ప్రథమచక్రము.

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| షడ్జగ్రామము | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | ని | |
| గాంధారగ్రామము | | | స | | | రి | | | గ | | | మ | | | ప | | | ధ | | | | ని |
| మధ్యమగ్రామము | | | | స | | | రి | | గ | | | | మ | | | ప | | | | ధ | | ని |

## ద్వితీయచక్రము

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 32 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | స | స | స | స | రి | రి | రి | గ | గ | మ | మ | మ | మ | ప | ప | ప | ప | ధ | ధ | ధ | ని | ని | స | స | స | స | రి | రి | రి | గ | గ | మ |
| 1 షడ్జగ్రామము | స | . | . | . | రి | . | . | గ | . | మ | . | . | . | ప | . | . | . | ధ | . | . | ని | . | స | . | . | . | రి | . | . | గ | . | మ |
| 2 మధ్యమగ్రామము | | | | | | | | | | స | . | . | . | రి | . | . | గ | . | మ | . | . | . | ప | . | . | . | ధ | . | . | ని | . | స |
| 3 గాంధారగ్రామము | | | | | | | స | . | . | . | రి | . | . | గ | . | మ | . | . | . | ప | . | . | . | ధ | . | . | ని | . | స | . | . | . |

## తృతీయచక్రము

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | స | రి | రి | రి | గ | గ | మ | మ | మ | మ | ప | ప | ప | ప | ధ | ధ | ధ | ని | ని | స | స | స | స |
| | (1) | | | 2 | | 3 | 4 | | 5 | 6 | | | 7 | 8 | | | 9 | | 10 | 11 | | 12 | |
| (షడ్జము) 1 వ శ్రుతి | స | | | శు. రి. | | వ.రి శు. గాం | ష.రి సా. గాం | | అం. గాం | శు. మ. | | | ప్ర. మ. | పం | | | శు. ధ. | | చ.ధ శు. ని. | ష.ధ. కై. ని. | | కా. ని. | స |

త్ర్యాయ ఇతీర్యతే। ఏకఏవ తత షడ్జగ్రామ ఇ
త్యవధార్యతే.

(చతుర్దండి ప్రకాశిక)

పైన నుదాహరించినట్లు పంచమభేద
మును నిరూపించి మధ్యమగ్రామమును గూడి
డెబ్బదిరెండు మేళకర్తల నేర్పరచిన వేంకట
మఖియనువారు తనచతుర్దండి ప్రకాశిక యను
గ్రంథరాజమున నిరసించి షడ్జగ్రామ మొక
దానినే యవలంబించెదమని నుడివియున్నారు.
ఏలననగి ఈ మేళకర్తలకు షడ్జగ్రామముమాత్ర
మనుకూల మగుటచేతను మధ్యమగ్రామమున
నేర్పడుపంచమము ప్రస్తుతానుభవమున వరా
ళిపంచమమగుటచే వికటించుటచేతను మధ్య
మగ్రామ నిరసనకారణము సుబోధవేద్యము.
ఇక గాంధారగ్రామము మాట చెప్ప నక్కు
రయే లేదు. మఱియు నసంబంధమగుటయు
నతీతమగుటయు, డెబ్బదిరెండు మేళములకు
వికటించినదనియు ననలే త్రోసివేసిరనుట నిర్వి
వాదాంశము.

ద్వితీయచక్రమున గానమగు విషయ
ములు.—దీనియందనను సులభముగా తెలి
యుటకై షడ్జాదిస్వరస్థానముల నాశ్రయించు
శ్రుతుల నన్నిటికి ఆస్వరములుగనే చూప
బడినవి. షడ్జగ్రామమున షడ్జాదిస్వరములు
వాటినాశ్రయించు శ్రుత్యాదినే చూపబడినవి.
మధ్యమగ్రామమున షడ్జగ్రామముననున్న మధ్య
మము షడ్జముగ జేయబడి ఆచటినుంచి ప్రారం
భమై షడ్జగ్రామమున దానికి పైస్థాయిలో
ననగ హెచ్చుమధ్యమమున తిరిగి మధ్యమ
గ్రామహెచ్చు షడ్జమగును. ఈ గ్రామమున
ష ధ లకు శ్రుతి నొకదానిని తగ్గించుటవల
నను, నిషాదమునకు శ్రుతుల దగ్గించుటవలనను
ష, ద, లకు మధ్య నిమిడిన శ్రుతులు చిన్న
స్వరమాయెను. (Minor-tone) ఇట్లే ధ, ని లకు
మధ్యను స్వరమున శ్రుతులు అర్ధస్వరమా
యెను (Semi-tone) ఇట్లు ధ, ని, నడుమనున్నది.
అగ్నిస్వరమగుడు, ని, స, లకు నడుమను పెద్ద
స్వరమై తీరవలెను (Major-tone)

గాంధారగ్రామమందు ఋషభమునుండి
యొకశ్రుతిని మధ్యమమునుండి మఱియొక
శ్రుతిని గ్రహించుటచే గాంధారస్వరము నాల్గు
శ్రుతులు గలదగును. అనగ ఋషభమున నొక
శ్రుతి దగ్గించి, మధ్యమమున నొకదానినిచ్చిం
చిన గాంధారమధ్యమములకు నడుమ పెద్దస్వర
మేర్పడును (Major-tone) అని దీనియుద్దేశము
షడ్జగ్రామమున గాంధారస్వరము గాంధార
గ్రామమున షడ్జస్వరముగ మారవలెను. మూరి
నదొకస్వరము నాల్గుశ్రుతులు గలది కావల
యును. ఇట్లు మిగిలిన స్వరము ననుసరించు
శ్రుతులును ఆయా లెక్కను సరికావలెను.
ఇటనే షడ్జగ్రామమని కొందఱి మతము. దీన
గానమగుభేదములు, షడ్జగ్రామమున, మధ్యమ
స్వరమున గల నాల్గుశ్రుతులలో నొకదానిని
గాంధారస్వరమున కిచ్చుటచే, మూడుశ్రు
తులు గలదై చిన్నలేక ముప్పాతిక స్వరము
(Minor tone) ఆగుచున్నది. అనగ నాలుగు
శ్రుతులు స, మ, ప, లకును, రి, ధ, లకు
మూడుశ్రుతులును, గ, ని, లకు రెండుచొప్పు
నను గలవు; కనుక నాల్గుశ్రుతులుగల స్వర
ములు, పెద్దస్వరములు లేక పూర్ణస్వరము

లనియు (Major-tones) మూడు శ్రుతులు గలిగినస్వరములు చిన్నస్వరములు, లేక ముప్పాతికస్వరములు (Minor-tones) అనియు రెండే శ్రుతులగల్గిన స్వరములను అర లేక అర్ధస్వరములు(Semitones) అనియు మనము సౌకర్యమునకై నామకరణ మొనరింతము. మఱియు నిషాదము, ధైవతషడ్జ శ్రుతులలో నొక్కొక్కదానిని గ్రహించుటచే అదివరకే అర్ధస్వరమగుచు నీరెండును జేరి 4 శ్రుతులగలిగి పూర్ణస్వరమగుచున్నది, (Major.tone)

ఇదియునుగాక షడ్జస్వరము, నిషాదమునకొక శ్రుతి నిచ్చుటచే, స, యొక శ్రుతి హెచ్చుగ పలుకవలసివచ్చును. స. రి. లకు మధ్య అంతరము మూడు శ్రుతులుమాత్ర మౌట ముప్పాతిక స్వరమగుచున్నందు వలన ధైవతముగ పరిగణింపబడుటయు గననగును. ధైవతము, పంచమమునుండి రెండు శ్రుతుల తీసికొనినందున, పంచమమున రెండుశ్రుతులే మిగిలినందువలన నర్ధస్వరమైనది.

ఒక శ్రుతిని, నిషాదమున కొసగుటచే, ధైవతము మొదట తనకుగల మూడు శ్రుతులు + పంచమమునుండి స్వీకరించినవి రెండు శ్రుతులు=ఐదు శ్రుతులలో నొకటి నిషాదమునకు బోగా శేషించిన శ్రుతులు నాల్గు గనుక పూర్ణస్వరముగ దేలినది. ఈ గంద్రగోళమంతయు నీ గ్రామమునకు విశేషము. వివరము రెండవ చక్రమున గమనింపనగును. లాపృగీతలు స్వరస్థానములు. వాటికి నెడమప్రక్కను లిఖించినవి ఆయా స్వరముల పేళ్లు. ఇది యాధునికాభిప్రాయము.



# శ ర ణా గ తి

నోరి నరసింహశాస్త్రి, బి. ఏ. [సాహితీసమితి]

కనులు తిరిగెడి, మేన మైకమ్ము గ్రమ్మె
హృదయము చలించి క్షోభించె, పిదప
చేరె నిను శరణార్థియై సింధురాజ [లెంకొ
దిక్కులేని యనాథుడీ దీనజనుడు.

రిక్తుడని యీతని నధఃకరింపవలదు
భువి విజృంభించు హీన మానవుల పగిది
ధీర గంభీర శాంత విస్తారమతివి
కాన నీవైన నో నిర్వికారరూప!

దురిత హృదయాబ్ధి వీచి కాందోళనమున
చెదరెడి యనర్ఘ రత్నసంపదల నెల్ల
వైభవజాత్ముడై వీడు పార జల్లె
వెల యెరుంగని హీనబుద్ధుల బడంగ

ఓ యపార గభీర, నీ యుదరమందు
అంతరము లేదె నావ్యథ [illegible]యుంప
అఖిల సరిదంబు భరణ, ఈ యార్త జనుని
బాష్పబిందు సందోహంబు భారమగునె?



# తేజోలేఖనము

పింజమూరి కృష్ణమాచార్యులు గారు

(ఏడవసంచిక తరువాయి)

## మూడవ ప్రకరణము

### తేజోలేఖన యంత్రములందలి ప్రధానభాగములు, అవియొనర్చు పని.



"పాశ్చాత్యసుందరి"

అత్యుత్తమమగు, యనాస్టిగ్మాట్ లెన్సుగల స్టాండుకమెరాలో దీయబడినది.

#### లెన్సు Lens

వస్తువిషయములను గాంచుటకు మనకు నేత్రము లెట్లు ప్రధానసాధనములగు చున్నవో, అట్లనే కమెరాకంతకును, లెన్సు ప్రధానభాగముగా నెంచబడుచున్నది. లెన్సులను జెందినశాస్త్రచర్చలో మన కంతప్రయోజన ముండకుండినను, వీటినిగురించి కొన్ని ముఖ్యవిషయములను మాత్రము, దెలిసికొనవలసి యుండును.

వెలుతురు గొప్పదును సమానమందముగల, అద్దము, గాలి, మొదలగు మధ్యవస్తులగుండా సరళరేఖలుగా వ్యాపించుచుండును. మధ్యవస్తులు మారినపుడు మాత్రము, వాటికి తగినట్లుల కిరణములు వంగుచుండును. సరళరేఖలుగా వ్యాపించు యీవెలుతురుకిరణములను "లెన్సు" అను గుండ్రని అద్దపుబిళ్ల కొకవైపునుండి ప్రసరింపజేసినచో, దానిరెండవవైపున కొంతదూరములో నివియన్నియుగూడి మొనగా నేర్పడ గలదు. ఈకిరణములన్నియు కలియుస్థానమునకు, "ఫోకస్" (Focus) అనిపేరు. సరళరేఖలుగా వ్యాపించు వెలుతురు కిరణములను, లెన్సుగుండా బోనిచ్చుటవలన గలుగుమార్పు, యీ క్రిందిపటమునందు జూపబడినది.



సరళరేఖలుగావ్యాపించు వెలుతురు కిరణములు — లెన్సు

లెన్సునకును, వెలుతురు కిరణములు కలియుస్థానమునకును, మధ్యప్రసారమునకు "ఫోకస్ ప్రసారము" (Focal Length) అని పేరు. లెన్సు ఎంతవెలగలదైనను, ఏరూపమును దాల్చినను, వెలుతురుకిరణముల నన్నిటిని ఒకచోటునకు దెచ్చి చేర్చ లేదు గానివిధి. లెన్సులం దనేకరకము లున్నను, మధ్యము దిట్టముగా నుండి, చివరలకు రానురాను సన్నమగునట్టి "డబ్బిల్ కాన్వెక్సు" లెన్సులు మాత్రమే ఫోటోగ్రాఫులు దీయుటకు పనికివచ్చును. చత్వారపుసులోచనపు అద్దములుగూడ, డబ్బిల్ కాన్వెక్సు లెన్సులే. కాని సామాన్యపుడబ్బిల్ కాన్వెక్సు లెన్సులు ఫోటోగ్రాఫులు దీయుటకు నుపయోగపడ నేరవు. వీటికి వేగము మిక్కిలి తక్కువ. మరియు వీటితో దీయబడిన పటములు, స్పష్టముగా నుండక చివరలకు రానురాను చెదిరిపోవును. కావున, ఫోటోగ్రాఫులను దీయుటకు పనికివచ్చు డబ్బిల్ కాన్వెక్సు లెన్సులు, పైలోపములు లేకుండునట్లుగ బహునేర్పుతో ప్రత్యేకముగా తయారు చేయబడును.

అంచుగాని, అరలక్కంటె హెచ్చుగాని, గుండ్రని సానబట్టినట్టి లెన్సు అద్దపుబిళ్లల నొకటిగా అతికించి, దానిని మరకలోయుంచినట్టి లోహపుబ్రిడియములో బిగింతురు. పిమ్మట, యీ కడియమును ఇత్తడిగొట్టపు ముక్కలో నమర్చి, లెన్సుగా జేయుదురు.

సామాన్యముగా, కమీరాల కమర్చబడునట్టి లెన్సులు, సింగిల్ ర్యాపిడ్ రెక్టిలీనియల్, యనాస్టిగ్మాట్ అను మూడురకములుగా నుండును.

సింగిల్ లెన్సులు "అక్రొమాటిక్" "మినిస్కస్" మొదలగుపేర్లు పెట్టబడి, తక్కువవెలగల కమీరాల కమర్చబడియుండును. ఈ లెన్సులకు గొట్టముయొక్క మధ్యపు భాగమునందుండు వెలుతురు చొరనిచ్చు రంధ్రము, చాల చిన్నదిగా నుండును. లేనిచో, వీటితో దీయబడు పటములు స్పష్టముగా నుండవు. లెన్సు గొట్టపుమధ్యముగానుండు రంధ్రమునకు "అపెర్చర్" (Aperture) అని పేరు. ఈ అపెర్చర్ రంధ్రము, చిన్నదైనకొలది, తక్కువ వెలుతురు లెన్సునుండి కమీరాలోనికి పోవుచుండును. ఈ కారణముచే సింగిల్ లెన్సులు చాలతక్కువ వేగముగలవై యుండును. సింగిల్ లెన్సులు, మంచి ప్రకాశమానమగు వెలుతురునందుమాత్ర ముపయోగించుటకు పనికివచ్చును.

ర్యాపిడ్ రెక్టిలీనియల్ లెన్సులకు డబ్బిల్ లెన్సులనియు, సిమెట్రికల్ లెన్సులనియు, మారు పేర్లుగలవు. వీటికి, సింగిల్ లెన్సులందువలెగాక, గొట్టమున కిరుపైపుల లెన్సుబిళ్లలమర్చబడియుండును. (మూడవ పటము II.) సింగిల్ లెన్సుల కుండులోపములు గొంచె మెచ్చుతగ్గుగా వీటి కుండవని చెప్పవచ్చును. మిక్కిలి హెచ్చువెలగల కమీరాలకుతప్ప, తక్కువవాటి కన్నిటికిని యీ ర్యాపిడ్ రెక్టిలీనియల్ లెన్సులే యుపయోగ్చబడును. సింగిల్ లెన్సులకంటె వీటి అపెర్చర్ పెద్దదిగా నుండును. ఫోటోగ్రాఫులెన్సు లన్నిటిలో, అత్యుత్తమమైనట్టివియు, హెచ్చువెలగలిగి నట్టియు, యనాస్టిగ్మాట్ లెన్సులని పిలువబడును. వీటి అపెర్చర్ యితర లెన్సు లన్నిటికంటెను చాల పెద్దదిగా నుండును. యనాస్టిగ్మాట్ లెన్సులకు, అపెర్చర్ తగ్గించకుండగనే స్పష్టమగు ఫోటోగ్రాఫుల నతివేగముగా దీయగలుగు శక్తి యుండుటచే, వీటిని హెచ్చువెలగల రిఫ్లెక్స కమీరాలకు, హ్యాండ్ కమీరాలకు, మాత్ర ముపయోగింతురు. ఈ లెన్సులతో, మబ్బుగా నుండుసమయములందు గూడ, కదలుచుండు జనసమూహములయొక్కగాని, వస్తువులయొక్కగాని స్పష్టముగా నుండునట్టి ఫోటోగ్రాఫుల దీయవచ్చును. లెన్సుయొక్క పూర్తిఅపెర్చర్ (అనగా లెన్సుగొట్టపు మధ్యముగానుండు, వెలుతురును లెన్సునుండి కమీరాలోనికి పోనిచ్చురంధ్రము) F గురుతున కెదురుగానుండు సంఖ్యవలన దెలుపబడును. సింగిల్ లెన్సులకు F 11, ర్యాపిడ్ రెక్టిలీనియల్ లెన్సులకు F 8, యనాస్టిగ్మాట్ లెన్సుకు F4, F6, F7. 7, అపెర్చరు లుండును. F గురుతున కెదురుగనుండు సంఖ్య తగ్గినకొలది, లెన్సుయొక్క వేగము హెచ్చుననియు; అపెర్చర్ పెద్దదగుచుండుననియు; హెచ్చినకొలది, అపెర్చర్ చిన్నదై







సింగిల్ లెన్సుగల చవుకరకపు చేతిపెట్టెకమీరాతో తీయబడినట్టి కొన్ని చిత్రములు

లెన్సువేగము తగ్గిపోవుననియు దెలిసికొనవలయును. ఉదాహరణము:— F4 గురుతుగల లెన్సు, మిక్కిలివేగము గలదై విశాలమగు అపెర్చర్ గలిగియుండును. F11, గురుతుగల లెన్సు వేగము లేనిదై, చాలసన్నని అపెర్చర్ మాత్రము గలిగియుండును.

లెన్సుయొక్క అపెర్చరును తగ్గించుచుండినకొలది కమీరాకు సమీపముననున్నట్టియు, దూరముగా నున్నట్టియు, స్థలములుగాని మరి యే యితరవస్తువులుగాని, ఏకరీతిగా, స్పష్టముగా నుండునటుల ఫోకస్ చేయుట కవకాశమేర్పడును. అపెర్చరు తగ్గించకుండ, ఈవీలు కలుగనేరదు. అపెర్చరును క్రమముగా తగ్గించుటకు వీలగునట్టి ఏర్పాటు ప్రతిలెన్సును కలిగియుండును.

స్టాండుకమీరాల కమర్చబడు సింగిల్ లెన్సులకును, ర్యాపిడ్ రెక్టిలీనియల్ లెన్సులకును, వాటిగొట్టముల పైభాగమున మయముగా నొకకడియ ముండును. ఈకడియమును నెమ్మదిగా నొకవైపునకు త్రిప్పుచుండినచో, అపెర్చర్ తగ్గుచుండును. ఈసాధనమునకు, "ఇరిస్ డయాఫ్రమ్" (Iris diaphragm) అని పేరు. లెన్సు గొట్టముపైన, కడియమున కెదురుగా F8, F11, F16, F22. F32, అని గురుతులు వేయబడియుండును. కడియముపైగూడ, "Λ" ఈవిధమగు గురు తొకటి యుండును. ఈగురుతును F8 నుండి వరుసగా F32 వరకు త్రిప్పుచువచ్చుటవలన, లెన్సుయొక్క అపెర్చర్ క్రమముగా తగ్గుచు రాగలదు. కడియముపై నుండు గురుతు F8, వద్దనుండినపు డొక ఫొటోగ్రాపు దీయుటకు 1 సెకండుకాలము పట్టుగల దనుకొందము. F8 నుండి F 11 వరకు అపెర్చర్ తగ్గించినచో, కాలపరిమితి 1 సెకండునుండి, 2 సెకండ్లకు హెచ్చగలదు. ఇదే విధముగా F 16 నకు తగ్గించినపుడు 4 సెకండ్లు, F22 నకుతగ్గించిన 8 సెకండ్లు, F32 నకు తగ్గించిన 16 సెకండ్లు కాలపరిమితి హెచ్చుచు రాగలదు. లెన్సునుండి కమీరాలోనికి పోనిచ్చు వెలుతురుయొక్క కాలపరిమితికి, యక్స్పోజర్ (Exposure) అనిపేరు. ఈయక్స్పోజరుకు జెందిన వివరములు; వేరొక ప్రకరణమందు విపులముగా చర్చింపబడును. తక్కువవెలగల చేతిపెట్టె కమీరాలకుమాత్రము, పైన దెలుపబడినట్టి అపెర్చరు తగ్గించు సాధనమునకు మారుగా, 3, 4, వేరువేరు F గురుతు రంధ్రములుగల గుండ్రని రేకుబిళ్ల యొకటి లెన్సునకు ముందుభాగమున బిగించబడియుండును.

## షట్టర్ (Shutter)

లెన్సుద్వారా కమీరాలోనికి, వలయునంతకాలము వెలుతురును పోనిచ్చిన పిమ్మట ఆపివేయు సాధనమునకు, షట్టర్ Shutter అందురు. ఈషట్టరులం దనేక రకములు కలవు. కొంచెము మెచ్చుతగ్గగా కమీరాలన్నిటికిని, నేదియో యొకరకపు షట్టర మర్చబడియుండును. షట్టరు లేకుండగూడ, కమీరాలు విక్రయింపబడుట కలదు. చాలమంది ఫొటోగ్రాఫరులు, తమ కమీరాలకు షట్టరు లేకుండగనే పనిచేయుట కలవాటుపడి యుందురు. షట్టరు లేకుండ ఫొటోగ్రాఫు దీయవలయునన్న, కాలపరిమితి నూహించుకొని దానికి తగినటుల లెన్సునకు ముందుభాగముననుండు అట్ట మూతను (Cap) తెరచి మూయుదురు. పిల్లలు, కదలుచున్నట్టి జనసమూహములు, రాజమార్గములు మొదలగు చలించుచున్నట్టి దృశ్యములఫొటోలను దీయుట కీఅట్టమూతపద్ధతి యెంతమాత్రము నుపయోగింప నేరదు. కదలుచున్నట్టి యొక దృశ్యమును ఫొటో దీయుటకు సెకండులో 1/25 వంతు కంటె హెచ్చుకాలము లెన్సును తెరచియుంచరాదు. అనగా, 1/25 సెకండుకాలములో లెన్సును తెరచి మూయవలయును. ఇంతకొద్ది కాలములో లెన్సుముందర నుండు మూతను చేతితో తెరచి మూయుట యసంభవము.

సాధారణముగా చేతికమీరాలకు, మడతజేబు కమీరాలకు, రెఫ్లెక్సుకమీరాలకు, లోహపురేకులతో జేయబడినట్టి షట్టరు లుండును. వీటిలెన్సులు ప్రత్యేకపు ఇత్తడిగొట్టములలో నమర్చబడక, షట్టరునకే బిగించబడియుండును. లెన్సుయొక్క అపెర్చరు తగ్గించు సాధనముకూడ, షట్టరునందే యుండగలదు. ఈషట్టరులలో తక్కువవెలగలవాటికి, T. B. I. అను మూడు వేరువేరు వేగపుగురుతు లుండును. ఈగురుతులను చూపు ముల్లొకటి షట్టరున కమర్చబడియుండును. ఈముల్లును T. అను గురుతున కెదురుగా నిలిపి, షట్టరుయొక్క మడిపక్కనుండుకాడను వ్రేలితో నొక్కివదలినచో, షట్టరు తెరవబడును. తిరిగి మరియొకసారి ఆకాడనే

నొక్కినచో, మూసుకొనిపోవును. ముల్లును T నుండి B వద్దకు మార్చి, కాడను నొక్కినచో, నొక్కియుంచినంతకాలము షట్టరు తెరచియుండి, వ్రేలుతీసివేయుటతోడనే మూసుకొనిపోవును. మన మెంతత్వరితముగా కాడను నొక్కి వదలినచో, నంతవేగముగా తెరచి మూసుకొనుచుండును. I వద్ద కీముల్లు తెచ్చి కాడను నొక్కినచో, 1/25 సెకండుకాలములో షట్టరు తెరచి మూసుకొనును. అనగా సెకండులో 1/25 కాలముమాత్రము లెన్సునుండి వెలుతురు కమెరాలోనికి పోవును. ఈసాధనము మూలముననే, కమెరాను చేతిలో నుంచుకొని, కదలుచున్నట్టి దృశ్యములయొక్కగాని, జనసమూహములయొక్కగాని, పటములను దీయుట కవకాశ మేర్పడుచున్నది.

స్టాండుకమెరాల కమర్చబడు షట్టరులు వేరువిధముగా నుండును. వాటికి రోలరు బ్లయిండు షట్టరులని (Roller Blind Shutter) పేరు. ఇవి చిన్నచెక్క పెట్టెవలె నుండి, లెన్సునకు వెనుకభాగమున కమెరాకమర్చబడును. లెన్సునుండి వచ్చు వెలుతురును కమెరాలోనికి పోనిచ్చుటకును, ఆపివేయుటకును, వీలగునట్లు షట్టరు పెట్టెయందు నల్లనిగుడ్డ యొకటి పైనుంచి క్రిందికిని, క్రిందినుంచి పైకిని, చిన్నకప్పలపై చుట్టుకొనుచుండును.

ఈ పెట్టెకు క్రిందిభాగమున కుడివైపున వ్రేలాడుచుండు త్రాడును టిక్కుమను శబ్దమగువరకు క్రిందికి లాగినచో పెట్టెలోనినల్లగుడ్డ లెన్సునకడ్డము లేక వెలుతురు కమెరాలోనికి పోవుట కవకాశ మేర్పడును. ఆత్రాడునే మరియొకమారు శబ్దమగునరకు క్రింది కింకను లాగినచో, నల్లగుడ్డ లెన్సునకడ్డమువచ్చి వెలుతురు కమెరాలోనికి బోకుండ చేయును. షట్టరు పెట్టెకు కుడివైపుప్రక్కన నుండు సన్నని కాడను, దానికిరుప్రక్కల వ్రాయబడియుండు T. I. అను అక్షరములలో, T వైపునకు త్రోసి, యీ కాడకు సమీపముగనే అమర్చబడియుండు పొడుగుపాటి రబ్బరు గొట్టపుకొన నుండు బంతిని ఎంతకాలము నొక్కిపట్టుకొని యుందుమో, అంతకాలమును షట్టరు తెరచియుండును. చేయి తీసివేసినచో తిరిగి మూసుకొనిపోవును. ఇట్లుచేయుపనికి టైము యక్స్పోజరు (Time Exposure) అనిపేరు. ఈకాడనే T నుండి I అను అక్షరమువైపునకు త్రోసి రబ్బరు బంతి నొక్కినచో, (మామూలుప్రకారముగా షట్టరు క్రిందిభాగమున నుండుత్రాడు రెండుసారులు శబ్దమగునట్లు లాగినపిమ్మట) సెకండులో 1/15 కాలములో షట్టరు తెరచి మూసుకొనును. షట్టరుపెట్టెయొక్క ఎడమవైపు కొంచెము క్రిందుగా, గుండ్రని కాగితపుబిళ్ల యొకటి అమర్చబడియుండును. దానిపై 1/15, 1/30 1/45, 1/75, 1/90 సెకండులవంటి భాగములు ముద్రింపబడియుండును. ఈకాగితపుబిళ్లకు మధ్యముగా చిన్నపిడిపట్టె యొకటి యుండును. దీనికెదురుగా షట్టరుపెట్టెయొక్క కుడివైపున క్రిందుగా నుండు సీలను, గడియారమునకు కీయిచ్చునట్లు త్రిప్పుటకు ప్రారంభించినచో, పండ్లచక్రమునందలి సూదిగా పోయిన పన్నొకటి, 1/15 సెకండునుండి, క్రమముగా 1/90 సెకండువరకు వచ్చును. ఈపన్ను ఏసంఖ్యపైనుండినను, అంతకాలముమాత్రము షట్టరు తెరచి మూసుకొనును. రిఫ్లెక్సు కమెరాలయందు షట్టరులుగూడ, రోలరు బ్లయిండుషట్టరులవలెనే యుండును గాని, వాటికి సెకండులో 1/1000 కాలములో సహితము తెరచి మూసుకొనుశక్తిగలదు. ఈపుస్తకమునకు పైన నుండు పటములో కొన్ని విధములగు లెన్సులయొక్కయు షట్టరులయొక్కయు, రూపములు చూపబడియున్నవి.

## డార్కుస్లైడు (Dark Slide)

వస్తురూపముల నాకర్షించు సెన్సిటివ్ ప్లేట్లను, వెలుతురు తగులకుండ నుంచుటకు వీలగునట్టి పుస్తకమువలె నుండు కర్ర పెట్టెలను డార్కుస్లైడు లందురు. ఇవి కమెరాతో చేరియుండక, ప్రత్యేకముగా నుండి కమెరాయొక్క వెనుకభాగమున, ఫోకసింగ్ గ్లాసు పట్టుముండుస్థానమున సరిగా పట్టగలవు. స్టాండు కమెరాలయొక్క డార్కుస్లైడులు కర్రతో చేయబడి పుస్తకమువలె మధ్యమునకు రెండుభాగములుగా విడు యేర్పాటు కలిగియుండును. వీటికి రెండుప్రక్కల, పైకి లాగి తిరిగి దోపివేయుటకు వీలగునట్టి తలుపు లుండును. డార్కుస్లైడును తెరచి, చీకటిగదిలో ఎర్రదీపపు వెలుతురునందు రెండుభాగములలోను రెండుప్లేట్లను పెట్టి పిమ్మట ఆ రెండుభాగములను మూసివైచి,



౧



౧. "సంతరోజు (పెంటపాడు)"		౨. "సరకుపడవలు"

ఈ రెండు పటములును చేతికమిరాతో సెకండులో 1/25 కాలములో దీయబడినవి.
ఇట్టి కదలుచుండెడు జనసమూహములయొక్క పటములను దీయుటకు కమి[illegible]ట్టరుంచి తీరవలెను.

గ్రవుండుగ్లాసుచట్ట మమర్చబడియుండును. దీనిని, తలుపు వలె మూయుటకును, తెరచుటకును, కమీరానుండి వేరు చేయుటకును, నిలువుగను అడ్డముగను కమీరాకు బిగించుటకును వీలుగలదు. ఈచట్టమునందలి గ్రవుండుగ్లాసుపై, కమీరా కెదురుగనుండు దృశ్యముయొక్క ప్రతిబింబము సరియైనపరిమాణములో ప్రకాశమానముగా నగుపడునంతవరకు, కమీరాయొక్క ముందుభాగమును, ముందు వెనుకలకు జరుపుచు ఫోకస్ చేయబడును.

ఫోకసింగ్ గుడ్డ (Focussing Cloth)

గ్రవుండుగ్లాసుపై కమీరా కెదురుగ నుండు దృశ్యముయొక్క ప్రతిబింబమును ఫోకసు చేయునపుడు, ప్రక్కలనుండి వెలుతురు వచ్చుచుండిన సరిగా కనబడనేరదు. యీకారణముచే, పైన నలుపురంగును, లోపల ఎరుపురంగును,గలగుడ్డ నొకదానిని తలపైనుండి కమీరా వెనుకభాగము పైకి కప్పుకొనవలసియుండును. ఈగుడ్డకు ఫోకసింగ్ గుడ్డ యనిపేరు.

మడతచేతి కమీరాలయొక్క గ్రవుండుగ్లాసులకు అట్టతో చేయబడినట్టి కప్పొకటి అమర్చబడియుండుటవలన, ఫోకసింగ్ గుడ్డ కప్పుకొనకుండగనే ఫోకసు చేసుకొనవచ్చును.

దృశ్యదర్శని (View Finder)

మడతకమీరాలను చేతిలో నుంచుకొని చిత్రములను దీయునపుడు, కమీరా వెనుక భాగమున నుండు గ్రవుండుగ్లాసుపై ఫోకసుచేయుట కవకాశ ముండనేరదు. అట్టిసమయములందీ దృశ్యదర్శని ఉపయోగింపబడును. [సశేషము]



# రాధ వేడుకోలు

మంగిపూడి వేంకటశర్మ గారు

రాధా! రమ్మని ప్రేమమీర నను నోరారంగ జీరంగ రా
రా ధారాళము మీర ముచ్చటల దేర్పన్ రార నీకన్న వే
రాధారంబెవరైన నాకుగలరా రారాపులింకేలరా
రాధారత్నము నేలుకోర సుకుమారా వల్లవీపల్లవా!

ఉ. రాధర నిన్ను నమ్మితినిరా ధరణీధర రావిదేర ధా
రాధరభాశరీర మధురాధర మానగనీర యేలుకో
రా ధర నిల్వలేర మధురామధురాధర లెక్కవేర యీ
రాధ రచించినట్టి యపరాధము లేమిర లోకమోహనా!

శా. నాథాయంచును ప్రాణనాథయనుచున్ నానాథయంచున్ మనో
నాథాయంచును నెవ్వనిన్ దలచి 'నానాథుండు నానాథుడా
హా ధన్యాస్మి'యటంచు గోపికలు తామానందమున్ గాంతు రా
రాధానాథుని నిన్ను వేడెదను రారా మన్మనోమోహనా!



# అజంతా గుహాలయములు

కో. నరసింహాచారి గారు

గౌతమబుద్ధుఁడు లోకములోని కష్టసుఖములను జూచి, రోసి నిత్యానందదాయకమును, ద్వంద్వరహితమును నగు మోక్షమార్గము నరయఁగోరి సన్న్యసించెను. సన్న్యాసి కైహికసుఖవాంఛ లేదు. స్వపరభేదములును లేవు. "ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి" యనునదియే వానిన్యాయము. గౌతముఁడును ఇట్టిన్యాయమునే ముక్తిమార్గముగాఁ దెలిసికొని లోకమున కీమార్గమునే బోధించెను.

తన వైరాగ్యచిత్తత లక్షించుకొనుఁడు తా నొక యువరాజై యుండియు సకలసంపదలఁ దులతూఁగుచుండియు, నవయౌవనసంపన్నురాలిని యశోధరాసతిని, ముద్దులుమూటఁ గట్టుచుండినకుమారుని విడచి వెళ్లి వనమునఁ దపమొనరించెను. మోక్షమార్గమును దెలిసికొని లోకోపకారార్థము దేశసంచారియై సకలజనముల కీమార్గమును బోధించుచుఁ దనకాలముఁ గడపెను. కాలక్రమమున నీబౌద్ధమతము సకలాశలయందును ప్రబలి వృద్ధినొందెను. మతబోధకులును విశేషముగా ఖండాంతరములకును బోయి మతమును వృద్ధినొందించుచుండిరి.

బౌద్ధసన్న్యాసులు తాము తపమొనరించుట కైగుహలనో వనములనో గిరిశిఖరములనో యాశ్రయించువారు. వీరి తపోభూములగుతించిన శ్రేష్ఠ వీరశిష్యుల కెక్కుడుగా నుండినందున సాధారణముగా నీశిష్యులు వారివారి శక్త్యనుసారముగా గురువుల కనువగునట్లు మఠములను, ఆలయములను గట్టుచుండిరి. ఈయాలయాదులు గురువులనిర్యాణానంతరమున వారి జ్ఞాపకార్థముగూడఁ గట్టఁబడుచుండినవి. భక్తులభక్తి వారిభావశక్తుల వెల్లడిఁ జేయుచుండును. భక్తుఁడు గాయకుఁడైనఁ దనభక్తిని గీతారూపముననే చూపుచుండును. నటకుఁడైన నృత్యరూపమున వెల్లడిచేయును. శిల్పియైనఁ దనశిల్పనైపుణ్యమును జూపుచు భక్తిని వెల్లడించును. ఇందులకు నిదర్శనములు గాయకభక్తులగు త్యాగరాయాదుల భక్తిరసాత్మకములగు గీతములును, శిల్పకళయం దప్రతిమానములగు మనదేవాలయాదులును నైయున్నవి. అటులనే బౌద్ధులు తమగురువులయందుఁగల భక్తివిశేషమున వారి జీవితకాలమున వారి తపోపయోగార్థమును, కీర్తిశేషులయిన, వారిజ్ఞాపకచిహ్నార్థమును, ఆత్మప్రీత్యర్థమును 'గుహాలయముల'నేమి, 'మఠముల'నేమి, 'విహారముల'నేమి, 'స్తూపముల'నేమి గట్టుచుండిరి.

బౌద్ధులే కాక, జైనులును, బ్రాహ్మణులును నీరీతిగానే యాలయముఁ బ్రతిష్ఠించుచుండిరి.

నైజామురాజ్యములో ఔరంగాబాదునకు 12 మైళ్లదూరమున గల "ఎల్లోరా"లో బౌద్ధులు 14 గుహలను మలిచి యందు దేవాలయములను సభామందిరములను, మఠములను ఏర్పరచుకొనిరి. ఇందుఁ బెద్దదగు దేవాలయము 85 అడుగులపొడవును 43 అ. వెడల్పును 34 అ. ఎత్తును గలిగియున్నది. భూమ్యుపరిభాగమున రాలుసున్నము చేర్చి యింత విశాలభవనముఁ గట్టవచ్చును గాని యొకకొండరాతియం దిట్టిభవనమును దానిమధ్య స్తంభములతో మలిచి నిర్మించుటయన్న నెంతకష్టమో యోచింపవచ్చును. బ్రాహ్మణులును అత్యద్భుతశిల్పచాతుర్యమును జూపుచు 'కైలాసము'ను గట్టిరి. 'కైలాసము' ఒంటిరాతియందు, చెక్కియు, మలిచియుఁ, జేయఁబడిన శాలలతోను సోపానమార్గములతోను, చెక్కడపుఁగంబములఁగలిగి యత్యంతసుందరమై 164 అ. పొడవును 109 అ. వెడల్పును, 96 అడుగులయున్నతియుఁ గలిగి యున్నది. ఇందు గోపురములుకూడఁ గలవు. బ్రాహ్మణు

లింకను 15 గుహాలయములఁగూడ మలిచియున్నారు. జైనులును 5 లేక 6 గుహాలయములఁ గట్టియున్నారు. జైనుల "ఇంద్రసభ" 90 అ. పొడవును. 80 అ. వెడల్పును, 14 అ. ఎత్తును గలిగియున్నది.

బౌద్ధ, బ్రాహ్మణ, జైనులమతములు వేరైయుండినను, వారివారి మతాభిప్రాయభేదానుసారముగ వారి దేవాలయములును, మఠములును, భవనములును, పరస్పర భేదముఁ గలిగియుండినను, సమకాలికులైనందున వారి శిల్పకళాప్రావీణ్యమును, చాతుర్యమును ఇంచుమించు ఏకరీతిగనే ప్రదర్శింపఁబడియున్నవి.

బొంబాయికి 20 మైళ్లదూరమున 'సాల్సెటి' దీవియందు బౌద్ధగుహాలయములు నూటికి మించియున్నవి. ఇందుఁ బెద్దది 86 అ. పొడవును, 40 అ. వెడలుపును, 40 అ. ఎత్తును గలిగియున్నది.

బొంబాయికి 50 మైళ్లు తూర్పున 'కార్లే' యను ప్రదేశమునఁ గొన్ని బౌద్ధగుహాలయములు గలవు. ఇందు వారిచైత్యాలయము హిందూదేశములో నున్న చైత్యాలయములలోఁ బెద్దదయి 124 అ. పొడవును, 45 అ వెడల్పును, 46 అ. ఎత్తును గలిగియున్నది. దీనియందు లేకుసామానులుఁగూడ నుపయోగింపఁబడియుండుట విశేషాంశము,

'కార్లే'కు ఎదుట మైదానమున 8 మైళ్లదూరమున 'భాజా'లోను, 8 మైళ్లలో 'బేడ్సా'లోను గూడ బౌద్ధగుహాలయములు కలవు. 'నాశిక'లో బౌద్ధదేవాలయములు 17 కలవు. ఇందు సన్యాసులుండుటకు 2 విశాల విహారములును, శాలలును, చైత్యాలయమును ముఖ్యమైనవి.

మాళవదేశమునకుఁ దక్షిణమున 'ధారా'నగరమునకు నైఋతిని 25 మైళ్లదూరమునను, 'మాండు' సంస్థానమునకు 30 మైళ్లుపశ్చిమమునను బౌద్ధులగుహాలయములు కొన్ని కలవు. ఇవి ఈకాలమున మిక్కిలి శిథిలములైయున్నను ఇందలి చిత్రకళాప్రదర్శన మప్రతిమమైనది.

జన్నార్, ఔరంగాబాదు, కుడాకరాడ్ మొదలగు ప్రదేశములందును గుహాలయములనేకములు గలవు. కాని యన్నింటికన్నను అజాంతాగుహాలలో నీశిల్పకళ పరిపక్వమును సంపూర్ణతను బొందియున్నది.

శిల్పులీగుహాలయములఁ గట్టుటకనువగు ప్రదేశముల నరయుటలో ముఖ్యముగా, మలుచుటకుఁ దగిన రాతిప్రదేశమగునా కాదా యనుటను, జలవసతియుఁ దహోవర్తనుల కనుకూలముగ వృక్షసమృద్ధిఁగల వనప్రదేశ సామీప్యముఁ గలిగియుండుటను, గమనించుచుండిరి. (రెండవపటమును జూడుడు.) నైసర్గిక స్వరూపానుకూల



పటము ౧

తను గమనింపుడు. చీనా, జపాన్ మొదలగు బౌద్ధమత ప్రాబల్యముగల ప్రాచ్యదేశములయందుఁగూడ ముఖ్యముగా నుండినందున నా దేశములలోని బౌద్ధాలయములు కూడ కొండలమధ్య సెలయేళ్ల సమీపమునను, సెలయేళ్లు లేనియెడలఁ గొండలశిఖరములందును గట్టబడుచుండినవి. 'లడక్', 'లామాయుర్రు', 'హెమిస్' దేశములందుఁగల మఠములు సముద్రమట్టమునకు 11000 అడుగుల యెత్తునను, హాలీలో 14000అ. ఎత్తునను గట్టఁబడియున్నవి.

మఱియు మఠాదులఁగట్టుటకుఁ గొండలు మొదలగురాతి ప్రదేశములఁ గోరుట, యవి శిలాశాశ్వతముగా నుండుటకును, మఠాచార్యులెల్లపుడును స్వాభావికమగు గిరివనప్రదేశముల వసించుచుండినందున వారి యాత్మప్రీత్యర్థమును నై యుండవలెను. ఒక్కొకచోట బుద్ధుఁడు విశ్రమించికాని, తపమాచరించికాని యుండిన నా ప్రదేశమున జ్ఞాపకచిహ్నముగా దేవాలయమునో, చైత్యమునో, విహారమునో, స్తూపమునో, ఆరామమునో కట్టుచుండిరి. ఈగుహాలయములన్నియు సమకాలికములు కాక పలుతరములవారిచేఁ గట్టఁబడినందున నానాతరములవారికాలపు శిల్పకౌశలము వేరువేఱుప్రదేశములలో వేరువేరుస్థితులతో పద్ధతులతో నుండుటను జూచుచున్నాము.

ఏకప్రదేశమున నిట్టు పరిపరిస్థితులలో శిల్పకౌశలమును జూడవలెనన్నఁ బలుతరములవారిచే వేర్వేరుకాలములందుఁ గట్టఁబడిన గుహాలయ సముదాయము ఒక "అజంతా"లోనే కలవు. "అజంతా"గుహాలు నైజాంరాజ్యమున "నజంతా" యనుగ్రామమునకు 4 మైళ్లదూరమునను, Great Indian Peninsular Ry. లో 'పచోరా' యనుస్టేషనునకు 30 మైళ్లదూరమున నుండు "ఫరీదుపురము"నకు నైఋతిదిక్కున 8½ మైళ్లలోను నున్నవి. (మొదటిపటమును జూడుడు.) జనులు పోయి చూచుటకు ఫరీదుపురమార్గ మనుకూలముగా నున్నది. ఈగుహాలు "వగోరా"నది పాఱు లోయయందుఁ గలవు. నదీజల ప్రవాహవేగమున లోతుగాఁ గోయబడి విలువంపుగా నుండు నీలోయయందు నదీవామపార్శ్వమున దక్షిణాభిముఖముగా నీగుహాలు మఱుచక్రపుపక్షులగూండ్లను బోలియున్నవి. వీటికుత్తరమున "దక్కను" (దక్షిణ) పీఠభూమియు, దక్షిణమున "ఖాండేష్" మైదానమును గలవు. నైఋతివున నీగుహాలక్రిందినది, జలపూరితమయి, కొండప్రక్కలనుండి నదీజలమున నీదులాడఁబోవు జలసర్పములవలె దిగుసెలయేళ్ల సముదాయముల జలజలధ్వనులతో నిండి నేత్రశ్రోత్రానందకరవయి, పార్శ్వముల నెటుచూచినను బచ్చికబయళ్లతో నొప్పుచుండును. లోయయొక్క పైభాగమున అరమైలువరకు వ్యాపించియుండు గుహాలయముల కొకనైఋతిన సప్తపాతములుగల ఝరమొకటి కలదు. ఈ నిర్ఝరజలపాతవేగమునకుఁ గ్రింద నొకమడుగేర్పడి యగాధమయి సంవత్సరాద్యంతమును జలపూరితమయియుండును. లోయనంపున మధ్య నొకసోపానమార్గము క్రిందినుండుకుఁ గలదు; కాన ఆలయవాసులగు సన్న్యాసులు స్నానపానార్థమయి నదీజలమునుగాని నదీజలాభావసమయముల నామడుగుజలమునుగాని యుపయోగించుటకు దిగిపోవుచు నుండియుందురు.

నిర్మానుష్యమగు నిట్టిచోట నీగుహాల నిర్మించుకొని ప్రాపంచికవైభవవిముఖులై, మోక్షకాములై తపమాచరించుచుండు భిక్షులప్పుడప్పుడు జానపదముల జేరి మోక్షమార్గోపదేశ మొనరించుచుండిరి. ప్రస్తుతమున నీప్రదేశము పాడుపడియుండియు, ప్రతిసంవత్సరమునను, మకరసంక్రాంతి మరుదినమున జనులు గుంపులుగుంపులుగా, నిచ్చోటికి వచ్చి నదియందుఁ గ్రుంకి యుత్సవములను, విందులనుఁ జేసికొని పోవుచుందురు.

అజంతాగుహాలయములగురించి బౌద్ధమతప్రాబల్యకాలమున జనుల కేమి తెలిసియుండినదోకాని, బౌద్ధమతము క్షీణించినతర్వాత వాటినిగురించి విశేషముగాఁ దెలిసినట్లు చారిత్రకగ్రంథాధారము లేవియు లేవు. కాని క్రీ. శ. 7 వ శతాబ్దమున చీనాదేశపు ప్రయాణికుఁడు 'హియన్‌త్సాంగ్' అజంతానుజూడకపోయినను, తాను మహారాష్ట్రరాజగు రెండవపులికేశుని రాజధాని 'బాదామి' కేగియుండినపుడు అజంతానుగురించి ఈరీతిని వినినట్లు వ్రాసెను. "మహారాష్ట్రమునకుఁ దూర్పున నొకపర్వత మున్నది. అందు ఎక్కువగాఁ గోయఁబడిన

లోయ కలదు. దానిలో 'సంఘారామ' (బౌద్ధసన్న్యాసులమఠ) మొకటి కట్టఁబడియున్నది. దానిలోని గొప్ప గొప్పగదులును, ఆస్థానములును క్రిందఁ బ్రవహించు నదీ ముఖములుగా నున్నవి. ఈ'విహారము'న నాలుగు ప్రక్కలను గోడలపైని 'తథాగతుని' జన్మచరిత్రకథలును 'బోధిసత్త్వుఁడు' బుద్ధుఁడైనకథలును, బుద్ధనిర్వాణకథలును కడు నందముగాఁ జిత్రింపఁబడియున్నవి."

1819 సం॥న మొదటిసారి ఈగుహాలయముల దర్శించిన పాశ్చాత్యులు చెన్నపురి సైన్యాధికారులై యున్నారు.

తర్వాత 1824, 1828, 1843, సం॥లలోఁ గ్రమముగాఁ గొందఱు పాశ్చాత్యులీగుహల దర్శించి వీటిదేవాలయముల గుఱించి ఇందుఁగల శిల్ప, చిత్రకళావిశేషముల విరళముగాఁ జర్చించుచు Royal Asiatic Society మూలముగాఁ బ్రచురించుచుండిరి. తర్వాత నీసంఘము వారు East India Company అధికారులకు వ్రాసి వారి కీగుహాలయందు శ్రద్ధఁ గలుగఁజేసిరి. కంపెనీయధికారులును అజంతాచిత్రములప్రతులఁ దీయించి వాటి నప్పటప్పటికే లండన్ నగరమునకుఁ బంపుచు వచ్చిరి. కాని యనేకసంవత్సరములు ప్రయాసపడి తీయఁబడిన ప్రతులనిట్టైనఁ గరుణింపక 1866 సం॥న హుతవహుఁడు (Great Fire of London) లండన్ నగరమునఁ బ్రవేశించినప్పు డీచిత్రములప్రతులనుగూడ నుపాయనముగాఁ గొనెను. ఇట్టినష్టమున కోర్వఁజాలక నీచిత్రములయందుఁ గల యభిమానము పెంపున, శ్రీఫర్గుసన్ దొరగారు మరల నీచిత్రములప్రతులఁ దీయించవలయునని ప్రభుత్వము వారిని బ్రోత్సహించి 1872 సం॥మున కొంతచర్యను దీసికొనిరి. దినదినమునకును నశించుచును, శిథిలీభూతము లగుచును వచ్చుచుండిన చిత్రములఁ గాపాడుటకును, వాటి ప్రతులఁ దీయించుటకును బొంబాయిప్రభుత్వమువారు 50,000 రూప్యముల వ్యయపఱచి ప్రతులఁదీయించియుఁ జిత్రములయందు వీరికిఁగల యభిమానమునకన్న లండన్ నగరముపైఁ గలయభిమాన మేవిధమునను గొఱతఁగానందున ఫర్గుసన్ దొరగారి కిష్టము లేకున్నను నీచిత్రముల ప్రతుల నప్పటికే పంపివేసిరి. కాని తాను మొదట నేర్చినపాఠమును నేర్చుకొన లేదనుకోపమున నగ్నిహోత్రుఁడు మరల నాప్రతుల నాహుతిఁగొనెను.

అయినను ఈమారు చిత్రముల ఛాయాపటములు తీయఁబడియుండినందున గొంతవఱకైనను అజంతాచిత్రములఁ గుఱించి చూడగలిగియున్నారము.

ఒక్కొక్కచోట నీగుహాలయములలోఁ బూర్తి కానిభాగము లున్నందున వాటియాధారమున నాగుహలను త్రవ్వినపద్ధతిని దెలిసికొను నవకాశము కలుగుచున్నది. సుమారు 9 అడుగులస్థలమున 6 గురు మనుష్యులు పనిచేసియుండిరి. వీరిలో ముగ్గురు A, B, C లలో 3 కాలువలను పలుచుచు ముందుపోయిరి. (నాలుగవ పటమునుజూడుడు.) ఈకాలువలమధ్య వదలఁబడిన

పటము ౪





D, E, F అనుగట్లను మఱిముగ్గురు వెనుకఁ ద్రవ్వుచు వచ్చిరి. ఇతరపనివారు త్రవ్వబడినభాగములను సమపఱచుచు (నిమ్నోన్నతములు లేక చేయుచు) వచ్చిరి. ఈరీతిని కుడ్యములను, స్తంభములను, వాటివాటిస్థలముల గుర్తించుకొని వదలుచుఁ దక్కినభాగములఁ ద్రవ్వుచు గుహాలను బూర్తిచేసి (ఇం దుపయోగింపఁబడిన పనిముట్లు, ఉలులు, సుత్తులు, సమ్మెటలు మొదలగునవిగా నుండి

యుండవలెను.) వాటిపైని గారపూతలు పూసియు, వర్ణములు వేసియు వన్నెదెచ్చుచుండిరి. మొదటి గుహాలయమును త్రవ్వుటకు ఆలయముఖమును 65 అడుగులుగా గుర్తించుకొని త్రవ్వ మొదలిడిరి. ఇందు ముందు మధ్యభాగమునందు 14 అడుగులు వెడల్పును 19 అడుగులు ఎత్తును వదలి పార్శ్వముల త్రవ్వసాగిరి. ఈ వదలిన భాగమున రెండు స్తంభములు చెక్కబడి ఆలయమునకు ముందుమంటపమును బోలియున్నది దీనివెనుకభాగమున నాలుస్తంభములు గల వసారా యొకటి 10 అ. వెడల్పుగలిగినది త్రవ్వఁబడినది. తర్వాత వసారానుండి లోపలికేగుటకు 3 ద్వారములు 2 కిటికీలును త్రవ్వఁబడినవి. ఇందు మధ్యద్వారము 5 అడుగులు వెడల్పును, 10 అడుగులు ఎత్తును గలిగియున్నది. అటువెనుక మధ్యశాల (Central Hall) 64 అ. చదరముగలది త్రవ్వఁబడినది. ఇందు 20 స్తంభములు కలవు. దీనిచుట్టును 10 అ. వెడల్పుగల వసారా త్రవ్వఁబడినది. ఈ వసారా గోడలయందు సన్న్యాసులుండుటకు గూండ్లు మలుచఁబడినవి. శాలవెనుక 19 అ. వెడల్పున 12 అ. వెనుక నడవ నొకగదియు దానివెనుక గర్భాలయమును త్రవ్వఁబడినవి. ఈ గర్భాలయమున బుద్ధవిగ్రహ మొకటి కూడ మలుచఁబడినది. ఆలయము పూర్తియగునప్పటికి గుహాలోనికి 121 అ. త్రవ్వఁబడినవి. ఇట్లే నాల్గవ యాలయము 147 అడుగులవఱకుఁ త్రవ్వఁబడినది.

అజంతాగుహాలయములు 29 కలవు. ఆలయగర్భములోనికి సాధారణముగా వెలుతురు విశేషముగాఁ బడుటకు మార్గములు లేకున్నను, భూమిపైఁబడిన వెలుతురు ప్రతిఫలించి ఆలయమంతటిలోను వ్యాపించును. 1, 2, ఆలయములలో సాయంసమయమున క్రుంకు సూర్యునికాంతి లోనికి నేరుగాఁ బ్రవేశించి వెనుక నెక్కడనో యుండు బుద్ధునివిగ్రహమును ప్రకాశింపఁ జేయుటఁ జూచుట కందముగా నుండును.

నిర్మాణకాలమునుబట్టి యీయాలయములు రెండు సముదాయములుగా విభజింపఁబడఁదగియున్నవి. లోయయందు మధ్యభాగమునందు 18, 12, 10, 9, 8, ఆలయములు మొదటఁగట్టబడిన (మూడవపటమును జూడుడు.) ఇవి క్రీ. పూ. మొదటిరెండవ శతాబ్దములలో ఆంధ్రభృత్య, శాతకర్ణి రాజుల కాలమునఁ గట్టఁబడియుండవచ్చును. తర్వాత క్రీ.శ.4 శతాబ్దములవఱకే యాలయమును గట్టఁబడక తర్వాతఁ గ్రమముగాఁ దక్కినవి యేర్పడి యుండవచ్చును. రెండవ సముదాయములో వరుసగా 11, 14, 15, 16, 17, 18, 19, 20. క్రీ. శ. 5 వ, 6వ శతాబ్దములలోఁ గట్టఁబడి యుండవచ్చును. తర్వాత తక్కినవి కట్టఁబడియుండవచ్చును.

ఆలయముల యందుఁగల చిత్రములఁ గురించి రాఁబోవు సంచికల యందు వ్రాయఁబడును.




చిత్రము 3.

# భాషాసాంత్వనము

పెనుమర్తి వేంకటరత్నము గారు

కన్నుఁగొలఁకుల నశ్రు లగ్గలికఁబర్వ, దిక్కులేనట్లుపోలెఁ జింతిలఁగ నేలొ?
ముకుళితకరారవిందులై మొనయు నీదు, నందనబుధతతుల జయనినాదాళి వినుము!

చాళుక్యరాజ్యధ్వజ ప్రభల్ వినువీధి, నెలరుపఁ దోడ్తోడ్త నలరినావు!
పెన్నానదీమనః ప్రీణనగీతముల్, పొలయంగఁ దరువాతఁ గులికినావు!
రెడ్డిరాజుల నగరీజయఘంటికల్, తనర భోగంబుల నెనసినావు!
స్వాతంత్ర్యవల్లకీ ప్రూత నిస్స్వనముల్, చిగిరింపఁ గీర్తితో నెగడినావు!
ఆంధ్రకర్ణాటరాజ్యసింహాసనమున, నర్తనమ్ముల నొకట నొనర్చినావు!
వలదు వలవంత నిటు నశ్రువుల వెలార్ప, నమలసద్గుణశ్రేణి! శ్రీయాంధ్రవాణి!

సంస్కృతాంధ్రంబుల సమ్మేళనముఁ జేసి, రసమంజులత్వము నొసఁగెనొకఁడు,
తెనుఁగుఁ గైతలలోన దీఁటుకొనినయట్టి, పచ్చితేనియలఁ జూపిచ్చె నొకఁడు,
భక్తిచేఁ బారవశ్యోక్తులఁ జిలికించి, నిన్నాడించె మనీషియొకఁడు,
నవరత్నములఁ బోషణముసేసి గ్రంథాళి, రచియింపఁజేసెను రాజొకండు.
భాగ్యమునుబోలెఁ గడిఁది సంపదల పేర్మి, నెసక మొసఁగితి! నేటి కిట్లు సదఁబోలె
నుమ్మలిక నొందనేల నోయెమ్మెలాఁతి! యూఁజడిలు మాంధ్రవాగీశ్వరీ! రయంబ.

భృంగీసముత్కరసంగీతమునుబోలె, భావగీతికల విరావ మొలయ;
నన్యపుష్టామంజు లాలాపగతిబలె, నవవృత్తమోహనరవళి పొరయ,
శారికాగాన ప్రసారణమ్మువిధాన, ముత్యాలసరములు మురువు నింప,
సెలయేటిజిలిబిలి యులివ్రలయట్లొప్పు, మాధురీరసగతు ల్మలసికొనఁగఁ,
గెలన మంగళ వాద్యముల్ సొలపు నింపఁ, జారుగీతారవమ్ములు మాఱుమ్రోయ
నరుగు దెంచుచున్నార లనుఁగుసుతులు, శోకమొందకు మాంధ్రభాషాకుమారి!

పావనమైన యీయుదయ భాస్కరు నూత్నమయూఖపాళికా
ప్లావితమయ్యెఁ బో! దిగిభబంధుర తావక సద్యశమ్ము; క్రొం
దావితలిర్చె; మంజుకవితా సుమదామములందు నాంధ్రభా
షావనజాయతాక్షి! శుభసంతతినందెదు! గాసివీడుమా!

‘తొలిపూఁత’

# జలపాతము



## దక్షిణహిందూదేశము - జలపాతములు

కానూరు లక్ష్మణరావు గారు, (బి. ఇ. యమ్. ఇ. ఆనర్స్)

వస్తువునుగురించి ఆలోచించేది దాని ఉపయోగములనుబట్టే. కొండమీద ఉండేరాతిని మాసే నేచూడము కాని దానిని ఏవిగ్రహముగనో మలిచి ఒక గుళ్లో ప్రతిష్ఠించి దానికొక మహత్తు కల్పిస్తే ఆ ప్రదేశము పుణ్యక్షేత్రమై రెండోరోజునే తిరునాళ్లుగా మారుతుంది. చెప్పదలచుకొన్న దేమిటంటే ఏదైనావస్తువు ఉపయోగమునకువస్తే మనలను ఆకర్షిస్తుంది. జలపాతములు మనపూర్వకాలమునుంచి ఉన్నవి. ఇప్పట్లో అవి మనలను ఇంతగ ఆకర్షించుటకు కారణము విద్యుచ్ఛక్తి. దీనివల్లనే జలపాతములలో ఉండే శక్తిని దూరప్రదేశములకు పంపి ఉపయోగించుకొనుచున్నాము. అందువల్ల దానినిగురించి కొంచెము క్లుప్తముగా ముందు తెలుసుకొందము.

### విద్యుచ్ఛక్తి తయారుచేయు విధములు

విద్యుచ్ఛక్తి పుట్టించవలెనంటే రెండుసాధనములు కావలెను. చలనము, అయస్కాంతము. *ఇందులో అయస్కాంతము సంపాదించవచ్చును. ఇక తీగెను విరామములేకుండా త్వరితముగా త్రిప్పేటందుకు సదుపాయము చెయ్యవలెను. ఇది నూనె, నీటి ఆవిరియంత్రాల వల్ల కొనసాగించవచ్చు. ఇప్పుడు చెన్నపట్టణములో విద్యుచ్ఛక్తి ఇట్లే సంపాదిస్తున్నారు. నీటిని ఆవిరిగా మార్చి దానివల్ల యంత్రము నడిపిస్తారు. దానితో ఈతీగెను త్రిప్పి విద్యుచ్ఛక్తి పుట్టిస్తారు. దీనికి చాలాఖరీదవుతుంది. త్రిప్పేయంత్రానికి రోజూ నూనెఖర్చు మొదలైన వెన్నో కావాలి. వీటి నన్నిటినీ లెఖవేసిచూస్తే ఆర్థిక ప్రమాణమునకు (Kilowatt hour) పదణాలు అవును. నీరు, బొగ్గుమొదలైనవి చౌకగా దొరకినా అరణాలకు తగ్గదు.

ఇక రెండవవిధము: గాలిలోనుంచి తీయడము. ఇది పాశ్చాత్యులు ప్రస్తుతము ఆచరణలోనికి తెచ్చుటకు భగీరథప్రయత్నములు చేస్తున్నారు. ఇది ఇంకా గాలి కబురువలెనే ఉన్నది.

మూడవవిధము జలపాతములసహాయమున ఇది చౌకపద్ధతి. ఆర్థికప్రమాణమునకు అణాకంటె మించదు. ప్రస్తుతము బొంబాయిపట్టణములో విద్యుచ్ఛక్తి ఆర్థిక ప్రమాణమునకు అణాకంటె తక్కువ. దీనివల్ల ఎన్నోపరిశ్రమలు ప్రారంభించవచ్చు. అందువల్లనే చెన్నపట్టణములో కొన్నిభాగాలలో విద్యుచ్ఛక్తిని దీపములకుకూడ ఉపయోగించకుండా ఉంటే బొంబాయిలోను, బెంగుళూరిలోను కాఫీహోటల్లో ఫలాహారములుచేసి వెళ్లిపోతూఉన్న మనుష్యునకు ఎంతచార్జి అయినదో ద్వారము దగ్గరనున్న యజమానికి విపరీతపుకేకలు లేకుండ తెలియ

* కడచిన 'భారతి' సంచికలో వాయువిమానముల వ్యాసము చూడుడు.



శివసముద్రపు జలపాతమున్నస్థలమును జూపుపటము

చెప్పుటకుకూడ దానినే ఉపయోగిస్తున్నారు. ప్రపంచమంతటిలో అమెరికాదేశము ప్రతివిషయమునను ఎక్కువ ఔన్నత్యముపొందినదని వింటిము. అక్కడ మోటారు బండ్లుచేయుట మొదలైన అన్నిపరిశ్రమలు బాగా సాగుతూఉన్నవి. ఇట్లు సాగుటకుకారణము ఏమిటనివిచారిస్తే విద్యుచ్ఛక్తి అతిస్వల్పపుఖరీదుకుదొరకడమే. అక్కడ ఇదిపుట్టించేవిధముజలపాతములమూలమున. అక్కడ 'నయాగ్రాఫాల్సు' (నయాగ్రానదీపతనము) అని ఒక పెద్దజలపాతముఉన్నది. దానిసహాయము చేత విద్యుచ్ఛక్తిని ఎంత విరివిగా తయారుచేస్తూ ఉన్నా దానిలోనిశక్తి పదవవంతుమాత్రకే వినియోగిస్తూఉన్నారని వినుటకు ఆశ్చర్యముగా ఉండును. ఇట్టి ఈపద్ధతి తెలిసికొనుట ముఖ్యమని ఎంచి ఈ క్రింద దక్షిణహిందూదేశములో ముఖ్యమైన శివసముద్రము బొంబాయి జలపాతములనుగురించి వ్రాసెదను.

## జలపాతములు

నీరు ఎత్తుస్థలమునుంచి క్రింద పడుటనుపేరే జలపాతము. భూమియొక్క మిట్టపల్లములే ఇందుకు కారణము. కృష్ణానది కొండలలో పుట్టి పీఠభూమి ప్రదేశము మీదుగాప్రవహించి పల్లపుభూమి అయిన నైజాము రాజ్యము ప్రవేశించినప్పుడు అక్కడ జలపాతములు ఉన్నవి. నీరు ఎత్తుభూమినుండి క్రిందికి పడుతున్నప్పుడు చూచుటకు ఎంతో అందముగా ఉండును. పెద్దతిరుపతి వెళ్లినప్పుడు ఆకాశగంగ చూస్తేనే ఎంతోసంతోషముగా ఉన్నట్టయితే, ఒక పెద్దనది, శ్రీనాథుడు వర్ణించిన కృష్ణవేణమ్మ ఆడుకొనుచూ, పాడుకొనుచూ, పర్వతములలోనుంచి దుముకుతూఉంటే పట్టరానిసంతోషము కలుగుతుందంటే ఆశ్చర్యమేమిటి? కాని కృష్ణవేణమ్మ మంచినడత, దుడుకుతనములేని స్వభావముకలది కాబట్టి కొండలలోనుంచి అట్లు చాలసార్లు దుముకదు. కావేరిఅంటే అట్లుకాదు. చూచుటకుపిల్లకాలువమోస్తరు కనబడుతున్నా అల్లరిపట్టుకు చాలాచేస్తుంది. కొద్దిరోజుల క్రిందనే అరవలనందరిని హడలగొట్టినది. ఆనదికి చాలచోట్ల జలపాతములు ఉన్నవి. 'గెర్సప్ప' అన్నచోట లోకమంతటిలో ఎత్తయిన జలపాతము కలదు. అక్కడ ఒక



శివసముద్రపు జలపాతము



నదిలోనుండి కాలువలు విడిపోవు స్థలము: అచ్చటి వంతెన

చోట నది 830 అడుగుల ఎత్తునుంచి క్రిందికిపడును. అనగా కొంచె మించుమించు పదహారుతాళ్ల ప్రమాణము. మైసూరుకు 80 మైళ్లదూరమున శివసముద్రము అన్నచోట ఇంకొక జలపాతము కలదు. శివసముద్రము అన్నది ఒకద్వీపము. చుట్టూ కావేరినది. కావేరి అంత వరకు ఒకటిగావచ్చి అక్కడ రెండుపాయలు అవును. అట్లుపాయలగు స్థలముదగ్గర 6 అడుగులఎత్తుగల ఒకచిన్న ఆనకట్ట కట్టినారు. ఈ ఆనకట్టకు దగ్గరగా పూర్వకాలములో కట్టబడిన ఒకవంతెన ఉన్నది. ఇక్కడఉన్న ఆశ్చర్యకరమైన విషయము ఏమిటంటే ఈవంతెనకు ఆధారమైన స్తంభాలు నదిపడక (River - bed) మీదనుంచియే కట్టినారు. ఆనకట్ట చివరభాగమునుంచి నీరు రెండుకాలువలలోనికి పోవును. ఈ కాలువలలోనికి పోవు నీరు మనయిష్టమువచ్చిన ప్రకారము ఎక్కువచేయుటకు, తక్కువచేయుటకు తలుపులున్నవి. ఈ కాలువలు మన పంటకాలువలకంటె కొంచెము పెద్దవి. ఆరు లేక ఏడడుగులలోతు. పది అడుగుల వెడల్పు. ఇక్కడనుంచి నది దారివేరు, కాలువలదారివేరు. ఇక మనకు నదితో సంబంధము లేదు. నది ఇక్కడనుంచి పీఠభూమి(ఎత్తు స్థలము) మీదనే ఒకమైలుదూరము పోయి నాలుగువందల అడుగుల క్రిందికిపడి ఒక లోయగుండ ప్రవహిస్తుంది. ఇక కాలువలు అట్లు కాదు. వాటిని పీఠభూమిమీదనే మూడునాలుగుమైళ్లు తీసుకొనిపోవుదురు. ఈ కాలువలువచ్చి నిలిచిపోవు స్థలమునకు జలాశయము (Fore bay) అందురు. ఈజలాశయము దగ్గరనుంచి క్రిందికి తొంగి చూచినయెడల నాలుగువందలమువ్వయి అడుగులు క్రిందనున్న లోయలోనుంచి నది పిల్లకాలువవలె ప్రాకుతున్నట్టు కనబడుతుంది. నది పడే ప్రదేశమునకు ఈకనబడుప్రదేశము రెండుమైళ్లదూరమున ఉండును. ఇందువలన మనము తెలుసుకోవలసినది ఏమిటంటే అందరు అనుకొనేటట్టు నదిపడేచోటనుంచి ఏమీశక్తి తీయరు. ఇక కాలువలను ఇంతదూరము తీసుకొనివచ్చుట ఎందుచేతననగా, సాధ్యమైనంతఎత్తుమీదనుంచి నీటిని క్రిందికి తీసుకొనిపోవుటకని. ఇట్లుచేసిన ఎక్కువశక్తి వచ్చును. దీనినిగురించి తరువాత ఆలోచింతము. ఈజలా



జలాశయము: విద్యుచ్ఛక్తియొక్క ఒత్తిడి ఎక్కువచేయుభవనము

శయమువద్దనుండి నీరు ఇనుపగొట్టములలోనుంచి పోవును. ఈయినుపగొట్టములలోనికి నీరు రాకపూర్వము అది ఇనుపజల్లెళ్లలోనుంచి పోవుటచేత పరిశుభ్రము అవును. ఈగొట్టములు మనుష్యులుపోవుటకు వీలుగా ఉండేటంత పెద్దవిగా ఉండును. వాటిఅడ్డుకొలత 80 అంగుళములు. ఇట్టిగొట్టములు 8 కలవు. ఈగొట్టములు నీటిఉరవడిచేత కొట్టుకొనిపోకుండ కట్టుదిట్టముచేయబడినవి. ఈగొట్టము లలోనుంచి నీరుపారి లోయలో నది ఒడ్డున ఉన్నయంత్ర ములలోనికి వస్తుంది. ఈయంత్రము లన్నీ ఉండుటకు పెద్దభవనము కట్టినారు. యంత్రములలోనుంచి నీరు బయ టికివచ్చి మళ్లీ నదిలోనికి పోవును.



శివసముద్రములోని యంత్రాలయము

యంత్రములకు కావలసిననీరు అసలునదిలోనుంచి కాలువలగుండ వచ్చునని ఇదివరకే చెప్పినాము. నదిలో నీరు ఎల్లప్పుడూ ఉండదు. ఎండకాలములో నీరు ఉండదనియే చెప్పవచ్చును. అట్టి సమయములో పైయంత్రములమీద ఆధారపడినపరిశ్రమలన్నీ మూలపడ వలసినదే. అట్లు అవస్థపడకుండ ఉండుటకు శివసముద్ర మునకు పైని 60 మైళ్లదూరములో కన్నంబాడి అను చోట ఒకపెద్ద సేతువు (అడ్డుకట్ట) కట్టినారు. దీనియెత్తు 120 అడుగులు. ఇట్లుకట్టుటవల్ల నీరు సరస్సువలె ఏర్పడి నిలవయుండును. ఇది లోకము అంతటిలో విద్యుచ్ఛక్తి తీయుటకు నీరునిలవయుండు సరస్సులు అన్నిటిలో పెద్దది. ఈసేతువు కట్టుటకు సుమారు రెండుకోట్ల రూపాయలు అయినవి. ఈసరస్సులో నిలవయుండే నీటిపరిమాణము 4,150 కోట్ల ఘనపుటడుగులు. ఎండకాలములో ఈనీటిని యంత్రములకు వదలిపెట్టుదురు.

## విద్యుచ్ఛక్తియొక్క లెక్క

ఇంతవరకు జలపాతములలోనుంచి విద్యుచ్ఛక్తి తయారుచేయుటకు నీటిని నదిలోనుంచి యంత్రమునకు ఎట్లు తెస్తారో చూచినాము. ఇక అట్లు సంపాదించిన నీటివల్ల ఎంతశక్తి మనము సంపాదింపగలమో చూతము.

బావిలోనుంచి ఒక బొక్కెనతో నీటిని తోడునప్పుడు ఎంత శక్తిని ఉపయోగిస్తున్నామో తెలుసుకొందాము. సాధారణముగ మూడుబొక్కెనలు పోస్తేనేకాని బిందె నిండదు. బిందెలో సుమారు* 30 పౌనుల నీరుండును. కాబట్టిబొక్కెనలో 10 పౌనుల నీరుండును. సామాన్యముగా కృష్ణా, గోదావరి జిల్లాలలో ఉండే బావి అయినయెడల అది 20 అడుగుల లోతువుండును. ఒక బొక్కెన తోడినయెడల మనము పదిపౌనులు బరువుగల వస్తువును 20 అడుగులు ఎత్తినట్లు అవును. అనగా 10 × 20 = 200 పౌనుల అడుగుల పనిచేసిన వాళ్లము అయితిమి. ఒక గుఱ్ఱము సాధారణముగ 550 పౌనుల అడుగులపని ఒక సెకనులో చేయగలదు. కాబట్టి మనము తోడుటకు ఒక సెకను పట్టినయెడల మనము చేసినపని సుమారు ఒక గుఱ్ఱముచేయు పనిలో సగముపనికి సమానము. అనగా మనపని అర్ధఅశ్వశక్తికి సమానము. ఇట్లు పనిని లెక్కవేయుట ఇంగ్లీషువారిపద్ధతి. ఇంగ్లాండులో ప్రతిపనికి గుఱ్ఱాలు ఉపయోగించెదరు. కాబట్టి వారికి అందరికి అర్థముకావలెనని ఇంతపని ఇంత అశ్వశక్తికి (అనగా ఇన్నిగుఱ్ఱములు చేసినపనికి)

* 70 పౌనులు ఒకమణుగు.

సమానము అని చెప్పుదురు. కాని మన మట్లు చేయుట ప్రశస్తముగా ఉన్నట్లు కనబడదు.

శివసముద్రముదగ్గర జలాశయము లోయకంటె 430 అడుగుల ఎత్తున ఉన్నదని చెప్పితిని. నిమిషమునకు 60 ఘనపుటడుగుల నీరు యంత్రమునకు పోనిచ్చెద మనుకొనుడు. అప్పుడు సెకనుకు ఒకఘనపుటడుగు పారుతున్నట్లు అయినది. ఒక ఘనపుటడుగు నీటిబరువు 62 పౌనులు. కాబట్టి 62 పౌనులు బరువుగలనీరు 430 అడుగుల ఎత్తునుంచి పడుతున్నది. ఏదైన వస్తువు ఎత్తుస్థలమునుంచి క్రిందికి పడుతున్నప్పుడు అది కొంతపని చేస్తుంది. ఈపని ఆవస్తువును పైకెత్తుకొని రావలెనన్న ఎంతపనిచేయవలెనో అంతకు సమానము. అట్లే 62 పౌనులు బరువుగలిగిననీరు 430 అడుగులు పడుతున్నప్పుడు దానియొక్కశక్తి 48 అశ్వములశక్తికి సమానము అగును. కాని కావేరినదిలోనుంచి కాలువలకు వచ్చునీరు 62 పౌనులేకాదు. నిమిషమునకు 900 ఘనపు టడుగులు పారుచుండును. ఇందులో సగముమాత్రమే ఉపయోగిస్తున్నారు. అందువలన మనము సంపాదింపగలశక్తి 20,000 ల అశ్వశక్తి. దీనివల్ల చదువరులకు ఒకసంశయము కలుగవచ్చును. నీరు ఎక్కువ తెచ్చినయెడల ఇంకా ఎక్కువశక్తి సంపాదింపవచ్చునుకదా అని. అవును; సంపాదింపవచ్చును. అయితే శివసముద్రములో ఇంతకంటె ఎక్కువ ఎందుకు సంపాదింపరో తరువాత ఆలోచింతము.

## యంత్రములు

ఈనీరు ఏవిధముగ యంత్రములలో ఉపయోగించునది కొంచెము ఆలోచింపవలెను. నీరు పది మొదలు ఏభై అడుగులు ఎత్తునుంచి పడిన అవి చిన్నరకము జలపాతములనీ, 50 మొదలు 600 అడుగుల ఎత్తునుంచి పడిన అవి మధ్యరకము జలపాతములనీ, అంతకంటె ఎత్తునుంచి పడిన అవి పెద్ద జలపాతములనీ చెప్పుదురు. వీటిలో చిన్నరకము జలపాతములకు నీటిచక్రములు ఉపయోగించెదరు. ఇవి బండిచక్రమువలె గుండ్రముగా ఉండి మధ్య ఇరుసుమీదతిరుగుతుండును. దీనిచుట్టు బొక్కెనల ఆకారముగల పాత్రలు కట్టుదురు. నీరు ఈచక్రములలో పైభాగముమీద పడి వాటిని త్రిప్పును. వీటిని మనయిళ్లలో పెట్టి వానకాలములో చూరునీళ్లవల్ల పనిచేయించుకోవచ్చు.

ఇక మధ్యరకపు జలపాతములకు 'ఒత్తిడియంత్రములు' ఉపయోగించెదరు. అనగా ఈ యంత్రములలో నీటి ఒత్తిడి(Pres-ure)వల్ల చక్రములు తిరుగును. పెద్దజలపాతములకు 'పెల్టన్' చక్రము ఉపయోగించెదరు. దీనిని పటములో చూడవచ్చును: దీనికి ఈ పేరు 'పెల్టన్' అనే శాస్త్రజ్ఞుడు కనిపెట్టుటచేత వచ్చినది. ఇక్కడ నీటివేగముచేత చక్రములు తిరుగును. పైనిచెప్పిన ఒత్తిడికి, వేగమునకు భేదము తెలుసుకొనుట ముఖ్యము.

ఏదైన వస్తువుగాని, లేక ఏదైన జంతువుగాని వేగముగ పరుగెత్తుతున్న దనుకొనుడు. అట్లు వేగముగ పరుగెత్తుటవల్ల దానికి కొంతశక్తి వచ్చినది. ఏదైన అడ్డు వచ్చిన దానిని ఆవేగమువలన త్రోసివేయును. ఒకడు పిట్టలను కొట్టుటకు తుపాకి గురిపెట్టి గుండువిడచినాడనుకొందము. తుపాకిమందువల్ల ఆగుండుకు కలిగిన శక్తి ఎటువంటిది? ఆశక్తి వేగమే. ఈశక్తివల్లనే గుండు పిట్టలోపలికి దూరిపోవును. ఈశక్తివేరు. రైలుబండిలోగాని, లేక మరియేయితరసాధన మొదలుగాగలయంత్రములలోగాని ఉపయోగింపబడుశక్తి వేరు. నీరు ఆవిరిగా మారి బయటికి పోవుటకు అవకాశము లేనందున దానికి కొంతశక్తి పుట్టును. మూత గట్టిగా లేకపోతే లోపల ఆవిరి యెక్కువై ఎట్లయినను బయటపడుటకు మూతనుకూడ తన్ని వేయును. ఇట్లు ఆవిరి యంత్రములలో ప్రవేశించినపుడు ఏమీచలనముకాని, వేగముకాని లేకపోయినా అది ఎక్కువై స్థలముచాలక ఒత్తిడిమూలమున చక్రములు త్రిప్పును. ఈచక్రములను త్రిప్పు శక్తియే ఒత్తిడి. ఈశక్తిన్ని, వేగమువలన వచ్చేశక్తిన్ని వేఱు. ఈసూత్రములే ఒత్తిడిచక్రములలో ఉపయోగింతము. నీటికి కొంతశక్తి ఉండుటవల్ల యంత్రముగుండ అది బయటపడేసాధనము చూచుకొనును. బయటపడవలెనన్న చక్రము అడ్డముండును. చక్రము ఇరుసుమీద తిరుగుటకు తయారుగ ఉన్నది. కాబట్టి నీరు పారిపోవలెనని ప్రయత్నించుటలో అది చక్రమునుకూడ త్రిప్పివేయును.

ఇక పెద్దజలపాతములలో ఉపయోగించు పెల్టన్ చక్రములు నీటివేగముచేత తిరుగును. నీరు ఎత్తుమీదనుండి క్రిందికి పడునప్పుడు గొప్పవేగముతో వచ్చును. అందులో దానికి తగినట్లు నీరు బయటికి వచ్చు రంధ్రముకూడ

చిన్నదిగ ఉండుటవల్ల ధారగా వచ్చి చక్రమును కొట్టును. ఈచక్రమునకు దొన్నె ఆకారముగల సుమారు 22 పాత్రలు ఉండును. ఒక్కొక్కపాత్రకు ఆధార ఒక్కొక్కమారు తగిలి చక్రము త్రిప్పివేయుచుండును. ఈచక్రమునకు నడుమ ఆకులుండవు. గట్టిఫలకము ఒకటి ఉండును. ఈఫలకమునకు మధ్యనే ఇరుసు ఉండును. ఈచక్రమునకుచుట్టూ గాలి ఉండవచ్చును. కాని ఒత్తిడియంత్రములకు అట్లుకాదు. ఎందువల్ల అనగా ఒత్తిడివల్లనే అవి తిరుగవలసి ఉండుటచేత. ఎంతమాత్రము గాలి దానిలో ప్రవేశించుటకు వీలులేకుండ అది పూర్తిగ నీళ్లలో ఉండును. ఇట్లు నీరు చక్రములనుండి ప్రవహించి మరల నదిలో కలుస్తుంది.

చక్రములు తిరుగునని చెప్పినాను. చక్రము తిరిగిన దానితోబాటు ఇరుసుకూడ తిరుగును ఇట్లు తిరుగుటవల్ల విద్యుచ్ఛక్తి తయారుచేయుటకు కావలసిన సాధనములలో ఒకటియైన చలనమువచ్చును. ఇక అయస్కాంతము కావలెను. ఇది సూదంటురాళ్లవల్ల సంపాదింపవచ్చును. కాని అట్లుచేయుట అనవసరము. ఎందువల్లనన విద్యుచ్ఛక్తి తీగెలోనుంచి ప్రవహించునప్పుడు ఆతీగచుట్టు అయస్కాంతక్షేత్రము ఏర్పడును: అనగా ఆతీగ సూదంటురాయిమోస్తరుగానే పనిచేయును. కాబట్టి అయస్కాంతముకూడ విద్యుచ్ఛక్తివల్లనే సంపాదింపవచ్చును. చలనము + అయస్కాంతము = విద్యుచ్ఛక్తి అనుసూత్రముప్రకారము విద్యుచ్ఛక్తి ఉద్భవించును.

## శక్తిని స్థలాంతరమునకు గొనిపోవు విధము

ఇంతవరకు జలపాతములో ఉండుశక్తిని ఎట్లు చలనరూపముగ ఉపయోగించి విద్యుచ్ఛక్తి పుట్టించెదరో చెప్పినాను. కాని జలపాతము సహాయమున తీసే ఈశక్తిని స్థలాంతరమునకు తీసుకొనిపోవుటలో ఈవిద్యుచ్ఛక్తినే ఎందుకు పుట్టించవలెను అని ఆలోచించవలెను. శివసముద్రమునకు ఆశక్తిని ఉపయోగించు ప్రదేశమునకు ఎంతలేకపోయినా నూరుమైళ్లకు తక్కువలేదు. అట్టిసమయములో జలపాతములోనుంచి తీసిన చలనశక్తి ఆప్రదేశమునకు పోవునట్లు చేయుట ఎట్లు?

శక్తిని స్థలాంతరమునకు తీసుకొనిపోవు విధములు మూడు. అందులో ఒకటి మనము సాధారణముగా ఫ్యాక్టరీలలో చూచుపద్ధతిని అనుసరించి ఉండును. యంత్రమువల్ల తిరిగేచక్రమునుండి దూరముగాఉన్న చక్రమును త్రిప్పుటకు రబ్బరుదట్టి (Rubber belt) గాని, మోకులుగాని ఉపయోగింతురు. త్రిప్పవలసినచక్రము ఇంతకంటె మైలు, రెండుమైళ్లదూరములో ఉండిన యెడల ఇనుపమోకులు ఉపయోగించవలెను. అప్పటికీ చలనశక్తి ఒకప్రదేశమునుంచి మరియొకప్రదేశమునకు పోవునట్లు చేయుటకు ఎన్నో సదుపాయములు చేయవలెను. అందువల్ల ఈచలనమును 100 మైళ్లు పంపించవలెనంటే ఈపద్ధతి ఉపయోగములేదని చెప్పవచ్చును నీటిద్వారా శక్తిని పంపుట రెండవపద్ధతి. ఇది ఎట్లన చలనశక్తిని ఉపయోగించి నీటికి ఒత్తిడికలిగించి దానిని గొట్టములగుండ దూరప్రదేశములకు పంపుదురు. నీరు అక్కడకుపోయి ఒత్తిడిమూలమున అక్కడిచక్రములను త్రిప్పును. ఇది సులభపద్ధతికాదు. ఇట్లు పంపుటలో శక్తికూడ చాలభాగము తగ్గిపోవును.

ఇట్టి ఇబ్బందులులేకుండ శక్తిని దూరదేశములకు పంపువిధము విద్యుత్తుమూలమున. శక్తి దాల్చేరూపములలో విద్యుత్తు ఒకటి. అది ఒకతీగెలోనుంచి నదీప్రవాహమువలె పోవుచుండును. ఈవిద్యుత్ప్రవాహమునకు, నదీప్రవాహమునకు పోలిక ఎక్కువ. నదీప్రవాహమునకు రెండు గుణములు ఉండును: ఒత్తిడి ఒకటి. ప్రవాహరాశి ఒకటి. ఈరెంటినిబట్టియే నదియొక్కబలము ఉండును. అట్లే విద్యుచ్ఛక్తి ప్రవహించునట్లు చేయుటకు ఒత్తిడి ఉండవలెను. పారేటందుకు విద్యుత్ప్రవాహరాశి ఉండవలెను. ఇట్లు శక్తి రెంటిమీద ఆధారపడి ఉండును. విద్యుద్బలము = ప్రవాహము × ఒత్తిడి అని చెప్పవచ్చును. ఇందులో బలమును హెచ్చించలేము. అందువల్ల అది మారదనుకొంటే ఇక ఒత్తిడి ఎక్కువచేసినట్లయిన ప్రవాహరాశి తగ్గును. నీరు తక్కువగా ఉండేకాలువ చిన్నదిగా ఉండవచ్చునుగదా అట్లే విద్యుత్ప్రవాహము తగ్గినయెడల దానిని తీసుకొనిపోవు తీగనుకూడ సన్నము చేయవచ్చును. అందువల్ల చాలా ఖరీదు తగ్గును. కాబట్టి శక్తిని స్థలాంతరమునకు పంపవలె



బొంబాయి జలపాతప్రదేశమును జూపు పటము

నంటే ఒత్తిడి ఎక్కువచేయవలెను. అందుచల్లనే శివసముద్రములోను, బొంబాయిలోను ఒత్తిడిని అనవసరముగ ఉన్నదానికంటె 20 రెట్లు ఎక్కువచేయుదురు. ఇట్లు ఒత్తిడి ఎక్కువచేయు యంత్రములు ఉన్నభవనమును పటములో జలాశయముదగ్గర చూడవచ్చును.

## బొంబాయి జలపాతములు

పైని శివసముద్రపు జలపాతములనుగురించిచిత్రాలో వివరించినాము. చెప్పినదంతా సూరల సంగ్రహముగ వ్రాస్తాను. జలపాతములలోనుండి శక్తి తీసుకొనవలెనన్న ఒకనదిఎత్తుభూమి మీదనుండి క్రిందికి పడుచున్నస్థలము ఉండవలెను. అట్టి వీలు ఉన్నయెడల ఆనదికి ఒక అడ్డుకట్ట కట్టి నీటిని ఒక కాలువలోనికి తీసుకొనివెళ్లవలెను. ఆకాలువనుండి నీటిని లోయలోనున్న యంత్రములకు గొట్టములగుండ పోనియ్యవలెను. ఇది సాధారణముగ జలపాతములోనుంచి శక్తిని తీసేవిధము.

కాని బొంబాయిపట్టణముదగ్గర ఒకచిత్రమైన జలపాతము కలదు. అక్కడనదీ లేదు; ప్రవాహము లేదు; కాని బొంబాయికి 40 మైళ్లదూరములో పడమటి కనుమలు అనే పర్వతములు ఉన్నవి. ఆకనుమలలో అతి వర్షము. చెన్నపట్టణమున 50 అంగుళముల వర్షమే అబ్బురముగా ఉంటే అక్కడ 200 అంగుళములవర్షము సర్వసామాన్యము. ఆ వర్షపునీరంతా పిల్లకాలువలుగా పారి వ్యర్థముగా పోవుచుండేది. కాని దాదాపు పదిహేను సంవత్సరములక్రిందట 'తాతా' గారికి ఈనీటిని వృధాగా పోనియ్యకుండ ఉపయోగించలేమా అనిసంశయము తోచినది. వెంటనేకనుమలన్నీ పరీక్షించుట మొదలుపెట్టినారు ఆయన. ఆ కనుమలుచూస్తే సప్పుడు శాస్త్రజ్ఞునికితోచినప్రదేశములు అందరికికలుగుతవి. 'వాల్వాహన్' అనుచోటమూడు వైపులకొండలున్నవి. ఒకవైపున మైదానముమాత్రము ఏమీ లేదు. చుట్టూ కొండలున్న ఈప్రదేశము సుమారు అయిదారు చదరపు మైళ్లు వైశాల్యము ఉండును. ఈప్రదేశమున ఎల్లకాలము



'వాల్వాహన్' సరస్సుయొక్క సేతువు



'షిర్వాటా' సరస్సు

తీరనివర్షము. అట్టిచో ఈనీటిని సరిగ్గాన ఉపయోగముచెయ్యవలె నన్న ఆనీరు పోకుండా అడుకట్ట వేయుటయేకదా! అప్పుడు అయనా అంతే చేసినారు: ఆసేతువు ఎత్తు 71 అడుగులు; పొడుగు 4,900ల; వెడల్పు పదిఅడుగలు. దీనిలో నిలవ ఉండే నీటిప్రమాణము 2,96 కోట్ల ఘనపుటడుగులు. ఆసేతునిర్మాణముతో ఆనీరు అక్కడ నిలిచిపోయేది. ఈసందర్భమునఒకవిషయముమాత్రముదాచుటకు వీలులేదు. ఇట్లు చేసినప్పుడు కొన్ని ఊళ్లవాళ్లు ఆప్రదేశము వదలిపెట్టవలసివచ్చినది. ఇట్లే 'వాల్వాహాణ్' సరస్సుచుట్టూ ఉండేకొండలలో ఒకకొండను అవతలభాగమున 'షిర్వాటా' అనే సరస్సు కట్టినారు. ఇక్కడకూడ మూడువైపుల కొండలు కలవు. ఒకవైపున మాత్రము అడ్డుకట్ట కట్టినారు. దీని వైశాల్యము ఆరు చదరపుమైళ్లు. సేతువు ఎత్తు 96 అడుగులు: దానిలో నిలవఉండే నీటిప్రమాణము 696 కోట్ల ఘనపుటడుగులు. ఈరెండుసరస్సులకు మధ్యనున్న కొండమీదనే పూర్వకాలములో బౌద్ధులు గుహలను తొలిచినారు. ఇవే జగత్ప్రసిద్ధిగల కార్లేగుహలు. ఇక ఈసరస్సులు రెంటిని కలిపి ఉపయోగించవలెనంటే ఒకదానికి ఒకదానికి సంబంధము ఉండవలెను. అందువలననే మధ్యనున్న కొండలో ఒకసొరంగము దొలవవలసి వచ్చినది. ఈసొరంగము వెడల్పు 11 అడుగులు: ఎత్తు 8½ అడుగులు: పొడుగు ఒకమైలు. దీనిని దొలుచుటకు 3 సంవత్సరముల 6 నెలలు పట్టినది. దీనివల్ల 'వాల్వాహాణ్' సరస్సులో నీరు పదిహేను అడుగులు తగ్గగానే ఈపైనిచెప్పిన 'షిర్వాటా' సరస్సులోనుంచి నీరు వదలిపెట్టెదురు. ఇంతటితో చాలక 'షిర్వాటా' సరస్సును ఆనుకొన్న ఒకకొండ అవతలవైపున 'ముంష్ఠీ' అనే ఒకసరస్సును క్రొత్తగా కట్టుతున్నారు. ఈసరస్సువల్ల ఇంకా 230 కోట్ల ఘనపుటడుగులనీరు వస్తుంది. దీనికిని 'షిర్వాటా' సరస్సునకు మధ్యనున్న కొండలో ఒకసరస్సులోనుంచి ఇంకొక సరస్సులోనికి నీరుఇచ్చుటకు ఒకసొరంగము దొలుచు



'వాల్వాహాణ్: 'షిర్వాటా' సరస్సులకు నడుమనున్న సొరంగము.

చున్నారు. ఇట్లు నీరు నిలవచేయుటకు ఒకదానితరువాత ఇంకొకటి చొప్పున మూడుసరస్సులు ఏర్పాటుచేసి సొరంగముగుండ ఒకదానిలోనుంచి ఇంకొకదానిలోనికి నీరు తెప్పించుచున్నారు. చివర 'వాల్వాహక్' సరస్సునుంచి ఒకకాలువ బైలుదేరును. ఇది 8 అడుగులలోతు, 15 అడుగుల వెడల్పు. పైని చెప్పిన మూడుసరస్సులు గాక మధ్య ఇంకొకసరస్సుకూడ ఉన్నది. దీనిలో నిలవఉండే నీటిప్రమాణము 36 కోట్ల ఘనపుటడుగులు. దీనిలోనినీరు కొద్దిరోజులకు సరిపోవును. అందువల్ల వర్షము అధికముగా ఉన్నప్పుడు మాత్రమే ఉపయోగిస్తారు. ఏయిరవై రోజులకో దీనిలోఉన్న నీరు అయిపోవును.



క్రొత్తగా కట్టుచున్న 'కుండిలీ' సరస్సు

శివసముద్రములో కాలువ ఏమీ అడ్డములు లేకలేకుండ స్వేచ్ఛగ వస్తుంది. కాని ఇక్కడమాత్రము అడుగడుగునకు ఆటంకములే. ఒక్కొకప్పుడు కాలువ ఇండ్లక్రిందుగా పోవును: ఒక్కొకప్పుడు రైళ్ల వంతెనలగుండపోవును. అందువల్లనే ఇదికట్టుటకు ఎంతో ఖర్చు అయినది. ఇట్లు వచ్చి ఈ నీరు ఒక జలాశయము చేరుతుంది. అక్కడనుంచి నీరు శివసముద్రములోవలెనే గొట్టములగుండ యంత్రములలోనికి వెళ్లును. ఈగొట్టముల పొడుగు రెండుమైళ్ల ఆరుఫర్లాంగులు. శివసముద్రములో మూడుఫర్లాంగులు మాత్రమే. ఈగొట్టములు పోవుటకుకూడకొండలోలిచి సొరంగములు చేయవలసివచ్చినది. కానిశివసముద్రములోకంటె ఇక్కడ నీరు చాలాపల్లమునకు దిగును. శివసముద్రములో నీరుదిగునది 430 అడుగులు మాత్రమే. ఇక్కడ 1730 అడుగులు క్రిందికి పడును.



సరస్సులలోనుండి నీటినిగొనిపోవు కాలువ

కాబట్టి యిది పెద్దజలపాతము. ఈకారణమున 'పెల్టన్' చక్రములనే ఉపయోగించవలెను. ఈనీరు మరల యంత్రములలోనుంచి బైటికి వచ్చినపిదప వ్యవసాయమునకు ఉపయోగిస్తారు. ఈయంత్రములవల్ల ప్రస్తుతము తయారుచేసే విద్యుచ్ఛక్తి 60 వేల అశ్వశక్తిసమానము, ఇది హిందూదేశమంతటిలో జలపాతములోనుంచి ఏర్పడ

శక్తి వచ్చేస్థలము. ఇట్టి వీలు చూచి పడమటికనుమల లో దాక్కొన్న గంగాభవానిని ఇప్పుడు అనేకస్థలములలో బయటికిపిలుస్తున్నారు. ఆంధ్రలోయ, మల్షీపేట మొదలగు ప్రయత్నములు అన్నీ ఇటువంటివే.

ఈ పైని చెప్పిన జలపాతములకు శివసముద్రములో ఉన్న జలపాతములకు భేదము గ్రహించుట చాలాముఖ్యము. బొంబాయిదగ్గర జలపాతములు లేవు; కనుమలున్నవి. అవి వర్షమునకు ఉనికిపట్లు. అందువల్ల వృథాగా పోవు నీటిని దాచి దానిని క్రిందికిదింపి జలపాతము మోస్తరుగా ఉపయోగిస్తున్నారు. శివసముద్రములో అట్లుకాదు. జలపాతములు లెక్కలేకుండ ఉన్నవి. నదిప్రవహిస్తుంది. ఆనది లోయలోనికిపడుతుంది. ఇందువల్ల మనము తెలుసుకోవలసిన విషయము ఏమిటంటే నదిఉన్నాసరే లేకపోయినాసరే: ఒక ఎత్తుప్రదేశముఉండి అది వర్షమునకు ఉనికిపట్టు అయితే చాలు. దానివల్ల మనము విద్యుచ్ఛక్తి సంపాదించగలము.

హిందూదేశములో జలపాతములు చాల ఉన్నవి. కాని అన్నిచోట్ల ఏదో నదో లేక చిన్న ప్రవాహమో పారుతుంది. దానిసహాయమువల్ల విద్యుచ్ఛక్తి తీయుచున్నారు. బొంబాయిమోస్తరుగ నీటిని పట్టుకొని తద్ద్వారా ఆవిధముగ శక్తిని సంపాదించు చోట్లులేవు. ఇది ఒక నూతనపద్ధతి.

## విద్యుచ్ఛక్తిని ఉపయోగించువిధములు

శివసముద్రములో ఉద్భవించిన విద్యుచ్ఛ- మైసూరు, బెంగుళూరు పట్టణములకు వెళ్లును కాని యీపట్టణములలో ఉపయోగించుశక్తి అంతా కలిపిన అది అయిదువేల అశ్వశక్తికయినా సమానముకాదు. కాబట్టి మిగిలినశక్తి అంతా ఉపయోగించుట ఎట్లు అని ఒకప్రశ్న వచ్చును. ఇప్పుడు ప్రస్తుతము కోలారు అనే ప్రదేశము శివసముద్రమునకు నూరుమైళ్ల దూరమున ఉన్నది. అక్కడ బంగారుగనులు ఉన్నవి. బంగారము రాళ్లతో కలిసి భూమిలో ఉండునని వేరే చెప్పనక్కరలేదు. ప్రస్తుతము ఇంగ్లీషువారికంపెనీలు ఆబంగారము తీస్తున్నారు. బంగారము తీసేవిధ మిది.

ఒకచిన్నబావిమోస్తరు 15 అడుగులు అడ్డుకొలత కలిగిన ఒకకన్నమును నిలువుగ త్రవ్వుదురు. అది భూమిలోనికి నాలుగువేలు అయిదువేల అడుగులవరకు పోవును. భూమి పైభాగమునుంచి భూమిలోపల వేయి అడుగుల



జలాశయమునుంచి యంత్రాలయమునకు నీటినిగొనిపోవు గొట్టములు

లోతువరకుమాత్రమే నీరు ఊరును. వేయి అడుగులు దాటి ఇంకా భూమిలోపలికి వెళ్లితే నీరు ఉండదు. ఇట్లు ఊరిన నీటిని యంత్రాలతో తోడివేయుదురు. ఇట్లు ఆకన్నములలోనుంచి చుట్టూ ఒకమైలుదూరము ప్రతినూరు అడుగులకు ప్రక్కలను సొరంగములు త్రవ్వుదురు. ఈసొరంగములు 8 అడుగుల ఎత్తు 6 అడుగుల వెడల్పు ఉండును. ఈసొరంగములోనుంచి రాయి తీయుదురు. ఈరాతిలో చాలాభాగము బంగారము ఉండును. ఈరాతిని భూమిపైకి తెచ్చి చిన్నచిన్న ముక్కలుగా చేసి చివరకు పిండిలాగు నలగగొట్టుదురు. ఈనలగగొట్టిన పదార్థములో తుత్తునాగము, పాదరసము కలిపినపదార్థము ( Zinc Amalgam ) కలిపి మిశ్రము చేసినట్టయితే బంగారము, పాదరసము కలిసిపోయి అదొక వేరుపదార్థము అగును. దీనిని వేడిచేస్తే అందులోనుంచి పాదరసముపోయి బంగారము మిగులును. ఇట్లు బంగారము తీయగా మిగిలినమట్టి వృథాగా పోనీయక

ఇతరపద్ధతులు ఎన్నో ప్రయోగించి అరట్టిలో బంగారము కొంచెముకూడ లేకుండ చేయుటకు ప్రయత్నించెదరు. ఈపనిఅంతా చేయుటకు చాలాశక్తి కావలెను. ఇది ప్రస్తుతము శివసముద్రపు జలపాతమువల్ల పుట్టించు విద్యుచ్ఛక్తివల్ల జరుగుచున్నది. కాని బంగారపుగనులు ఎల్లకాలమూ ఉండవు. కొంత కాలము అయిన తరువాత అక్కడ ఉన్న బంగారము అంతా అయిపోవును. పరిటాలసంగతి అంతే అయినదికదా! అట్టిస్థితి ఈ కోలారుకుకూడా ఇంక పదిలేక పదిహేను ఏళ్లలో వస్తుంది అని అందురు. అట్టిస్థితి వచ్చినప్పుడు శివసముద్రము




హిందూదేశములోని జలపాతములు

దగ్గర దొరకుశక్తిని ఏమిచేయవలెను అని ప్రశ్న కలుగును. ఈసందర్భములుఅన్నీ గమనించినపిదప శివసముద్రముదగ్గర దొరకువిద్యుచ్ఛక్తిని ఎందుకు ఎక్కువచేయుటలేదో చదువరులకుసులభముగ తెలియవచ్చును. అతివృష్టి-అనావృష్టి: కావలసినంత శక్తి ఉన్నది. దానిని ఉపయోగించుటకు తగినపరిశ్రమలు లేవు. చెన్నపట్టణములోను, మరియితర ప్రదేశములలోను అనేక పరిశ్రమలు సాగించుటకు అనుకూలములు చాలకలవు. కాని విద్యుచ్ఛక్తి చౌకగ దొరకదు. ఇట్టిస్థితిలో చదువరులకు ఒకసందేహము తోచవచ్చు. 'పోనీ, శివసముద్రము చెన్నపట్టణమునుండి 300 ల మైళ్లే కదా, అక్కడనుంచి ఇక్కడికి జలపాతములోని శక్తిని విద్యుత్తమూలముగా పంపింపకూడదా' అని. కాని, అది సాధ్యముకాదు. 300 మైళ్లు పంపించుటకు ఎంతో ఖర్చు అవును. అందువల్ల ఆశక్తి ఇంతదూరము వచ్చుటదుర్లభము, కాని ఎవరైన శాస్త్రజ్ఞుడు శక్తిని దూరదేశములకు సులభముగ పంపించుపద్ధతిని ఏదైనా కనిపెట్టితే కావేరిలో ఉన్న నీరు అంతా వినియోగించి శక్తిని సంపాదింపవచ్చు. మనప్రశ్న అట్లే ఉన్నది. పదిహేను ఏళ్లకు మైసూరు గవర్నమెంటువారు శివసముద్రములో పుట్టే విద్యుచ్ఛక్తిని ఏమిచేస్తారు?

ఈకారణముననే రైలుబళ్లను విద్యుచ్ఛక్తిమూలమున నడపవలెనని ప్రయత్నములు, ఆలోచనలు జరుగుచున్నవి. రైలుబళ్లు ఇప్పుడు మనదేశములో నీటిఆవిరివల్ల నడచుచున్నవి. ఎక్కువగా నూనెగనులు ఉండే మెక్సికో మొదలైన దేశములలో రైలుబళ్లు నూనెవల్లకూడా నడిపిస్తారు. వాటిని విద్యుచ్ఛక్తివల్లకూడ నడిపించవచ్చును. మదరాసులోని ట్రాంబళ్లు చూచినవారు ఉండవచ్చును. ఎట్లు ట్రాంబండి కదలుచున్నదంటే ఆయు

హిందూ దేశములో ఇప్పుడు ఉపయోగములోనికివచ్చిన

# జలపాతముల పట్టిక*

| | స్థలము పేరు | | నీటి ఆధారము | అశ్వశక్తి (550 పౌను- అడుగుల పని ఒక సెకనులో చేసే అశ్వశక్తికి సమానము) | నదిలోనికి ప్రవహించు కనీస ప్రవాహరాశి. (సెకనుకు ఘనపుటడుగులలో) | సరస్సులోని నీరు (కోట్ల సంఖ్య ఘనపుటడుగులు) | నీరు పడే ఎత్తు (అడుగులు) | కాలువ యొక్క పొడవు (మైళ్లు) | కాలువలో పారు నీరు (సెకనుకు ఘనపుటడుగులలో) | గొట్టముల పొడవు (అడుగులలో) | శక్తినుపయోగించుటకు ప్రారంభించిన సంవత్సరము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | తోపోలి | (బొంబాయి) | వర్షము | 67,000 | — | 1,000 | 1,725 | 4.6 | 480 | 12,590 | 1914 |
| 2 | ఆంధ్రలోయ | ,, | ,, | 68,000 | — | 1,200 | 1,743 | — | — | 4,700 | 1912 |
| 3 | శివసముద్రము | (మైసూరు) | కావేరినది | 22,650 | 890 | 4.200 | 410 | $3\frac{1}{4}$ | 1000 | 950 | 1902 |
| 4 | డార్జిలింగు | (బంగాళము) | కొండ సెలయేళ్లు | 600 | 10 | — | 275 | 2.9 | — | 720 | 1897 |
| 5 | సిమ్లా | (పంజాబు) | ,, | 1,680 | 19 | — | 540 | $2\frac{1}{4}$ | 32 | 1,800 | 1913 |
| 6 | అమృతసరము | ,, | కాలువ | 270 | 1,050 | — | 6 | — | 2,300 | — | — |
| 7 | పాటియాలా | | ,, | 285 | 550 | — | 8 | .2 | 550 | — | — |
| 8 | గంగానదికాలువ | | ,, | 600 | 3,000 | — | 19 | — | 600 | — | 1914 |
| 9 | భిట్గొర | (మధ్యపరగణాలు) | నది | 1,280 | 150 | 531 | 46 | — | — | — | 1914 |
| 10 | జమ్ము | (కాశ్మీరము) | కాలువ | 910 | 500 | — | 26 | — | — | — | 1911 |
| 11 | జీలము | (పంజాబు) | నది | 5,360 | 4,000 | — | 395 | 6.5 | 560 | 750 | 1909 |
| 12 | గోకక్ | (బొంబాయి) | గటప్రభనది | 2,100 | 136 | 90 | 210 | $\frac{1}{2}$ | 200 | 275 | 1913 |
| 13 | మసూరి | (సంయుక్తపరగణాలు) | సెలయేరు | 2,400 | $8\frac{1}{2}$ | — | 1,000 | — | — | 4,350 | — |
| 14 | ఖాట్మాండు | (నేపాళము) | చలమ | 551 | — | — | 678 | — | — | 2,805 | 1909 |
| 15 | మలకండ | (పశ్చిమోత్తరపరగణాలు) | కాలువ | 530 | — | — | 30 | $2\frac{1}{2}$ | 125 | 45 | 1908 |

* ఇంకను చాలాచోట్ల చాలా జలపాతములున్నవి కాని వాటిశక్తిని ఇంకా ఉపయోగములోనికి తీసుకొని రాలేదు. ఉపయోగములోనికి తీసుకొనివచ్చినవి మాత్రమే ఇచ్చట తెలుపబడినవి.

సాకాంతము + విద్యుచ్ఛక్తి=చలనము. మొదటి ముఖ్య సూత్రమే ఇక్కడ మరల ఉపయోగములోనికి వచ్చినది. విద్యుచ్ఛక్తి అయస్కాంతక్షేత్రములో ప్రవహిస్తే చలనము పుట్టుతుంది: చక్రాన్ని గిర్రున త్రిప్పుతుంది. ఇట్లే రైలుకూడా నడిపించవచ్చును. ఇట్లుచేస్తే శివసముద్రములోని శక్తిని సవ్యముగ అంతా ఉపయోగింపవచ్చును.

ఇక బొంబాయిలో అట్లుకాదు. అక్కడ పరిశ్రమలు ఎక్కువ: శక్తి తక్కువ. అందువల్ల ఇంకా టాటా కంపెనీవారు ఎన్నో సరస్సులు కట్టుతున్నారు. నీరు ఎట్లయినా ఎక్కువ నిలవ చేయవలెను. అట్లు చేసినచాని తో శక్తిని ఎక్కువచేయవచ్చును అనగా బొంబాయి కృత్రిమ జలపాతమునకు నీరు తక్కువ. అక్కడ నీటిని ఎంతో విలువగా చూస్తారు. కాలువలో ఎక్కడనైనా నీరు కారుతూ ఉంటే వెంటనే దానిని ఆపుచేయిస్తారు. శివసముద్రములో అట్లుకాదు. నీరు సమృద్ధిగ ఉన్నది. ఎంతనీరు కాలువలనుంచి వెలుపలికిపోయినా లక్ష్యము లేదు.

ఇక్కడ ఒక ఉదాహరణము చెప్పి దీనిని పూర్తి చేయదలచుకొన్నాను. మందరపర్వతముతో సముద్రమును దేవతలు, రాక్షసులు చిలికినారు. ఈచిలుకుటయే పైని చెప్పిన చలనశక్తి. సముద్రమునిండా నూదంటురాళ్లే కదా! అనగా అది అయస్కాంతక్షేత్రము అని చెప్పుదము. అయస్కాంతక్షేత్రములో దేనినైనా త్రిప్పితే అమృతమువలె విద్యుచ్ఛక్తి పుట్టక ఏమి పుట్టును! విద్యుచ్ఛక్తియే పుట్టినది. అమృతము ఎంత అమూల్యపదార్థమైనదో అట్లే విద్యుచ్ఛక్తికూడా అంత అమూల్యమైనదై అన్నిపనులకూ ఉపయోగపడుతున్నది. సముద్రమున ఉద్భవించిన అమృతమును తీసికొనుటకు దేవతలు ఎట్లు ముందు తయారుపడిరో అట్లే ఈనూతనఫలమును అందుకొనుటకు మనముకూడ తయారుపడవలెను.



# విస్మృత గానము

తురగా వేంకట రామయ్య గారు

భ్రాంతులుదీరి మాకనులపండువు సేయు, విశిలభూధర
ప్రాంతవ నాంతకందర కరాళవినిర్గతవాః ప్రవాహావి
క్రాంతనటత్తరంగరవ రంజిత విస్తృతరాగ మేదో, వి
భ్రాంతునిఁ జేసె నన్ను ముదిరావసితమ్మగు సాంధ్యవేళలన్.

భ్రాంతిపడి మానసమ్ము విశ్రాంతి నొందఁ, బ్రకృతిలక్ష్మికిఁ జూపు లర్పణ మొనర్చి
రమ్యరాగతరంగ పరంపరలకుఁ, గర్ణము లొసంగి, కంటి నక్కజపురూపు.

ఆహారిదంత విశ్రుతవిహార సుగంధ తరంగమాలికా
మోహనదివ్యరాగసుమపుంజనికుంజవిలోకనామితో
త్సాహవిలోలహృత్పరభృతమ్ము సరస్తటిఁ బాదమాని య
వ్యాహతదృష్టిఁ గాంచెను ధదు(?)త్తమసీమలఁ జేరుదారులన్.

సాధుచరితమ్ము వోలెఁ బ్రశాంతమగుచు, ధీరహృదయమ్ము భాతి గంభీరమగుచు
కావ్యరీతి నఖిలలోక సేవ్యమగుచు, రాజభావమ్ము వలె గాఢరమ్యము, నగు
నప్పరాయనృపాలు మహాతటాక, కూలముల నల్లనల్లనఁ గొంతనడచి.

బాలరసాలపల్లవపుఁ బందిరులం బరువెత్తి, విచ్చుఁ గ్రొం
బూలబజారులం దవలపూన్చినవాయురథమ్ము నెక్కి, భా
వాలఁ గఱంగి జంట నెడబాయనిగువ్వలఁ గాంచి మ్రొక్కి, గీ
తాలఫాలాల క్రేవల లతాలసితమ్మగు సీమ కేఁగినన్.

పాయలం దీరు సెలయేటిపవనసీమఁ, గ్రొంజవురుగొన్న వంశనికుంజతలిని
విరియఁ బూచిన తంగేడు విరులనడుమఁ, బసిమి మిసిమిల్లు పచ్చికపాన్పునందుఁ
గంటి నానందకామినీకాంతు నొకని?

నీలదేహమ్ము గన్నెరుపూలసరులు, గాలిససియాడు నెత్తురుమాలు పాగ
చిన్నగోచియు నానంద చిత్రితాస్య, మలర గోబృందముల మేపునాంధ్రబాలుఁ.

సరససుందరుఁడైన యాసహజమూర్తి, కెంపుమోవిని దాల్చి రాగిల్లు గ్రోవి
నలరి వర్షాంతరచితదినాంత వేళ, నాట్యమాడుచుఁ బాడుట నంతఁ గంటి.

మోరలెత్తిన యాలముందు నృత్యముసల్పు, లేఁగలు బాల్గ్రోవ సాఁగ వేల?
దగఁ దీర్చుకొన నేటిదరులఁ జేరిన, లేళ్ళు? నట్టె మ్రాన్పడి నీర మాన వేల?
ప్రియుఁడుఁ దెచ్చినపిల్లి పెసరగింజలనేని, గలరవమ్ములు నోటఁ గఱవ వేల?
పుష్పసౌరభధనమ్ముల లోకముల కిచ్చు, కరువలి నినువీడి కదలఁ డేల?
నేల బ్రహ్మాండభాస్కరుఁ డేఁగఁ డింకఁ, బశ్చిమాశాంగనా పరిష్వంగమునకుఁ
బ్రకృతి నీయీలపాటలో వగలుచుండె, నేల నేఁడిటు గొల్ల గోపాలబాల!

రాలుచున్నము దస్రుకణాలతోడఁ, గన్నుఁగవ మోడ్చి ప్రణమిల్లి కాంచునంత
వెడలిపోయె మహావనవీథు లంటి, బాలకుఁడు నాయెడల నేమి భ్రాంతిఁ గనెనొ?

తెలియరాదయ్యొ నా తెల్గుఁదేటపాట, నాటిపోయెను రాగమ్ము నామనమున
"నాఁటి విస్మృతగాన మేనాఁటికైన, విందునే తత్ప్రవీథుల వీను లలర".



# నేను చంపేనా?

పారనంది జగన్నాథస్వామి గారు, యమ్. ఏ., యల్. టి.

"సుందరీ, మధ్యాహ్నం జోగమ్మ ఏమిచెప్పిందో చూచేవా! ఏమిసాహసము! ఈఊళ్లోవాళ్లు ఏమైనా పుట్టిస్తారు. అమ్మా వీరినోటికి తలుపుద్వార బంధం లేదు. నీవు......"

"ఏమిటుంది?..."

"నీ కెవరు చెప్పేరు అని నేను అడిగితే, ఊరంతా అనుకొంటూఉంటే, ఎవరుచెప్పేరని అడుగుతావేమిటి? పిల్ల పెద్ద, ఆడ మొగ భేదము లేకుండా, అందరూ అంటూఉంటే ఎవరనిచెప్పేను? ఇంతమంది అనుకొంటూఉంటే నీకుమాత్రము తెలియదా అనుకొన్నాను. అవునులే నీతో ఎవరు చెప్తారు ఇట్టి నీచవార్తలు?" అని అన్నాది.

"ఏమిటది అక్కా, ఎవరు చెప్పితే నేమి? ఏమిటి నామీదనేనా?...ఎందుకు ఆలాగుచూస్తావు? నీముఖము నీవైఖిరి చూస్తే ఏదో నామీద తుట్ట పడ్డట్టు ఉంది. అదేదో చెప్పివేస్తూ నీ ధర్మముంటుంది, చెప్పినతరువాత కలిగే క్షోభకంటె, నీ ఆందోళనముఖమువలన నాకు ఎక్కువ తాపముగా ఉంది, నాగుండెకాయ చీలిపోతున్నది. చెప్పే అక్కయ్యా అదేమిటో"

"నీవెప్పుడైనా మన రామారావును నీషికారులలో కలిసేవా? అత డెప్పుడైనా నీచెయ్యి పట్టుకొన్నాడా? నీవూ అతనూ ఎక్కడైనా కలిసి కూర్చొని మంతనాలు చేసేరా?... ఏమమ్మా దేనికీ జవాబు చెప్పవు?"

"అయితే ఏమి? నాపై వలపుఉన్నదనా లేకపోతే ఇద్దరమూ సరసులమనా? ఏమంటుంది జోగమ్మ?"

"సుందరీ, ఇదివరకే మన కీగ్రామములో వెలి. మన నాన్న అమ్మ చూపినధైర్యానికి ఈగ్రామస్థులు నిలవలేక, వారిని కులమునుండి గ్రామమునుండి కూడా బహిష్కరించినారు. ఇన్నాళ్లు అయిపోయిందిగదా అనిన్నీ, నాన్న పోయిన తరువాతైనా అమ్మ ముసలిది అయిన తరువాతైనా పూర్వపు కావేషాలు ఉండవుగదా అనిన్ని మన ఇంటికి మనము వచ్చేము. ఇలాటి నీచవార్తలు, చిక్కులు రావచ్చుననిన్నీ, వస్తే మళ్లా ఇబ్బంది



"సుందరం ప్రత్యుత్తరము ఈయకుండా మేజోడు అల్లుకొంటూ కేన్వాసు మడతకుర్చీలో చేరబడి చూస్తూ ఊరుకొన్నది."

వస్తుందేమో అనిన్నీ నీషికార్లు మానీమని అమ్మచెప్పింది, నీవు వింటేనా?..."

సుందరి ప్రత్యుత్తరము ఈయకుండా, మేజోడు అల్లుకొంటూ కేన్వాసు వాడతకుర్చీలో చేరబడి చూస్తూ ఊరుకొన్నది. భాగమ్మకూడా సుందరిముఖమందు ప్రతిఫలిస్తున్న భావోద్రేకముల విన్యాసములను అదేమాస్తూ దగ్గరనే ఉన్న బల్ల మంచముమీద కూర్చొన్నది.

సుందరి ఆతల్లి కూతురే. సాధ్యమైనంతవరకూ ఏ గొడవా లేకుండా ఉండేటట్లు ప్రవర్తించాలనే ఆమె కోరికకూడా. అలాగని అయిన దానికి కానిదానికి బెదురుతూ ఉండే అలవాటు ఆమెకు లేదు. అట్టినడవడి అప్రయత్నముగా వస్తూఉంటుంది. నోళ్ళవస్తుందని భయపడకుండా, ఆమె తల్లి తన అంతరాత్మ కోరిన ప్రకారము నడిచింది. వెలిరాగానే వెలితోపాటు స్వాతంత్ర్యముకూడా ఆమెకు బహిరంగముగా వచ్చివేసింది. వెలివేసేవారి తెలివితక్కువ ఇంత అంతకాదు. సాంఘికనియమములకు లొంగనివారిని దండించి బుద్ధి చెప్పాలని వెలివేస్తారు. కాని వెలిరాగానే, సంఘమునుండి తొలగిపోగానే, ఆత్మపైఉండే నిరోధముకాస్తా పలచన కాగానే, నిజమైన స్వాతంత్ర్యము పైకి స్వేచ్ఛగా విజృంభిస్తుంది. సుందరితల్లిదండ్రులు వెలిపడగానే ఆగ్రామము విడిచిపోయి రాజమహేంద్రవరంలో ఒకమూలనెమ్మదిగా తమకు సంతుష్టికలిగేటట్లు జీవయాత్ర నడిపేరు. వీరేశలింగం పంతులుగారు స్థాపించిన హైస్కూలులో సుందరికి చదువుచెప్పించేరు. వీరేశలింగంగారు వారిపాఠశాలలో ఉన్న పిల్లలకు స్వేచ్ఛ చూపలేకపోయినా, సుందరికిమాత్రము అన్యాయమైన నిరోధములు పెట్టకుండా తల్లిదండ్రులు పెంచేరు. ఆటలు, పాటలు, సభలు, షికార్లు, చదువు, చర్చ, — ఇన్నీ చల్లగా అబ్బినవి. భాగమ్మకూడా చదువుకొన్నది కాని ఆమెజననమే తల్లి వెలికి కారణముకుటచేత, గర్భములో ఉన్నప్పుడు తల్లికి కలిగిన బహిష్కారవేదనవల్ల భాగమ్మది పిరికిస్వభావము అయినది.

సుందరి ముఖము చూచిచూచి, భాగమ్మ తనహృదయములో ఉద్భవిస్తూ పైకి ఉబకకుండా ఉన్న భావసమూహమునంతా స్వరములోను, నేత్రములలోను సూచిస్తూ చెల్లిని పలుకరించింది. "అమ్మా, చెల్లీ, ఆరామారావుతోనా నీకా నీలాపనిందలు! నీకతడు ఎంత మేనత్తకొడుకైనా, అత్త డొక్కమారైనా మనఇంటికి వచ్చి, అమ్మని చూడలేదుకదా. మన నాన్నతల్లికి వన మీద ఎంతక్రోధమో నీకే ఎరుగుదువు. ఆమె ఆస్తిలోనిది ఒక్కదమ్మిడైనా మన కిచ్చిందికాదు. అంతా ఆకూతురు కొడుకు రామారావుకే ఇచ్చివేసింది. ఇంతకూ ఆవెలి కదా కారణము. నిన్నెలాగు ఆరామారావు పలుకరించగలిగేడే! నీపెళ్ళినాడు తాంబూలము పుచ్చుకోవడానికైనా రానివానికి నీతో మాట్లాడడానికి ఎంత సిగ్గులేకపోయిందే...... .."

"అక్కయ్యా, నావల్ల అపరాధ మేమీ లేదు. రామారావు పలుకరిస్తే నేనూ పలుకరించేను. మాట్లాడితే మాట్లాడేను. అతడు రామారావు అయినంతమాత్రాన నేనెందుకు భయపడాలి? ఇంతకూ నీమరిదికి వానిపైని గౌరవమేకదా. అందుచేతకూడా మామూలు లాంఛనపు మర్యాద లోపముచేయరాదని నేను నటించేను ఎందుకు, నేనెప్పుడూ ఏమీ దాచలేదే నావివాహానికి పూర్వము, రామారావు నేను ఎప్పుడెప్పుడు కలిసేమో, ఎప్పుడెప్పుడు ఏమేమి మాట్లాడేమో చెప్పుతూ ఉండేదానినే......"

"అయితే ఇప్పుడు ప్రత్యేకముగా ఏమిటైనా జరిగిందా ఏమిటి?"

"ఏమీ లేదు. కడపటిసారి నన్ను ఒంటరిగా కలిసినప్పుడు, మామూలు పలకరింపులైనతరువాత, నా చెయ్యిపట్టుకొని నాభర్త నా పెండ్లికాలమందు ఇచ్చిన ఉంగరము, విప్పువాచీ చూస్తూ, 'ఇది ఈదేశములో దొరకదే అని ప్రసంగిస్తూ' ఉంటే, ఎవరో లోకులో కాకులో చూస్తే చూసిఉంటారు. అందుకుకాబోలు ఈ గొడవఅంతా."

"చెల్లీ, నాకేమీ ఎప్పుడూ నీమీద దురభిప్రాయము లేదు. నీ వేదిన్నీ లాభాలాభములు మంచి చెడ్డలు ఆలోచించకుండా చేసే తొందర స్వభావము కలదానివి కావని నాకు తెలుసును; కాని నీమొగుడు ఏమనుకొంటున్నాడో అని నా ఆందోళనము. చిన్నతడు జరిగిచి పెండ్లాడేటప్పుడు రామారావు అన్నా, అతని

తల్లి అన్నా చాలాగౌరవము. అతనిచెవిని ఈనీలివార్త పడిఉంటే..." అని అంటూ భాగమ్మ మంచముమీద నడ్డి వాలిచింది.

౨

భీమారావు ఇంగ్లీషువైద్యము అభ్యసించినవైద్యుడు. చికిత్స అతనివృత్తిఅయినా, తోటలువేయించుట, మొక్కలకు అంట్లుకట్టుట అంటే అతనికి చాలాసరదా. తనవృత్తిమీదనున్న శ్రద్ధకంటె ఈపనులమీద శ్రద్ధ ఎక్కువ. ఈపనులంటే రామారావు తల్లికికూడా చాలా అభిమానము గనుక, ఆమెవద్దకు తరుచుగా భీమారావు వెళ్లుతూ, తానుచేస్తున్న నూతనశోధనాలు ఆమెకు చూపిస్తూ, ఆమె మెప్పుపొందుతూ ఉండేవాడు. కాని ఆమె ఇంటివైద్యము మాత్రము వైకుంఠమే చూస్తూఉండేవాడు. తనకీ వైద్యము ఎందుకు అప్ప చెప్పదని భీమారావు వగస్తూఉండేవాడు. తనకంటె పెద్దపరీక్షలో ఉత్తీర్ణుడై తనకంటె ఎక్కువఖ్యాతి సంపాదించిన గోపాలము ఉన్నప్పుడు తనకేరావలనని కోరుట ఒక తప్పని భీమారావు తలచలేదు.

తననుగురించి సదుద్దేశము గౌరవము అందరికీ ఉండాలని భీమారావు ప్రయత్నించేవాడు. చక్కనిదుస్తులు ధరించడములో అతనికి ఒక పట్టుదల. పేదిక్రొత్తమోదికోటు, పంట్లాము, జోడు, టై, కాలరు, టోపీ అయితే వాటిని చెన్నపట్నంనుండి తెప్పించుకొనేవాడు. గ్రామములో పెద్దవాళ్లు వీధులలో కనబడ్డప్పుడు, వారియెడల గౌరవము చూపేవాడు. రామారావును ఎప్పుడైనా కలిస్తే మోటారు ఆపి వానితో ఒక్క నిముషమైనా మాట్లాడకుండా వెళ్లేవాడు కాడు. ఈవైఖరంతా చూసి రామారావు నవ్వేవాడు.

రామారావు ఆగ్రామములో పెద్ద. ఆరోగ్యము లేకపోయినా, మంచిఆస్తిఉండడముచేతను, గ్రామములో చాలాతరములనుండి దర్జాగా కాలముగడుపుతూఉండే కుటుంబములోనివాడగుటచేతను, గ్రామానికి వచ్చేదొరలందరితోను పరిచయము ఉన్నవాడగుటచేతను, రామారావు అంటే అందరికీ చాలా గౌరవము. రామారావు ఆధునికనాగరకుడు పూర్వపుకట్టుబాట్లు అంతగా లక్ష్యపెట్టక, కొంచెము స్వేచ్ఛగా సంచరించడానికి ప్రయత్నిస్తూఉండేవాడు. పూర్వపుకట్టుబాట్లకు వ్యతిరేకముగా సంచరించే సుందరి కనబడగానే, రామారావుకు ఒకవిధమైన సంచలనము కలిగింది. సుందరి షికార్లు, సుందరి విద్యాగంధము, సుందరినాగరక విలాసములు, సుందరి మాటసొంపు—ఇవన్నీ, రామారావుహృదయమును ఆకర్షించినవి.

సుందరిని రామారావు తరుచుగా షికారులలో కలిసేవాడు. ఒకపెద్దశిరీషవృక్షము క్రిందనున్న కావావైపు కూర్చొని సుందరి రామారావులు కులాసాగా మాట్లాడుతూఉంటే భీమారావు ఎక్కడనుండో వస్తూచూసేవాడు.



"భీమారావు... మోటారుఆపి, రామారావుతో కొంతసేపు మాట్లాడి సుందరిని, దగ్గిరనుంచి చక్కగా చూచి... నాల్గుమాటలు మాట్లాడిపోయినాడు"

మోటారుఆపి, రామారావుతో కొంతసేపు మాట్లాడి సుందరిని, దగ్గిరనుంచి చక్కగాచూచి, ఆమెతోకూడా నాల్గుమాటలు మాట్లాడి మోటారుఎక్కి పోయినాడు. మోటారునడుస్తున్నది కాని వానిధ్యానము బండీచక్రము మీద లేకుండెను. ఇదివరకు చాలామార్లు సుందరిని వీథు లలో ఒంటరిగా దూరమునుంచి చూచేదుగాని, ఈరోజు సంభవించినదర్శనఫలము ఇంతకుముం దెప్పుడూ కలుగ లేదు, రామారావు అభిప్రాయము ఏమైయుండును? సుందరి అభిలాష ఏలాగుఉండునో? రామారావుతల్లి, సుందరితల్లి, ఇద్దరిఅభిప్రాయములమాట ఏమిటి? ఇవన్నీ ఏలాగున్నా తనకుమాత్రము సుందరిపైని మోహము కలి గింది అన్నమాట నిశ్చయమే కదా!

సుందరి కుటుంబానికి పెలికాబట్టి, ఎవరూ తగిన వాళ్లు వాళ్లఇంటికి తరుచుగా వెళ్లరు; వెళ్లినా చాలా సేపు ఉండరు. భీమారావుకు అట్టినిర్బంధ మేమీ లేక పోవడముచేత, అతని కెభాగమ్మతల్లి చికిత్సకొరకు వర్త మానము చేసింది. ముసలిదానికి జబ్బుగాఉన్నప్పుడు భీమారావు ఎక్కువసంతోషముతో వారింటికి తరుచుగా వెళ్లి వైద్యము చేస్తూఉండెను. కాని ఆమెదేహారో గ్యము కుదర్చలేకపోయినా, మనస్సుకు ఆరోగ్యము కుద ర్చగలిగినాడు. భాగమ్మకు వివాహముకాదని నిశ్చయ మై చాలాకాలమైంది; సుందరికైనా తగినభర్త దొరుకునా అని ముసలిది చింతిస్తూఉండేది. రామరావు కనబడ్డాడని పలుకరించేడని సుందరి చెప్పితే, రామారావు ఇంకా వివాహము చేసుకోలేదని తల్లి సంతోషిస్తూ ఉండేది. అట్టి ఆశలతోను. ఊహలతోను కలవరపడుతూ ఉన్న ఆమె చెవులకు అమృతమువంటి మాటలు ఒక సాయంకా లము భీమారావు పలికినాడు.

సుందరికైతే వివాహమైనది; కాని అంతగా సౌఖ్యము లేకపోయింది. తాను ఎరిగిన ఇద్దరిలోను ఎవ రిపై ఆమెకు వాస్తవమైన వలపు ఉన్నదో సుందరి తర్కించి కనుక్కొనక పూర్వమే భీమారావుతో వివా హము నిశ్చయమై జరిగిపోయినది. రామారావు బయట పడలేదు. ఇంటికి రాలేదు. భీమారావు, కుటుంబన్నే హితుడైనాడు. కోరుదిశిబి అడిగి వేసినాడు. తల్లికి దుఃఖము వస్తుందనిన్నీ, వెలిలోఉన్నా కోరి వరించినా డనిన్నీ, సిష్టాన్నము తిన్నివేస్తే భోజనము మరిదొరకద నిన్నీ, సుందరి అతనితో వివాహమునకు అంగీకరించింది. ఒప్పుకొన్నది కాబట్టి భీమారావుమాటకు ఎదురుచెప్ప కుండా సంచరిస్తూ ఉండేది. భీమారావు చాలాపిసినీ, కోపిష్టి, పంతగాడు. ఏదో అసౌఖ్యములో సుందరి పడి కొట్టు కొంటున్నాదని మాత్రము రామారావు శీఘ్రమే గ్రహించినాడు. ఆమాట సుందరి ఎప్పుడు ఎత్తలేదు. కాని ఎంత అణచి ఉంచినా ముఖములో హృదయము వికసించక మానదుగదా. అయ్యో! ఇట్టి సుందరికికూడా అసౌఖ్యము కలిగిందిగదా అని రామారావు దుఃఖించినా సుందరితో ఏమీ స్పష్టముగా అనకుండా ఆమెతో పూర్వమువలెనే షికార్లలో కలిసినప్పుడు మాట్లాడుతూ ఉండేవాడు. పూర్వముసుందరి; ఇప్పుడు భీమరావు భార్య; అంతే భేదము.

ఇంతగాథ ఉన్నప్పుడు సుందరి రామారావుల వలపు నీలివార్త భీమారావు వింటే ఏమి చేస్తాడోగదా అని భాగమ్మభయము.

## 3

"సుందరీ, నీమొగు డేమైనా అన్నాడే?"

"చికాకుపడడము, కసరడము, పరధ్యానంగా ఉండడము తప్ప వేరేమీ బయలుపడలేదు. ఆపేరైనా తలపెట్టలేదు. మునుపు అప్పుడప్పుడు అడిగేవారు రామా రావు కనబడ్డాడా, మాట్లాడినావా. అని నీలివార్త వినో, ఎందుచేతనో కాని ఆమాట ఎత్తనైనా ఎత్తలేదు. ఏమై ఉంటుం దనుకొంటావు?"

"అతనిపై ఖరంతా చూస్తే అనుమానంగానే ఉంది. స్పష్టము కావడానికి ఈరోజు భోజనాలవద్దిర అడిగి చూస్తా."

"అక్కయ్యా, ఎందుకా గొడవ. ఊరుకోకూడదూ అదిగో మోటారుచప్పుడు. ఇంతవేగిరముగా డాక్టరు ఈరోజు వచ్చివేసేరు? ఎనిమిది ఇప్పుడేకదా కొట్టింది."

"పద, భోజనానికి పద."

భోజనము చేస్తూఉంటే "భీమ ఏమిటివి తే పాలు ఊర్లో?" అని భాగమ్మ కదిపింది. మౌనమువహిం చిన ఋషివలె మాట్లాడకుండా వడ్డించినదానిని తింటూ ఏదో ఆలోచిస్తూఉన్న భీమారావు తులుక్కు పడ్డట్లు

వొదినగారి వైపుచూసి ఊరుకొన్నాడు. సుందరిభాగమ్మలు మొగమొగాలు చూసుకొన్నారు.

"వైకుంఠము ఊర్లో లేదు కదా, ఇప్పుడు జబురు వస్తే ఎవరిని పిలుస్తారో!" అని డాక్టరు మొగముఎత్తకుండానే ఊరుకొన్నాడు.

"భీమం, ఈమధ్య రామారావు ఎప్పుడైనా .."

"నీకెందుకు ఆ అధికప్రసంగము. నీకు బుద్ధిలేదు. ఊరుకో" అని పైకివస్తున్న కోపమును అణచుకొంటూ, పళ్లు పటపట కొరుకుతూ, "ఛీ, వాడు పాపి" అని ఒక్కమారు ఛీకరించి, కంచము విడిచి పోయినాడు.

"నిశ్చయమేనా?"

"కావచ్చును. కాని ఏప్రమాదము జరగవలసి ఉన్నదో!" సుందరి భోజనానంతరము తాంబూలము, పాలు, దాసీద్వారా పడకగదిలోకి పంపివేసి, తాను అక్కయ్యదగ్గిరే ఉండిపోయింది. అక్కచెల్లెలు చాలాసేపు ఈసంగతే మాట్లాడుకొన్నారు. మరింక కోపము వచ్చింది, అనుమానం కలిగింది. కాబట్టి దాంపత్యమేలాగు నడుస్తుందో అని భాగమ్మ ఆందోళనము. రామారావు భీమారావులు ఏమిచేసుకొంటారో, ఏమి ఉపద్రవము వచ్చిపోవునో అని సుందరిభయము. రాత్రి చాలా అయింది, పడుకొందామని రాత్రికట్టుకొనే చీరతో తను మేడమీదకి వెళ్లగానే, వసారాలో తిరుగుతూ ఉన్న భీమారావు సుందరిని చూచి చేయిపట్టుకొని గది లోనికి తీసుకొనిపోయినాడు. కాని ఒక్కమాటైనా మాటాడలేదు.

ఏవైపునుండో చిన్నమేఘం లేచింది. రివ్వుమని గాలివేస్తూఉంటే, కిటికీతలుపులు బడబడమని కొట్టుకొంటూ ప్రళయచిహ్నాలువలె సుందరిని బెదరగొట్టుతూ ఉన్నవి. భీకరమైనగాలివాన, గాఢమైనచీకటి, ప్రౌఢమైన నిశ్శబ్దము. రామారావు భీమారావులకథ, అక్కయ్యచెప్పినమాటలు, తాననుకొన్న ఊహలు, ఇన్నీకలిసి సుందరిని కలవరపెట్టుతూఉంటే, కంటికి కునుకురాక పరుపుపైని దొర్లుతూ, బెదరిపోయిన లేడివలె సుందరి తహతహలాడుతూఉన్నది. ప్రక్కనున్న పరుపుమీద భీమారావు గుర్రుకొట్టుతూ సింహమువలె పరుండిఉన్నాడు. వీథితలుపు దబదబమని ఎవరో బాదుతున్నట్లు వినబడుతూఉంటే, ఇక సుందరి మనోవైకల్యము వర్ణించుటఎందుకు?

తుళ్లిపడుతూ 'భీమంభీమం' అని సుందరి అరిచింది. కళ్లునులుపుకొంటూ డాక్టరులేచి "ఎందుకా భయము? కలకన్నావా ఏమిటి?" అని అడుగుతూఉంటే దబదబమని వీథితలుపు చప్పుడు వినబడ్డాది. "ఎవరు ఆ తలుపు" అంటూనడ్డిమీదనుంచి జారిపోయిన లుంగీ సర్దుకొంటూ, చేతిలాంతరు, తాను క్రిందికి దిగివచ్చేడు. ఈ లోపున, ఏమిలేపన్నా ఒకనందమాత్రనా కేకల, చప్పుడు వినబడి ఉంటుంది.

తలుపుతీయకముందే "డాక్టరుగారు, వేగంగా రండి వ్యవధిలేదు." అని ఆవచ్చినవాడు లాంతరువెలుతురుమాస్తూ అరవడము ఆరంభించేడు. వాడితో ఏదో మాట్లాడి లోపలికి పరుగెత్తుకొనివచ్చి "సుందరీ, ఆసల్లబారాన్న లేదే; భాగం! తోలుసంచితే; చూడు నల్లపెట్టెలో ఉన్న వాడిపోనాబుడ్డీ నల్లది ఈలాగు అందియ్యి." అని వచ్చినసేవకునికంటె ఎక్కువ గాభరాతో భీమారావు ఇటుఅటు పరుగెత్తినాడు.

"అక్కయ్యా, ఏమిటే, ఈరాత్రివేళ ఎక్కడికి ఒక్కరే వెళ్లుతున్నారు? ప్రళయమువలె ఉన్న ఈగాలివానలో ఎందుకే ఆవెళ్లడము? వానగుండె జల్లు జల్లుమంటున్నదే."

"ఆనౌఖరివానిని అడిగితే రామదాసు పంపేడనిన్నీ రామారావుకు అకస్మాత్తుగా మూర్ఛవచ్చినదనిన్నీ వైకుంఠము ఊర్లో లేకపోవడముచేత నీమొగుడిని పిలిచేరు అనిన్నీ చెప్పేడు."

"ఆ! రామారావుకే! ఏమిటే! మూర్ఛా! బావవైద్యమున్నా? బావనే ఎందుకి పిలవాలే అక్కయ్యా, గోపాలమును పిలవలేక పోయినారా? అక్కయ్యా, ఈపిడుగులు గాలి ప్రళయము, రామారావు అకస్మాత్తు మూర్ఛ, బావవైద్యము— ఇవేవీ నాకు నచ్చలేదు."

"ఏమిటి అంటావు?"

"రామారావు చచ్చిపోడుగదా!"

"పిచ్చిఎత్తిందా ఏమిటి?"

"బావ పట్టుకొనివెళ్లిన మందు విషముకాదుగదా!" ఇతనిని ఎందుకు పిలిచేరే! రాత్రే నీవున్నా రామారావు

పేరు ఎత్తేవు? ఆకాశము పడిపోలేదుగదా! ఘోరంగా ఉందే!" అని సుందరి గందరగోళం పడుతూ ఉంటే, పిడుగులు ఎడతెరిపిలేకుండా రాలుతూ ఉంటే, గాలి కుక్కలు అరచినట్లు మొర్రపెట్టుతూ ఉంటే, అక్కచెల్లి మేడక్రింద ఆఫీసుగది ప్రక్కగదిలో ఒకరిని ఒకరు పట్టుకొని కూర్చొన్నారు. పిడుగులు అక్కడికిరావా! వర్షం, గాలి, చీకటి, పిడుగులు, రామారావు మూర్ఛ, భీమారావు వైద్యము వీటిమధ్య సుందరిమనస్సు పడిపోయింది. ఏమీ తోచకుండా ఆగదిలో దాగున్నారు. తెల్లవార వచ్చింది. డాక్టరువచ్చి, ఆఫీసులో చలికిలపడ్డాడు. తాామున్న గదితలుపు సందులలోనుంచి సుందరి డాక్టరుని అదేచూచి, అక్కకు చూపించింది. కొంతదిగులు, కొంత సాహసము కలవాడు విచారిస్తూ కూర్చొన్నట్లు డాక్టరు రెండుచేతులమధ్య బుర్రపట్టుకొని బల్లపై అని కుర్చీలో చతికలపడి ఉండడము అక్కచెల్లి చూసేరు. గాలివర్షం చల్లారిపోయినవి. చూరు చినుకులు మాత్రము మిగిలి ఉన్నవి.

తెల్లవారిందిగదా అని మెల్లగా తలుపుతీసుకొని అక్కచెల్లెలు పైకివచ్చివేసేరు. బెదరిపోయిఉన్న సుందరి ముఖము భాగమ్మచూచి "అమ్మా, ఎందుకే ఆలాగు బెదురుతున్నావు?" అని అడిగింది.

"అక్కయ్యా, రామారావు చచ్చిపోయినాడు. చంపలేదుగదా డాక్టరు. ఔషధము లేకపోయిఉంటే బ్రతికిఉండునా?" అని సుందరి గద్గదముగా అన్నది.

"నీకేమి మతిపోయిందా ఏమిటి? చచ్చిపోతే చచ్చిపోయిఉంటాడు. ఎవరు ఆచంపివేసినవారు? ఎందుకు చంపివేస్తారు?" అని భాగమ్మ చీకాకుపడ్డది.

"ఆహా! వైకుంఠం లేకపోతివిగదా. ఆరామారావుపాలింటికి యమదూతవలె వచ్చింది ఆపురుటికేసు. భీమారావును ఎందుకు పిలిపించేరే."

పిచ్చిఎత్తిందా ఏమిటి? ఊరుకొంటావా లేదా. ఎందు కానోడబి! రామదాసే పిలిపించేడు. ఎందుకా దురూహాలన్నీ? రామారావంటే రామదాసుకు ఎంతో ప్రేమ; గౌరవమున్నూ. ఆఇంటివైద్యము తనకు రావాలని బావ ఎన్నాళ్లనుండో తంటాలుపడుతున్నాడు కాదూ! మరొకలాగు ఎందుకు జరుగుతుంది? ఊరుకో! ఇంతకూ నీకెందుకు ఈగోడబంతా!

"నేనే కారణం. నీ నీలివార్త అనుమానం. నేను నమ్మను. ఉ! కాని. అయిపోయిందిగదా! కాబట్టే ఆ ప్రళయము!"

"పద, కాఫీచేసుకొందాము. పద."

భీమారావును చూడడానికి గోపాలము వచ్చినాడు. ఇద్దరు డాక్టర్లు గదిలో చాలాసేపుకూర్చొని, ఏదో చర్చించినారు. రామారావుకు చేసినవైద్యముగురించి ప్రసంగించినపుడు భీమారావుచేసిన చికిత్స చాలాతప్పు అని గోపాలము నిష్కర్షగా నొక్కిచెప్పినాడు. స్ట్రిక్నీను అనేది ఒకవిషము. తక్కువ మోతాదులో ఇస్తే మందున్ను, ఎక్కువైతే విషమున్ను; దానిని కొన్ని కొన్ని స్థితులలోనే ఇవ్వవచ్చునుగాని, కొన్నిటిలో ఇవ్వకూడదు. రామారావు మూర్ఛకు స్ట్రిక్నీను సూది ద్వారా అంతమోతాదు ఇచ్చుట చాలాతప్పు చికిత్స అని గోపాలము ఖండించినాడు. భీమారావువాదము మనకంతగా తెలియదు. భీమారావు అంతగా వాదించలేదు. తానుచేసినది పొరపాటని ఒప్పుకొన్నాడా? మానానికి అర్థము తెలియదు. గోపాలము కొంతసేపు ఈలాగు వాదించి, తన అభిప్రాయముచెప్పి, లేచి వెళ్లిపోయినాడు.

రామారావు చావుకు స్ట్రిక్నీను వైద్యమే కారణమా? భీమారావు పొరపాటా లేక బుద్ధిపూర్వకమా?

గోపాలము వెళ్లిపోగానే భీమారావు ఇంటిలోనికి వచ్చి, సుందరిని పిలిచి "సుందరీ! నాశరీరములో ఏమీ బాగాలేదు. ఈగ్రామము విడిచి కొన్నాళ్లు పాటు దగ్గిర సముద్రము తీరమైన రామపట్నంలో ఉండడానికి నిశ్చయించేను; 10 గంటల ప్యాసింజరులో పోదాము. అన్నీ సిద్ధముచేయి." అని ఆజ్ఞచేయగా, "నేను మీతో రాను! రాలేను" అని సుందరి ఆలోచనచేయకుండా మాట్లాడినట్లు వెంటనే జబాబు చెప్పివేసింది.

"ఊ! ఏమిటి అన్నావు. ఆ! రామారావా, చచ్చిపోయినాడు."

"అయిందిగదా! నేనెందుకు?"

"నాకు అస్వస్థతగా ఉన్నాదంటే నీవు దగ్గిర లేకపోతే ఏలాగు"? అని ధ్వని చేసేడు అతడు.

## ౫

ఊరికి బయటఉన్న ఒకచిన్న ఇల్లు అద్దెకు తీసుకొని అందులో భార్యాభర్తలు, ఒకదాసీగి కాలము నడుపుతున్నారు. గదివిడిచి డాక్టరు పైకిరాడు. ఏదో ఒక గ్రహావేశమువల్ల బాధపడుతున్న వానివలె సంచరిస్తూ ఉండేవాడు. ఎవరితోనూ మాట్లాడేవాడు కాడు. ఆంధ్రపత్రిక, భారతి, సాహితి, స్వరాజ్య మొదలైనపత్రికలు వచ్చేవి. ఏదీ చదివేవాడు కాడు. ఉత్తరాలువస్తే ఎక్కడనుంచి వచ్చేయో చూడడమేకాని చదవడము లేదు. సుందరిని రమ్మన్నాడుకాని సుందరితోనైనా కాలముగడపలేదు. ప్రొద్దున్న సాయంత్రము షికార్లు వెళ్లేవాడు. ఉన్నకాలమంతా గదిలో కూర్చొనుట, మంచముమీద పరధ్యానముగా చూస్తూపరుండుట, అతనినిత్యకృత్యములు. చింకి ట్టలు, మాసినగెడ్డాము, మురికిపట్టినబట్టలు, మాడిపోయినముఖము— ఇవి అతని శరీరసౌఖ్యచిహ్నాలు.

"ఇదేం చిత్రమో, శరీరములో బాగులేకపోతే, ఏదో మందో చికిత్సో కావాలిగాని ఈలాగు మరింత ఖిన్నుడై, సరిగ్గా కావలసినభోజనసదుపాయమైనా చూసుకోకుండాఉంటే,ఎన్నాళ్లకు ఆరోగ్యముకుదురుతుంది! ఇదంతా చూసే శరీరముకాదు, ఇక్కడ జబ్బుగా ఉన్నది. ఏసంగతీ చెప్పరు. ఏవూసు ఎత్తరు. ఇంతమనోబాధ ఎందుకుపడాలో! నేనుకూడా శోకము కలుగజేసుకోకుండా ఎన్నాళ్లు ఉపేక్షించేది? నామీదే ఈజుగుప్సఅంతానా అంటే నన్నెందుకు తీసుకోరావాలి? నేను రానన్నానే. నన్ను దండించడానికా! నావ్యధకంటె అతనిబాధే తీవ్రముగాఉందే. ఇంటివూసు, ఊరు ఊసు ఎత్తరు. దాసిదానితో నేను మాట్లాడుతూ ఉంటే పళ్లు పటపటమని కొరికి వెడిపోతారు. నామీదినీలావార్త, రామారావువైద్యము, ఇక్కడికి వెళిపోరావడము—అంతా కలిపితే ఒకచిత్రముగా ఉంది. ఈజుగుప్స రానురాను స్థిరమై పిచ్చిఅవుతుంది. దైవమా, ఏమిదారి? దగ్గిర అక్కయ్యైనా లేదుగదా; సలహా చెప్పలేకపోయినా ఊరడించగలుగును. ఊర్లోకి ఎక్కడికైనా వెళ్తాను అంటే అటంకపరుస్తారు." అని తనలోతాను విలపిస్తూ ఇంటిచుట్టూ ఉన్నఅంటుమామిడితోట వీధిద్వారమువద్ద భర్తకొరకు ఎదురుచూస్తూ సుందరిసంధ్యాకాలసమయాన నిలుచున్నది.

సంధ్యాకాలము నడిచిపోయినది. కనుచీకటివేళకు భీమారావు ఇల్లుచేరినాడు. అంతవరకుకూడా అక్కడనే ఎదురుచూస్తూ అబుద్ధిపూర్వకముగా ఒక చిన్నగీతము పాడుతూ సుందరి నిలుచుండిఉండెను. కొంతదూరమునుండీ వినబడుతూ ఉన్న ఈసంగీతమాధుర్యము భీమారావుకూడా రుచిమూచి, కొంచెము సంసారప్రపంచములోనికి మళ్లేడు.అట్టి భర్తను ద్వారముదద్దే చల్లనిమాపులతో చేరదీస్తే, ఆకుణముపరకు చెవులలో పడుతూఉండెన గీత స్వరముల మాధుర్యము మేళమై మాపుల చల్లదనములోను ముఖము సౌందర్యములోను, చెక్కిళ్లతళుక్కులోను మిశ్రమై సుందరి సహృదయతను మూర్తీభవింపజేసి భీమారావును పిచ్చిప్రపంచమునుండి తప్పింపజేసినది. అప్రయత్నముగా పూర్వపుభీమారావు బాహ్యముగా వ్యక్తమైనట్లు కనబడ్డాడు.సుందరిముఖమువైపు అదేచూస్తూ నిలుచున్నాడు. "వొడ్లో నీళ్లుతోడించి ఉంచేను. చల్లనినీళ్లలో స్నానము చేసి, ఆనందించరాదా" అని సుందరి కోమలముగా లాలనచేసింది. స్నానముచేస్తూ ఉంటే ఆవీస్తున్న పిల్లవాయువుతో మేళవింపజేసి మరొకగీతము పాడుతూ భర్తసేవ చేసింది.

"సుందరీ టీ ఉందా?" అరటిపళ్లు, మిఠాయి తిని, టీ త్రాగుతూ "నీకు తెలుసునుగదా" అని భీమారావు అడిగినాడు.

"ఏమిటి? నాకు తెలిసినవి తెలియనివి చాలా ఉన్నవి" అని సుందరి జవాబుచెప్పుతూ ఉన్నప్పుడు, భీమారావు కళ్లు టీ గిన్నెమీదనుంచి సుందరి ముఖవిలాసములవైపే ఉన్నవి. సుందరి హృదయము ఆప్రశ్నకు చలించి ముఖములో వ్యక్తమైనది. సుందరికి తెలిసిన కథ వేరు;భీమారావుకు కావలసిన జవాబు వేరు. రెండూ అత్తలేదు. భీమారావు ఒక్క పెద్దకేకవేసి, టీగిన్నె అక్కడపారవేసి, గదిలోనికి లేచిపోయినాడు.

సుందరి క్షోభ ఇంతా అంతా కాదు. తాను జయించి సుఖపడే చక్కని సమయము ముక్కలైపోయినది. మొదటి భీమారావుపోయి మళ్లా రెండో భీమా

రావు ప్రవేశించేడు. నాటకము మొదటికి వచ్చింది "ఆ జబాబు ఎందుకుచెప్పేను, ఆముఖము ఆలాగు ఎందుకు మారిపోయింది; ఆపాడుహృదయము ఆలాగుఎందుకు చలించింది. దైవమా! అక్కయ్యా!" రామారావు వచ్చి సాధిస్తున్నాడా!

"నే నీరోజున మీతో షికారు వస్తాను."

"నీకోసము నేను ఆగి ఉండలేను. లింగంకాఫీ హోటేలుదగ్గిర ఉంటాను. వచ్చి కలుసుకో"అని అంటూ భీమారావు వెళ్లిపోయినాడు. తలుపులన్నీ వేసుకొని, దాసీదానికి ఇల్లు అప్పచెప్పి, సుందరి బయలుదేరింది. అనుకొన్నస్థలముదగ్గిర ఇద్దరూకలిసేరు. భీమారావు ప్రక్కకుచేరేసరికి, ఏదోవింతవాసన వేసింది. "ఏమిరా దైవమా ఇదికూడానా?" అని సుందరి కన్నీరు పెట్టుకొన్నది.

షికారంతసేపు ఏమీమాటలులేవు. తిరిగివస్తూ ఉన్నప్పుడు రోడ్డు ప్రక్కపడిఉన్న ఒకడు కనబడ్డాడు. వానితలమీద తగిలినదెబ్బనుండి రక్తము కారుతూఉంటే ఏదోపెట్టుతూఉన్న ఆడది ఒకర్తె కనబడ్డది. ఆప్రక్కనే బ్రద్దలైన కల్లుబిడ్డి, మోకుత్రాడు, చెట్లుగీసే పెద్ద కత్తి పడిఉన్నవి. సుందరి వానిని చూసి, భీమారావు చేయిపట్టుకొని ఆపి పడి ఉన్నవానిని చూపించి, ఏదో, చెప్పబోతూఉంటే, "ఇంత కానచ్చింది నాగతి, వీడికా నా వైద్యం" అని కేకవేసి, సుందరిచేతులు విదిలించుకొని, గబగబమని పరుగెత్తిపరుగెత్తి భీమారావు పోయినాడు. పెద్దడాక్టరు, మంచివిరివిగావృత్తిఉండేది. పెద్దపెద్దవాళ్లను చూస్తూ, చికిత్సచేస్తూ ఉండేవాడు. ఆఖరివైద్యం, రామారావు జ్ఞప్తికివచ్చేరు. తన ఊరు, తన వైద్యవృత్తి, తానంటే ప్రాణముపెట్టే తనరోగులు, ఇవన్నీ జ్ఞాపకమునకు ఒక్కమారు తుపానుప్రవాహము వలె భీమారావు చైతన్యము ముందివేసినవి. అందులో కొట్టికొనిపోయిన భర్తకొరకు సుందరి మెల్లగా ఈదు కొంటూ ఇల్లుచేరింది.

భీమారావు గదిలో తలుపులు వేసుకొనికూర్చొని ఏదో వ్రాస్తూ ఉండెను.

తెల్లవారకమునుపే, సుందరి లేవకముందే, కాఫీ త్రాగకుండానే లేచి, పైకివెళ్లి మామూలుకంటె చాలా వేగిరముగా తిరిగివచ్చివేసి "సుందరికోసము వెతుకుతూ దొడ్లో పందిరి దొండకాయలు కోస్తూఉన్న భార్యను చూసి "సుందరీ, వాడు అక్కడ లేడు. ఇంటికి తీసుకొపోయినారు కాబోలు. వాడిని నిన్న చూడలేకపోయినాను. ఇక వైద్యంమళ్లా ఆరంభించాలి. ఎన్నాళ్లు ఈలాగు." అని ఏమేమో చెప్పేడు. ఎవరు, ఏమిటి అని అడిగితే, ఏమి ఉపద్రవము సంభవిస్తుందో అని, అంతటికి చిరునవ్వు నవ్వుతూ తలఊపుతూ దొండకాయలు కోస్తూ భర్తకు తన వికసించిన ముఖము చూపుతూ ఆమాటలు ఆనందముతో విన్నది సుందరి.

భీమారావుకుకూడా శాంతి కలిగింది.

"సుందరీ, సుందరీ, ఉత్తరమువచ్చింది. రా, రా, చదువుదాము, రా" అని కేకలువేస్తూ, గెంతులువేస్తూ,



'చదువు ఈ ఉత్తరము" అని చేరవచ్చేడు."

సుందరికొరకు ఇల్లంతా తిరిగేడు భీమారావు. సుందరి దొడ్లో నీళ్లుపోసుకొంటూఉన్నది. కడతేరా స్నానము చేయనీయకుండా, కబ్బా, చీరచక్కగా కట్టుకోనీయకుండా, జుట్టుసర్దుకోనీయకుండా, సుందరిని చెయ్యిపట్టుకొని భీమారావు వరాండాలో మేజాబల్లదగ్గిరికి తీసుకొని వచ్చి కూర్చుండబెట్టేడు.

"చదువు, ఈఉత్తరము" అని చేతికి ఇచ్చేడు. ఆఉత్తరము అప్పుడే పోస్టుజవాను తెచ్చిఇచ్చేడు. దానికోసము ఆఉదయమునుండి భీమారావు ఎదురుచూస్తూ ఉండెను. భీమారావు వారమురోజులక్రిందట వ్రాసిన ఉత్తరానికి జవాబుగా గోపాలము డాక్టరు వ్రాసినాడు. రామారావు వైద్యము అయినతరువాత భీమారావు గోపాలముతో కొంతసేపు చికిత్సగురించి ముచ్చటించి ఉండిరిగదా, దానిపర్యవసానము ఈఉత్తరప్రత్యుత్తరములు. 'నీవాలాగు ఎవరికీచెప్పకుండా వెళ్లిపోవడము చాలాతప్పు. నీవు ఇట్లాచేస్తావని తెలిసిఉంటే నిన్నంత తీవ్రముగా ఖండించిఉండకపోయి ఉందును. నాఖండనకు ప్రతికూలముగా ఒక్కమాటైనా చెప్పకుండా నీవు ఊరుకొనుటచేత నాలోనాకు సందేహము కలిగినది. నావాదన సరియైనదేనా, నీవుచేసినచికిత్సకు ఏమైనా ఆధారమున్నదా అని ఆలోచిస్తూ గ్రంథపరీక్ష చేస్తే నీవు అవలంబించిన పద్ధతికి సబబు లేకపోలేదని స్పష్టమైనది. ఆసంగతి నీకు తెలియజేదామని వెంటనే నీఇంటికి వచ్చేను. నీవు శరీరములో బాగులేదనిచెప్పి,సముద్రతీరనివాసముకోసము వెళ్లిపోయినట్లు భాగమ్మచెప్పింది. నాఖండన నిన్ను నొప్పించినదో, రామారావు మరణము నిన్నెంత దుఃఖపెట్టి యుండునో అని మేమందరమూ విచారించినాము. నీవు ఉన్నస్థలము సరిగా మాకు తెలియనందున ఇన్నాళ్లు ఊరుకొన్నాము. ఊరంతా నీకొరకు ఎదురుచూస్తున్నది. రామదాసు ఇంటివైద్యం నీకొరకు కనిపెట్టుకొని యున్నది. నేను ముసలివాడను అగుటచేత నావృత్తి అంతా నీదేఅగును. కాబట్టి ఈఉత్తరము చూడగానే బయలుదేరి రావలెను. నీవు ఆలస్యముచేస్తే మేము వస్తాము.' అని గోపాలము వ్రాసిన ఉత్తరము చదువుతూ సుందరికూడా ఆశ్చర్యపడింది.

"చూసేవా, నేను చంపివేయలేదు. నేను ఎంత తంటాలుపడ్డా, నూనెతో ఎంతమందు ఎక్కించినా లాభములేక పోయింది" అని భీమారావు సంతసముతో పలికినాడు. "అయితే రేపు వెళ్లిపోదామా" అని మెల్లగా అన్నది సుందరి. "తప్పకుండా—భాగమ్మసంగతేమరచిపోయినాను." "నాపేర వ్రాస్తున్నది. వస్తున్నామని తంతి ఇద్దాము."



# సవరణ



భారతి యెనిమిదవ సంచికయందు శ్రీయుత గోటేటి జోగిరాజుగారిపేర 'మురళిగాన సుధాకర! ముద్దుకృష్ణ!' అను పద్యమును ప్రకటించినాము. అది పొరపాటు. ఆ పద్యమును రచియించినవారు శ్రీయుత పెమ్మరాజు వెంకటరావుగారు.

—సంపాదకుఁడు.



# వానకాలపు పల్లీజీవితము

దువ్వూరి. రామిరెడ్డి గారు

శ్రావణనీలమేఘముల చల్లనినీడలఁ బెంపుగొందిక్రొం
దావులఁ జల్లుచుం బొలముదాపునఁ బూచెను గేతకంబు; లే
తావులనైన యౌవనముఁ దాల్చె వసుంధర పైరుపచ్చలన్;
ఆవులు కండవెట్టఁ దనివారఁగఁ బచ్చిక మేసి బీడులన్.

ఉ. కాఱుమొయిళ్లపైన హరికార్ముకరేఖలు స్వర్గపట్టణ
ద్వారపుఁ దోరణంబు సరిదాఁక, బలాకలు మాలగట్టి యా
దారిన సంచరింప, నిశితత్వముఁ బాసిన సూర్యరశ్మి లేఁ
బైరుల సేవఁజేయఁ గనుపండువుగాఁ గొల్పు దినంబు లివ్వియెన్.

గీ. ప్రకృతి లీలావిలాస కావ్యంబునందు, రసవదధ్యాయమేమొ వర్షంపుఋతువు!
కానిచోఁ దదధ్యేతలౌ కర్షకులకు, నెట్టులఁ బరనిర్వృతిం గూర్చి యింపెలర్చు?

మ. పనిపాటుల్ ముగిసెంగదా, యిఁకను లేఁబ్రాయంపు టిల్లాలితోఁ
దనపైఁ బ్రక్కలఁ ద్రొక్కి మూఁగు పసిసంతానంబుతోఁ బర్వపున్
దినముల్ తిన్నగఁ బుచ్చవచ్చు నను నుద్దేశమ్మునం గాఁపు గ
న్గొనుచుండుం దనపైరుచేల శ్రమకున్ జోడైన సంతృప్తితోన్.

చ. కలకలనవ్వుచుం గలుపుగంటలు దీయుచుఁ బాటపాడుచుం
బొలములఁ జక్కఁగుంపటులఁ బోడిమిఁ జూపెడిపల్లెటూరిత్రొ
య్యలుల నిసర్గరమ్య దరహాసవిలోకన చేష్టలందు ని
ష్కలుషపు గ్రామ్యజీవనపుఁ గమ్మఁదనంబు భలే! గుబుల్కొనున్.

గీ. ఎన్ని యిక్కటులుండిన నేమియైనఁ, గుడువఁగట్టను నొకవేళఁ గొదువయైనఁ
బ్రకృతిసామీప్య జీవనభాగ్య మొకటె, యున్నకడగండ్ల మఱపించు నూఱడింపు.



# రెండవ జయసింహుని పెణుకపఱు దానశాసనము

సి. ఆర్. కృష్ణమాచార్యులు గారు, బి. ఏ.

ఈ క్రింద వివరింపబడిన తామ్రశాసనము ఆంధ్రపత్రికా సంపాదకులయిన శ్రీయుత నాగేశ్వరరావు పంతులవారు నాకుపంపిరి ఇది గుంటూరు జిల్లా బాపట్లతాలూకా వేటపాలెంగ్రామములో పంగులూరి వెంకటనరసింహంగారి పెరటిదొడ్డి ఆవరణములో దొరికినది. ఈశాసనవిషయము సర్కారువారి 1923-24 వ సం॥రపు వార్షిక శాసనిక నివేదక[1]లో కొంచెముదహరింపబడియున్నది. దీనిపైని యొక్క యాంగ్లపరివర్తనయును 'ఎపిగ్రాఫియా ఇండికా' యను సర్కారు శాసనికపత్రికలో త్వరలో నాచేతనే ప్రచురింపబడును.

ఈశాసనము మూడు రాగిరేకులపై చెక్కబడియున్నది. ఈరేకు లొక్కొక్కటియు సుమారు $6\frac{3}{4}$ అంగుళముల నిడివియును $2\frac{1}{2}$ అంగుళములు వెడల్పును కలిగియున్నవి. రేకులమందము అంగుళములో ద్వాదశాంశ ముండును. తరువాయికాలపు తూర్పుచాళుక్యుల శాసనపు రేకుల కున్నట్లు వీనికి అంచులలో బొద్దు లేదు. తొలికాలపు చాళుక్యుల శాసనముల రేకులకు బొద్దు లుండుట లేదు. రేకులపైన యక్షరముల పంక్తులు పూర్వపుతాళపత్రములపైన వ్రాయబడినట్లే నిడుపు ననుసరించి వ్రాయబడియున్నవి.[2] రేకులకుడిభాగమున అంచుకు అరయంగుళముదూరమున అరయంగుళము అడ్డుకొలతగల రంధ్రమున్నది. ఈరంధ్రముగుండ వేయబడిన రాగికడియముచేత ఈ మూడు రేకులున్ను బంధింపబడియున్నవి. ఈ కడియముయొక్క యడ్డుకొలత సుమారు $2\frac{1}{2}$ అంగుళము లుండును. కడియమునకు వలయాకృతి గల [3] రాగిముద్ర యొకటియిమిడ్చబడియున్నది. దీని యడ్డుకొలత సుమారు ఒక అంగుళముండును. ఈముద్రయొక్క ముద్రముపై భాగమున అర్ధచంద్రబింబమున్ను దానిక్రింద నిరుపార్శ్వములలో నొక్కొక నక్షత్రమున్ను దానిక్రింద పూర్వచాళుక్యాంధ్రాక్షరములలో 'శ్రీసర్వసిద్ధి' యను బిరుదమున్ను, దానిక్రింద అష్టదళపద్మమున్ను బొద్దుగ చెక్కబడియున్నవి. శాసనము నాయొద్దకు వచ్చునప్పటికే ముద్రకడియమునుండి తీయబడియుండినది; కాని శాసనబింబమింతకు పూర్వము ముద్రింపబడినట్లు గాని పరిశీలింపబడినట్లు గాని కానరాదు. శాసనపు మూడు రేకులలోను మొదటిదిన్ని మూడవదిన్ని ఒకవైపునమాత్రమే వ్రాయబడియున్నవి. రెండవదియైన నడిమిరేకు యిరుప్రక్కలనున్ను వ్రాయబడియున్నది.

శాసనముయొక్క లిపి పూర్వకపు తూర్పుచాళుక్యరాజుల శాసనముల లిపిని బోలియున్నది. ఈవంశపు ప్రథమ జయసింహుని శాసనములలోని యక్షరములకును వీనికిని చాల పోలికయున్నది. శాసనభాగముయొక్క భాష సంస్కృతగద్య. కడపటమాత్రము నాలుగు శ్లోకము లున్నవి. వీనిలో మొదటిమూడును సాధారణముగ నితరశాసనములలో నుదహరింపబడినవియే; కాని నాలుగవశ్లోకముమాత్రము క్రొత్తగ నీశాసనమున కానవచ్చుచున్నది. దానభూమికి చెప్పబడినహద్దులలో కొన్ని తెలుగుపదము లున్నవి. ఉదా: ఓంగోడు[ను*]డ్డిలిగదేంకు పోపు పన్గా(ప.17),

---

1 Annual Report on South-Indian Epigraphy for the year 1923—24. (Superintendent, Government Press, Madras.)

(2) కదంబులు, పల్లవులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు, చోళులు మున్నగు పూర్వరాజుల శాసనపట్టము లిట్లే వ్రాయబడియున్నవి. ఈపద్ధతికి తాటియాకుగ్రంథముల వ్రాయుపద్ధతి మూలాదర్శము. కాని విజయనగరచక్రవర్తులశాసనపట్టము లిక్కాలపు ముద్రితగ్రంథములవలె వెడల్పు ననుసరించి చిన్న పంక్తులలో వ్రాయబడియున్నవి. పూనా,బొంబాయిప్రాంతములలో యిప్పుడున్న పురాణగ్రంథములు తాళపత్రగ్రంథములవలె నేముద్రింపబడుచున్నవి.

3. ౧౮౬ వ పేజి చూచునది.

తోట (ప. 17). అక్షరవిన్యాసమునుగుఱించి యొక్కువగ ప్రసంగించఁదగినయంశము లెవ్వియును లేవు. ఇతరపురాతనశాసనములవలెనే దీనియందున్న రేఫము నకు వెనుకవచ్చుసంయుక్తాక్షరము ద్విత్వమును పొంది యున్నది. ఉదా: విష్ణువర్ద్ధన, సర్వ్వలో° *(ప. 5), సర్వ్వానిర్థ° (ప. 9), శర్మ్మ° (ప. 10, 11), చతుర్వ్వేద (ప. 11), పౌర్ణ్ణమాస్యా (ప. 13). సంయుక్తాక్షరములకు మాఱుగ ననుస్వారముతోఁటి కొన్ని పదములు వ్రాయఁబడియున్నను [ఉదా: లాంఛనే° (ప. 3). °మలంకరిష్ణోః (ప. 5) సింఘు°, వంగిపఱు (ప. 9), ఆపస్తంబ, గుంజ (ప. 10)] మఱికొన్నిపదములలో సంయుక్తాక్షరము లుపయోగింపఁబడియున్నవి. [ఉదా: మణ్డలా° (ప. 4), ఫుఙ్జీకృతకృత (ప. 7), కుటుమ్బి° (ప. 12), సంక్రాన్తి (ప. 13), పూర్వ్వస్యాన్దిశి క్షేత్ర స్దత్త° (ప. 14), శారీరదణ్డ° (ప. 25)]

ఈశాసనము సమస్తలోక విఖ్యాతయశులును మానవ్యసగోత్రులును, హారితీపుత్రులును మహాసేనుని భక్తులును భగవన్నారాయణుని యనుగ్రహమువలన పొందినవరాహచిహ్నమును గలవారునునయిన (తూర్పు) చళిక్క్యుల[1] వంశమున జన్మించిన శ్రీవిష్ణువర్ద్ధన మహారాజునకు మనుమఁడును శ్రీ సర్వ్వలోకాశ్రయ మహారాజునకు కొడుకునునైన సకలలోకాశ్రయ శ్రీ జయసింఘ వల్లభమహారాజుచేతనివ్వఁబడినది. దీనియుద్దేశము కర్మ్మరాష్ట్ర విషయమున పెణుకపఱు అనియెడి గ్రామమున కొంతభూమినిన్ని వంగిపఱు నివాసియైన కౌండిన్యగోత్రపు తైత్తిరీయాపస్తంబసూత్రపు ఎఱ్ఱద్రోణశర్మ్మ యను చతుర్వేదవేత్తయును సకలశాస్త్రపారీణుఁడును నయిన బ్రాహ్మణునికి యేలాటి పన్నులనిర్బంధమును లేక బ్రహ్మదేయ దానముగ నిచ్చుట.

రాజుయొక్కతాత యీవంశపు రెండవవిష్ణువర్ద్ధనుఁడ[2]ని సులభముగనే తెలియనగును. రాజుతండ్రియైన సర్వ్వలోకాశ్రయమహారాజు సాధారణముగ తూర్పు చాళుక్యుల శాసనములలో 'మంగియువరాజు' అను నామముతో బరగియున్నాఁడు.[3] సకలలోకాశ్రయ[4] జయ

---

* '°' గల పదములు సంపూర్ణములుగావని తెలియవలె. 1 ప్రథమ జయసింహునిశాసనములలో వంశనామము 'చలుక్య' 'చాలుక్య' అని చెప్పబడియున్నది. (Epigraphical Report for 1918, p. 130, para 3) సర్వలోకాశ్రయుని శాసనములో 'చళుక్య' అని చెప్పబడియున్నది. (Ep Ind. Vol.. VIII. p.237)

2 ఇతనికి 'విషమసిద్ధి' యను బిరుద ముండెను. ఇతనిశాసనముద్రికలమీఁద ఈబిరుదమే చెక్కఁబడియున్నది. (Ind. Ant. Vol. XX. p.98.) నెల్లూరుప్రాంత్యమున దొఱికిన యితని తామ్రశాసన మొకటి IndianAntiquary Vol. VII. p. 185లో ప్రచురింపబడియున్నది. సర్వ్వలోకాశ్రయమహారాజు (అనగా మంగియువరాజు)యొక్క చందలూరు శాసనములో నితనికి 'మకరధ్వజ' యను నపరనామధేయ ముండినట్లు కానవచ్చుచున్నది. (Ep. Ind Vol. VIII. p. 237) కుబ్జ (ప్రథమ) విష్ణువర్ధనునికి కూడ నీ యపరనామధేయ ముండినట్లు కనుపించుచున్నది. (Epigraphical Report for 1917 p.115,para 19) నూజువీడు సంస్థానమునకు చేరిన పంటిముక్కల గ్రామమున దొఱికిన రెండు తామ్రశాసనములలో రెండవవిష్ణువర్ధనునికి 'ప్రళయాదిత్య' యను నపరనామధేయ ముండినట్లు తెలియుచున్నది. (Ibid para 16)

3 ఇతనిశాసన మొక్కటి Indian Antiquary Vol. XX. p. 104లో ప్రచురింపబడియున్నది. దీనిలోనున్న ఇతని చందలూరు శాసనములోనున్న (Ep. Ind. Vol. VIII. p. 237) ఇతనికి 'సర్వలోకాశ్రయమహారాజు' అను నామధేయము యివ్వబడియున్నది. ఇతనికి మంగి యనునది జాతకర్మనామమున్ను, 'సర్వ్వలోకాశ్రయ' యనునది పట్టపుపేరున్ను అయియుండవలెను. ఇతనికి 'విజయసిద్ధి' యను బిరుదున్ను ఉండెను. (Ep. Rep. 1920-p. 99. para 12) ఇతని శాసనముద్రికలపై 'శ్రీవిజయసిద్ధి' యను బిరుదు చెక్కబడియున్నది. (Ep. Ind. Vol. VIII. p.237)

4. 'సకలలోకాశ్రయ' యనుబిరుదు తూర్పుచాళుక్యులశాసనములలో సాధారణముగ కానరాదు. వారు 'సర్వలోకాశ్రయ' యనుబిరుదునే గైకొనుచుండిరి. పశ్చిమచాళుక్యులు 'సమస్తభువనాశ్రయ' యను బిరుదును వహించుచుండిరి.

సింహుమహారాజు యీవంశపు రెండవజయసింహుడు. ఇతడు మంగియువరాజుయొక్క జ్యేష్ఠపుత్రుడు. ఇతని రాజ్యకాలము 18 సంవత్సరములు. డాక్టర్ ఫ్లీట్ ఇతడు క్రీ. శ. 696 (సెప్టెంబరు) నుంచి 709 (జూన్ నెల) వరకును రాజ్యము చేసియుండవలెనని యభిప్రాయ పడియున్నాడు.[1] ఈశాసనముద్రికపైని 'శ్రీసర్వసిద్ధి' యని చెక్కబడియుంటనుబట్టి యితనికి యీబిరుద ముండెనని రూఢిగ జెప్పవచ్చును. ప్రథమజయసింహునికిని యీబిరుదుండెను.[2]

శాసనకాలము వివరముగ తెలుపబడలేదు. శకవర్షముగాని ప్రభవాదిషష్టి సంవత్సరములలో నేదిగాని చెప్పబడకపోవుటయేకాక రాజ్యసంవత్సరము కూడ నివ్వబడలేదు. జ్యేష్ఠపూర్ణిమ సంక్రాన్తి యనిమాత్రము చెప్పబడియుండుటనుబట్టి క్రీ. శ. 707 సం॥ మే నెల 21 తేదికి సరియగుచున్నది.

ప్రభువు యీదానమును గొబ్బడి యనువాని విజ్ఞాపనమీద జేసినట్లు చెప్పబడియున్నది. ఇతనికి శాసనమున యేలాటిబిరుదున్ను యివ్వబడనందున నితడు చాలప్రముఖుడు కాడని యూహింపవలసియున్నది. దానమునకు ఆజ్ఞప్తి (అనగా రాజపక్షమున నుత్త

వును పుట్టించిన యధికారి) నిరవద్య[3] సకలలోకాశ్రయ(శ్రీ) పృథివీగాముణ్డి.

పెణుకపఱుగ్రామము కమ్మరాష్ట్రములో నుండినట్లు చెప్పబడియున్నది. మఱియొక్క పూర్వశాసనములో[4] కూడ నీగ్రామము పేరు కనుపడుచున్నది. ఇది కమ్మరాష్ట్రములోని నూతులపఱు అనుగ్రామమునకు పశ్చిమదిశనున్నట్లు చెప్పబడియున్నది. ఈ 'నూతులపఱు' యిప్పటి బాపట్ల తాలూకాలోని నూతులపాడుగ్రామమే యయియుండవలెను.[5] పెణుకపఱు దీనికి నైఋతిదిక్కున నుండు యిప్పటి వంకాయలపాడుగా నుండియుండవలెను. ఫుసబోళ (ప. 16)యును ఇళిగదేబు (ప. 16)న్ను యిప్పటి పూసపాడు ఇడుపులపాడుగా నుండవలెను. వంగిపఱు యిప్పటి వంగిపురము. హద్దులలో చెప్పబడియుండు ఓంగోడుగ్రామము పూర్వపు పల్లవుల శాసనములలో దానముగ నియ్యబడిన[6] ఓంగోడుగ్రామమేయని చెప్పవచ్చును.

కమ్మరాష్ట్రము (కమ్మనాడు) చాలప్రసిద్ధమైన పురాతనప్రదేశము. జగ్గయ్యపేటస్తూపములోని ప్రాకృతశాసనములలో నిది 'కమ్మరఠ' 'కమ్మరఠ' యని పేర్కొనబడియున్నది. ఈశాసనము క్రీస్తుశకము మూడవశతాబ్దములోనిది[7].

---

1. Ind. Ant Vol.XX.p 12    2. Ep. Rep. 1918, p. 130, para 3.

3. 'నిరవద్య' అనగా దోషహీను డనియర్థము. 'నిరవద్య' యనునది యీవంశపు రెండవ విజయాదిత్యుని యపరనామము. ఇప్పటివఱకును దీని తొలిప్రయోగము విజయాదిత్యుని కాలముననే యున్నట్లుగ కనుపించినది. కాని మన శాసనమువలన నీబిరుదు అంతకుపూర్వమునకూడ వాడుకలో నుండినట్లు విశదమగుచున్నది. 'సకలలోకాశ్రయ' యను తనప్రభువుయొక్క బిరుదును తన పేరునకు ముందుకొనుటచే పృథివీగాముణ్డి తనరాజభక్తిని సూచించినట్లగుపడుచున్నది. చోళుల శాసనములలోను పాండ్యుల శాసనములలోను యీవాడుకను కనుపఱచు నిదర్శనములనేకములు గలవు. 'గాముణ్డి' (గావుణ్డి) యనునామాంతవాచకము కేవలము కన్నడశాసనములలోననే యెంతయును పరిచితము. దీనికి పర్యాయపదమైన 'గాముణ్డి' యనునది యాంధ్రదేశపు శాసనములలో కానవచ్చుటలేదు. ఇది దానియొక్క తొలిప్రయోగముగ కనుబడుచున్నది.

4. మంగియువరాజు తామ్రశాసనము. Ind. Ant. Vol. XX. p. 104f.

5. ప్రథమజయసింహుని పెద్దమద్దాళి శాసనములోనున్ను ఒక పెణుకపఱుగ్రామము దానముగ నివ్వబడియున్నది. అయితే యిది గుద్రహారవిషయములో నుండినట్లు చెప్పబడియున్నది. (Ind. Ant. Vol. XIII.p. 138) కనుక నిది మఱియొకగ్రామమనుటకు సందియము లేదు. ఈగ్రామము మద్దవల్లిగ్రామమునకు తూర్పుననుండెను. మద్దవల్లి యిప్పటి కృష్ణజిల్లా గుడివాడ తాలూకాలోని మద్దవల్లిగా యుండవలెను. పెణుకపఱు యిప్పటి 'పానుకుమాడు'గా నుండవలెను.

6. Ep. Ind. Vol. XV. 7. Archaeological Survey of Southern India, p. 110.

## మూలము[1]

### రేకు I.



[ ] యీ బ్రాకెట్టులలో నుంచిన యక్షరములు మూలములో సందేహముగ నుండునవి.

[*] ఇట్టి గురుతుగల బ్రాకెట్టులో వ్రాయబడిన యక్షరములు శాసనములో లేక యిపు డుంచబడినవి.

( ) బ్రాకెట్టులో నున్నవి మూలమున అధికమై త్రోసివేయవలసిన యక్షరములు.

1. స్వస్తి[|*] శ్రీమతాం సకలభువనసంస్తూయమాన మానవ్యసగోత్రాణాం హారితీపుత్రాణా[ం*]
2. సప్తలోకమాతృభిః[2] పరిపాలితానాం స్వామి మహాసేనపాదభక్తానాం భగవన్నారా-
3. యణప్రసాదసమాసాదిత వరవరాహలాంఛనేక్షణక్షణవశీకృతాశేషశ-
4. త్రు[3]మణ్డలానా మశ్వమేధావభృథస్నానపవిత్రీకృతవపుషాం చళిక్యానాం కుల-
5. మలంకరిష్ణోః శ్రీవిష్ణువర్ధనమహారాజస్య[4] పౌత్రః శ్రీసర్వలో[కా]శ్ర-
6. యమహారాజస్య పుత్రః స్వాసిధారానమితారాతినృపమకుటతటఘట్టిత-
7. [5]మణిమయూఖపుఞ్జరఞ్జిత చరణయుగళ[ః] ప్రతాపవాన్ప్రసన్న[6] వినివేశితశక్తిత్రయ[ః*]
8. పరమబ్ర[హ్మ]ణ్యో మాతాపితృపాదానుధ్యాతః[7] సకలలోకాశ్రయ శ్రీజ[య]-

---

1. ఇది శాసనపు రేకు నుంచియే చదువబడినది.

2. కొన్ని శాసనములలో 'సప్తలోక మాతృభిః సప్తమాతృభిః' అనియున్నది. ఉదా: ప్రథమ జయసింహుని పెద్దమద్దాళి తామ్రశాసనము (Ind. Ant. Vol. XX, 138.) సర్వలోకాశ్రయ (మంగియువ)రాజు శాసనములో 'లోకమాతృభిః మాతృభిః' అని యున్నది.

3. 'ºమణ్డలానామశ్వº' అని చదువునది.

4. 'ºమహారాజస్య' అని చదువునది.

5. 'ºమణిమయూఖº' అని చదువునది.

6. 'ºప్రసన్నో' అని చదువునది.

7. 'ºపాదానుధ్యాతః' అని చదువునది.

II రేకు-ప్రక్క 1



9. సింఘవల్లభమహారాజః [1]సర్వ్వానిత్థ మాజ్ఞాపయతి విదితమస్తు వోస్మాభిః వంగిపఱువస్త
వ్యాయ[2]

10. కాణ్డిన్యగోత్రాయ తైత్తిరీయాపస్[త]oబసూత్రాయ గుంజదేవశర్మ్మణ [ః*] పౌత్రాయ సర్వ్వ-

11. క్రతుయాజినో దేవశర్మ్మణః పుత్రాయ చతుర్వ్వేదపారగాయ సర్వ్వశాస్త్రవిశారదయ[3]

12. శ్రీ ఎఱిద్రోణశర్మ్మణే కమ్మరాష్ట్ర విషయనివాసికుటు[4]మ్బినః భవద్విషయే స[ర్వ్వా]ని-

13. త్థమాజ్ఞాపయతి జ్యైష్ఠ్యాం[5] పౌర్ణ్ణమాస్యాం సంక్రాన్తికాలే భూమిదాననిమిత్తే

14. గొబ్బడి విజ్ఞాపనా త్కమ్మరాష్ట్రే పెఱుకపఱునామగ్రామే తస్య గ్రా-

15. మస్యోత్తరపూర్వ్వస్యాన్దిశి క్షేత్రన్నత్తమస్య క్షేత్రస్య పూర్వ్వతో వధిః నిడుంగట్టతటా-

16. కః దక్షిణతో వధిః పూసబోళక్షేత్రాన్తః ప (శ్) చ్చిమతో వధిః ఓంగో [డు] [ను*]
[డ్డ్రిగదే]బుప-

17. [శ]కు పోవు పన్థాః ఉత్తరతో వధిః[ప]షచో వధిః తోటక్షేత్ర[ం] గ్రామ[స్యోత్త]రత స్త-

1. 'సర్వ్వానిత్థమాం' అని చదువునది.

2. 'ంవాస్తవ్యాయ' అని చదువునది.

3. 'ంవిశారదాయ' అని చదువునది.

4. 'టు' అను నక్షరము పఙ్క్తిలో లేక హంసపాదముచేత సూచింపబడి పఙ్క్తికి క్రింద చెక్కబడి యున్నది.

5. 'జ్యైష్ఠ్యాం' అని చదువునది

II రేకు-ప్రక్క



18. టాకః తస్యోత్తరాంరస్యాప్లిశి తస్య పూర్వతోవధిః [కూ]పః దక్షిణతోవధి [ఃత]
టాకః పశ్చిమత

19. ఉత్తరతశ్చ జెద్దబోళక్షేత్రాన్తోవధిః [|*] అస్యక్షేత్రస్య కూపద్వయమ్ తటాక ప-

20. కః కూపః తాలతటాకస్య పూర్వతః దక్షిణార్ద్ధే వ్రీహిక్షేత్రం చతుష్టయపరిమా-

21. ణ[ం]ప్రాగపవగణంద గ్రామస్యోత్తర[1]పూర్వే దిశేగిరావ[వ*]కాశం ఏ[త][2]చతురవధి-

22. పర్యన్తం క్షేత్రం ధర్మయశోభివృద్ధయే సర్వకర పరిహారోపేతము (క)దకపూ-

23. ర్వకం బ్రహ్మదేయీ కృత్య ప్రాదామ్ [|*] అస్య సర్వకరపరిహారోపేతస్య క్షేత్ర
స్య యో

24. బాధాం కరోతి స(ః) వారణాశ్యాంసహస్ర[3]బ్రహ్మహత్యాపాతకసంయుక్తో భవతి [|*]

25. యోస్మచ్ఛాసనమతిక్రమేత్స పాపః శారీరన్దణ్డమర్హతి [|*] సోపిపంచమహా-

1. 'గ్రామస్యోత్తర' అనిచదువునది.

2. 'తు'అను నక్షరము తొలుతచెక్కబడి తరువాత దాని 'ఉ' కారము కొట్టివేయబడియున్నది. 'ఏత చ్చతురవధిం' అని చదువవలెను.

3. 'ంహశ్యాం' అనిచదువునది.

## III రేకు



26. పాతకసంయుక్తో భవతి [|*] భవన్తిచాత్ర శ్లోకాః [|*] భూమిదానా త్పరన్దా నన్న భూతన్న భ-

27. విష్యతి[*]తస్యైవ హరణాత్పాపెన్న[1] భూతన్నభవిష్యతి[౧||*]స్వదత్తాం పరదత్తాంవా

28. యో(రే) [హ]రేత వసున్ధరామ్ [|*] షష్టిం వర్షసహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః [౨||*]

29. బహుభిర్వ్వసుధా దత్తా బహుభి శ్చానుపాలినా[2] [|*] యస్య యస్య యదా

30. భూమి స్తస్య తస్య తదా ఫలమ్ [3||*] ఆజ్ఞప్తిన్నిః రవద్యసకలలోకాశ్రయ శ్రీపృథివిగాముణ్డి [|*]

31. విన్ధ్యాటవీష్వతోయాసు శుష్కకోటరవాసిన [ః|*] కృష్ణాహయో హి జాయన్తే బ్రహ్మదేయాంపహారకా[ః][౪||*]

1. 'ంత్పాపన్న' అని చదువునది. 2. 'పాలితా' అని చదువునది.

## ఆంధ్రీకరణము

స్వస్తి [|*] శ్రీమంతులును, అన్ని లోకముల లోను కొనియాడబడుచుండు మానవ్యసగోత్రులును, హారితీ పుత్రులును, ఏడ్గురు లోకమాతలచేత కాపాడబడు వారును, మహాసేనదేవుని (అనగా కుమారస్వామి) పాద ములయెడ భక్తిగలవారును, భగవంతుడైన నారాయణుని యనుగ్రహమువలన పొందబడిన (తమ) శ్రేష్ఠమైన వరా హలాంఛనము చూచినక్షణమునందే సమస్త శత్రువర్గ ములను పిక్కులనుగా చేసికొనువారును, అశ్వమేధావభృథ స్నానమువలన శుద్ధమైనదేహములను కలిగినవారునునగు చళుక్యులయొక్క వంశమునలంకరించు శ్రీవిష్ణువర్ధనమహా రాజుయొక్క మనుమడును శ్రీసర్వలోకాశ్రయమహా రాజుయొక్క కొడుకును నైనట్టిన్ని, శక్తిచేత వంచబడి (పాదాక్రాంతులయి)న రాజన్యుల కిరీటములలో చెక్క బడినమణులయొక్క కిరణములకాంతిచలన ప్రకాశించు పాదద్వంద్వములను గలిగినట్టిన్ని, శౌర్యవంతుడైనట్టిన్ని, దయావంతుడైనట్టిన్ని, [1]శక్తిత్రయమును లెస్సగ నుపయో

1 'ప్రభుమంత్రోత్సాహశక్తి'యను మూడురాజశక్తులు. వీనివిషయమైనచర్చ కౌటిల్యుని అర్థశాస్త్రము న'అభియాస్యత్కర్మ' యనుశీర్షిక గల 9 వ అధికరణమున జరుపబడియున్నది.

గించునట్టిన్ని, పరమబ్రహ్మణ్యుడైనట్టిన్ని, తల్లిదండ్రుల పాదములయెడ భక్తియుతుడైనట్టిన్ని సకల లోకాశ్రయ శ్రీజయసింహవల్లభమహారాజు అంనతి నిర్విఘ్నమున నాజ్ఞాపించుచున్నాడు. 'మీరు (యీక్రిందివిషయము) తెలిసి యుండుగాక! వంగిపఱు (గ్రామ) నివాసియును, కౌండిన్యగోత్రుడును, తైత్తిరీయ (శాఖీయు) ఆపస్తంబసూత్రుడును, గుంజదేవ శర్మయొక్క మనుమడును, సర్వక్రతుయాజియైన దేవశర్మయొక్క కొడుకును, చతుర్వేద పారగుడును సర్వశాస్త్రవిశారదుడును నైన శ్రీ ఎఱ్ఱద్రోణ శర్మకు— కమ్మరాష్ట్ర విషయనివాసులార! మీదేశమున నెల్లర నిర్విఘ్నమున నాజ్ఞాపించుచున్నాడు— జ్యేష్ఠ(మాస) పూర్ణిమనాడు సంక్రాంతి సమయమున భూమిదానముగ, గొబ్బడి (యనునతని) యొక్కమంవి చొప్పున, కమ్మరాష్ట్రములో పెణుకపఱు అనెడు గ్రామములో నా గ్రామముయొక్క ఉత్తరతూర్పు అనగా (ఈశాన్యపు) దిక్కున క్షేత్రము యివ్వబడినది. ఈక్షేత్రమునకు తూర్పుతట్టు[1] హద్దు నిడుంగట్టు చెరువు; దక్షిణపుతట్టు హద్దు పూసబోళ (గ్రామము) క్షేత్రముయొక్కఅంచు; పడుమటితట్టు ఓంగోడు (గ్రామము) నుండి [ఇరిగ] దేబుపళ (గ్రామమున)కు పోవుదారి; ఉత్తరపుతట్టున్ను ఇదియే హద్దు; తోటక్షేత్రము (న్ను యివ్వబడినది); గ్రామమునకు ఉత్తరమున చెరువు, దానికి ఉత్తరపడుమర (అనగా వాయవ్యమున) (ఆతోట క్షేత్రముఉన్నది). దానికి (అనగా తోటక్షేత్రమునకు) తూర్పుతట్టు హద్దు నూయి; దక్షిణపుతట్టు హద్దు చెరువు; పడుమటితట్టున్ను ఉత్తరపుతట్టున్ను జెన్దబోళ (గ్రామ) క్షేత్రముయొక్క అంచుహద్దు. ఈక్షేత్రమునకు రెండునూతులు, ఒకచెరువు. ఒకనూయి తాలతటాకమున[2]నకు తూర్పు(ననున్నది) (దీనికి) దక్షిణపుసగము (వైపు)న వరిపొలము నాలుగు పరిమాణములు.[3] (దీనికి) తూర్పు ముగింపున్ను. (అటుపై) గ్రామముయొక్క ఉత్తరతూర్పు (అనగా ఈశాన్య (ప్రదేశమున) కొండలో(ని)సందు(న్ను హద్దు). ఈనాలుగుహద్దులలోనుండు క్షేత్రము(మా) ధర్మమున్ను కీర్తియున్ను హెచ్చుటకుగాను అన్నిపన్నులనుంచియు తొలగించి నీకు విశిష్ట బ్రహ్మదేయముచేసి యిచ్చినారము. అన్నిపన్నుల నుంచియు తప్పించబడిన యీభూమికి యెవ్వండు బాధనుకలుగ జేయునో అతండు కాశిలో వేయిబ్రహ్మహత్యలను జేసినపాపముతో కూడుకొనినవా డగును. ఎవండు మాయాజ్ఞను మీరిపోవునో అపాపి దైహికశిక్షకు పాత్రు డగును. అతడున్ను పంచమహాపాతకములతో కూడుకొనినవా డగును. ఈసందర్భమున నీ(క్రింది)యర్థముగల శ్లోకము లున్నయవి:—

(1) భూమిదానమునకు మించినదాన మిప్పటికి యుండలేదు. ఇక నుండబోదు. దాని నపహరించుటకన్న (గొప్ప)పాప మిప్పటికి లేదు. ఇక నుండబోదు.

(2) తా నిచ్చిన భూమినిగాని యితరు లిచ్చిన భూమినిగాని హరించువాడు అరువదివేలయేండ్లు అమేధ్యమున పురుగువయి (పడి)యుండును.

(3) భూమి యనేకులచేత (దానముగ) నివ్వబడినది. అనేకులచేత (నది) కాపాడబడినది. భూమి యెపు(డె)పు డెవ్వనిదో అపు(డపు)డు (దాన)ఫలము వాని (వాని)ది.

ఈశాసనమునకు ఆజ్ఞప్తి (కారుడు) నిరవద్యసకలలోకాశ్రయ శ్రీపృథివీగాముణ్డి.[4]

(4) బ్రహ్మదేయము నపహరించువారు వింధ్య(పర్వతపు)అడవులలో నీరులేక యెండిపోయినగవులలో నివసించు నల్లపాములయి పుట్టుదురు.


కడియమునకు గలరాగిముద్ర

1. "తః" అను సంస్కృత అవ్యయాంతమునుండియే తెనుగున "ట్టు" అను నవ్యయాంతము వచ్చియుండవచ్చును. 'హద్దు'అనుమాట 'అవధి'యను సంస్కృతపదమునుండి వచ్చి యుండవలెను. 'అంచు' అను ఆంధ్రపదము 'అన్త' అను సంస్కృతమునుంచి వచ్చినది. 2. తాడ్ల చెరువు కాబోలును. 3. పరిమాణముయొక్క వివరము శాసనమున నివ్వబడలేదు. 4: ఈవాక్యముగద్యరూపముననే యున్నది.




(క్షేమేంద్రుని సంస్కృతకృతికిఁ దెనుఁగు)

శ్రీ రాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద బహద్దరు గారు

భ్రాంషణమయి దుస్తృష్ణా [విషసం
శేషతమోమోషణమయి సేవా
శోషణమయి యొప్పెడు సం
తోషం సన్మతికి నేనిదో ప్రణమిలుగున్.

గీ. కష్టజీవులఁ బాడఁగాంచి కంటఁ దడిని
బెట్టి నిజకార్యములఁ బెడనెట్టియైనఁ
జేయఁడా! సేవ్యసేవకసేవలకును
జగతి సజ్జనవరు లనుశాసనంబు.

గీ. దర్పమున నొక్కఁ డింకలోభ్యమున నొకఁడు
సేవ్యసేవకు లిరువురు జీర్ణదృష్టు
లగుట ధనగర్వవికృతిని నార్తివికృతి
నారయఁగనేర రన్యోన్య మానసముల.

మ. అనివార్యంబుగ లోభమోహములచే
నంధుండు గాఁడేని యే
జనుఁ డీధారుణి నిల్వ జీతములతో
సత్త్వంబు గోల్పోయి దు
ర్వినయాక్రుష్టము రోషరూషితము స
ద్విజ్ఞానదూరంబు నా
ధనియాస్యంబును దేవురించుకొనుచున్
దాఁ జూడ నాసించునో!

గీ. గర్వపటలంబు గన్నులఁ గ్రమ్ముకొనఁగ
మ్రోలఁ గల సేలనుం జూడఁజాలనట్టి
వాఁడు దారిద్ర్యదోషంబువలన లాఘ
వంబుగాంచినవాని సేవకునిఁ గనునె? [డు

కుంభియుంబోలె మోయించుకొను నొకం
వినుతి సేయను జవుటిని వేత్రకండు
సేవ్యసేవకు లిర్వురు సిగ్గుమాలి
హాస్యమున నగ్గమగుచుందు రవనియందు.

గీ. ఎపుడు హుంకృతిమాత్ర విసృష్టుఁడగుచు
దూరమునఁ బడు మఱి గుణదూరుఁ డగును
తప్పిపడ్డబాణమువోలెఁ జప్పఁబడును [డు.
నిష్క్రియుండగు భృత్యుండు నెళవు గనఁ

క. ధర సేవాపంకమునం
జొరఁబడనివివేకి తొల్లి సుస్థిరతపమున్
సురతటినీతీరమునో [దున్.
హరవనములఁ జేసియుండునా? యనుకొం

గీ. కడఁగి యెవఁడు సేవాపంకకశ్మలముగఁ
ఒనతలను జేసికొనకుండ ననువుగల్గి
అతఁడు దైన్యవిదూరుండు నతఁడు సుకృతి
క్రాలు నాతనియశము దిక్తటములందు.

గీ. ఏలికకు భక్తితో వ్రేఁగ్రుక్క లిడుచునపుడు
దైన్యమూలము కుక్షి ప్రదర్శనంబు
చేయుచును మెల్ల లోఁజొచ్చి సేవకుండు
కొంకుచును జంకుచిలఁ జూచుకొనుచు నిలు

గీ. దాస్యకేతువై యంజలి తలనుగలుగ [చు
నెదను దైన్యము సంస్తుతుల్ వదనమందు
నాను నాశాగ్రహాగ్రస్తులైనవారి [యు.
కక్కటా యిట్టియగచాట్లఁ జిక్కుటయ

గీ. అక్రమముగ నకాలమం దదరు లుమిసి
నప్పిగూర్చు నీశ్వరుకోపదృష్టివలనఁ
బ్రాభవంబెల్ల భస్మమై పాడుగాఁగ
సేవకుఁడు చిత్తజుఁడువోలెఁ జేటు గాంచు.

గీ. వాహినిఁ బ్రవిష్టుఁడై ఖడ్గపాతమునను
దనుపు నర్పించు నెవ్వండు త్యాగియగుచు
మరల నాతండు క్లేశావమానములకు
స్థానమగు సేవలకును భాజనము గాఁడు.

క. తృణకణ దప్స క్లేశం
బున సేవకచాతకంబు పొందును శోషం
బును దా నుద్గ్రీవముగా
ననిశ మెదురుచూచుచునీ ఘనాశాహతమై.

గీ. అపరితోషపిశాచి పై నావహింపఁ
దుష్టి గలిగించు బాటఁ బూఁదోఁట విడిచి
తేఁటివోలెను భృత్యుఁ డర్థించి చనును
దాన లోభంబుచేత మాతంగసేవ.

గీ. జడుని సేవించి సేవించి బడలి బడలి
కొంగరీతిని హెచ్చుగా దొంగజపము
సల్పుచును సేవకుం డిల క్షణికమైన
లాలనకుఁ బాత్రమగు నెట్టకేల కింత.

గీ. ఉన్న తినిగోరి యత్నించుచుండి కూడ
మానభంగ మానోయని మఱఁగుచేని
సేవకతయందు మనుజుండు చెడుటనిజము
రెంటికిని జెడ్డ రేవని రీతిగాను.

గీ. అవనిపైఁ బడుకొనుచు నిరశనుఁడౌచు
శీతవాతాతపములకు సిరతఁ గనుచు
సేవకుఁడు మునివృత్తితోఁ జెలఁగికూడ
కడిఁది నరకంపుబాధలఁ గుడుచుచుండు.

[సశేషము]






## నాట్యోత్పలము

### గ్రంథకర్త: శ్రీయుత పురాణం సూరి శాస్త్రిగారు

విద్యానిలయము, ఒంగోలు.

డబిల్ క్రౌను సైజున 253 పేజీలుగల గ్రంథము వెల రు 1-8-0

క్రీస్తుకుఁ బూర్వము 600 సంవత్సరములనుండి పాశ్చాత్య దేశములయందు వెలయుచున్న రూపకములను, దత్కర్తల జీవితములను, వాని మర్యాదలను, వికాసమును, ఈగ్రంథము చాటుచున్నది. గ్రంథకర్తగారు ప్రాచీనాధునికాంగ్ల నాటకవాఙ్మయమును లెస్సగాఁ బరిశీలించి యీగ్రంథమును రచించిరనుట ఈగ్రంథమును జదువువారికిఁ దేటయగును. వీరీగ్రంథమును బండ్రెండధ్యాయములుగా విభజించిరి.

మొదటియధ్యాయమునఁ బాశ్చాత్య వాఙ్మయపఠనము వలని ప్రయోజనము, జంతుపరిణామము, కళావికాసము మొదలగువానినిగూర్చి చర్చించిరి. "లచ్చనవుపిచ్చికూతల పడి నేర్చి కళాప్రపంచమును శాసింపసమకట్టెడి బుద్ధిలేమిని సైరింపవచ్చునే" యనుచున్నారు. ఇది నవ్వించుచున్నది. కళావికాసమునకుఁ గొంత లక్షణశాసన మావశ్యకము. తత్త్వజ్ఞులగువారు, ప్రాచీనకళాలక్షణములను బాగుగాఁ బర్యాలోచించి, దేశకాలపాత్రములఁబట్టి కొన్నికొన్ని క్రొత్తత్రోవలఁ ద్రొక్కుచుండుటయు, నవియు లక్షణానుశాసనములలోఁ జేరుచుండుటయు సమంజసమును, భావి కళాభ్యుదయమునకు గారణమును నగునుగాని యిట్టి నిబంధనమే తగదనియు, బొత్తిగా నవియెల్లఁ బిచ్చికూతలనియుఁ, దలఁచి తోఁచగఁ ద్రొక్కుటవలనఁ గళాప్రపంచమున వికాసమునకు మారు వినాశము సంభవించునేమో యని దిగులగుచున్నది.

రెండవ యధ్యాయమున నాట్యోత్పత్తి, ప్రాచీన ఋతూత్సవములయందలి నాట్యములు, నటులు, సూత్రధారుఁడు. అప్పటి నాట్యశాలలు మొదలగు విషయములను జర్చించినారు.

మూఁడవ యధ్యాయమున ట్రాజెడీ, కామెడీ, ఫార్సు మొదలగు రూపకభేదముల నిర్వచనములు, వాని లక్షణములు, పుట్టుక, పాశ్చాత్య వాఙ్మయమున వానిస్థానము మొదలగు విషయములను జర్చించినారు. "ఇట్టి సదాదర్శముల మొలకెత్తజేసి 'సంసారం సాగరం దుఃఖ'మని చిత్రించి చూపియు భక్తి జ్ఞాన వైరాగ్యముల దివ్యభావోదయమును గలిగింపగలవియే నిజమైన ట్రాజెడీలు. అంతియేకాని వీర బీభత్సభయానక తరంగముల నుక్కిరిబిక్కిరిగ దుమికించి ప్రేక్షకమానసమందు అపస్మార నిర్వేదమహాందోళన మేర్పరచి పంపెడి యీనాటి విషాదాంతనాటకములు నిజమగు ట్రాజెడీలు కా"వనిరి. ఇది సమంజసముగా నున్నది.

నాల్గవయధ్యాయమున సారస్వత వికాసమునకు సంబంధించిన పాశ్చాత్య నాగరక చరిత్రలు క్రీస్తుకు 3800 సంవత్సరములకుఁ బూర్వమునుండి యార్యకులముల పాశ్చాత్యదేశసంచారము, ప్రాచీనయవనలౌకిక కళావిభవము, ఇటలీ, స్పెయిను, జెర్మనీయము, గ్రీసు, ఫ్రాన్సు, ఇంగ్లండు మొదలయిన దేశములయందలి సారస్వతవికాసము మున్నగువానినిగూర్చి నుడివిరి.

అయిదవయధ్యాయమునఁ బాశ్చాత్యనాటకకవుల జీవితములు వారు రచించిన నాటకములు, వానిస్వరూ

వికాసమును, (క్రీస్తుకుఁబూర్వ మాఱవశతాబ్దమునుండి యీ నాఁటివఱకును) విరివిగాఁ జర్చించినారు. "యవనరూపక కవులు పరీక్షార్థము రూపకత్రయము నర్పించుచుండిరి... కాళిదాసు యవనాచార మనుసరించి రూపకత్రయమును రచించెనని నమ్మవచ్చు"ననుచున్నారు. ఇది విచార్యము. కొన్నిచోటుల నాంగ్ల రూపకముల పేరుల నాంధ్రీకరించినారు. అదిపాఠకులకుఁ గొంత చీకాకును గలిగించునేమో?

ఆఱవయధ్యాయమున సుప్రసిద్ధములగు ప్రాచీన పాశ్చాత్య నాట్యాలయములు, అభినయోత్పత్తి వికాసములు మొదలగునవిషయములను దేటపఱిచిరి. వీరిటఁ జేర్కొన్న నాటకపాత్రధారులలక్షణములు నటజనుల కత్యంత సమాదరణీయములు. నటుల యభినయ స్వాతంత్ర్యమునుగూర్చియుఁ గొంత చర్చించినారు. ఇట సూచించిన యాస్వాతంత్ర్యము గ్రంథకర్తగారు నుడివినట్టులు నటునిప్రతిభావిశేషముపై నాధారపడి యుండును.

ఏడవయధ్యాయమున నుత్తములగు పాశ్చాత్య నటీనటకుల జీవితములను, 16 వ శతాబ్ది మొదలుకొని, విమర్శించిరి. ఈనాఁడు పాశ్చాత్యదేశములఁ బ్రసిద్ధి గాంచి వెలయుచున్న నటులపట్టికనుగూడ నిందుఁ జేర్చియున్నారు.

ఎనిమిదవయధ్యాయమున మారీసు మాటర్లింకు, హెన్రీ ఆర్థరు జోన్సుగారులు నవ్యనాటకములను విమర్శించుచు వ్రాసినవ్యాసములయందలి సారాంశములఁ దెనిఁగించినారు. వీరిరువురు బహునాటకకర్తలు; గొప్ప విమర్శకులును. వీరియభిప్రాయములు పాశ్చాత్య సాంప్రదాయముల ననుసరించినవైనను హైందవనాటకకళాభివృద్ధికి సైతముఁ దోడ్పడఁగలవు. కావున నాంధ్రనాటకకర్తలకును నటులకును నంగీకార్యములు.

తొమ్మిదవయధ్యాయమునఁ బాశ్చాత్యదేశముల యందలి నాటకకళాపోషణక్రమము, భిన్నభిన్నవిధములగు నాటకశాలలు, వానిని బోషించుక్రమము, నాటకప్రయోగపద్ధతులు మొదలయిన విషయములు చర్చించినారు.

పదవయధ్యాయమునఁ బాశ్చాత్యదేశములయందలి నాట్యమందిరనిర్మాణాలంకారాది వైఖరులను జర్చించినారు.

పదునొకండవ యధ్యాయమున బర్మా, చీనా, జపాను, పరిషియా, అరేబియా, టర్కీ మొదలగు దేశములనాట్యవైఖరులు, ప్రయోగక్రమము, భారతీయనాట్యకళయొక్క యుత్పత్తివికాసములు, ప్రాచీనసంస్కృత నాటకరచయితలు, వారికాలము, వారురచియించిననాటకములు, ప్రాచీనహిందీవంగభాషానాటకములు మున్నగు విషయములను జర్చించినారు. బాబూశ్యామసుందరదాసుగారి సాహిత్యాలోచనమున భారతీయ రూపకవికాసమునుగూర్చి చెప్పఁబడిన యంశములను వీరిందు సంతరించినారు.

తుదియధ్యాయమున నిప్పటి యాంధ్రనాటకకవులు స్వీకరించిన పాశ్చాత్యరూపక మర్యాదలనుగూర్చి కొంత ముచ్చటించిరి. ఆంధ్రీకరింపఁదగిన సుప్రసిద్ధాంగ్ల నాటకములను, నాట్యకళనుగూర్చిన ప్రసిద్ధప్రాచీనాధునాతనగ్రంథములను గొన్నిటిని జేర్కొనిరి. పాశ్చాత్యవిజ్ఞానవికాసమును గూర్చియుఁ గొంత నుడివిరి. గ్రంథకర్తగారనినట్లు లాంధ్రవాఙ్మయమున నొకటిరెండేని లలితకళలను విమర్శించు గ్రంథములు లేకుండుట మనయాంధ్రపండితసోదరుల వెనుబాటును వేనోళ్లఁ జాటుచున్నది. మఱియు శాస్త్రిగారు సూచించినట్లులే కళాస్వరూపమును నిర్ణయించు గ్రంథజాలమును వికసింపఁజేసి యీదారిద్ర్యమును దీర్పఁజాలిన యాంధ్రమహాశయులయొక్క ప్రయత్నములకు హృదయపూర్వకముగ స్వాగతమీయవలెను.

పై విమర్శనమునుబట్టి యీగ్రంథమున నాయూలాగ్రము పాశ్చాత్యరూపక వాఙ్మయచారిత్రముతో పాటు, కొంతవఱకు భారతీయరూపకకళయొక్క భావ్యభివృద్ధికిఁ దోడ్పడువిషయములను జర్చింపఁబడినవని తేలుచున్నది. ఇట్టిగ్రంథ మిదివఱ కాంధ్రవాఙ్మయమున నపూర్వము. ఇది యాంధ్రనాటకకర్తలకును, నటకులకును మిగుల సాహాయ్యకారి యగుట సత్యదూరముకానేరదు. అధిక వ్యయప్రయాసములను లెక్కింపక యిట్టియమూల్యగ్రంథమును వెలయించిన శ్రీ శాస్త్రిగారియెడ నాంధ్రసోదరులు—ముఖ్యముగా రూపకకవులు, నటులు—మిగుల కృతజ్ఞులు గాఁదగుదురు.

ఈగ్రంథముయొక్క శైలి పెక్కుచోటుల నతిక్లిష్టమై యసంగతమై సుబోధముగాకున్నయది. ఒకచో సంస్కృతపదాడంబరము, లేనిశబ్దరూపములు, లేనియర్థములు, ఇంకొకచో వాడుకలోను గ్రంథములలోను లేని యచ్చ తెనుఁగుమాటలు—గాగి గండ్లుగుండ్లుగల బాటను బండ్లుపోవునట్లున్నది. వాక్యరచనాదోషము లిందుఁ గాన్పించుచున్నవి. గ్రంథకర్తగా రింకను శ్రద్ధవహించి యుండిన నిట్టిదోషములు వాటిల్లకుండెడివి.

ఇట్టియపూర్వవిషయముల విమర్శించునప్డు శైలి యొడుదుడుకుగానుండక సరళముగను, అందఱకు సైతము సుగ్రాహ్యముగను నుండవలయును. లేకున్న గ్రంథప్రయోజనమునకు భంగము వాటిల్లును. వీరిఁక ముందు వెలువరింపఁదలఁచిన గ్రంథములయం దిట్టి కొఱఁతకుఁ జోటీయకుందురుగాక!

అచ్చుతప్పులును గుప్పలుగా నిందు దొరలినవి. గ్రంథప్రాశస్త్యమున కిది యొక లోపముకాకున్నను ఒక్కొకయెడ నపార్థములకుఁ దావొసఁగుచుఁ జదువరులను విసిగించును. ఇట్లు దోషపరిగణనము గావించినందులకు గ్రంథకర్తగారు మన్నింతురుగాక! విమర్శకులు గుణదోషపరిశీలనమును సమదృష్టితో గావింపవలసినవారు కదా! నాయకకవినుగూర్చి శ్రీశాస్త్రిగారు మున్ముందు ప్రకటింపఁదలఁచినట్లు నుడివిన గ్రంథముల నచిరకాలముననే వెలువరించి యాంధ్రభాషాశ్రయుల మన్ననకుఁ బాత్రులగుదురుగాక! గ. సు.



# ఎవ్వరనియెంతురో నన్ను?

దేవులపల్లి కృష్ణశాస్త్రి, బి. ఏ. [సాహితీసమితి]

నన్నుఁ గని మీరు జాలిఁ జెందఁగవలదు!
ఎవ్వరని యెంతురో నన్ను? ఏ ననంత
శోకభీకర తిమిరలోకైకపతిని!
కంటకకిరీటధారినై, కాళరాత్రి
మధ్యవేళల, జీమూతమందిరంపుఁ
గొలువుకూటాల, నేకాంతగోష్ఠిఁ దీర్చి,
దారుణ దివాంధరోదన ధ్వనుల శ్రుతులఁ
బొంగి, యుప్పొంగి, యుప్పొంగి పొరలిపోవు
నావిలాపనిబిడగీతికావళీ వి
రావముల నర్ధరాత్రగర్భమ్ము మఱియు
మఱియు భీషణ కాళిమోన్మత్త గాఁగఁ
జేయుతఱి నన్ను మీరు వీక్షింపలేదా?
నన్నుఁ గని మీరు జాలిఁ జెందంగవలదు!
నాకు నిశ్వాసతాళవృంతాలు గలవు;
నాకు కన్నీటిసరులదొంతరలు కలవు;
నాకమూల్యమపూర్వ మానంద మొసఁగు
నిరుపమనితాంతదుఃఖంపునిధులు కలవు—
ఎవ్వ రని యెంతురో నన్ను?...



# అభినవాంధ్రనటశేఖరులు

గతసంచిక తరువాయి

## శ్రీ. నెల్లూరు నాగరాజరావుగారు

వీరు ఆధునికాంధ్రనటశేఖరులలో నొకరు. దశరథుడు, శ్రీరాముడు, నలుడు, రాజరాజనరేంద్రుడు, పఠాన్ రుస్తుమ్, హిరణ్యకశిపుడు మొదలగు ప్రధాననాయకపాత్రములను జక్కఁగా నిర్వహించు సామర్థ్యముగలవారు. వీరి హావభావవిలాసము లత్యంత రమణీయములు. ఉచ్చారణము సుస్పష్టము. సంగీతము రంగోచితము. రసపోషణము నిరుపమానము. ప్రేక్షకులు తన్మయత్వము జెందుదురు. ఆంధ్రదేశమునను చెన్నపురమునను వీరు ప్రసిద్ధిగాంచిరి. వీరికిప్పుడు వయస్సు ముప్పదిమూడు సంవత్సరములు. వీరు పదునెనిమిదవయేట దొలుదొల్త నాటకరంగమున బ్రవేశించిరి. వీరికి నాటకకళాభిమానము మెండు. బందరు ఆంధ్ర నాటకపరిషత్తువారు నెల్లూరు పురమున గావించిన పోటిపరీక్షయందు వీరు నలబాహుకపాత్రములను ధరించి గెలుపుఁగాంచిరి. వేఱొకతరుణమున బందరు పౌరులు బంగరుగంటలకడియమును, 'ఆంధ్రనాటక సంగోద్ధారక' బిరుదమును వీరికొసగిరి. మొనమొన్న ప్రదర్శింపబడిన ప్రతాపరుద్రీయనాటకమున వీరు యుగంధర భూమికనుధరించి యసామాన్యకౌశలమును జెఱపి ప్రేక్షకుల ప్రశంసకు పాత్రులయిరి. వీరు చక్కఁగా వేణుగానము గావించెదరు. చిత్రవిద్యయందును వీరికి నేర్పు గలదు. రంగాలంకారాదులకు వలసినయపనికలను సైతము వీరు చిత్రించగలరు. భిన్నభిన్న భూమికలను ధరించిన వీరి చిత్రము లీసంచికయందు గలవు;

(నాటకకళాభిమాని)

# ఆడుకొనుమోయి బాలకా ఆడుకొనుము

ముక్కవిల్లి వేంకటనారాయణగారు

ఘుల్లుఘుల్లని గజ్జియ లుల్లసిల్లఁ
జిఱుతపరుస్తున మురిపంబు గురియుచుండఁ
బలుకుపలుకునఁ దేనియ లొలుకుచుండ
నాడుకొను మోయిబాలకా! ఆడుకొనుము.

ముందుసంగతి యోజన యెందు లేదు
వెనుక చింతకుఁ దలఁపున నునికి లేదు
అవనిలో నీకు నంతరాయములు లేవు
ఆడుకొను మోయి బాలకా! ఆడుకొనుము.

కమలమిత్రుండు నీరెండఁ గరఁగుచుండ
నిందుబింబంబు కొండపై నెక్కుచుండ
మలయవాయువు చెలరేఁగి మసలుచుండ
కుహుకుహూయనుచుఁ గోయిల కూయుచుండ
నాడుకొను మోయి బాలకా! ఆడుకొనుము.

గతవిచారంబునంత విస్మృతి మునర్చి
ముందు నాలోచనలు మదిఁ బొందనీక
ఒంటి నీయందు నైక్యంబు నొందియుందు
నైదు నిముసాలు నాకోస మాడుకొనుము

ఆన లెఱుఁగవు లేదు నీ కర్థచింత
ఏవిచారము గదియనియాడు నీకు
నిన్నుఁ జూచుచుఁ గష్టంబు లన్ని మఱచి
యనుపమానంద సౌఖ్యంబు నందుచుంటి
నాడుకొనుమోయి బాలకా! ఆడుకొనుము.



# శరన్నవరాత్రములు

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

మానవ హృదయమును రంజింపఁజేయు ఋతురాజములలో వసంత శరదృతువులు పేర్కొనఁదగినవి. ఒకటి అసమానపుష్పశోభచేత నుద్దీపితమగునది. మఱియొకటి దివ్యజ్యోత్స్నావైభవముచేత భాసురమగునది. వసంతకాల వైభవము ఎంతరాగోద్దీపకమో శరచ్చంద్ర చంద్రికా వైభవ మంతయానంద ప్రదాయకము. కాని యత్యంతసుఖప్రదములైనవే మానవుని కెక్కువ యరిష్టప్రదములని భగవన్నిర్ణయము కాఁబోలు!

"అరయఁగ సర్వజనౌఘ నాశకములై
యత్యంత ఘోరమ్ములై,
పరమవ్యాధి కరమ్ములయ్యుఁ
గడు శోభాస్ఫూర్తి మెప్పారి శాం
తిరతిన్ ప్రీతికరమ్ములై మిగుల
వేసాల్ సేయు లోకాళికిన్
శరదారంభ వసంతముల్ శమన
దంష్ట్రాప్రాయముల్ భూవరా!"

అని యీరెండుఋతురాజములును వర్ణింపఁబడినవి. దానం జేసియే యీ ఋతువుల యారంభమున నరిష్ట నివారణమునకై దేవీపూజలు నిర్వర్తింతురు. ఈపూజ లీరెండు ఋతువులందుఁ దొమ్మిది దివసములు ప్రవర్తిల్లుటం జేసి నవరాత్రములు నాఁబరగుచున్నవి. వసంతనవరాత్రము శ్రీరామనవమి యుత్సవములుగను, శరన్నవరాత్రములు దేవీ నవరాత్రములు లేక దశరాయుత్సవములుగను పేరు కెక్కినవి.

ఇది యాశ్వయుజమాస మగుటచే నివి శరన్నవరాత్రములు. దేవీ పూజాదివసములు. దేవీపూజ ఆశ్వీన శుక్ల ప్రతిపత్తిథి మొదలు నవమీపర్యంతము జరుగుచుండును. పూజాప్రధానము దేవీభాగవతమునను స్కాందము, మాత్స్యము, పాద్మము మొదలగు పురాణముల లోను విపులముగ వర్ణింపఁబడినది. ఇరువది నాలుగడుగుల చతురముగ నొకమంటపమును నిర్మించి దానిని తోరణములు మొదలగు వానితో నలంకరింపవలెను. తెల్లమట్టి గోమయముకలిపి మంటపమును నలుకవలెను. మంటపమధ్యమున నాలుగడుగులు చతురముల నొకవేదిక నేర్పఱచి దానిలో నాగ్నేయ దిశగా నొక హోమకుండమును త్రిభుజాకారమున నిర్మింపవలెను. అంబికామూలమంత్రమును జపించుటకు బ్రాహ్మణులనేర్పఱచవలెను. మొట్టమొదట విఘ్నేశ్వరపూజ పూర్తియైనపిదప దేవీపూజ ప్రారంభమగును. 'క్షౌమవస్త్రసమన్విత

మగు సింహాసనము స్థాపించి యందుఁ జతుర్హస్తయు, నాయుధసమంచితయు, రత్నాలంకారవిరాజితయు, ముక్తాహారభాసురయు, దివ్యాంబరధారిణియు, సౌమ్యయు, సర్వలక్షణసంయుతయు, శంఖచక్రగదా పద్మాన్వితయు, సింహవాహనయునగు జగదంబిక నాగమోక్తవిధానంబున స్థాపించి యథాశక్తి బూజింపవలయును.' నవరాత్రములందు నడుపవలసిన కార్యములను శాస్త్రము లీవిధమునఁ జేర్కొనుచున్నవి. 1. కలశస్థాపనము 2. దేవతాపూజనము 3. సప్తశత్యాది జపము 4. అఖండదీపము 5. మాలాబంధనము 6. ఉపవాసనక్తైకభుక్తాదినియమము 7. సువాసినీభోజనము 8. కుమారీభోజనము 9. స్తోత్రమంత్రహోమాదులు.

శాంతినిమిత్తము పూజాకర్తలు తమ శక్తికిం దగినంతిని కన్యలకు భోజనము పెట్టుచుండవలయును. ఈ కుమారీ నిర్ణయమును గుఱించి పురాణములందిట్లు తెలుపఁబడినది.

"ఏకవర్షాతు యా కన్యా పూజార్థే తాం వివర్జయేత్ । గంధపుష్పఫలాదీనాం ప్రీతిస్తస్యా నవిద్యతే."

ఈకుమారికలసంఖ్య దినమున కొక్కొక్కటి చొప్పున హెచ్చించుచుండవలెను. అనఁగా మొదటిదినమున ఒకరైన రెండవదినమున నిరువురు మూఁడవదినమున మువ్వురు నాలవదినమున నలువురు ఈవిధమున కుమారికా సంఖ్య వృద్ధిపఱుచుచుండవలెను. ఈకుమారిక లందఱు పదిసంవత్సరములు లోపువారై యుండవలెను. ఏడాదిపిల్ల ఇట్టిదానికిఁ బనికిరాదు. రెండేండ్లు మొదలు పదేండ్లవఱకుఁ గల కుమారికలకు వారివారి వయస్సునుబట్టి వేఱువేఱు నామములు గలవు. రెండేండ్లున్నఁ గుమారికయనియు, మూఁడేండ్లున్నఁ ద్రిమూర్తియనియు, నాలుగేండ్లున్న గల్యాణి యనియు, నయిదేండ్లున్న రోహిణి యనియు, నాఱేండ్లున్న కాళియనియు, నేడేండ్లున్నఁ జండికయనియు, నెనిమిదేండ్లున్న శాంభవియనియుఁ దొమ్మిదేండ్లున్న దుర్గయనియు బదేండ్లున్న సుభద్రయనియు నాకుమారికలకు బేళ్లు. ఈకుమారికలకు పూజా భోజనాదికంబులు జరుపవలయును. కుమారికా పూజ వ్యాధి నివారకమనియు, త్రిమూర్తిపూజ శత్రుసంహారకమనియు, దుర్గాపూజ యరిష్టవిచ్ఛేదకమనియు, నిట్లు ఆయాయికుమారికల పూజా భోజనాదిక నిర్వాహకమువలనం దొలంగు నమంగళములును, కలుగు ఫలములును పురాణములందు వివరముగఁ జేర్కొనంబడినవి. మూఁడేసిదినములకు దేవి నొక్కొక్క పేరున మూఁడుపేళ్లతో నీతొమ్మిది దినములు పూజింపవలయును. మొదటి మూఁడుదినములు మహాకాళిపేరను, తరువాతి మూఁడు దినములు మహాలక్ష్మిపేరను, దక్కిన మూఁడుదినములు మహాసరస్వతిపేరను బూజలు జరుపవలెను. మహాకాళిపూజ దుఃఖదారిద్ర్య పీడానివారకమనియు, మహాలక్ష్మిపూజ భాగ్యైశ్వర్యప్రదమనియు, మహాసరస్వతీపూజ విద్యావివేక హృదయపారిశుద్ధ్యసౌఖ్యప్రదమనియుం దెలుపంబడినది. ఈపైన తెలిపిన మూఁడుశక్తిస్వరూపములలో మొద

టిది శైవశక్తి: రెండవది వైష్ణవశక్తి: మూఁడవది బ్రాహ్మీశక్తి.

పదవనాఁటి యుత్సవముతో నీనవరాత్రదీక్ష ముగియుచున్నది. పదవనాఁడు అపరాజితాపూజనము, సీమోల్లంఘనము, శమీపూజనము మొదలగునవి విధివిహితములు. పైనఁ దెలిపిన అపరాజితకు జయావిజయలు పార్శ్వదేవతలగుటంజేసి యీ దశమి విజయదశమి యనుపేరఁ బరగుచున్నదని కొందఱ మతము.

'జమ్మిపవారి' అను తెలుఁగుపేరఁబరగు నీపదవనాఁటి యుత్సవమున శమీపూజ దక్షిణ సందర్భమునఁ బఠించునట్టియు, శమీవృక్షమునకు వ్రేలాడఁగట్టుటకై తాటియాకులమీఁద వ్రాయఁబడునట్టియు నీ క్రింది శ్లోకములాంధ్ర లోకమునకంతకు శ్రుతపూర్వములు. 'అమంగలానాం శమనీం శమనీం దుష్కృతస్య చ। దుస్స్వప్ననాశినీం ధన్యాం ప్రపద్యేఽహం శమీమ్ శుభామ్॥ శమీ శమయతే పాపం శమీ శత్రువినాశినీ। అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియవాదినీ॥

భక్తితత్పరులగు చతుర్వర్ణముల వారికి నీశరన్నవరాత్రములు పూజాదివసములు. ఏయేవర్ణములవారీపూజ నిర్వర్తించిన నెట్టిట్టి ఫలమును బడయఁగలరో పురాణములు విశదముగఁ దెలుపుచున్నవి. బ్రాహ్మణులకు, క్షత్రియులకు నీపూజ ముఖ్యము. క్షత్రియులు ముఖ్యముగ విజయార్థులై దేవిని బూజింతురు. విజయదశమినాఁడు క్షత్రియుల కర్తవ్యమిట్లు నిర్దేశింపఁబడినది.

క్షత్రియుఁడు తూర్పు దిక్కుననున్న జమ్మిచెట్టుదగ్గఱకు మంగళవాద్యములతోఁ బోయి దానిని బూజించి, ఆచెట్టుమొదటనున్న తడిమట్టిని గొంత అక్షతలతోఁగూడఁ దీసికొని యింటికి వచ్చి దానిని విధివిహితముగఁ బూజింపవలెను. పిదప సైన్యమును సన్నద్ధముచేసి, తరువాత గ్రామముయొక్క ప్రాగ్ద్వారముగుండ నిరాకులమైన గ్రామబహిః ప్రదేశమునకువచ్చి, అచ్చట ప్రతికాదులతోఁగాని, లేక మనస్సునఁగాని శత్రుప్రతిరూపమును జయించుకొని, బంగారుకోలలతోఁ దద్రూపమును గొట్టి సంపీడించి రాత్రివేళ మఱల నింటికిరావలెను. ఇట్లు జరిపినపిదప జైత్రయాత్రకును బైలువెడలవచ్చును.

విజయప్రస్థానమునకు శరత్కాలమే యుక్తసమయము. వర్షకాలము వెనుకబట్టి శరదాకాశము నిర్మలమై, 'దండుత్రోవ' లారి బీటలుతీసిన యాశ్వయుజ మాసదివసంబులు వీరవిక్రమకళాకౌశల ప్రశోభితములు. హిందూప్రభువుల రాచఱికమున నీశరదృతువు విజయదుందుభి నిర్ఘోషమున మాఱుమ్రోగుచుండెడిది. ఈఋతువు వీరరసపోషక మగుటచేత వీరరసప్రధాన నాటకములందు నీయదియే గానముచేయఁబడుచున్నది.

హిందువులగు ప్రభుపుంగవులు రాజ్యముచేయునాఁటి శరన్నవరాత్రవైభవమును దెలిసికొనుటకు మన కెక్కుడాధారములు లేవు. ఆంధ్రభోజుఁడని ప్రసిద్ధిగాంచిన శ్రీకృష్ణదేవరాయలనాఁటిశరన్నవరాత్ర్యుత్సవములనుఆకాలమున విజయనగరమునందుండిన 'పేయస్' అను నాతఁడు సవిస్తరముగ వర్ణించి

యున్నాఁడు. మేజువాణీలు, మల్లయుద్ధము, అగ్నిబాణప్రదర్శనములు, సైనిక పరీక్ష, గొఱ్ఱెపొట్టేలు పందెములు, వేడుకలు, ఉత్సవములు, ఊరేగింపులు, గౌరవసమ్మానములు, ఈ మొదలగున వనేకములు యథారూపముగ వర్ణింపఁబడినవి. ఆ వర్ణనమును జదివి యపరిమితానందమునొంది, జారిపోయిన యావైభవమును దలంచుకొని యొక్క నిట్టూర్పుఁబుచ్చి, కన్నీటిచుక్క విడువని యాంధ్రుఁడుండఁడు.

నేఁటికిని గొన్నికొన్ని దేశీయప్రభుసంస్థానములలో నీ శరన్నవరాత్ర్యుత్సవములు జరుగుచున్నను బూర్వపువైభవముమాత్రముఁ గానఁబడదు. అయినను ఈయుత్సవములను జరుపుటలో మైసూరు సంస్థానమే నేఁడు కడుంగడు పేరుకెక్కినది.

విల్లమ్ములను గేలఁబూని, దిగ్విజయమునకు బైలువెడలు రాజసైన్యములతో దశదిశలు నిండి నివిడీకృతము కావలసినయీదినములలో గిలకలబద్దలు పట్టి పప్పుబెల్లముల కొఱకు యాచించు బాలవిద్యార్థులను, పారితోషిక సమ్మానముల నభ్యర్థించు బడిపంతుళ్లను గాంచవలసివచ్చుట కడుశోచనీయము. శౌర్యమునన్నగిల్లినది: పరాక్రమము పాడువారినది: అస్త్రవిద్య ఆకాశకుసుమమైనది. నాఁటి దినములకు: నేఁటి దినములకు ఎంతటి వ్యత్యాసము. ఎట్టిమార్పు!



# పంటసేలకే పయినం

నండూరి వెంకటసుబ్బారావు గారు, బి. ఏ., సాహితీసమితి

౧. ఈయేపు నోయావు ఆయేపు నోయావు
జోడావులకు నడుమ నాయెంకి, యీడు
జోడుగా నిలుసుంటె, నాయెంకి, ఆట
లాడదాకలిసుంటె నాయెంకి, "నన్నె
సూడు"మన్నట్టుంటు నాయెంకి.

౨. యీయేపు నోయేరు, ఆయేపు నోయేరు
యేళ్ల రెంటికినడమ నాయెంకి, తలను
పాలకడవెత్తుకుని నాయెంకి, సేత
పూలుపుణుకుకొంట నాయెంకి, పూల
బూరవోయిస్తాన నాయెంకి, "నన్నె
ఫోలుండు" మంట్పాది నాయెంకి.

౩. యీకాడ నోకొండ, ఆకాడ నోకొండ
కొండకోనలనడమ నాయెంకి, పాల
కుండ దింపుకోని నాయెంకి, గుడికి
దండ మెడతాన్రంటె నాయెంకి, సూడ
రెండుకళ్లనిపించు నాయెంకి.

౪. యీసాయ నోసేను, ఆసాయ నోసేను
సేలరెంటికి నడమ నాయెంకి,
పూలు నాకందిచ్చినాయెంకి, "సామ్మి
లేల మన"కంటాది నాయెంకి, గుండె
జాలిపుట్టిస్తాది నాయెంకి.

# అంగారకగ్రహము

ప్రతిదినమును, రాత్రులయందు మన మంగారకగ్రహమును జూచుచున్నాము. ఆగ్రహము నారింజపండు వలె యెఱ్ఱగను, గుండ్రముగను, మిగుల చిన్నదిగను గనుపడుచుండును కాని యాగ్రహముయొక్క పరిమాణము భూగోళమున నర్ధముకంటె నెక్కువగ నుండును. సూర్యకుటుంబమునందలి గ్రహములలో నెల్ల నీయంగారకగ్రహమే భూమికి మిగులఁ జేరువగనుండునది. భూమియందువలెనే యీగోళమునను పర్వతములు నదులు, చెట్లు చేమలు మొదలగునవి కలవని యూహించుచున్నారు. ఆగోళమునఁగల పెద్దయిసుకయెడారులవలన నాగ్రహమున కెఱ్ఱనిరంగుగలిగినదని విజ్ఞులు తలఁచుచున్నారు. ఈగ్రహగోళముయొక్క ధ్రువప్రదేశములందు మంచు గడ్డ కట్టి వలయాకారముగ నుండును. వేసవియందది కరఁగి చిన్నదగును. వర్షాకాలమున నధికముగ మంచు పేరుకొని పెద్దదగును సాధారణముగా నాగోళమునందలి ఋతువులు దినములు భూగోళమునందలి ఋతువులు దినముల కించుమించుగ సరిపోవును. కాని సంవత్సర పరిమితి మాత్రము ద్విగుణముగ నుండును.

ఎఱ్ఱనిరంగుగల యాగోళోపరిభాగమున భిన్నాకారములఁ గాన్పించుచున్న నల్లనిచారలు సముద్రములని పూర్వతనఖగోళశాస్త్రజ్ఞు లూహించిరి. ఆగోళకాలమానమునుబట్టి యాచారలరంగు మారుచుండుటఁ గాంచి తరువాతివారు వానిని పైరు పంటలచేనొప్పు విశాలభూప్రదేశములని తలఁచిరి. ఎండకాలమున సూర్యుని వేఁడిమికి ధ్రువములకడ గడ్డకట్టియున్న మంచుకరఁగి నీరై ప్రవహించునదనియు, నానీరే యాపంటపొలములకాధారమనియు వారు తలఁచిరి. దీనిని బట్టి యంగారకగోళమునఁగూడ వాతావరణము గలదనియు, అది చాలఁ బలుచనిదనియుఁ దెలియుచున్నది. ఒక్కొకప్పుడు తెల్లని చారలుఁగూడఁ గాన్పించుచుండును. వానిని మేఘములనుగాఁ దలఁచుచున్నారు. అవియు సూర్యుని కెదుటనున్న భాగమున గాన్పించుట యరుదు. రాత్రికాలమున నొకవేళ యాగోళమున వర్షించునేమో? సూర్యునకతిదూరముననున్న యీగ్రహమునందు వాతావరణస్థితి మిగులఁ దక్కువగుటచే శీతోష్ణస్థితి చాలఁదీవ్రముగ నుండును. ఈకారణముచే మనవంటిజీవులాగోళమున జీవించుట దుస్తరము. ఇంతమాత్రమున నాగోళమున జీవజంతువులే లేవని చెప్పఁజనదు.

పై రెండుచిత్రములలో మొదటిది: 1918వ సంవత్సరము మార్చి 18వ తేదినాఁటి యంగారకుఁడు.

ఉత్తరధ్రువము (అడుగున) భూమివైపునకుఁ దిరిగియున్నది. అప్పుడాగోళార్ధమున నడువేసవి. పెక్కునెలలు సూర్యకాంతియందుఁ గ్రాఁగుచుండుటచే ధ్రువప్రదేశమునందు మంచుకరఁగిపోయి యత్యల్పముగా మిగిలియున్నది.

రెండవచిత్రము: 1924వ సంవత్సరము జూలై 81వ తేదినాఁటి అంగారకుఁడు.-దక్షిణగోళార్ధమున నిపుడే వేసవి ప్రారంభించినది. కావున ధ్రువప్రదేశమున మంచు కరఁగక అధికముగా గాన్పించుచున్నది. ఉత్తరగోళార్ధముయొక్క ధ్రువమవతలివైపుననున్నది. అట వర్షాకాలముగుటచే మంచు మిగులఁ బేరుకొని సూర్యుని కెదుటనున్న యిటువైపునఁగూడఁ గాన్పించుచున్నది.





1918-వ సం. మార్చి 22-న తేదినాఁటి అంగారకుఁడు.

1924-వ సం. జూలై 31-వ తేదినాఁటి అంగారకుఁడు.



భూమికి వర్షాకాలమునందుకంటె మూఁడుకోట్ల మైళ్లు చేరువగనున్న అంగారకుఁడు. ఇతఁడు భూమి కిది వఱకెన్నఁడును రానంతసమీపమునకు వచ్చియున్నాఁడు.

భగవత్ప్రీతికిని ఆత్మశాంతికిని ఫలదాయక మగునని మహాత్ముడు విశ్వసించుచున్నాడు. ఆవిశ్వాసము భగవదనుగ్రహమువలనను సఫలముగాగలదు.

* * * *

మానవులకు దైవాసురభావములు సహజములైనను ప్రవృత్తి సామాన్యముగను నాసురభావమును నవలంబించుచు దేహవాసమునందు లగ్నమగునట్లు ఉపవాసమునందు లగ్నమగుటలేదు. లోకమునందంతటను నీప్రవృత్తి పాశ్చాత్య సంసర్గమువలనను ప్రబలినది. ప్రజలకు దేహవాసస్థితియందుగల సమ్మోహము ఉపవాసస్థితియందు గనుపడదు. ఈ దేహవాస వ్యామోహము లోకమునందంతటను మహాసంరంభమునకు మూలముగ బరిణమించినది. శ్వేతజాతుల దౌర్జన్యములకును సాంఘికవాదుల సంరంభమునకును హిందూ మహమ్మదీయ కలహములకును స్వరాజ్యాందోళనమునకును బీజములీ దేహవాసమునందు సుప్రతిష్ఠితములై యున్నవి. అధికారలాభము భాగ్యభోగానుభవము జన్మఫలముగను జాతులు సంఘములు వ్యక్తులు గ్రహించి నిరంతర సంరంభమునందు మునిగి తేలుచున్నపుడు ధర్మోద్ధరణము దురారాధ్యముగ నున్నది. ప్రపంచ మంతయును శాంతిస్థాపనమునకు పరితపించుచున్నను శాంతిస్థాపనము దుస్తరముగ నున్నది. యూరపురాజ్యాధికారులు మారణసాధనముల మూలముగను శాంతిని స్థాపించుటకు దలపడుచున్నారు. హింసాసాధనములహింసాస్థితికి దోడ్పడజాలవు. అహింసాధర్మమునకు జన్మస్థానమైన భారతభూమియందును నీదుర్దశయే సంప్రాప్తమైనది. అధికార దౌర్జన్యము, రాజ్యాంగవిప్లవము, అంతఃకలహములు ధర్మవిప్లవమునకు సాధనములైనవి. ప్రజాజీవితము స్తంభితమై నిస్సహాయస్థితి ప్రబలినది. గాంధిమహాత్ముడు దౌర్జన్యమును నిర్జించి ఆత్మశక్తిని వ్యక్తముచేసి ప్రజాశక్తిని విజృంభింపజేయుటకు బూనుకొనెను. గాంధిమహాత్ముని నాలుగేండ్లయందు బూనిన కార్యవిధానమున కంతకును నీసంకల్పము బీజముగనున్నది. ప్రజాశక్తివిజృంభణమునకువలె ప్రజాదౌర్జన్యమునకును మహాత్ముడు భారమును వహించుచున్నాడు. ప్రజలదౌర్జన్యములకు మహాత్ముడు స్వయముగను శిక్షననుభవించుచు మానవకళ్యాణమున కాత్మసమర్పణమును జేయుచున్నాడు. అహమదాబాదునందు న్యాయాధిపతి సమక్షమునందు దెలిపిన భావములందును యంగుఇండియా నవజీవన పత్రికలయందు వ్యక్తముచేసిన భావములందును ఇతర సందర్భములందు దెలిపిన భావములందును నీవిషయమును విస్పష్టముచేసియుండెను. మహాత్ముడు ప్రస్తుత మవలంబించిన మహోపవాసదీక్షయును నీధర్మమునే వేయివిధములను ప్రతిపాదించుచున్నది.

* * * *

గాంధిమహాత్మునకు మానవ సౌశీల్యమునం దపారమైన విశ్వాసముగలదు. మంచితనము మానవులకు సహజశీలమని మహాత్ముడు విశ్వసించుచున్నాడు. ఆవిశ్వాసమును మహాత్ముడు హిందూమహమ్మదీయ సమ్మేళన

ప్రయత్నమునందు వ్యక్తము చేసినాడు. అజ్మలుఖాను, అలిసోదరులు మొదలగు మహమ్మదీయనాయకులపట్లను మహాత్మున కపారమైన గౌరవవిశ్వాసములు గలవు. హిందూధర్మ పరాయణుండైన గాంధిమహాత్ముడు మహోపవాసదీక్షను మహమ్మదీయ గృహమునందు మహమ్మదీయ వైద్యులసహాయమునను నిర్వహించుట మహాత్ముని సత్యశీలమునకు మహావ్యాఖ్యానముగ నున్నది. మహాత్మునకు స్వధర్మానుష్ఠానమునకు గృహములు, గుడులు, గోపురములు, మతసాంప్రదాయాచారములు ప్రతిబంధకములుగావు. విధివశమునను భరతఖండము వివిధమతములకును జాతులకును భాషలకును నిలయముగనున్నది. అన్ని మతములవారును వారి మతాచారములను యథావిధిగ ననుష్ఠించుచు సుఖముగ నివసించగల విధమును గాంధిమహాత్ముడు వ్యక్తముచేసెను. ప్రజలీవిధి ననుష్ఠించి స్వరాజ్యము ననుభవించుటకు హృదయపరివర్తన మవసరము. ప్రజలయందు హృదయపరివర్తనము గలుగుటకు మహాత్ముడు హింసావిసర్జనమును అసహాయయోగమును నుపదేశించెను. ఆరంభమునందు మహాత్ముని ప్రయత్నములు ఫలోన్ముఖములుగ గనుపడెను. గాంధిమహాత్ముడు పరమవిశ్వాసముతో కారాగృహావాసమును స్వీకరించెను ఆరేండ్లశిక్షకు పాత్రుడైనను రెండేండ్లలో దైవకృపవలన విమోచనమును బడయగలిగెను. ఆరేండ్లను యరవడాయందు మహాత్ముడు నిర్బంధము ననుభవించిన నేమిసంభవించెడిదో దేవునకెరుక!

* * * *

మహాత్మునకు విమోచనము కార్యనిర్వాహణమునకు సాధనమైనను దుఃఖమునకు మూలమైనది. మహాత్ముడుపదేశించిన హింసావిసర్జన మంతర్హితమైనది. దేశమునందంతటను సంతఃకలహములు పెరిగినవి. హిందూమహమ్మదీయ విభేదములు మితిమీరినవి. కాంగ్రెసు సంఘములందును నితరసంఘములందును విభేదములు విపరీతాకారములను దాల్చినవి. దేశబంధు దాసు, పండిత మోతీలాలు నెహ్రూ మొదలగునాయకులు ప్రతిఘటనమునకు బూనిరి. సన్నిహితానుచరులు సయితము సంశయభావము నవలంబించిరి. ఢిల్లీ గుల్బర్గ కోహాటు మొదలగు ప్రదేశములందు సంభవించిన హిందూమహమ్మదీయ దౌర్జన్యములు మహాత్మున కపారమైనసంతాపమును గలుగజేసినవి. హిందువులు వారనుభవించిన దుఃఖపరంపరలను మహాత్మునకు నివేదించిరి. పాపపరిహారార్థము మహాత్ముడు ప్రాయశ్చిత్తమునకుగాను ౨౧ దినముల యుపవాసదీక్షను స్వీకరించెను. మహాత్ముడు తనయుపవాసదీక్షకు భగవంతునకుమాత్రమే బాధ్యుడు. ఈదీక్షయం దితరుల ధిక్కారతిరస్కారముల కవకాశములేదు. లోకకళ్యాణమున కవలంబించిన మహాత్మునిదీక్ష ధన్యవాదములకు పాత్రతను బడయగలదు. భగవంతునకు భక్తుల యార్తనాదము నాలకించి వారిమనోభీష్టములను సమకూర్చుట

సహజశీలము. మహాత్ముని దీక్షానాదము దేశమునందంతటను మారుమ్రోగినది. నాయకుల హృదయములందు వేదన గలిగినది. ఢిల్లీయందు సంయోగసభ గూడినది. క్రైస్తవమహమ్మదీయ పార్సీ హిందూ నాయకులు లెస్సగ సంప్రతించి కలహనివారణసాధనములను సంయోగమార్గములను నిర్ణయించిరి. సంయోగసభ సఫలమైనదని లాజపతిరాయి మాలవ్య నెహ్రూ మహమ్మదాలీ అబ్దుల్కలామ్ ఆజాద్ శ్రద్ధానంద భగవాన్దాసు వెస్టుకాటు మున్నగు ప్రముఖులు వివరించుచున్నారు. హిందూదేశమునందుగల భిన్నసంఘములందు హృదయపరివర్తన మొక్కసారి గలుగుట యసంభవమని గాంధిమహాత్ముడే తెలిపియుండెను. కాని మహాత్ముని మహోపవాసదీక్ష హృదయపరివర్తనమునకు బీజాంకురములను నాటినదని దేశపరిస్థితులు విశదముచేయుచున్నవి. సంయోగసభయందంగీకృతమైన ప్రధాన తీర్మానమును నుపతీర్మానములును హృదయపరివర్తనఛాయలను విశదముచేయుచున్నవి.

### తీర్మానము

"మహాత్ముడు దీర్ఘోపవాసదీక్షను బూనినందులకీసభవారధికమగు పరితాపమునకు పాల్పడిరి. మతవిషయములలో సంపూర్ణవ్యక్తిస్వాతంత్ర్య మత్యవసరము. దేవళములు మసీదులు మున్నగుపవిత్రస్థలములను పాడుచేయుటయు, అన్యమతము నవలంబించినవారిని బాధించుటయు, బలవంతమున నితరుల తమమతమున కలుపుకొనుటయు, ఇతరులపై తమమతస్వాతంత్ర్యముల నమలుజరుపుటయు, చాల దారుణకార్యములు. ఈ ధర్మముల ననుసరించుటకును, ఎంతటి ఆగ్రహకారణము కలిగినను ఆధర్మములను పరిత్యజింపకుండుటకును, అట్లు పరిత్యజించినవారిని పూర్తిగా నిరసించుటకును, తాము మనఃపూర్వకముగా పూనుకొందుమని యీసభవారు ప్రమాణముచేసి మహాత్మునకు బాస యిచ్చుచున్నారు. ఈ ప్రమాణతీర్మానమును సభాధ్యక్షుడు స్వయముగా మహాత్మునకు చదివి వినిపించుటకు వెంటనే ఉపవాసదీక్షను వదలి ఈవిషమసమస్యను శ్రేష్ఠముగను శీఘ్రముగను పరిష్కరించుటకు మహాత్ముడు సభవారికి సర్వవిధముల సహకారియు, ఉపదేశకుడును, మార్గదర్శియు కావలెనని యీసభవారు ప్రార్థించుచున్నారు." అని మహాత్మునకు స్వయముగా విన్నవించుటకును అధ్యక్షున కధకార మియ్యబడినది."

*        *        *        *

ఉపతీర్మానములు ప్రధానతీర్మానము నాచరణమునందు బెట్టుట కుపయుక్తములై మహాత్మునిసంకల్పమును సఫలము చేయుటకు భగవదనుగ్రహము గలుగుగాత !

గాంధిమహాత్ముడు నిర్విఘ్నముగను ౨౧ దినముల మహోపవాసదీక్షను పరిసమాప్తి నొందించి దైవబలప్రభావమును ప్రపంచమునకు వ్యక్తముచేసెను. ఉపవాసదినములందైనను నూలును ప్రతిదినమును వడుకుచు మహాత్ముడు దీక్షాదార్ఢ్యమును ప్రపంచమునకు విశదముచేసెను. వైద్యులు ప్రతిషేధించినను వడుకుట మహదానందమును గలుగజేయునని చెప్పి దానిని మహాత్ముడు విధ్యుక్తకర్మగ నిర్వహించెను. ఆండ్రూసుగారిని యంగుఇండియా పత్రికయందు "అందరు వడుకుట"ను గురించి ప్రధానవ్యాసమును వ్రాయుమని కోరెను. ఖద్దరుమీదను మహాత్మునకుగల భక్తివిశ్వాసముల కీయుదాహరణములును నిదర్శనములుగ నున్నవి. దేశభక్తులుగాంధిభక్తులుమహాత్మునిసంకల్పమును

సఫలము చేయుటకు బూనుకొని స్వధర్మ నిర్వహణమును జేయుదురుగాత!

* * * *

తపస్సంపన్నులకు నిలయమైన భారత భూమియందు గాంధిమహాత్ముని యుపవాసాచరణమునే శంకించెడువారు నయితము పుట్టుట పతనదశకు నిదర్శనముగ నున్నది. సంశయాత్ములేమి ప్రలపించినను మహాత్ముని మహోపవాసము ప్రపంచమునకుపవాసస్వరూపమును విశదము చేసినది. గాంధిమహాత్ముడు మూడువారములలో వ్యక్తము చేసిన యుపవాసఫలమె మానవజీవితమునకు సత్యమైనఫలము. మానవజీవితలక్ష్యము శాశ్వతమైన ధర్మారాధనముగాని యస్థిరమైన దేహారాధనముగాదు. దేహారాధనమునకుగాను చేసెడి ప్రయత్నములు రాగద్వేషపూరితములై యశాంతికిని ధర్మారాధనమునకుగాను జేసెడి ప్రయత్నములు భక్తిప్రేమభరితములై శాంతికిని సాధనములగుచున్నవి. మహాత్ముని మహాత్యాగము దేశమునందు శాంతివాతావరణమును గలుగజేసినది. ఆవాతావరణమును గాంధిమహాత్ముని సంకల్పసిద్ధికి సకలజనులును వినియోగించి యథాశక్తిని మహాత్ముని ప్రయత్నములకు దోడ్పడుదురుగాత! దీర్ఘోపవాసదీక్షను నివర్తించి పరిశుద్ధుడును తేజోవంతుడును నైన మహాత్ముని సంకల్పసిద్ధికి భగవంతుడనుగ్రహించునుగాత! భారతీయులు త్యాగదీక్షను వహింతురుగాత!

## విన్నపము

1. వ్యాసరచయితలు వ్యాసములు కాగితమున కొకవైపు మాత్రము విడియక్షరములతో వ్రాయవలయును.

2. సామాన్యముగా వ్యాసములను సమగ్రముగనే పంపుట యుక్తము. అసమగ్రముగ పంపక తప్పనపుడు వ్యాసపరిమితి నయినను ముందుగనే తెలుపవలయును.

3. ఇతరత్ర ముద్రితములైన వ్యాసములను, ఇతరపత్రికలకుఁ బ్రకటనార్థము పంపిన వ్యాసములను బంపకుండుటకుఁ బ్రార్థితులు.

4. వ్యాసములను భారతీ సంపాదకుని పేరఁ బంపవలయును. మఱియు, వ్యాసము పేరు, రచయిత పేరు, పూర్తిచిరునామా వ్రాయుటకును; మాఱుపేరునఁ బ్రకటింపవలసిన వ్యాసముల, కట్లు ప్రకటింపక తప్పనిచో, నట్టి మాఱుపేరును, నిజమైనపేరును, పూర్తిచిరునామాను, దెలుపుటకును; వ్యాసములతోఁ బంపు చిత్రములయొక్క వివరమును, వ్యాసమున వానిస్థానమును విశదముగ వ్రాయుటకును బ్రార్థితులు.

5. ప్రకటింపని వ్యాసములను, దమవ్యాసములుగలసంచికలను (ఉచితముగా), మావ్యయముతోనే సురక్షితముగా వ్యాసరచయితలకుఁ బంపుచుందుమని మనవి చేసుకొనుచున్నాము.

సంపాదకుఁడు,—భారతి.

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thumbu Chetty Street, G. T. Madras.


విషయానుక్రమణిక

☞ పే. ౩౯. రెండవ పేజి ౧౬-వ పంక్తిలో, 'సర్వజ్ఞ' అనుటకు మారుగా 'దేవర్ల' అనియు, ౧౮ వ పంక్తిలో 'సర్వజ్ఞ' అనుటకు మారుగా 'ఆదేవర్ల' అనియు, ౪౦ వ పేజి అడుగున వార్తికలో 'అవంతిసుందరీకథాసారము' అనుటకుమారుగ 'అవంతిసుందరీ కథను' అనియుఁ జదువునది.

# చిత్రములు

వర్ణచిత్రములు:—శ్రీకృష్ణజలక్రీడ, మోహనకృష్ణుఁడు, జరాసంధవధ,

సాధారణచిత్రములు:—ఊర్వశివలపు, అగ్నినిరీక్షణ పేటలసము, చిత్రకారుఁడు: శ్రీ వై. ఏ. ఆర్యదాసుగారు; దానము; కానడారాగిణి, కేదారరాగిణి, నాటికారాగిణి, కామోదీరాగిణి, దీపకరాగిణి;* 7 వ అజంతాగుహాలయము ముఖ్యభాగము యొక్క ప్లాను; ఇతర చిత్రములును.

---

*ఈప్లాను భారతి పదవసంచికయందలి 'అజంతాగుహాలయములు' అనువ్యాసమునకు సంబంధించినది.



